





# కథలు

## ఉపాఖ్యానము

# ఆంధ్ర నలకథా సర్వస్వం





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.
A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name
A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year
1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject
Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language
Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# ఆంధ్ర నలకథా సర్వస్వం



శ్రీ లక్ష్మీ ప్రచురణలు

శవనప్పగారిపల్లి

పనపాకం (పోష్టు) చంద్రగిరి (తాలూకా)

చిత్తూరు (జిల్లా)

రచయిత

వి. దొరస్వామి నాయుడు

ఎం. ఏ., పిహెచ్. డి.,

# కృతజ్ఞతలు

నా పరిశోధనకు అవకాశము కల్పించుటయేగాక అడిగిన వెంటనే ఈ గ్రంథమునకు 'ఆశీస్సులు' వ్రాసియిచ్చిన గురువర్యులు ఆచార్య జి.యన్. రెడ్డి గారికి,

ఈ పరిశోధనా వ్యాసానికి పర్యవేక్షకులుగా వ్యవహరించి, అమూల్య సలహాల నివ్వడమేగాక, వాత్సల్యంతో అడిగిన వెంటనే 'అభినందన' వ్రాసియిచ్చిన గురువర్యులు ఆచార్య జి. నాగయ్యగారికి,

ఈ సిద్ధాంత వ్యాసానికి న్యాయనిర్ణేతలుగా వ్యవహరించి, నా కృషిని ప్రశంసించి, తమ అమూల్య అభిప్రాయాలు తెలిపిన ఆచార్య బిరుదురాజు రామరాజుగారికి, ఆచార్య తూమాటి దోణప్పగారికి, డా॥ జి.వి. సుబ్రమణ్యంగారికి,

విషయసేకరణలో తోడ్పడిన గురుజనులు ఆచార్య మద్దూరు సుబ్బారెడ్డిగారికి, డా॥ కె. సర్వోత్తమన్‌గారికి, ఆప్తమిత్రులు డా॥ ఎం. గోవిందస్వామి నాయుడుగారికి, ఈ సిద్ధాంత వ్యాస ప్రచురణకు ఆర్థిక సహాయం అందజేసిన తిరుమల తిరుపతిదేవస్థానం కార్యనిర్వహణాధికారులు శ్రీ జి. కుమారస్వామి రెడ్డి, ఐ.ఎ.యస్. గారికి,

ముచ్చటగా ముద్రించిన శ్రీ లక్ష్మి ప్రింటర్స్ అధినేతలు శ్రీ జి. ఆర్. పురుషోత్తం యం. యస్ సి. గారికి.

నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

డా॥ వి. దొరస్వామి నాయుడు

# ఆశీస్సులు

జి. యన్. రెడ్డి
వైస్ ఛాన్సలర్
యస్. వి. యూనివర్శిటి, తిరుపతి

భారతీయ పురాణేతి వృత్తాలు, కథలు చారిత్రక సత్యాలని నిరూపించలేము. కాని భారతీయ సంస్కృతికి, సార్వజనీనమైన మానవప్రవృత్తికి మన ప్రాచీనపురాణాలు పట్టుగొమ్మలు. మన పురాణపాత్రలు మానవ ప్రవృత్తి, వైవిధ్యానికి ఉత్తమ మానవ ధర్మ నిరతికి, భారతీయ చింతనలు సామాజిక విలువలకు, ఐహికాముష్మిక దృక్పథాలకు సజీవ మూర్తులు. నలహరిశ్చంద్రాది పురాణపాత్రలు భగవదవతారమూర్తులుగా ఆలయాల్లో ఆరాధ్యదేవతలుగా ప్రతిష్ఠాపన పొందక పోయినా, యుగయుగాలుగా భారతీయుల హృదయాలలో అనుభూతుల్లో స్థిరమూర్తులుగా నిలిచినారు. భారతీయ భాషా సాహిత్యాలలో బహువిధ ప్రక్రియల్లో, బహువిధాల కీర్తింపబడినారు. సంసార సాగరంలో మహావిభ్రాంతులై అశాంతి చిత్తులైన మానవమాత్రులకు నలహరిశ్చంద్రుల వంటి దివ్య పురుషుల జీవితాలు దిక్సూచి ప్రాయాలు. కాబట్టి పురాణపురుషుల కథలు కావ్య ప్రబంధనాటకాది రచనలకు ఇతి వృత్తాలైనాయి.

వెయ్యేండ్ల తెలుగు సాహిత్య చరిత్రలో నలకథ గల రచనలన్నింటిని సమగ్రంగా సమీక్షించి, నిశితమైన పరిశోధన నిర్వహించి డాక్టరేట్ పట్టాన్ని పొందిన చిరంజీవి దొరస్వామి నాయుడు సాహిత్య ప్రియులందరికీ అభినందనీయుడు. "ఆంధ్ర నలకథా సర్వస్వం" అనే పేరుతో వెలువడిన ఈ గ్రంథం విషయ విశ్లేషణలో తులనాత్మక పరిశీలనలో ఉచితానుచిత నిర్ణయంలో ప్రశంసనీయమైంది. దీనిని చదివిన తర్వాత నలకథను వర్ణించిన తెలుగు కవులు ఇందరు

న్నారా? నలకథ గల రచనలు ఇన్ని వున్నాయా? అని ఆశ్చర్యం కలుగుతుంది. సంస్కృతేతరమైన భారతీయభాషా సాహిత్యాలలో తెలుగుసాహిత్యంలోనే నలకథకు అత్యధికప్రాధాన్యం వున్నదేమో అని పిస్తుంది ఈ చక్కటి ప్రామాణిక గ్రంథాన్ని ముద్రించి ప్రచురించి నందుకు కూడా చి॥ దొరస్వామినాయుడు ప్రశంసపాత్రుడు. తన సాహిత్య కృషి నిరవధికంగా సాగాలని అభినందన పూర్వకంగా ఆశీర్వదిస్తున్నాను.

తిరుపతి

12-1-85

జి. యస్. రెడ్డి



# అభినందన

ఆచార్య జి. నాగయ్య, ఎం.ఏ.,పిహెచ్.డి.
తెలుగుశాఖాధ్యక్షులు,
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం,
తిరుపతి 7502.

హరిశ్చంద్రుడు, నలుడు షట్చక్రవర్తుల్లో ప్రసిద్ధులు. పుణ్యశ్లోకులు, గుణోత్తరులు. మహామహులయిన అట్టి వారికి కూడా విధి వైపరీత్యంవల్ల కష్టాలు తప్పలేదు. ఎన్ని కష్టాలు వచ్చినా, ఎన్ని బాధలు ఏర్పడినా ఎన్ని అవమానాలు కల్గినా వారు క్రుంగి కృశించి పోకుండా ఉత్సాహంతో ఆత్మనిగ్రహంతో వాటిని భరించి జనారాధ్యులైనారు. వారిచరిత్రలు పరమపావనంగా పండితులనుండి పామరుల వరకు అందరికి ఆదర్శ ప్రాయమైనాయి. కష్టాల్లో ఉన్నవాళ్లకు కావలసిన మనస్థైర్యాన్ని చేకూర్చినాయి.

నలకథాశ్రవణం వల్ల కలినాశన మవుతుందనే నమ్మకం లోకవిదితం. నలదమయంతుల ఆదర్శజీవితం, అకలంక ప్రవర్తనం, పవిత్రప్రేమ పలువురి కవులను ఆకర్షించినాయి. మహాభారతారణ్య పర్వంలో నలోపాఖ్యానం విపులంగా వుంది. ఇది మొత్తం భారతకథకు ప్రతిబింబం అని చెప్పదగింది. సంస్కృత ప్రాకృత సాహిత్యంలోనే కాకుండా తమిళ,కన్నడ,మలయాళాదిదాక్షిణాత్య భాషాసాహిత్యాల్లోను నలకథ వివిధసాహిత్య ప్రక్రియల్లో వెలువడింది. ఆయాసాహిత్యాల్లోని నలకథావిశేషాలను సమీక్షాత్మకంగా, సోదాహరణంగా, స్వయం సమగ్రంగా, తులనాత్మకంగా వివరించే విమర్శగ్రంథం ఈ ఆంధ్ర నలకథా సర్వస్వం.

ద్విపదలుగా, కావ్యప్రబంధాలుగా, చంపువులుగా చిత్ర కావ్యాలుగా, వచనాలుగా, నాటకాలుగా, యక్షగానాలుగా, జంగ కథలుగా హరికథలుగా గేయకావ్యాలుగా తెలుగులో పలురీతుల వెలువడిన ముద్రితాముద్రిత నలకథా కావ్యాలను ఏభైకి పైగా పరిశోధించి డాక్టరు దొరస్వామినాయుడు గారు ఈ గ్రంథాన్ని రచించారు. విషయ సేకరణలోను. విమర్శనాత్మక పరిశీలనలోను విషయవ్యక్తీకరణలోను రచయితకుగల ప్రావీణ్యం ప్రతిపుటలోను వ్యక్తమౌతుంది. శైలిలోని సరళత, సంక్షిప్తత నిర్ణయాల్లో నిర్భరం ఈ గ్రంథంలో మెచ్చదగిన గుణాలు. పిహెచ్.డి. పట్టంకోసం రచింపబడిన గ్రంథమైనా తెలుగు సాహిత్య ప్రియులందరు ప్రశంసింప దగిన సద్విమర్శ గ్రంథమిది. అందుకు నా అభినందనలు. సహృదయ పాఠక లోకం దీన్ని ఆదరిస్తుందని నా ఆశ. డాక్టరు దొరస్వామినాయుడు ఇట్టి పరిశోధనాత్మక గ్రంథాలను మరికొన్నిటిని వెలువరించాలని నాకోరిక

జి. నాగయ్య



# 1. వివిధ భాషా సాహిత్యములలో నలకథ

సూర్యవంశ పుణ్యదంపతులగు సీతారాముల చరిత్ర వలె, చంద్రవంశ ప్రసిద్ధ దంపతులగు నలదమయంతుల చరిత్ర పరమ పావనముగ భారతదేశమున నాబాలగోపాల మన్ని తెగల వారికి సుపరిచితమైనది. ఆ పురాణదంపతుల ఆదర్శ జీవితము, అకళంక ప్రవర్తనము, పవిత్ర ప్రేమ మున్నగు పరమోదారగుణము లందులకు కారణములు గావచ్చును.

నలకథాశ్రవణము వలన కలి నాశనము కలుగునని మహాభారతములో ఇట్లు తెలుపబడినది.

"కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్య చ
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనమ్"

వ్యాసభారతారణ్యపర్వము, 79-10

నలోపాఖ్యానము ఫలశ్రుతిని నన్నయ తన భారతమున ఇట్లు చెప్పినాడు.

"ఇన్నలోపాఖ్యాన మెప్పుడు దత్తావ
ధానులై వినువారు దవిలి సభల
జదివెడు వారును జగతీశ! కలిదోష
నిర్ముక్తు లగుదురు నిఖిల పుణ్య
ఫలభాగు లగుదురు బహుపుత్ర పౌత్రాయు
రారోగ్య ధన యుక్తు లగుదు రెల్ల
విషములకును, దుష్టవిషయంబులకు దూరు
లగుదురు; ధర్మాత్ము లగుదు రుర్విఁ-

గడు బ్రసిద్ధి యిదియు గర్కోటకుని, దమ
యంతి బుణ్యమూర్తి యైన నలుని
బుజా చరిత్రుడైన బుతుపర్ణు గీర్తింప
గలి భయంబులెల్ల గ్రాగు నధిప"

అరణ్య పర్వము 3-231

నలకథాస్మరణ మాత్రమున జగత్తు రసక్షాళనమునంది పవిత్రత నందగలదని శ్రీహర్షుడు ఇట్లు నుడివినాడు.

"పవిత్రమత్రాతనుతే జగద్యుగే
స్మృతారసక్షాళన ఏవ తత్కథా
కథం న సా మద్గిరమావిలామపి
స్వసేవినీమేవ పవిత్రయిష్యతి"

నైషధీయ చరితమ్ 1-3

నలదమయంతుల కీర్తనము కలినాశనము, పాపనాశనము, సుఖ

ప్రదము, సంతోషప్రదము. నలుని కీర్తించిన వారికి కలిదోషము లంటదని కలి వరమిచ్చినట్లు భారతమున తెల్పబడినది.

నలుడు షట్చక్రవర్తులలో నొకడు. పుణ్యశ్లోకుడు,లోకోత్తరుడు నగు నలుని ధర్మపరిపాలనమును,దమయంతి పాతివ్రత్యమహిమను కొనియాడుచు సంస్కృతమున కొందరు ప్రత్యేక కావ్యములను రచించినారు. సంస్కృత సాహిత్యము నందేకాక వివిధ భారతీయ భాషా సాహిత్యములందును నలకథకు వివిధరూపములైన అనువాదములు, అనుసరణలు, నలకథావస్తుకములైన స్వతంత్రగ్రంథములును వెలువడినవి.

*"The theme Nala captivated the Indian mind so much so that poets and dramatists adopted the story again and again in their compositions. Now there is a vast literature on the theme in the several regional languages. There is a considerable literature on the theme in Sanskrit itself besides numerous works in Prakṛt including Jaina literature. Among the various forms of literature Kāvya and Nataka take premier position"*[1].

మొదట వివిధ భాషాసాహిత్యములందలి నలకథాప్రశస్తిని పేర్కొని తరువాత తెలుగు సాహిత్యములోని నలకథను సమగ్రముగ చర్చించుట ప్రస్తుత విషయము.

## 1.1 సంస్కృత సాహిత్యములో నలకథ:

శుక్లయజుర్వేదమనదగిన వాజసనేయసంహితలో 13వ ఖండమున తూర్పు, మధ్యహిందూస్తానీయులను గూర్చి వివరించు సందర్భమున దక్షిణ దేశపు ప్రజలను నిషధులని, నిషధదేశమునకు రాజు నలుడనియు చెప్పబడినది.[2] దీనినిబట్టి వేదకాలము నాటికే నిషధాధిపతియైన నలుడు ప్రఖ్యాతి చెందియున్నట్లు విదితమగుచున్నది. వేదకాలమునాటి నలకథా వివరములేవియు తెలియరావు.

నలునకు సంబంధము లేదు. ఇరువురు ఒకరు కారు. భిన్నవ్యక్తులు.

నలదమయంతుల పూర్వజన్మవృత్తాంతము దెల్పుకథ ఒకటి శివపురాణము లీలాఖండము[3] నందిట్లున్నది. శివభక్తులైన ఆహుకులను భిల్లదంపతులు అర్బుద పర్వతము నందొక గుడిసెయందు నివసించుచుండిరి. ఒకనాడు భిల్లుడు వేటనిమిత్తమై అడవికి వెళ్లెను. భిల్లసతి ఒంటరిగా గుడిసెయందుండెను. భిల్లదంపతులను పరీక్షించుటకు శివుడు మునివేషమున గుడిసెను సమీపించెను. వచ్చిన మహర్షిని భిల్లసతి అతిథిమర్యాదలతో సత్కరించినది. వేటనుండి తిరిగివచ్చి భిల్లుడు కూడ మునిరూపమునందున్న శివుని పూజించి, రాత్రి తన గుడిసె యందుండుమని కోరెను. వీరి గుడిసెయందు ఇద్దరికంటె ఎక్కువ మంది యుండుటకు వీలుపడదు. ఇద్దరు గుడిసెయందు, ఒకరు వెలుపల పరుండవలయును. పైగా అది క్రూరమృగములు తిరుగుచుండు భీకరారణ్యము అతిథిని వెలుపల పరుండబెట్టిన క్రూరమృగముల వాతబడును. తత్ఫలితముగ ఆ దంపతులకు పాపము వచ్చును. దంపతులలో నెవరైన ఒకరు గుడిసె వెలుపల పరుండిన వారికి వియోగము సంభవించును. తత్ఫలితముగ మునికి పాపము వచ్చును. ఇక్కడ ధర్మసందిగ్ధత ఏర్పడినది. ఆ ముగ్గురు బయటపరుండుటకు సన్నద్ధులగుచుండిరి. చివరకు భిల్లుడు బయట పరుండెను. గుడిసెలో భిల్లసతి, యతినాథుడు పరుండిరి. ఒకవైపు భార్యను పోషించుభారము, మరొకవైపు అతిథిని సత్కరించు భారము భిల్లునిపై నున్నది. అందువలన వెలుపల పరుండుట భిల్లునకు కర్తవ్యమైనది. ఆరాత్రి భిల్లుడు క్రూరమృగములకు బలియయ్యెను. ఉదయమున లేచి చూచి యతినాథుడు జరిగిన సంఘటనకు ఆశ్చర్యపడెను. ఆహుకి దుఃఖమునకు అంతు లేదు. ఆమె భర్తతో సహగమనమునకు సంసిద్ధమయ్యెను. అప్పుడు

మాయాముని వేషధారియైన శివుడు నిజరూపము పొంది వచ్చే జన్మమునందు ఆ భిల్లదంపతులు నలదమయంతులై జన్మింతురని, తాను హంసగ జన్మించి వారికి దౌత్యము చేయుదునని ఆహుకితో చెప్పినట్లు శివపురాణము లీలాఖండమునందు కలదు.

"చందురు వంగడంబున బ్రశక్తి వహించిన వీరసేన రా
జేందునికిన్ దనూజుడయి యీ శబరుండు నలుండ నా గఁబు
ట్టొందు జతుస్సముద్రదశనోన్నత దీవ్యదిలాధినాథ సం
క్రందనుడై సిరిన్ దనరు గాధయశంబును జెందు నెంతయున్"

"నీవు విదర్భ నేలు నరనేతకు భీమునకున్ గుమారై వై
యావటిలంగ పేర్మి దమయంతియనన్ బడు పేర్మితో నన
న్యావహ రూపకాంతి సుగుణాకరవై యమరేంద్రముఖ్యులన్
బోవడి యన్నలున్ నృపతి పూజ్యు వరించి సుఖింతు వెంతయున్"

"ఏను యతీంద్ర రూపమున నెంతయు మీపరిచర్యలొందుటన్
మానిని! రాజహంసనయి మంచిగ నీకును నైషధావనీ
జానికి మొక్కలంబయిన చక్కని కూరిమి గూర్చి పెండిలిన్
మానుగ గూర్తు నిర్వురు సమంచిత భోగము లొందుదుర్భువిన్"

(శివపురాణము లీలాఖండము 8-286, 287, 288)

*"The Satarudrasamhita of the Sivapuraṇa maintains that Nala and Damayanti were foresters in their previous birth. Billa was born as the son of Virasena in the City of Naishadha. He was the great king Nala. Ahuka was born as the daughter of king Bhima in the City of Vidarbha. She became famous as damayanti. Siva in the form of Yatinatha was born as a swan and managed the marriage of Damayanti with Nala. The narration of the story of the incarnation of Yatinathɒ hamsa is held as auspicious according to the Puraṇa"*[4].

శివుని వర ప్రభావము వలన భిల్లుడు నలుడుగ, ఆహుకి దమయంతిగ, యతినాథుడు హంసగ జన్మించినట్లు చెప్పిన ఈ శివపురాణాంతర్గతమైన విషయము వ్యాసభారతమునగాని, శ్రీహర్షుని నైషధీయ చరితమునందుగాని, శ్రీనాథుని శృంగారనైషధమునగాని కానరాదు. తెలుగులో ప్రత్యేకముగా నలకథాకావ్యములను రచించిన కవులు కూడ దీనిని గ్రంథస్థము చేయులేదు. శివపురాణాంతర్గత నలకథను స్మరించి నన్నయ నలోపాఖ్యానమును ఒక రసవత్ప్రబంధముగ చిత్రించినట్లు విదితమగును. మల్లంపల్లి వీరేశ్వర శర్మ తన ఉత్తర నైషధములో శివపురాణాంతర్గతమైన నలకథను కొలదిమార్పులతో అనుకరించియున్న విషయము ముందుప్రకరణలో వివరించుట జరిగినది.

గణేశపురాణమునందు కూడ నలదమయంతుల పూర్వజన్మ వృత్తాంతము గల కథ ఒకటి కన్పట్టుచున్నది. గణేశపురాణము ప్రకారము నలుడు పూర్వజన్మమున గౌడదేశమున "పిప్పల" పట్టణమున వైశ్యుడుగ జన్మించినట్లు, అతడు అరణ్యమునందు ప్రవేశించి నియమముతో ఉపవాసవ్రతము, తపము లాచరించినట్లు, ఒక ముని అతనికి ప్రత్యక్షమై గణేశుని పూజింపుమని సలహాయిచ్చినట్లు, గణేశుని అనుగ్రహమున వైశ్యుడు రానున్న జన్మమున నలుడుగ జన్మించినట్లున్నది[5]. ఈ గణేశపురాణాంతర్గత నలకథను సంస్కృత కవులుగాని, తెలుగు కవులుగాని తమ నలకథా కావ్యములందు స్మరింపలేదు.

సంస్కృత మహాభారతమున అరణ్యపర్వమునందు నలోపాఖ్యానము విపులముగ స్వయంసంపూర్ణముగ వివరింపబడినది. జానపదులలో విపులవ్యాప్తి చెందియున్న నలకథను గ్రహించి వ్యాసుడు విపులీకరించి తన భారతమునందు రచించియుండును. వివిధ

భారతీయ భాషాసాహిత్యములలో వివిధ ప్రక్రియలందు వ్యాప్తి చెందిన నలకథలన్నింటికి మహాభారతారణ్య పర్వములోని నలోపాఖ్యానమే మూలము. భారత నలోపాఖ్యాన విశేషాంశములు ప్రత్యేక ప్రకరణమునందు పరామర్శింపబడినవి.

మార్కండేయపురాణములో ప్రస్తావింపబడిన ధూమాశ్వుని కుమారుడైన నలునికి, నిషధాధిపతియైన నలచక్రవర్తికి సంబంధము లేదు.

ఇట్లు వాజసనేయసంహితలోను, సంస్కృత పురాణేతిహాసములలోను నలకథ సూచింపబడియున్నను సంస్కృత మహాభారతారణ్య పర్వమునందు మాత్రమే విపులముగ వివరింపబడినట్లు విదితమగుచున్నది.

## 1·1·2 నలకథాపరములైన సంస్కృత కావ్యములు:

సంస్కృత కవులు పలువురు నలకథను రసదృష్టితో వివిధ కావ్యప్రక్రియలలో వెలయించినారు.

కుశుని పౌత్రుడు, నిషధుని కుమారుడగు నలుడొకడున్నట్లు రఘువంశమునుబట్టి తెలియుచున్నది. రఘువంశమునందలి నలుడు తనకుమారుడైన నభునకు ఉత్తరకోసలరాజ్యమునిచ్చినట్లు కలదు. రఘువంశమునందు పేర్కొనబడిన నలుడు నిషధాధీశుడైన నలుడు భిన్నవ్యక్తులు.

## సంస్కృతములోని నలోదయము:

నాల్గాశ్వాసముల యమక కావ్యము. ఇందు 217 ఆర్యావృత్తములున్నవి. కొందరు దీనిని కాళిదాసు రచనగాను, మరికొందరు రవిదేవుని రచనగాను భావించిరి. కాని కేరళదేశమునకు చెందిన

వాసుదేవుడే (10వ శతాబ్ది) నవోదయ కర్తయని పలువురి అభిప్రాయము. ఇందు కవికి కథాదృష్టి కన్న రచనాదృష్టిమీదనే మక్కువ ఎక్కువగా కనిపించును.

## నైషధీయ చరితమ్:

సంస్కృత పంచమహాకావ్యములలో నొకటి. దీనికర్త శ్రీహర్షుడు (12వ శతాబ్ది) శ్రీహర్షుని తండ్రి శ్రీహీరుడు, తల్లి మామల్లదేవి. నైషధీయ చరితమ్ ప్రతిసర్గాంత శ్లోకములందును శ్రీహర్షుడు తన తలిదండ్రులను పేర్కొని స్మరించినాడు. ఇందు 22 సర్గలున్నవి. నలకథలోని పూర్వభాగము మాత్రమే ఇందు వర్ణితము. కథకంటె వర్ణనలే ఎక్కువ. "నైషధం విద్వదౌషధం" అను నానుడిని బట్టి దీని ప్రాశస్త్యము గమనింపవచ్చును. దీనికి సంస్కృతములో సుమారు 30 వ్యాఖ్యానములున్నవి. నైషధకావ్యమును శ్రీనాథుడు నిండు జవ్వనములో శృంగారనైషధమను పేర ఆంధ్రభాషలో సంతరించినాడు. శ్రీహర్ష, శ్రీనాథుల కావ్యములలోని కథావిశేషములను మూడవ ప్రకరణమున చర్చించుట జరిగినది.

## నలాయనము:

దీనికి కుబేరపురాణమని నామాంతరము. ఇందు 100 సర్గలలో నలకథ వివరింపబడినది. ఇది అముద్రితము. దీనికర్త మాణిక్య చంద్రుడు (1600) జైన సంప్రదాయానుగుణముగ కుబేరుని అవతారమే నలుడని కవి ఈ గ్రంథమునందు నిరూపించినాడు.

## నలకీర్తి కౌముది:

దీని కృతికర్త అగస్త్యభట్టు (14వ శతాబ్ది). ఇతడు ఓరుగల్లును పాలించిన ద్వితీయ ప్రతాపరుద్రుని (1294-1325) అస్థాన కవి

గంగాదేవి తన "మధురావిజయము" ను చారిత్రక కావ్యములో అగస్త్యుడు 74 కావ్యములను రచించినట్లు పేర్కొని కీర్తించినది. నలకీర్తికౌముది రెండవసర్గలో 79 శ్లోకములు, నాల్గవ సర్గలో 103. శ్లోకములు మాత్రమే లభించుచున్నవి. లభ్యమైన ఈ రెండు సర్గలు సాహిత్య పరిషత్తు పత్రిక కాకినాడ (1920-30) యందు ముద్రితమైనవి.

దేవతల పనుపున నలుడు దమయంతి యంతఃపురమును ప్రవేశించుట, నలదమయంతుల సంభాషణము, దమయంతి నిర్ణయమును నలుడు దేవతలతో చెప్పుట అను కథాంశములు నలకీర్తికౌముది రెండవ సర్గయందు వర్ణింపబడినవి. శ్రీహర్షుని వలెనే అగస్త్యుడు కూడ దమయంతికి స్వయంవరాగతులను జూపుటకు సరస్వతిని ప్రవేశపెట్టినాడు. త్రిమూర్తుల పనుపున తాను దమయంతీ స్వయంవరమునకు వచ్చినట్లు సరస్వతీదేవి భీమరాజుకు వివరించు విషయము అగస్త్యకవి కల్పనమే. ఇది భారతనలకథయందుగాని, హర్షనైషధమునందుగాని లేదు. దేవతలు నలదమయంతులకు దివ్యవరములిచ్చి దీవించు సందర్భమున "దమయంతి సాక్షాత్తు ఆదిశక్తి స్వరూపిణియగు పార్వతీదేవి అపరావతారమని, నలుడు సాక్షాత్తు పరమేశ్వర స్వరూపుడని సరస్వతీదేవి చెప్పిన విషయము అగస్త్యుడు కల్పించినదే. ఈ విషయము భారతనలకథయందుగాని, హర్షనైషధమునగాని, మరి యేయితర సంస్కృతనలకథా కావ్యములలోగాని లేదు.

నలకీర్తికౌముది నాల్గవ సర్గలో నలదమయంతుల వియోగము నలుడు తన రాజధానియగు కల్యాణపురిచేరువరకు గల కథ వివరింపబడినది. కల్యాణపురిని నలుడు చేరినట్లు తెల్పుట అగస్త్యుని కల్పనమే. భారత నలకథలో నలుడు అయోధ్యాపురిని చేరినట్లున్నది

కథాసంవిధానములో శ్రీహర్షనైషధమునకు నలకీర్తి కౌముదికి పెక్కు పోలికలున్నవి. ఇందలి నాసికావర్ణనకు సంబంధించిన శ్లోకభావమును రామరాజభూషణుడు తన వసుచరిత్రయందు ఇట్లు ఆంధ్రీకరించి యున్నాడు.

"నానాసూన వితాన వాసనల నానందించు సారంగ మే
లా నన్నొల్ల దటంచు గంధఫలి బల్కాననం దపంబంది యో
షానాసాకృతి బూని సర్వసుమనస్సౌరభ్యసంవాసియై
పూనెం బ్రేక్షణమాలికామధుకరీపుంజంబు లిర్వంకలన్"

వసుచరిత్ర 2_47

దీనినిబట్టి వసుచరిత్ర రచనాకాలము నాటికి (క్రీ. శ 16వ శతాబ్ది) నలకీర్తికౌముదికి విపుల వ్యాప్తి యుండినట్లు గమనింపవచ్చును.

## సహృదయానందము:

కృతికర్త కృష్ణానందుడు. ఇందు 15 సర్గలు, 943 శ్లోకములలో నలకథ వివరింపబడినది. సహృదయానందములోని ఒక శ్లోకమును విశ్వనాథుడు తన సాహిత్య దర్పణములో ఉదాహరించినాడు. సహృదయానంద కర్త శ్రీహర్షుని నైషధీయ చరితమును అనుకరించి యుండుటవలన కృష్ణానందుడు 13వ శతాబ్దము వాడని భావింపవచ్చును.

సహృదయానందము 3వ సర్గలో దమయంతీ సౌందర్యమును గూర్చి కాముడు ఇంద్రునితో చెప్పిన విషయమును హంస నలునితో చెప్పినట్లు తెలుపబడినది.

8వ సర్గలో సన్న్యాసి వేషమున కలిపుష్కరుని సమీపించి

జూదమున నలుని రాజ్యము పరిగ్రహింపు మని పురికొల్పినట్లు అందులకు పుష్కరుడు నిరాకరింపగ కలి పుష్కరునకు అక్షరాధ్య యనమను మంత్రముపదేశించినట్లు వర్ణింపబడినది.

13వ సర్గలో అరణ్యమున సర్పమును జూచి భయకంపితు రాలయిన దమయంతికి ఒక ముని కన్పించి, ఆమెకు ఆత్మవిశ్వాస మును కల్పింపనెంచి, తన ఆశ్రమమునకు వచ్చి విశ్రాంతి తీసి కొమ్మని ఆమెను కోరినట్లు, అందులకు దమయంతి నిరాకరింపగా త్వరలోనే తన భర్తను కలిసికొనగలదని ముని ఆమెను ఆశీర్వదించి నట్లు కల్పింపబడినది.

14వ సర్గలో నలు డయోధ్యాపురమును చేరి ఋతుపర్ణుని యొద్ద అశ్వ, గజశిక్షకుడుగ కుదురుకొనినట్లు అతనితో నలుడనగ పాపహరుడని అర్థము చెప్పినట్లు తెలుపబడినది.

సహృదయానందము వైదర్భీరీతిలో వ్రాయబడిన కావ్యము. దీనికి స్వయముగా కృష్ణానందుడు వ్యాఖ్యానమును వ్రాసినట్లు తెలియుచున్నది. కాని నేడది అలభ్యము.

## నలాభ్యుదయము:

వామనభట్టబాణుడు దీనిని రచించెను. ఇతడు కొండవీడును పరిపాలించిన పెదకోమటి వేమారెడ్డి (1403-1420) ఆస్థానకవి. విద్యారణ్యుని శిష్యుడు. వేమభూపాల చరితమను గద్యకావ్యమును సంస్కృతమున రచించుటను బట్టి ఇతనికి అభినవ భట్టబాణుడను బిరుదు లభించినది. శృంగారభూషణము, పార్వతీపరిణయమను గ్రంథములను కూడ సంస్కృతమున రచించినాడు. వామనభట్ట బాణుని నలాభ్యుదయములో కొంత భాగము మాత్రమే లభించు చున్నది. నలాభ్యుదయము 9వ సర్గలో 3వ శ్లోకముతో ముగియు

చున్నది. మొత్తము 508 శ్లోకములు గల నలాభ్యుదయము వివిధ వృత్తములతో నున్నది. కథాగతిలో శ్రీహర్షుని నైషధీయచరితమునను సరించియున్నను వామనభట్టబాణునిపై కాళిదాసుని కవితాప్రభావము కొంతగోచరించును.

నలాభ్యుదయము 5వ సర్గలోని దమయంతీ స్వయంవర ఘట్టము కాళిదాసు రఘువంశములోని ఇందుమతీ స్వయంవరమునకు ప్రతిబింబముగా కన్పించుచున్నది.

పెదకోమటి వేమారెడ్డి ఆస్థానముననే విద్యాధికారిగానుండిన తెలుగుకవి శ్రీనాథుడు. వామనభట్టబాణుని నలాభ్యుదయ ప్రభావముచేత కాబోలు శ్రీహర్షుని నైషధీయ చరితమును శ్రీనాథుడు శృంగారనైషధమను పేర ఆంధ్రీకరించియున్నాడు.

విద్యాధర, లక్ష్మణులను జంటకవులు "ప్రతినైషధ" కావ్యమును రచించినారు. ఇది షాజహాను కాలము 1708లో రచింపబడినది. విద్యాధరుడు శ్రీహర్షుని నైషధీయ చరితమునకు వ్యాఖ్యను కూడ వ్రాసినాడు.

## ఆర్యనైషధము:

ఆర్యనైషధమును ఆధునిక కవియగు ఎ. వి. నరసింహాచారి రచించినాడు. విశేషించి ఇందలి కథలో మార్పేమియులేదు.

నలకథాపరములగు కల్యాణకావ్యములు కూడ కొన్ని సంస్కృతమున గలవు. చక్రకవి (17వ శతాబ్ది) రచించిన దమయంతీ పరిణయకావ్యము, వాసుదేవన్‌నంబూద్రి రచించిన కల్యాణనైషధము కళ్యాణకావ్యములలో పేర్కొనదగినది.

సంస్కృతములోని నలకథా పరములగు శ్లేషకావ్యములలో ముఖ్యమైనవి- కృష్ణకవి నైషధపారిజాతీయము, హరిదత్తాసూరి (18వ శతాబ్ది) రాఘవనైషధము అనునవి. నలహరిశ్చంద్రీయమను శ్లేష కావ్యకర్త పేరు తెలియరాదు. ఘనశ్యాముని (18వ శతాబ్ది) అబోధ కరము, త్ర్యర్థికావ్యము, ఇందు నలకథ, కృష్ణుని కథ, హరిశ్చంద్ర కథలు జోడింపబడినవి. నలయాదవరాఘవపాండవీయమను చతు రర్థకావ్యము కూడ సంస్కృతమున కలదు.

సంస్కృతమున నలకథను చంపువుగా రచించిన వారిలో పేర్కొనదగినవాడు త్రివిక్రమభట్టు (A. D. 914-916). అతని నలచంపూకావ్యమునందు ఏడుచ్ఛ్వాసములున్నవి. దీనికి దమయంతీ కథ అని కూడ పేరున్నది. దేవతల పనుపున నలుడు దమయంతి యంతఃపురము ప్రవేశించి, వారి సందేశమును ఆమెకు దెలుపుట ఇందలి కథాంశము. ఇందు నూతనముగ 33 పురుష పాత్రలు, 29 స్త్రీ పాత్రలు కల్పింపబడినవి. కథలో మార్పు కూర్పులు లేక పోయి నను రచనా విషయమున సంస్కృతకావ్యమున కొక విశిష్ట స్థాన మున్నది.

త్రివిక్రమభట్టు రచించిన మరొక చంపువు దమయంతీ చంపూ కావ్యము. ఇందు హైమంతక, వసంతక అను రెండు హంసలు పేర్కొనబడినవి. ఒకటి నలుని సందేశమును దమయంతికి, మరొకటి దమయంతి సందేశమును నలునకు వినిపించి నలదమయంతులకు పరస్పర ప్రణయ భావమును నెరపినవి.

## 1.1.3 సంస్కృత నలనాటకములు:

నలకథ సంస్కృత నాటక కర్తలను ఎక్కువగా ఆకర్షించినది. సంస్కృతములో శాకుంతల కథకు కూడ ఇన్ని నాటకములావిర్భ

వింపలేదు. సంస్కృతములో నలకథా పరములైన నాటకములు 72 ఉన్నవి.

*" Some episodes like those of Nala and Damayanti have attracted many dramatists while ohers have attracted only a few. Even the famous Sākuntala episode has not attracted many dramatists, possibly because of the phenominal success of Kalidāsa's Abhijnana Sākuntala. None of his followers dared to emulate him and to base his drama on the same theme. But in the case of the Nala theme a drama of equal footing with Kalidāsa's work was absent and hence many a dramatists tried his hand at it, A perusel of Sanskrit dramatic literature will show that among the episodes of Mahabharata the Nala story occupies an important position"*[6].

నలవిలాస నాటకమును రచించిన రామచంద్ర సూరి (12వ శతాబ్ది) నలచరిత్ర నాటక కర్తయగు నీలకంఠదీక్షితుడు, దమయంతీ కల్యాణకర్తయగు నల్లాన్‌చక్రవర్తి శఠగోపాలాచార్యుడు. దమయంతీ కల్యాణమును రచించిన రఘునాథుడు, భైమీపరిణయ కర్తయగు శ్రీనివాస దీక్షితుడు. నలవిజయ నాటకమును రచించిన రామశాస్త్రి, నలదమయంతీ నాటకకర్తయగు కాలిపాదతర్కాచార్యుడు (20వ శతాబ్ది) మొదలగువారు రూపక ప్రక్రియానుగుణముగ నలకథను మలచి సంస్కృతములో రచించినారు.

నలవిజయనాటకము, కలికేళి ప్రహసనము, నలవిక్రమనాటకము, విధివిలాసిత నాటకము, నలభూమిపాలరూపక నాటకము, కలితాండవ నాటకము, అనర్ఘనలచరిత్రము ఇత్యాది నలకథాపరములగు నాటకములు సంస్కృతములో రచింపబడినట్లు సంస్కృతాలంకార గ్రంథములను బట్టి తెలియుచున్నవి. ఇవి నేడలభ్యములు.

రామచంద్రసూరి జైనమత గ్రంథములందలి విషయములను ఆధారముగా చేసికొని నలకథలో మార్పుకూర్పులు చేసి "నలవిలా

సము" ను ఏడంకముల నాటకమును సంస్కృతములో రచించినాడు. రామచంద్రసూరి సుప్రసిద్ధ సంస్కృత పండితుడైన హేమచంద్రుని శిష్యుడు. అతడు నలవిలాస నాటకమున ప్రదర్శనకు యోగ్యమైన సన్నివేశములను మాత్రమే గ్రహించెను. నలుని తండ్రి పాము రూపమున వచ్చి నలుని కాటువేసిన సన్నివేశము తప్ప నలవిలాస మునందలి మిగిలిన అంశములన్నియు వాస్తవికతా దృక్పథము కలిగి నట్టివే.

నలవిలాస నాటకమునందు మహాభారతమునగాని, ఇతర నల కథాకావ్యము లందుగాని లేని పాత్రలు 27 కల్పింపబడినవి. నల విలాసము ప్రకారము కింపురుషుడు నలుని మంత్రి, కూబరుడు నలుని సోదరుడు, పుష్పావతి దమయంతి తల్లి, కలహంసుడు నలుని స్నేహితుడు, ఖరముఖ విదూషకుడు, కోరకుడు నలుని కోశా ధికారి. సింహలకుడు మరియు మకరందులు నలుని సేవకులు, చిత్రసేనుడు చేదిదేశపు రాజు. మేఘముఖుడు కాపాలికుడు, లంబ స్తాని కాపాలకుని భార్య, విజయవర్మ మధురారాజు, దధిపర్ణుడు అయోధ్యారాజు. ఋతుపర్ణుడు అలకాపురి రాజు. వీరి మంత్రుల వివరములు కూడ నలవిలాసమునందు తెలుపబడినవి.

పాత్రల పేర్ల విషయమునందేగాక కథావిషయమునందు కూడ రామచంద్రసూరి పెక్కు మార్పులు చేసినాడు.

మహాభారతారణ్యపర్వమందలి నలోపాఖ్యానమును బట్టి నలునితండ్రి వీరసేనుడు; తమ్ముడు పుష్కరుడు. నలవిలాస నాటకము ప్రకారము నలుని తండ్రి నిషధుడు; సోదరుడు యువరాజకూబరుడు.

దమయంతి తల్లి మహాభారతమున నలోపాఖ్యానమున పేరులేని

పేరంటాలు. నలవిలాస నాటకమున ఆమెపేరు పుష్పావతి.

హంస దౌత్యమునకు బదులుగా నలుని వేడుక చెలికాడగు "కలహంసుడు" నలదమయంతులకు పరస్పరానురాగము కలిగించి నట్లు నలవిలాస నాటకకర్త కల్పించినాడు.

ఇంద్రాగ్ని యమవరుణుల ప్రసక్తియే లేకుండ నలవిలాస నాటకమున స్వయంవర సంవిధానము నడిచినది. దేవతలు మాన వాంగనను గోరుట అనుచితమని భావించి కాబోలు నాటకకర్త యిట్టి మార్పుచేసియుండును. ధీరోదాత్తుడైన నలునిచేత దౌత్యము నెరపుట అనౌచిత్యమని తలచియే నాటకకర్త నలదౌత్యమును కూడ పరిహరిం చినాడు. దానికి బదులుగా కథానుగుణమగు కొన్ని సన్నివేశములు కల్పించి రామచంద్రసూరి నాటకీయతను పోషించినాడు.

స్వయంవరాగతుల వృత్తాంతము వ్యాసభారత నలకథయందు కానరాదు. శ్రీహర్షుని నైషధీయ చరితములో సరస్వతీదేవి దమ యంతికి స్వయంవరాగతులను జూపినట్లున్నది. భీమరాజు మంత్రి యగు మాధవసేనుడు దమయంతికి స్వయంవరాగతులను జూపి నట్లు నలవిలాస నాటకకర్త కల్పించినాడు.

దమయంతిని గోరి విఫలమనోరథుడైన కలిపురుషుని ప్రేరణచే పుష్కరుడు కపట ద్యూతమున నలుని రాజ్యభ్రష్టునిచేసి దమయంతి తోకూడ అతని నడవులపాలొనర్చుట మహాభారతాంతర్గతమైన నల కథలోని విషయము. నలవిలాసనాటకమున దమయంతిని వివాహ మాడగోరి విఫలుడైన చేదిరాజగు చిత్రసేనుడును, అతని మిత్రుడగు కూబరుడును, కాపాలికుడును నలుని అడవులపాలు చేయుటకు కారకులుగా నిరూపింపబడినారు.

నలరూప వికృతికి కర్కోటకుడను సర్పము కారణమని

భారతనలోపాఖ్యానమున కలదు. తపశ్శక్తిచే దైవత్వము నందిన నలుని తండ్రియే కుమారునకు మేలుకలిగింపనెంచి భుజగరూపమున వచ్చి నలుని వికృతరూపమును చేసి అవసరమైనపుడు తన్ను స్మరించినచో నిజరూపమందగలడనియు ద్వాదశవర్షానంతరము మరల నలునికి దమయంతీ సమాగమము గల్గుననియు సూచించినట్లు నలవిలాస నాటకమున కల్పింపబడినది. ఇది జైనమతానుగుణముగ చేసిన కల్పనమే.

నలుడు బాహుక నామమున వంటలవాడై ఋతుపర్ణునొద్ద గడిపినట్లు భారతనలకథలో ఉండగా దధిపర్ణుని యొద్ద గడిపినట్లు నలవిలాసమున చెప్పబడినది. "ధర్మసేనగణి" అను జైన కవి తన నలచరిత్రమున కూడ ఈవిధముగనే తెలిపినాడు. దమయంతి అలకాపురములో రిపుశాత్రుని యింట గడిపినట్లు, ఋతుపర్ణుని భార్యయైన చంద్రయాశ దమయంతి పినతల్లి అని నలవిలాస నాటకమున పేర్కొనబడినది.

జీవలుడు ఋతుపర్ణుని రథసారథిగ భారతాంతర్గత నలకథలో చెప్పియుండగా నలవిలాసములో దధిపర్ణుడు రాజపురుషుడుగా పేర్కొనబడినాడు. ఈ జీవలునినే జైనకవులు కొందరు మంగళునిగా పేర్కొనినారు.

నలదమయంతుల పునస్సమాగమమునకు నాలుగు సంవత్సరములు పట్టినట్లు మహాభారత నలకథలో వర్ణింపబడగా నలవిలాసమున ద్వాదశవత్సరములని చెప్పబడినది.

నలుడశ్వవిద్యావిచక్షుడగుటచే శతయోజన మార్గ మొక్క రాత్రిలో రథము నడిపినట్లు భారతనలకథలో చెప్పగా దివ్యతేజస్వియగు జనక నిషధు డావేశించుటచేత నశ్వములు పవనాధిక జవము

గలవైనట్లు నలవిలాసములో వర్ణితము.

నలఋతుపర్ణుల కుండిన నగరప్రవేశము సాయంసమయమున జరిగినట్లు భారతనలకథలో కలదు. నలదధిపర్ణులు ప్రాతః కాలము ననే నగరమున చేరినట్లు నలవిలాసమున చెప్పబడినది.

బాహుకరూపములోనున్న నలుడు వండిన వంటకమును ఋతుపర్ణుడు దమయంతికి పంపగా నలపాక రుచినెఱిగి తన భర్త ఋతుపర్ణునొద్దనున్నట్లు ఆమె గ్రహించినట్లు భారత నలకథలో పేర్కొనబడినది. దధిపర్ణుని వంటలవాడైన బాహుకుడు సూర్యపాకమున సిద్ధహస్తుడని విని యాతని పరీక్షింపగోరి దమయంతి కలహంసాదులను దధిపర్ణుని కడకు పంపుట, వారు దధిపర్ణుని యాస్థానములో బాహుకవేషముననున్న నలుడు తిలకించినట్లు "నలాన్వేషణ"మను నాటకమును ప్రదర్శించుట, తరువాత దమయంతి ద్వితీయ స్వయంవరమునకు దమయంతి తండ్రి దధిపర్ణుని ఆహ్వానించుట, నలుడు రాలేదనుకొని దమయంతి యగ్నిప్రవేశము చేయనెంచుట, దధిపర్ణుని రథము తోలుకొని నలుడు కుండిన నగర సమీపమున కేతెంచి వృత్తాంతమంతయు నెఱిగి,దమయంతియొద్దకేగి జనక స్మరణముచే బాహుకరూపము వీడి నిజరూపమునంది దమయంతిని పరిగ్రహించుట అనునంశములు నలవిలాస నాటక కర్త కల్పించినవే.

ఇతివృత్త నిర్వహణము, రసపోషణము మున్నగు నాటక ప్రయోజనములను బట్టి చిత్రపటవృత్తాంతము,అంతర్నాటక ప్రదర్శనము, కాపాలికాది పాత్ర ప్రవేశము మున్నగువానిని నలవిలాస నాటకకర్త కల్పించెను.

నీలకంఠ దీక్షితుని నలచరిత్ర పదంకముల నాటకము.

దమయంతి నలుని వివాహమాడుట బ్రహ్మసంకల్పమైనట్లు దమయంతికి కలవచ్చుట, కలలో దమయంతి నలుని వివాహమాడుట, సువర్ణహంస నలదమయంతుల సంగమమునకు దూతగ వ్యవహరించుట, దమయంతీ స్వయంవరమునకు వెళ్లుమని బ్రహ్మ సరస్వతిని అజ్ఞాపించుట, గౌరీదేవాలయమున నలదమయంతులను కలిసికొనునట్లు సరస్వతీదేవి ఏర్పాటు గావించుట, ఇత్యాది కల్పనలు నలచరిత్ర నాటకమునందున్నవి. నలచరిత్ర నాటకమునందు దైవకల్పితమైన కొన్ని శక్తులు (Supernatural elements) ప్రవేశపెట్టబడినవి. ఇంద్రుడు నలుని శత్రువుగా నిందు చిత్రింపబడినాడు.

రామశాస్త్రి (20వ శతాబ్ది) రచించిన నలవిజయనాటకములో 10 అంకములున్నవి. నలుడు దమయంతిని గూర్చి కలలు కనుట, దమయంతి యరణ్యమునందు కాళికాదేవి నుపాసించి ఆ దేవి వరప్రభావమువలన తన ఆకారము మారి వచ్చుచుండగ కిరాతుడు జూచి పారిపోయినట్లు చెప్పుట కలికిబదులు పుష్కరుడే నలునకు కష్టములు కలిగించుటకు ప్రయత్నించునట్లు తెల్పుట మొదలైనవి నలవిజయ నాటకకర్త కల్పించిన భారతనలకథలో లేని కొన్ని కల్పనలు.

కాలిపాద తర్కాచార్యుని (20వ శతాబ్ది) నలదమయంతీ నాటకమునందు ఏడంకములున్నవి. ఇది సంస్కృత సాహిత్య పరిషత్తు పత్రికలో (కలకత్తా 1926) క్రమముగా ప్రచురింపబడినది. నాటకకర్త విదూషక, వనపాల, వనపాలిక, దమయంతి చెలికత్తెల వివరముల నిందు పొందుపరచినాడు. కామ, మోహ గుణములు కలికి సహాయము చేసినట్లు, ధర్మ, వివేకములు నలునకు సహాయపడినట్లు ఈనాటకమున చిత్రింపబడినవి. నలునకు ప్రధాన శత్రువు కలి. ఇందు పుష్కరుడు కలిచేతిలో కీలుబొమ్మగా చిత్రింపబడెను.

దేవతల పనుపున నలుడు దమయంతి యంతఃపురము ప్రవేశించి తనపేరు చెప్పకుండా దౌత్యము చేసినట్లు హర్షనైషధములో వలెనే నలదమయంతీ నాటకమున కలదు. నలుడు మొదట తన పేరు చెప్పి తరువాత దౌత్యము చేసినట్లు భారతాంతర్గత నలకథలో కలదు. అయితే నలదమయంతీ నాటకమున దమయంతి నేరుగా మాట్లాడినట్లు లేదు. దమయంతి యంతఃపుర రాజకన్యా.పురుషులతో రాజకన్యలు మాట్లాడుట అపచారమని భావించి.నాటకకర్త చెలికత్తెల ద్వారా దమయంతి తన సందేశమును నలునికి వినిపించినట్లు నిందు కల్పించెను. దమయంతీ నాటక కర్త నైషధకథను ఎక్కువగా అనుసరించినట్లనిపించును.

దమయంతి బోయవానిచేత పీడింపబడుటకు బదులు అతనిచే రక్షింపబడి తనబంధువుల యిల్లు చేరినట్లు నలదమయంతీ నాటకమున కల్పింపబడినది. కిరాతుని శీలమునకు మెరుగుపెట్టిన కల్పనయిది.

నలదమయంతీ నాటకమున నలుడు తనకుమారుడగు ఇంద్రసేనుని కలిసినప్పటి దృశ్యము దుష్యంతుడు సర్వదమనవనమందు భరతుని కలిసినప్పటి దృశ్యమును తలపించుచున్నది. ఇంద్రసేనుడు దున్నపోతుతో ఆటలాడుకొనుచుండెను. అది అతనిపైకి విజృంభించుచుండెను. ఆ సమయమున బాహుకరూపమునందున్న నలుడు ఇంద్రసేనుని కాపాడెను. ఇంద్రసేనుడు కోపగించుకొని నలునితో యుద్ధము చేయుటకు సన్నద్ధుడయ్యెను. ఇంద్రసేనుడు తనకుమారుడని తెలిసి నలుడు అతనిపై కోపగించుకొనలేదు. కాలిపాదతర్కాచార్యులు ఈ సన్నివేశమును కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలమును దృష్టిలో పెట్టుకొని రచించినట్లు తెలియుచున్నది.

మహాభారతకథలో పుష్కరుడు నలునకు జ్ఞాతి సోదరుడు.

నలదమయంతీ నాటకమున ప్రేమ సోదరుడు.పుష్కరుడు నిష్కళంకుడు. నలునకు కలిగిన బాధలను దలచుకొని దుఃఖించెడివాడు. పుష్కరుడు నలుని రప్పించి అతనికి రాజ్యమీయదలచినపుడు కలి అందులకు అంగీకరించలేదని నలదమయంతీనాటకమున కల్పింపబడినది. భారత నలోపాఖ్యానములో కలి విముక్తుడైన నలుడు పుష్కరునితో పునర్ద్యూతమాడి రాజ్యము పొందినట్లున్నది.పుష్కరుడు తానే విదర్భకు పోయి నలుని ఆహ్వానించి అతని రాజ్య మతనికిచ్చినట్లు నిందు తెలుపబడినది, పుష్కరుని ఉదారగుణము నలదమయంతీనాటకమున వ్యక్తమగుచున్నది.

జైన సంప్రదాయ నలకథలో జైనకవులు తమమత ధోరణుల ప్రకారము కొన్ని మార్పులను చేసినారు. నలుడు నిషధదేశాధీశుడని భారతనలకథయందుండగా జైనకవులు నలుని కోసలదేశపు రాజుగ పేర్కొనినారు. దమయంతి తల్లిపేరు పుష్పదంతి అని, దమయంతిని దమదంతి అనియు, దవదంతి అనియు, నలదమయంతుల సంతానము పుష్కర పుష్కలులని, బాహుక రూపమునందున్న నలుని హుండికుడని, జీవలకుని మంగళకుడని మార్చి జైనకవులు తమ కావ్యనాటకములందు తెల్పియున్నారు.

పైన పేర్కొనిన సంస్కృత కావ్య, నాటకములలో నలకథా పాత్రములు వినూత్న కల్పనలను సంతరించుకొనినవి.

## 1.2.ప్రాకృత భాషలలో జైనసంప్రదాయసాహితిలో నలకథ

ప్రాకృత భాషలలో ముఖ్యముగ జైన సంప్రదాయ సాహితిలోని నలకథలో ప్రధాన కథాసూత్రము తప్ప తక్కిన ప్రతి ఘట్టము, ప్రతి సన్నివేశము, ప్రతి పాత్రము సరిక్రొత్తవిగా వ్యాసభారతాతిరిక్తముగ

కన్పట్టును. హేమచంద్రుడను జైనుడు త్రిషష్ఠిశలాక (శ్లోక) "పురుష చరితమను పేరుతో రచించిన గ్రంథమునందలి నలచరిత్ర, సుభాశీలగణి విరచితమైన భరతేశ్వర బాహు బలివృత్తి" అను గ్రంథమునందలి దమయంతీ కథ వచనము, సోమ ప్రభాచార్యుని "కుమారపాలప్రతిభోధ" అను గ్రంథమునందలి దవదంతీచరితము,జినసాగర సూరి కర్పూర ప్రకార టీకాయందలి దవదంతీ కథ, దేవవిజయగణి రచించిన గద్యనేమినాథ చరితములోని నలచరిత్రమను వచనము, దేవ ప్రభాసూరి పాండవచరితములోని నలోపాఖ్యానము, ధర్మసేన గణివాసుదేవ హిందీలోని నలచరిత్ర వచనము మొదలగునవి ప్రాకృతభాషలో ప్రముఖములైన నలచరిత్రలు. అవియేగాక జైన గ్రంథావళిలో సోమతిలకసూరి రచించిన శిలోపాదేశ మాలావృత్తమను గ్రంథములోని దవదంతీకథ, దమయంతీ ప్రబంధము, జిన నైషధీయచరితమను ప్రబంధమును, దమయంతీ ప్రబంధమను వచనముకూడ పేర్కొనదగినవి. వినయచంద్రగణి రచించిన మల్లినాథ మహాకావ్యములోకూడ దవదంతి చరితమను పద్యకావ్యము పేర్కొనబడినది.

మాణిక్యచంద్రుని నలాయణకావ్యము, రామచంద్రసూరి నలవిలాసమను నాటకము జైనసాంప్రదాయానుగుణముగ సంస్కృతములో విరచితములైన గ్రంథములు. రామచంద్రసూరి మొదలైన జైనకవులు నలకథలో చేసిన మార్పులను కూర్పులను గూర్చి చర్చించియున్నాము.

## 1·3. పైశాచీ భాషలో నలకథ:-

బృహత్కథను పైశాచీభాషలో గుణాఢ్యుడు రచించెనందురు. కాని ఆ గ్రంథము నేడు లభించుటలేదు. కాశ్మీరమును పరిపాలించు

హర్షదేవుని (క్రీ. శ. 1100) ఆస్థానమందుండిన సోమదేవసూరి దీనిని సంస్కృతములో "కథాసరిత్సాగరము" అనుపేరుతో రచించినాడు. మూలమైన పైశాచీ బృహత్కథకిది యథానువాదమని సోమదేవుడు గ్రంథారంభమున పేర్కొని యుండుటచే, కథాసరిత్సాగరమునందలి నలకథాసారమును బట్టి బృహత్కథాకాలము(క్రీ.పూ. 200)న వ్యాప్తినొందిన నలకథను గ్రహింపవచ్చును. బృహత్కథలోని నలకథ సంస్కృత మహాభారతానుసారియైనను స్వల్పమైన కొన్ని మార్పులుకూడ లేకపోలేదు.

భర్తృవియోగురాలయిన బంధుమతికి దుఃఖనివారణార్థము సుమానుడను బ్రాహ్మణుడు ఇందు నలకథను చెప్పినట్లున్నది. నారదుని ప్రబోధము వలన దమయంతీ స్వయంవరమునకు ఇంద్రాగ్ని యమవరుణులు మాత్రమే వచ్చినట్లు భారతనలకథలో నుండగా, ఆ నల్వురితోపాటు వాయుదేవుడుకూడ వెళ్లినట్లు నిందు నూతనముగ కల్పింపబడినది.

నలుడు మామగారి యింటివద్ద ఏడు దినములు గడిపి, తరువాత నిషధకు వెళ్లినట్లు చెప్పినవిషయము కూడ భారత నలకథయందు లేని కల్పనమే.

నిషధ చేరిన తర్వాత నలదమయంతులు పార్వతీపరమేశ్వరులవలె పరస్పరానురాగులై యుండిరని, దమయంతి నలుని యర్ధనారీశ్వరియని కథాసరిత్సాగరము నందలి నలకథలో తెలుపబడిన్నది.

కలి నలుని శరీరమునందు ప్రవేశించుటకు చిరకాలము నిరీక్షించి, ఒకనాడు నలుడు కాళ్లుకడుగక, సాయంకాలపు పూజాది కార్యక్రమము నెరవేర్చక నిద్రించియుండగా సమయమును కనిపెట్టి

కలి నలుని ప్రవేశించెనని యిందు కల్పింపబడినది. కలి నలుని శరీరమునందు ప్రవేశింపగ. ద్వాపరుడు పుష్కరుని శరీరమునందు ప్రవేశించినట్లు ఇందు కల్పింపబడినది. నల, పుష్కరుల జూదము, జూదములో కలిప్రభావము వలన నలుడు క్రమేణా తన వస్తువులను కోల్పోవుట, పుష్కరుడు దమయంతిని పందెమునకు పెట్టుమని నలుని కోరుట, అందులకు నలుడు నిరాకరించుట వంటి విషయములు ఇందు కల్పింపబడినవి.

నలదమయంతులు రాత్రివేళ అరణ్యములందు గడ్డిపరకల మీద నిద్రించినట్లు తెల్పుట, దమయంతి సుబాహుపురము చేరినట్లు చెప్పుట, దమయంతిని సుషేణుడను బ్రాహ్మణుడు కనుగొనినట్లు వర్ణించుట కర్కోటక విషదగ్ధుడై హ్రూశ్వబాహుక రూపమున కోసలాధిపతి ఋతుపర్ణుని సేవించినట్లు తెల్పుట. సుషేణుడను బ్రాహ్మణుడు ఋతుపర్ణుని సభలో భర్తలేని భార్య జీవింపగలదా? అని ప్రశ్నించినపుడు హ్రూశ్వబాహుకరూపమునందున్న నలుడు సమాధానమిచ్చినట్లు వర్ణించుట – అనునవికథాసరిత్సాగరమునందలి నలకథలో చెప్పుకొనదగినఅమూల్యమైనకల్పనలు.

## 1. 4. ఉత్తర భారత భారతీయేతర భాషలో నలకథ:-

సంస్కృత,ప్రాకృత సాహిత్యములందేగాక గుజరాతీ,బెంగాలీ, సింధీ, ఒరియా, హిందీ మొదలైన సాహిత్యములలో కూడ నలకథ రచింపబడినది.భాలణకవి నలాఖ్యానము, మహీరాజుని నలదవదంతీ రాస,అనుకావ్యములు గుజరాతీభాషలో పేర్కొనదగిన నలచరిత్రలు, పీతాంబరుని నలదమయంతీచరితము వంగభాషలో ప్రసిద్ధమైనది. ఇది ప్రధానముగ మహాభారత నలోపాఖ్యానమునను సరించి రచింపబడినది. గుమాన్‌మిశ్రా నైషధీయచరితము, (శ్రీహర్షుని నైషధీయ చరితమున కనువాదమిది) పురోహిత్ ప్రతాప్‌నారాయన్ నలనారేస్ హిందీభాషలో ముఖ్యమైన నలచరిత్ర కావ్యములు.మాస్టర్ జేతానంద్

(క్రీ.శ. 1894) మహాభారత నలకథననుసరించి సింధీభాషలో నల దమయంతి నాటకమును రచించినాడు. నైషధీయచరితము ఒరియా భాషలోనికి కూడ అనువదింపబడినది.

భారతీయ భాషలందేగాక నలకథ భారతీయేతర భాషలలోనికి కూడ పరివర్తనము చెందినది. ఆంగ్లము, జర్మన్, ఇటాలియన్, ఫ్రెంచి, గ్రీకు, డచ్చి, హంగేరియన్, రష్యన్ మొదలగు భాషలలోనికి కూడ నలకథ అనువదింపబడినది. వివిధదేశములందు వివిధ రీతుల ప్రచారము నందిన నలకథను ఆయా దేశ ప్రజలు కల్పించినారని చెప్పుటకు వీలులేదు. ఈకథ భారతదేశమునుండియే ఆయా దేశములలోనికి వ్యాపించినది.

## 1. 5. తమిళ సాహిత్యములో నలకథ:

ప్రాచీన తమిళసాహిత్యమందు పలుచోట్ల నలదమయంతుల ప్రసక్తి కన్పట్టుచున్నది.

తమిళ పంచమహాకావ్యములలో ప్రసిద్ధమైనది శిలప్పదిగారము. దీని కృతికర్త ఇళంగో అడిగల్ (క్రీ.శ. 2వ శతాబ్ది) శిలప్పదిగారమున కౌంతి కోవలుని ఓదార్చుచు నలమహారాజు నంతటివానికే భార్యా వియోగము తప్పలేదని చెప్పు సందర్భమున నలకథ ప్రస్తావించబడినది. ఇందు ఇళంగో అడిగల్ నలుని కష్టపరంపరకు విధియే కారణమని నుడివినాడు. శిలప్పదిగారములో ప్రస్తావించబడిన నలకథ జైన సంప్రదాయ సాహితిలోని నలకథ ననుసరించినట్టిది.

తేవారములోని తిరుజ్ఞాన సంబంధర్ గీతమునందు నలుడు తిరునాళ్లారు దేవాలయములోని శివుని ప్రతినిత్యము పూజించెడి విషయము పేర్కొనబడినది. శైవభక్తులగు నాయన్మారుల భక్తిగీతములందును నలకథ ప్రసక్తియుండుట గమనింపదగిన విశేషము.

కొట్టికూర్రత్తన్ రచించిన రామాయణ సంబంధియగు "ఉత్తర కాండిత్తిల్"లో నలదమయంతుల కష్టములకు విధియే కారణమని పేర్కొనబడినది.

అది వీరరామ పాండియర్ (16వ శతాబ్ది) రచించిన "నైడదము" హర్షనైషధమున కనువాదము. నైడదము 26 పటములలో 1173 పద్యములున్నవి. కాని కొన్ని పట్టుల ఇది నలవెణ్బాకథను గూడ అనుసరించినట్లు కన్పట్టును.

నల్లాన్‌పిళ్లై వ్రాసిన భారతమునందలి నలకథ శ్రీహర్షుని నైషధీయ చరితము, నలవెణ్బాలను అనుసరించి రచింపబడినది.

ముత్తప్ప వ్రాసిన జయంగొండార్ శతకములోని నాలుగు పద్యములలో నలునిగూర్చి వివరణ కలదు. కర్కోటక సర్పవృత్తాంతము ఇంద్రుడు నలుని దూతగా పంపుట, నలచరిత్ర పవిత్రగాథ అని తెల్పుట, పుష్కరుడు నలుని జూదమునకు పిలిపించుట అనువిన శతకమునందు పేర్కొనబడిన ముఖ్యాంశములు.

స్వామినాథదేశికర్ వ్రాసిన విలకణకొత్తురై యందు నలుని ప్రశంస స్థూలముగ కలదు.

మహావిద్వాన్ మీనాక్షి సుందరం పిళ్లై రచించిన మధూన్ వనం అని నామాంతరముగల మణ్ణిప్పడికరై యందు నలుడు బ్రహ్మ తీర్థములో స్నానముచేసి కలి విముక్తుడయ్యెనని రోమశుడు ధర్మరాజునకు చెప్పినట్లు వృత్తాంతము వివరింపబడినది.

సుబ్రమణ్య కవిరాయర్ రచించిన తమిళపురాణములో నలుడు అలుబిడ్డలతో తిరునాళ్లార్ దేవాలయమును సందర్శించినపుడు కలి విముక్తుడయ్యెనని తెలుపబడినది.

జూదవ్యసనాభిలాష వలన నలుడు ఇడుములు పడెనని కనుక జూదమును పరిత్యజించ వలయునని వెణ్మణి నారాయణ భారతి తన తిరువెంకట శతకములో తెల్పియున్నాడు.

ఇట్లు తమిళసాహిత్యమున నలకథా వస్తుకమగు ప్రాసంగికములు కొన్ని అటనట పేర్కొనబడినవి.

తమిళసాహిత్యములో పూర్వోత్తర కథాంశములు కలిగిన మొట్ట మొదటి నలకథాకావ్యము పుగళేంది (12వ శతాబ్ది) రచితమైన నల వెణ్బాకావ్యము. నలునిగురించి నాలుగువందల "వెణ్బా" పద్యము లందు రచింపబడిన కావ్యమిది. పుగళేంది తమిళ కవిత్రయములో ప్రసిద్ధుడు. తన ఆశ్రయ దాతయగు చంద్రిన్ స్వర్గి కోరికపై పుగళేంది "నలవెణ్బా" కావ్యమును వ్రాసినట్లు అవతారికలో చెప్పుకొన్నాడు. మానవుని సుఖదుఃఖములు విధిప్రేరితములని, విధి అతి బలీయమైనదని, దానిని దాటుటకు బ్రహ్మకు కూడ సాధ్యము కాదని నలుని కథ ద్వారా పుగళేంది లోకమునకు చాటినాడు.

నలవెణ్బాకు మూలము వ్యాసభారతములోని నలోపాఖ్యానము. నలవెణ్బాలో స్వయంవరకాండం, కలితొడర్ కాండం, కలినీంగుకాండం అను మూడుకాండము లున్నవి. స్వయంవరకాండంలో దమయంతీ స్వయంవర వృత్తాంతమున్నది. కలితొడర్ కాండంలో కలి ఎత్తుగడలు కలిఆవేశము, కలి నలుని శరీరమునందు ప్రవేశించుట అను అంశములు వర్ణింపబడినవి. కలినీంగు కాండంలో కలి నలుని వీడిన సన్నివేశచిత్రణ మున్నది.

వ్యాసభారతమునందున్నట్లే అరణ్యవాసమనుభవించుచున్న ధర్మజునకు బృహదశ్వుడు నలకథను వివరించినట్లు నలవెణ్బా కావ్యారంభమునందు కలదు. దుర్యోధనాదులచే రాజ్యబహిష్కృతు

లయిన పాండవులు అరణ్యమునందున్నపుడు జరుగబోవు భారత యుద్ధములో పాండవ పక్షములో పాల్గొనగోరువారందరు వచ్చి ధర్మ జుని జూచినట్లు నలవెణ్బానందు మూలములో లేని విషయము తెలుపబడినది. ధర్మరాజు ధర్మపరుడు. దుర్యోధనుడధర్మ వర్తనుడు ఇది లోకమునకు తెలిసిన విషయము. యుద్ధము అనివార్యమైనపుడు ప్రజలు ధర్మపరుడైన ధర్మజునికి అండగా నుందురను విషయమును ఈ కల్పన ద్వారా కవి సూచించినాడు. దుర్యోధనుని కుటిల నీతిని ప్రజలు సహింపరని యిందు కవి తెల్పినాడు. బృహదశ్వమహర్షి ధర్మజునకు నలకథతోపాటు హరిశ్చంద్ర కథను కూడ చెప్పి దుఃఖో పశమనము కలిగించినట్లు నలవెణ్బాయందు కల్పింపబడినది. ఇది వ్యాసభారతములో లేని నూతనాంశము. బృహదశ్వుడు ధర్మజునకు జూదరహస్యమును తెలిపి జూదములో అతడు సుఃభముగ గెలు పొందుటకు "అక్షహృదయం" మంత్రమును కూడ అతనికి ఉపదే శించినట్లు నలవెణ్బాలో కల్పింపబడినది. కలి వలననే నలకథ జరి గినదని పుగళేంది భావించుటచే నలవెణ్బా కావ్యములో కలి పాత్రకు ఎక్కువ ప్రాధాన్యము కల్పింపబడినది.

వ్యాసభారతములోని నలోపాఖ్యానమును ప్రధానముగ అనుస రించినను పుగళేంది తన కాలమునాటి తమిళప్రజల ఆచారవ్యవహా రములకు సన్నిహితముగ మహాభారతనలకథలో లేని కొన్ని నూతనాం శములను నలవెణ్బా కావ్యమునందు చేర్చినాడు. నలచక్రవర్తి తండ్రిపేరు వీరసేనుడని వ్యాసభారతముననుండగా ఇందు నిషధు డని మార్చి చెప్పినాడు.

పరివార సమేతముగ నలచక్రవర్తి ఉద్యానవన ప్రవేశము చేసి

నట్లు చెప్పుట, హంసను చెలికత్తెలు పట్టితెచ్చి రాజునకిచ్చినట్లు చెప్పుట. తనబంధువులను తలచుకొని దుఃఖించు హంసను ఓదార్చి నలచక్రవర్తి అభయమిచ్చుట అనునంశములు నలుని రాజఠీవి ప్రదర్శన కనుగుణముగా పుగళేంది నలవెణ్బా కావ్యమునందు నూతనముగా చేర్చిన కల్పనలు.

కథాగమనమున కనుగుణమగు ప్రధానపాత్రలచే గ్రహించి మిగిలిన అప్రధానపాత్రలను పుగళేంది పరిత్యజించెను. నలుని తండ్రియైన వీరసేనుని నలదమయంతుల సంతానమైన ఇంద్రసేన, ఇంద్రసేనులను దమయంతి సోదరులైన దమ, దాంత, దమనులను పుగళేంది తన కావ్యమునందు పరిహరించినాడు.

నలుని రూపగుణసౌందర్యములకు ముగ్ధురాలైన దమయంతి చెలికత్తెలకు తెల్పకుండగనే తనకు తానై నలుని కీర్తించినదని తమిళ సాంప్రదాయానుగుణముగ పుగళేంది తెలిపినాడు.

భారతనలోపాఖ్యానములో దమయంతి విరహముగూర్చి చెలికత్తెలు భీమునకు చెప్పినట్లు కలదు. తమిళములోని అగం శాఖకు ఇది విరుద్ధము "ఏకమనస్కులైన నాయికా నాయకులు సంతోష పురస్సరముగ వ్యక్తీకరించు మధురానుభూతియే "అగం" అనబడును. ప్రేయసీప్రియుల వివాహాత్పూర్వప్రణయము, వివాహానంతర ప్రణయము, తరువాత వారికి కలిగిన వియోగము, అపుడు సఖులు నాయికను అనునయించుట మొదలగు విషయములు ఈ ప్రణయ గీతికా సంపుటములో వర్ణింపబడును". అగం సంప్రదాయము ప్రకారము నాయికకు సంబంధించిన విషయమునుముందు చెలికత్తె తన

సొంత అమ్మకు చెప్పును. తర్వాత చెలికత్తె అమ్మ నాయిక అమ్మకు ఆ విషయమును చెప్పును. నాయికఅమ్మ పోయి తనభర్తతో కుమార్తె విషయము చెప్పును. అగంశాఖలోని ఈ సంప్రదాయమునే నల వెణ్బాలో దమయంతి విషయమున పాటింపబడినది.

పుర ప్రజల, పురోహితుల,మంత్రుల తోడ్పాటుతో దమయంతి వార్ష్ణేయునిచే తమ బిడ్డలను విదర్భకు పంపినట్లు వ్యాసభారత నలో పాఖ్యానమునందున్నది. జూదములో రాజ్యము ఓడినతర్వాత నలుడు తన ఆలుబిడ్డలతో కలసి అరణ్యమునకు వెళ్లినట్లు, బిడ్డల బాధను చూడలేక నలుడు వారిని అరణ్యమునుండి విదర్భకు పొమ్మనినట్లు దమయంతి తన బిడ్డలను బ్రాహ్మణుల ద్వారా విదర్భకు పంపి,తాను మాత్రము నలునితో అరణ్యమునకు వెళ్లినట్లు నలవెణ్బాయందు కల్పింపబడినది.

ఆహారనిమిత్తమై నలుడు పక్షులను పట్టుకొనుటకు ప్రయత్నించి విగతవస్త్రుడైనట్లు భారతనలోపాఖ్యానములో వర్ణింపబడినది. నల వెణ్బాలో నలదమయంతులకు ఒక బంగారుపక్షి కన్పించినట్లు, దానిని దమయంతి కోరినట్లు, దానిని పట్టుకొనుటకు ప్రయత్నించు సందర్భమున నలుడు వస్త్రములను పోగొట్టుకొనినట్లు తెలుపబడినది కేవలము ఆహారనిమిత్తమైగాక దమయంతి కోరిక నెరవేర్చుటకు నలుడు బంగారుపక్షిని పట్టినట్లు పుగళేంది కల్పించి, కావ్యౌచిత్య మును పెంపొందించెను. ఇది రామాయణములో బంగారులేడిని పట్టి తెమ్మని సీత రాముని కోరిన సన్నివేశమును తలంపించుచున్నది,

నలదమయంతులకు వారి వివాహసందర్భమునందు దేవతలు దివ్యవరములిచ్చినట్లు భారతనలకథలో నుండగా నలదూత్యకార్య మును అదృశ్యాకారములతో తిలకించి, అతని నిష్పక్షపాతవైఖరికి,

నిష్కల్మషహృదయమునకు సంతోషించి, స్వయంవరమునకు ముందే దేవతలు దివ్యవరములిచ్చినట్లు నలవెణ్బాకర్త కల్పించెను.

నలదమయంతులకు దౌత్యముచేసిన హంస ఒండొరుల రూప గుణములను వివరించి పరస్పరానురాగయుక్తులను చేయుటయేగాక స్వయంవర విషయమును కూడ నలునకు తెల్పి కార్యసన్నాహము లకు పురికొల్పినట్లు నలవెణ్బాలో చిత్రితమైనది.

దమయంతీ ద్వితీయ స్వయంవరమునకు వెళ్లు ఋతుపర్ణునికి నలుడు రథసారథ్యముచేయు సందర్భమున ఋతుపర్ణుడుపదేశించిన అక్షహృదయవిద్యవలన నలుడు కలివిముక్తుడైనట్లు భారత నల కథలో తెలుపబడినది. నలవెణ్బాలో నలదమయంతుల పునస్సమాగ మసందర్భమున నలుడు కలి విముక్తుడైనట్లు వర్ణింపబడినది.

వ్యాసభారతనలోపాఖ్యానమున నున్నట్లు దమయంతి కేశిని అనుదాసిని నలుని దగ్గరకు రెండుసార్లు పంపి అతని వృత్తాంతమును తెలిసికొనినట్లు నలవెణ్బాకర్త చెప్పినాడు. విల్లి భారతమందలి నల కథలో కేశిని నలుని దగ్గరకు ఆరుసార్లు వెళ్లినట్లున్నది. నల్లాపిళ్లై రచించిన భారత నలోపాఖ్యానములో కేశిని ప్రశంసయే కానరాదు.

నలవెణ్బాలో తమిళ దేశాధీశుడగు చోళరాజునుండి సింధు రాజు వరకు 15 పద్యములలో స్వయంవరాగతుల వృత్తాంతము చెప్పబడినది. అది వీరరామపాండియర్ నైడదములో 42 పద్యము లందు స్వయంవరాగతుల వృత్తాంతమున్నది. నలవెణ్బాలో స్వయం వరాగతులను గురించి పరిచయము చేసిన వారి విషయము లేదు. నల్లాపిళ్లై భారత నలకథలో శారదాదేవి దమయంతికి స్వయంవరా

గతులను గూర్చి చెప్పినట్లున్నది. నైడదములో బ్రహ్మదేవుని యాజ్ఞతో సరస్వతీదేవి దమయంతీ స్వయంవరమునకు విచ్చేసిన రాజుల కులవ్యవస్థలను గూర్చి చెప్పినట్లు కల్పింపబడినది. వ్యాసభారత నల కథలో స్వయంవరాగతుల వృత్తాంత వివరములేవియు కానరావు.

నలదమయంతులు కుండిన పురమునుండి నిషధదేశమునకు (మావిందం) వెళ్లునపుడు మార్గమధ్యమున గంగానదిలో స్నానము చేసినట్లు వర్ణించుట, నల దమయంతులు ఏకవస్త్రధారులై అడవిలో తిరుగుచున్నపుడు దమయంతి కలినుద్దేశించి "పరస్త్రీ వ్యామోహము తో నీవు మాకు కష్టములు కలిగించినావు కావున నీకు నరక ప్రాప్తియ గునని" కలిని దమయంతి శపించినట్లు చెప్పుట అనునవి నలవెణ్బా కర్త కల్పించిన అమూలకములే.

ఇట్లు ప్రాచీనకాలమునుండి నలకథ తమిళ వాఙ్మయమున ప్రఖ్యాతమైనట్లు గుర్తింపవచ్చును. నలవెణ్బావంటి కావ్యములవల నను నలకథ తమిళ సాహిత్యములో విపుల ప్రచారము నందుటయే గాక శాశ్వతస్థితిని కూడ పొందినదని చెప్పవచ్చును.

## 1. 6. కన్నడ సాహిత్యములో నలకథ

తమిళ సాహిత్యమందువలెనే కన్నడ సాహిత్యమునందును నలకథ విశేషవ్యాప్తి చెందినది. కన్నడములో నలకథావస్తుకములైన కావ్యములు సుమారు పది ఉన్నవి.

### 1.6.1. చౌండరసకృత నలచంపూకావ్యము:

కన్నడ సాహిత్యములో పూర్వోత్తర కథాంశములు కలిగిన

ప్రథమ నలకథా కావ్యము "చౌండరస కృత నలచంపుకావ్యము". చౌండరసకవి దశకుమారచరిత్ర బాణాసుర విజయములను కూడ వ్రాసినట్లు నలచంపూకావ్యములో చెప్పికొన్నాడు. చౌండరసకృత దశకుమారచరిత్ర దండిదశకుమారచరిత్ర ననుసరించినది. ఇది అసంపూర్ణముగ నున్నది. బాణాసుర చరిత్ర అలభ్యము. కవి కాలము గురించి స్పష్టముగా తెలియదు. ఇతర కన్నడ కవులుకూడ ఇతనిని ప్రశంసించి యుండలేదు. చౌండరసు మాత్రము పంపపొన్న కవులను స్తుతించియున్నాడు. రుద్రభట్టుకు సమకాలికుడని భావించుటనుబట్టి చౌండరసు క్రీ. శ. 1180-1300ల మధ్యకాలము నందుండునని విమర్శకుల అభిప్రాయము. వ్యాసభారత నలకథకు నలచంపూకావ్యకథకు కథానిర్వహణమున పెక్కు పోలికలున్నవి. కావున ఈ కవి వ్యాసభారత నలకథ ననుసరించియుండవచ్చును. నలచంపూకావ్యమునందు పద్యము లెక్కువ. గద్యములు తక్కువ.

చౌండరసు త్రివిక్రమ భట్టు (914-916)నలచంపువునుకూడ అనుసరించి నలచంపువును రచించినట్లు తెలియుచున్నది. త్రివిక్రముని నలచంపూ అసమగ్రమైనది. ఇరువురి నలచంపూ కావ్యములకు మూలము వ్యాసభారత నలోపాఖ్యానమే. చౌండరసు నల చంపూలో శ్రీహర్షుని నైషధీయ చరితములోని శ్లోకములను కూడ అనువదించియున్నాడు.

చౌండరసు భారత నలకథలో లేని కొన్ని నూతనాంశములను కూడ కల్పించియుండుట గమనింపవచ్చును. భారత నలకథలో దమయంతి దమన మహర్షి అనుగ్రహమువలన భీమునకు పుట్టిన విషయము. ఆమె జననాది విషయములు విస్తృతముగ వివరింపబడి

నవి. చౌండరసు నలచంపువులో దమయంతి భీమనృపాలపుత్రి అని మాత్రమే తెలుపబడినది. కాని తక్కిన వివరములు లేవు.

నలుని జననము, విజయయాత్ర, వేటవినోదయాత్ర విస్తృతముగ చౌండరసు వర్ణించినాడు. దమయంతీ సౌందర్యమునకు ముగ్ధుడైన నలుడు ఉపవనమందున్న సువర్ణహంసను పట్టుకొనినట్లు భారతనలకథలోని విషయము. వన్యమృగములను వేటాడుటకు నలుని వేటగాండ్రు పిలిచినట్లు, అడవిలో నలుడు వేటాడునపుడు హంస కన్పింపగ దాని సువర్ణత్వమునకు ముగ్ధుడై పట్టుకొనినట్లు నలచంపూకావ్యమునందు తెలుపబడినది. కేవలము నాయికమీది విరహవేదనచే నలుడుద్యానవనమునకు వచ్చెననుట నాయకుని పాత్రకు కళంకమేర్పడునని, కార్యార్థియై వచ్చి అడవిలో హంస కన్పింపగ పట్టుకొనెనని చౌండరసు ఇట్లు కల్పించియుండును. విధి ప్రేరణవలన హంస నలునకు కనిపించినదని చెప్పుటలో ఔచిత్యమున్నది. విధిబలీయమైనది. దానిని అధిగమించుటకు వీలులేదనుటకే కవి ఈ కల్పన చేసినాడు. నలుని చేజిక్కిన హంస దమయంతీ వృత్తాంతము చెప్పుట భారత కథలో నున్నట్టిదే.

నారదపర్వతులిరువురు ఇంద్రసభలో దమయంతీ స్వయంవర వార్తను వినిపించుట, దేవతలు దమయంతీస్వయంవరమునకు సన్నద్ధులగుట, మార్గమధ్యములో దేవతలు నలుని జూచి దూత కార్యము అప్పగించుట, నలుడు దమయంతి యంతఃపురము ప్రవేశించి తనపేరు నలుడని చెప్పి, యింద్రాదులు స్వయంవరమునకు వచ్చినారని చెప్పుట, నలుడు దేవతల కార్యము విఘ్నమైనదని చింతించుట, తిరిగి వచ్చి నలుడు దమయంతి యభిప్రాయమును

దేవతలకు తెల్పుట, అనునవి వ్యాసభారత నలకథలోనున్న అంశ ములే. వీనిని కొంత వ్యత్యాసముతో నలచంపూ కర్త గ్రహించి యున్నాడు. పర్వతుని వలన కథకు ప్రయోజనములేదు. కాబట్టి ఆ పాత్రను తొలగించి నారదుడొక్కడే ఇంద్రసభకు పోయినట్లు, ఇంద్రునితో స్వయంవర వార్త చెప్పుచు దమయంతి నలుని తప్ప ఇతరులను వివాహమాడదని కూడ చెప్పినట్లు నిందు కల్పింపబడి నది. నారదుడు త్రిలోకసంచారి. నలదమయంతుల అనురాగము నారదునకు తెలియును. అందువలన నారదుడు దమయంతికి నలునిపై గల ప్రేమనుగూడ ఇంద్రునితో చెప్పుటలో ఎంతేని ఔచిత్య మున్నది. భారత నలకథలో నారదుడు ఇంద్రునితో దమయంతీ స్వయంవర వైభవమును వివరించెనేగాని నలుని ప్రసక్తి చేయడు. దమయంతి ఉత్తమ పతివ్రత. నలుడు సత్త్వగుణోపేతుడు. నల దమయంతుల గుణశీలములను లోకమునకు తెలియచేయుటకే ఇంద్రాదులు దమయంతీ స్వయంవరమునకు వచ్చిరి.

నలుడు దమయంతీ స్వయంవరమునకు ముందు వినాయక స్తుతి చేసినట్లు నలచంపువులో కల్పింపబడినది మార్గమధ్యములో ఇంద్రాదులు నలుని జూచిరి. దమయంతి నలుని వివాహమాడునని వారికి తెలియును. నలుని పరీక్షింపగోరి దమయంతిని తమకు భార్యగా చేయుటకు వారు నలుని కోరిరి. "దమయంతి లోకరత్నము. ఆ రత్నమునిచ్చుటకు నేనెవరిని? వివాహమనునది దైవ సంకల్పిత మైనది. అమె ఎవరికి భార్యకాగలదో దైవమునకు మాత్రము తెలి యును "అని నలుడు వారికి సమాధానమిచ్చెను. ఇంద్రాదులు తమ కొక శుభకార్యము చేయుమని కోరినారేతప్ప నలుని దూతకార్యము

నకు నియోగించినట్లు నలచంపువులో లేదు. దమయంతి యంతఃపుర మునకు నలుడు వెళ్ళునపుడు దేవతలు ఒక మానినిని సూక్ష్మకృతిలో అతనికి తెలియకుండ అతని వెంట పంపించినట్లు ఇందు కల్పింప బడినది. దీనివలన నలుని సత్యసంధత నిరూపిత మగుచున్నది. దమయంతి నేరుగా మాట్లాడక ఆమె తరఫున ఒక చెలికత్తె నలునితో మాట్లాడినట్లు నలచంపూ కర్త వర్ణించినాడు. మూల కథలో మాత్రము దమయంతి నేరుగా నలునితో మాట్లాడినట్లున్నది. అంతఃపుర స్త్రీలుగాని కులస్త్రీలుగాని పరపురుషునితో మాట్లాడుట అపచారమని భావించి దమయంతి యభిప్రాయమును చెలికత్తె ముఖముగ కవి యిట్లు వెల్లడించియుండును. తన పేరు చెప్పకుండ దేవతల కార్యము నేరవేర్చుటకు వచ్చిన నలునితో దమయంతి, 'నలుడే తనకు ప్రాణేశ్వరుడని చెప్పినట్లు', 'పేరేమి' యని వచ్చిన దూతను దమయంతి యడుగగ 'నీవు చెప్పె నామమే మూలంనకు నామమ్' అని నలుడు చెప్పినట్లు నలచంపూకర్త కల్పించినాడు. దమయంతి కోరుకొనుచున్నవాడను తానేనని నలుడొప్పుకొనినట్లిందు చెప్పబడినది. ఈ సన్నివేశము వలన నలుని సత్య సంధత, కార్యనైపుణ్యము, సువ్యక్తమగును. అదృశ్యాకారమునందున్న మానిని తిరిగివచ్చి ఇంద్రాదులతో నలుని సత్యసంధతను తెలిపెను. నలుడు సత్యవ్రతుడని లోకమునకు తెలియజేయుటకే నలచంపూకర్త మానిని వృత్తాంతమును కల్పించినాడు.

నలుని కార్యాసక్తికి మెచ్చి అతనికి ఇంద్రుడు అశ్వహృదయ జ్ఞానమును, అగ్ని, అగ్నిసిద్ధినిడు, యముయుద్ధజయలబ్ధిని, వరుణుడు జలసిద్ధిని ప్రసాదించిరి. దమయంతి చిత్త స్థైర్యమునకు మెచ్చి అగ్ని

దేవుడామె కిచ్చిన వర ప్రభావమువలననే దమయంతి బోయవానిని భస్మము చేసినదని యిందు తెలుపబడినది. ఇది చౌండరసు కల్పనమే. భారత నలకథలో ఈ విషయములేదు. నలదమయంతుల వివాహానంతరము వర్ణించిన ఓకుళి (నీళ్లు ఒకరిపై నొకరు చల్లుకొనుట) చౌండరసు కల్పితమే. కన్నడములోని ఓకుళిని తెలుగు ప్రజలు వసంతోత్సవమందురు. వివాహానంతరము వధూవరు లిరువురు పరస్పరము తమలో సిగ్గును పోగొట్టుకొనుటకు ఒండొరులపై వసంతము చల్లుకొనుచుండుట నేటికిని కలదు.

జూదమునందు తన భర్త సర్వస్వము కోల్పోవునపుడు దమయంతి రానున్న ప్రమాదము గ్రహించి తమ పిల్లలను తన పుట్టింటికి పంపించును. ఈ సందర్భమున దమయంతి తెలివితేటలను ప్రశంసించుచు "రమణియళుల్ బుద్ధి నాల్కుమడి" (స్త్రీకి బుద్ధి నాలుగు వంతు లధికముగా నుండును) అని కవి పేర్కొనినాడు.

సుబాహుని పట్టణమైన చేదిపురమును అనంతనిధి పట్టణమని చౌండరసు వ్యవహరించినాడు. అనంతనిధి రాజమాతకు దమయంతి తన అక్కకూతురని ముందుగానే తెలిసినట్లు నలచంపూకర్త కల్పించినాడు. వ్యాస భారతములోని నలకథ ప్రకారము సుదేవుడను బ్రాహ్మణుడు చెప్పువరకు దమయంతి తన అక్కకూతురని రాజమాతకు తెలియదు. కనుకనే దమయంతి రాజమాతకడ సైరంధ్రీ వృత్తితో నున్నట్లు చౌండరసు వర్ణించియుండలేదు. బ్రాహ్మణుడు తనతో పుట్టింటికి రమ్మని పిలిచినపుడు దమయంతి పతిచేత పరిహరింపబడి యుండుటచే నిరాకరించినట్లు నలచంపువులో కల్పింపబడినది.

భారత నలకథ ప్రకారము ఋతుపర్ణుని ఆస్థానములో నలుడు అశ్వశాలాధ్యక్షుడు, పాకశాసన నిపుణుడు కూడ. నలచంపువులో నలుడు వాజీసేవాజీవి అతని పాకశాసన నిపుణత్వము నిందు చెప్ప లేదు. దమయంతిని దలచుకొని నిరంతరము నలుడు గుర్రపుశాలలో దుఃఖించినట్లు మూలములో నున్నను "చౌండరసు" ఆ విషయమును తన కావ్యములో స్వీకరించలేదు. నలునితోపాటు వార్ష్ణేయుడు ఋతు పర్ణుని గుర్రపుశాలలో నున్నట్లు ఉన్న మూల విషయమును కూడ చంపువు కావ్యకర్త గ్రహించలేదు. తనకన్న తక్కువ స్థానములో నుండి తన్ను సేవించిన వార్ష్ణేయుడు తనకన్న అగ్రస్థానములో ఋతు పర్ణుని ఆస్థానము నందుండినట్లు వర్ణించుట సబబుకాదని భావించి చౌండరసు వార్ష్ణేయు పాత్రను పరిహరించి యుండును.

వ్యాసభారత నలోపాఖ్యానములోని పర్ణాదునకు బదులు చౌండరసు తన నలచంపూ కావ్యములో బ్రాహ్మణ వేషధారియైన ఒక చోరుని ప్రవేశపెట్టినాడు. ఆ చోరుడు ఋతుపర్ణుని వంటశాల యందు కూర్చుండినట్లును, అక్కడికి బాహుకుడు వచ్చి చోరుని ప్రశ్నించినట్లు, నలమహారాజు దమయంతిని వదలిరాగా అతని యన్వేషణకు తిరుగుచున్నానని అతడు జవాబు చెప్పినట్లు. నలచంపూ కావ్యమునందు వర్ణింపబడినది. బాహుక రూపమునం దున్న నలుడు 'భర్తను వెదకుచు పోవు స్వాతంత్ర్యము స్త్రీకి కలదా?' అని చోరునితో బదులు పల్కినట్లు ఇందుకలదు. బాహుకుడే నలుడని చోరుని మూలముగ తెలిసికొని, దమయంతి అటు తరువాత ఒక బ్రాహ్మణుని ఋతుపర్ణుని ఆస్థానమునకు పంపి అతనితో దమయం

తికి పునస్స్వయంవరమని చెప్పమనెను. దమయంతి పంపిన బ్రాహ్మణుని పేరు ఇందు చెప్పబడలేదు. బ్రాహ్మణ చోదుడు బాహుకుని వృత్తాంతము చెప్పినపుడు బాహుకుడ తన అల్లుడు కాడని భీముడు సందేహించినట్లును, దమయంతీ మాత్రము బాహుకుడే తన భర్తయని గుర్తించినట్లు నిందు కల్పింపబడినది. "సతి బుద్ధి చతురుణవత్తే బావినల్" (స్త్రీ బుద్ధి నాలుగు గుణములతో కూడినది) అను నానుడినిబట్టి తన బుద్ధి విశేషముచేత దమయంతి ఈ విషయము తెలిసికొనినది.

దమయంతి ద్వితీయ స్వయంవర వార్త విని ఋతుపర్ణుడు వేయి యోజనముల దూరముగల కుండినపురము చేరుట దుర్లభమని చింతించినట్లు రాజవాహుకుడు అశ్వశాలకు వచ్చి బాహుకునితో రాజునకు కలిగిన దుఃఖము తెల్పినట్లు, అందులకు రథము నడుపుటకు బాహుకుడు సంసిద్ధుడయినట్లు నిందు కల్పింపబడినవి. నలుడు ఋతుపర్ణుని నుండి అక్షహృదయ విద్య నేర్చుకొనినట్లు తెలుపబడినది కాని ఋతుపర్ణుడు మాత్రము అశ్వహృదయ విద్యను నలునినుండి గ్రహించినట్లు ఇందు తెలుపబడలేదు. దమయంతి దాదితో తనకు వంటపదార్థములు కావలయునని బాహుకునితో చెప్పమనినట్లు నలచంపువులో కలదు. భారత నలకథలో దమయంతి దాదితో బాహుకుని వంట పాత్రములను తీసికొని రమ్మని ఆజ్ఞాపించినట్లున్నది.

నలచంపువులో భారత నలకథయందు వలెగాక దమయంతి తల్లిఅనుమతి లేకుండ బాహుకుని సమీపించి అతని కాళ్లపై పడినట్లు

వర్ణింపబడినది. బాహుక రూపమున నున్నవాడే తన భర్తయని దమయంతి దృఢవిశ్వాసము. అందువలన దమయంతి స్వతంత్రించి నలుని సమీపించినట్లు చంపూ కవి కల్పించెను.

చౌండరస కవి నలచంపూ కావ్యరచనకు ప్రధానముగ వ్యాస భారతారణ్యపర్వ నలోపాఖ్యానము నాధారముగ చేసికొన్నను శ్రీ హర్ష నైషధము నందలి భావములను కూడ కొన్నిచోట్ల అనుసరించెను. ఉద్యానవనములో నలుడు హంసను చూచుట, హంస దుఃఖ వర్ణన, నలుడు బంగారు ఈకలు వచ్చుటకు కారణమడుగుట, మేరు గిరీంద్రములలో సంచరించు కతమున తన ఈకలకు సువర్ణత్వ మబ్బినట్లు హంస చెప్పుట, అనునవి నలచంపూ కావ్యకర్త నైషధీయ చరితము ననుసరించి చెప్పిన అంశములు. నైషధమునందు వలెనే ప్రత్యుపకారము లేకుండగనే నలుడు హంసను వదలిన విషయమును నలచంపూకర్త తెలిపినాడు. విరహవేదనలోనున్న దమ యంతికి చెలులు నలకషాయము ఇచ్చి శైత్యోపచారములు చేసినట్లు నైషధమునందున్నట్లే యిందును కలదు. నల్లేరు వైద్యమువలన ఆరోగ్యము చక్కబడునని కన్నడికులనమ్మకము. నల్లేరుతో వైద్యము చేయుట ఇప్పటికి తెలుగుదేశమందలి పల్లెటూరులందు కలదు.

"స్యదస్య నలదం............దేవా కర్ణ యత్రశుశ్రుత"

—నైషధీయ చరితము (4–16)

"నలద" అను పదము నైషధములోను, నలచంపువులోను ఉన్నది.

హృదయాలను కదిలించే సన్నివేశములు కలిగిన నలచరిత్రకు కన్నడ సాహిత్యములో విశిష్టమైన స్థానమున్నది.[8]

కనకదాసుని నలచరిత్రకు మూలము సంస్కృత భారతారణ్య పర్వ నలోపాఖ్యానమే. నలచరిత్రలోని మార్పు కూర్పులు కథకు సంబంధించినవి కావు. కన్నడ ప్రజల ఆచార వ్యవహారములకు సంబంధించినవి. నియమనిష్టలు కలవాడు; కలినుండి విముక్తి పొందగలడని, దైవభక్తి కలిగిన వారికి కలివలన భయములేదని, కష్టము లెన్ని వచ్చినను నమ్మిన దేవుని వదలకుండినచో అవి ఏమియు చేయజాలవని కనకదాసు నలచరిత్రలో సూచించినాడు.

ఇందు తొమ్మిది భాగములున్నవి. ఈ భాగములను సంధి అని అందురు. కథారంభమున భారత నలకథలో నున్నట్లుగాక ధర్మజునకు రోమశ మహర్షి చెప్పినట్లున్నది. రోమశ మహర్షి ధర్మజునకు నలకథతోపాటు హరిశ్చంద్ర, రామకథలను కూడ సూచించి అతనికి చిత్తశాంతి చేకూర్చినట్లు కనకదాసు ఇందు చెప్పినాడు, సంస్కృత భారత నలకథలో బృహదశ్వుడను ముని కేవలము నలకథను మాత్రమే చెప్పినట్లున్నది. నల, ధర్మజులు చంద్రవంశపు రాజులు. హరిశ్చంద్ర, శ్రీరాములు సూర్యవంశపు రాజులు. చంద్రవంశపు రాజులకేగాక, సూర్యవంశపు రాజులకు కూడ కష్టములు తప్పలేదని చెప్పుటకే ధర్మజునకు రోమశ మహర్షి హరిశ్చంద్ర, శ్రీరాముల కథలను కూడ చెప్పియుండునని కనకదాసు భావించి యుండును. రోమశ మహర్షి ధర్మరాజుకు చెప్పిన ఈ నలచరిత్ర సూతుడు శౌనకాది మునులకు, అగస్త్యుడు శ్రీరామునకు చెప్పెరట. కథారంభములోని ఈ వివరములు వ్యాసభారత నలకథలో లేవు.

దమయంతి భీమునకు యాగఫలశ్రుతిగ జన్మించినట్లు నల దమయంతులు జనుల పొగడ్తల వలన పరస్పరము ప్రేమాభిమాను లయినట్లు, భీమరాజు సభలో నలుని సౌందర్యమును గూర్చి ఒక బ్రాహ్మణుడు అపారముగ పొగడగ దమయంతి విని నలుని తప్ప అన్యుని వివాహమాడుటకు నిరాకరించినట్లు కనకదాసు తన చరిత్రలో కల్పించినాడు.

నలుని ఆస్థానములో ఒక బ్రాహ్మణుడు దమయంతి రూపగుణ సౌందర్యములను వివరించుట, నలుడు దమయంతీ గుణబద్ధ చేతస్కుడగుట, వేటకాండ్రువచ్చి నలుని వేటకు పురికొల్పుట, వేటకాండ్ర వివిధ చేష్టల వర్ణన, వేటాడునపుడు నలునకు హంస పట్టుబడుట, దమయంతి వృత్తాంతమును తెలిపిన హంసను నలుడు వదలుట అను సంశములు వ్యాసభారత నలకథలో లేవు. ఇవి కనక దాసుని స్వకపోల కల్పితములే.

దేవతల పనుపున రాయబారిగ వచ్చిన నలుని దమయంతి పేరడిగినట్లు. అందులకు నలుడు దూతగా వచ్చినవారి కులగోత్ర ములు తమబోటి రాజకన్యలడుగరాదని, చెప్పుటకు నిరాకరించి నట్లు, దమయంతి నలకీర్తనము చేయుచుండగా తానే నలుడని బయ టపడుట, దేవతలు పన్నిన మాయగా దమయంతి అనుమానించుచు దమయంతి సందేహనివృత్తికి నలుడు హంస వృత్తాంతము చెప్పుట ఇత్యాద్యంశములు ఇందు కల్పింపబడినవి. భారత నలకథయందివి కానరావు.

స్వయంవరమండపములో నలాకారమునందున్న దేవతలను జూచి దమయంతి తన అంతఃపురమువెళ్ళి ఇదంతయు ఇంద్ర

జాలముగా తన తండ్రితో చెప్పుట. అపుడు భీముడు సరస్వతీదేవిని ప్రార్థించుట, సరస్వతీదేవి ప్రత్యక్షమై దమయంతి వారిని ప్రార్థించినచో కరుణించి యథారూపము పొందగలరని చెప్పినట్లు నిందు వర్ణింపబడినది. నలదమయంతుల వివాహమైన అయిదవనాడు వధూవరు లిరువురు ఒండొరులపై వసంతపు నీళ్ళు చల్లుకొనినట్లు నిందుగలదు. దీనిని కన్నడ ప్రజల వివాహాది వినోదములను దృష్టిలో పెట్టుకొని చేసిన కల్పనము.

పాత్ర చిత్రీకరణములో కనకదాసు శ్రద్ధవహించినట్లు తెలియుచున్నది. కలి మనసేకాదు. అతని శరీరముకూడ కలుషితమైనదిగా కనకదాసు నలచరిత్రలో చిత్రించెను. వంగిపోయిన మెడకల్గి, ఎర్రని కళ్ళతో మలిన వస్త్రధారియైన కలిని సౌందర్యహీనముగా కనకదాసు తెల్పినాడు. నలుడు సామాన్యుడు కాడని, త్యాగశీలుడని భగవంతుని అపరావతారమని కవి వర్ణించెను. ఇంద్రాదుల దూత కార్యమునకు నలుడు ఒప్పుకొనుటచే అతని త్యాగశీలత ప్రస్ఫుటమగునని కవి భావించినాడు. కలిని, పుష్కరుని, మన్నించుటలో నలునికిగల కారుణ్యభావమును రసవత్తరముగ చిత్రించి కనకదాసు నలుని లోకోత్తరునిగా, గుణోత్తరునిగ నిరూపించెను. సీతా చంద్రమతులవలె దమయంతి సాధ్వీలలామయని లోకమానిని యని, సత్యజ్ఞానియని, ఎన్ని కష్టములు వచ్చినను. పతిభక్తిని వదలని పతివ్రత యని కనకదాసు దమయంతిని కీర్తించినాడు.

కనకదాసు నలచరిత్ర కథా సంవిధానములోను, పాత్ర చిత్రీకరణములోను, ప్రత్యేక ప్రతిపత్తిని సంతరించుకొనినది.

## 1.6.3 బసవప్పశాస్త్రి – దమయంతీ స్వయంవరము:

ఆధునికుడగు బసవప్పశాస్త్రి (1843–1891) దమయంతీ స్వయంవరమను చంపూకావ్యమును రచించినాడు. దమయంతీ

స్వయంవరములో నలదమయంతుల వివాహమువరకుగల కథ ఉన్నది. బసవప్పశాస్త్రి శివభక్తుడు. కనుకనే కావ్యారంభమున శివుని స్తుతించినాడు. ఇతడు శాకుంతలము, రత్నావళి, విక్రమోర్వశీయము మాలతీ మాధవము అనునాటకములను, శృంగార శతకములను సంస్కృతమునుండి కన్నడములోని కనువదించినాడు. షేక్స్పియర్ 'ఒథెల్లో' (Othello) నాటకమును కూడా కన్నడీకరించినాడు. శివభక్త తరంగిణి, అష్టా, శివాష్టక, సహస్రాష్టకములను సంస్కృత భాషలో వ్రాసినాడు. బసవప్పశాస్త్రి బహుభాషావేత్తయని యిందు మూలమున స్పష్టమగుచున్నది.

బసవప్పశాస్త్రి దమయంతీ స్వయంవర చంపూకావ్యమందు కథకు సంబంధించి మార్పులు చేయలేదు. అతడు శ్రీహర్షుని నైషధ కథను ఆదరించినట్లు తెలియుచున్నది. శృంగార ప్రధానమైన ఈ చంపూ కావ్యములో బసవప్పశాస్త్రి నలుని గుణగణములను కీర్తి ప్రతాపములను విపులముగ వర్ణించియున్నాడు.

## 1.6.4 పరిశిష్టములు :

అయ్యాశాస్త్రి సోసలె (1854-1934) రచించిన దమయంతీ చరిత్రె అను పద్యకావ్యము, పి. ఆర్. కరి బసవప్పశాస్త్రి (1848-1931) కృతమగు నలచరిత్రె అను పద్యకావ్యము, శంకరభట్టు మహాబలేశ్వరశర్మ అను జంటకవులు రచించిన "నలదమయంతీ" అను గద్యకావ్యము, శివశంకరశాస్త్రి రచితమగు నలోపాఖ్యానము నలకథా పరములగు కన్నడ కావ్యములలో గణుతింపదగినవి.

కన్నడమున నలకథా పరములగు నాటకములు కూడ కొన్ని వెలసియుండుట చెప్పుకోదగిన విశేషము. బాలకృష్ణభటుని (1844-

1914) దమయంతీ స్వయంవరము అయ్యాశాస్త్రి కృతమగు నలచరిత్ర నాటకము, వాసుదేవాచార్య (1866–1921) రచితమగు నలదమయంతీయ నాటకములు కన్నడ నాటకములలో పేర్కొనదగినవి.

పైని పేర్కొనిన వానిని బట్టి నలకథ కన్నడములో ఆధునిక రచయితలను కూడ ఎక్కువ ఆకర్షించినదని చెప్పుకోవచ్చును.

## 1.7 మలయాళ సాహిత్యములో నలకథ:

తమిళ, కన్నడములందువలె మలయాళ సాహిత్యమునందును నలచరిత్ర ప్రాచీన కాలమునుండి విశేషవ్యాప్తి గాంచినది. మలయాళ సాహిత్యమున వ్యాస భారతమందలి నలకథేగాక, శ్రీహర్ష నైషధమునకుకూడ అనువాదములు, అనుసరణలు వెలసినవి. నిరణంకవులు ఎళుత్తచ్చన్, చెరుశ్శేరి కవులు తమ భారతానువాదములలో నలకథను పరామర్శించి యున్నారు. నిరణం కవులలో ఒకడైన శంకరఫణికర్ రచించిన 'భారతమాల'లో 32 ద్విపదల్లో సంపూర్ణమైన నలచరిత్ర ఉన్నది.

## 1.7.1 పాట్టు సాహిత్యములో నలకథ:

మలయాళ సాహిత్యమునందు నలకథ శిష్టసాహిత్యములో కంటె జానపద సాహిత్యముననే విపుల ప్రచారము పొందినది. నలకథా పరములైన స్త్రీల పాట్టులనేకములు మలయాళములో నున్నవి. పాట్టు ప్రాచీన మలయాళ సాహిత్యములో విశిష్టమైనది. అందు నలకథకొక విశిష్ట స్థానమున్నది.

### 1. ఊంజాల్ పాట్టు: (ఊఞ్ఞాళప్పాట్టు)

ఇందు పది పద్యములలో నలదమయంతుల వివాహమువరకు

గల కథ వర్ణింపబడినది. "ఓణమ్" పండుగ సందర్భములో స్త్రీలు ఊయల లూగుచు ఆనందించుటకొరకు ఈ కృతి వ్రాయబడినట్లు ఇందు పేర్కొనబడినది. దేవతల పనుపున నలుడు దమయంతి యంతఃపురము ప్రవేశించినపుడు నలుని కాంతి ప్రసరము చూచి దమయంతి సందేహించుట, నలుడామెను ఆశ్వాసించుట అను విషయములు ఊంజాల్ పాట్టునందు తెలుపబడినవి.

## 2. నలచరితం కిళిప్పాట్టు :

చిలుకగాని హంసలుగాని కథ నడిపే కావ్యమునకు మలయాళ మున కిళిప్పాట్టు (చిలుకపాట) అనిపేరు. ఈ కిళిప్పాట్టులను మలయాళభాషలో మొదట ప్రవేశపెట్టినవాడు ఎళుత్తచ్చన్ (16వ శతాబ్ది). నలచరితమ్ కిళిప్పాట్టులో ఇంద్రకలి సంభాషణము నల పుష్కర సంవాదము సరసముగ నిర్వహింపబడినది. శారదాదేవి స్వయంవరాగతులను దమయంతికి జూపినట్లు ఇందు శ్రీహర్షుని నైషధము ననుసరించి తెలుపబడినవి. ఇట్టి నలకథా పరములైన కిళిప్పాట్టులలో కొచ్చెన్ నంబియార్ నలచరితమ్ విశిష్టమైనవి.

## 3. నలచరితం కురత్తిపాట్టు :

దీనిని కుట్టికుఞ్ఞు తంగచ్చి రచించినాడు. పార్వతి ఎరుకత (కురతి) వేషములో వచ్చి దమయంతి చేయిచూచి ఫలము చెప్పి నట్లు ఇందు తెలుపబడినది. మలయాళమున ఎరికలవారు బుట్టలు అల్లుచు ఈ నలకథను పాటలుగా పాడుచుందురు. దమయంతీ ద్వితీయ స్వయంవరమువరకుగల కథను ఎరికలది చెప్పినట్లు ఈ నలచరితం కురతిపాట్టునందు కలదు. ఇది కాక కవిపేరు తెలియని

మరొక నలచరితం తురత్తిప్పాట్టు మలయాళమున ఉన్నట్లు తెలియు చున్నది, దీనిని 1923లో ఎస్. టి. రెడ్డియార్ ముద్రించెను.

## 4. తిరువాదిరప్పాట్టులు:

కేరళ దేశములో ఆర్ద్ర నక్షత్ర ప్రవేశమపుడు జరుగు పండుగ నాడు స్త్రీలు గుంపుగ కలిసి నాట్యము చేయుచు పాడు పాటలను తిరువాదిరప్పాట్టు అందురు. లక్ష్మీబాయ్ దమయంతీ స్వయంవరము (తిరువాతిరప్పాట్టు), దమయంతీ స్వయంవరము (తిరువాతిరప్పాట్టు-పద్యకావ్యము) మలయాళ సాహిత్యములో తిరువాతిరప్పాట్టులలో పేర్కొనదగినవి.

## 5. అమ్మనప్పాట్టు:

స్త్రీలు అచ్చన గాయులాడుచు పాడుపాటలను మలయాళమున అమ్మనప్పాట్టు అని పిలుతురు. ఈ పాటలలో కూడ నలకథ చోటు చేసికొన్నది.

## 6. పత్తు వృత్తమ్ ప్పాట్టు:

ఇది పది విధములైన ద్రావిడ వృత్తములతో కూడిన ప్పాట్టు. ఇందు పది పద్యములందు నలకథ సంగ్రహముగ వివరింపబడినది.

## 7. కైకొట్టికళి ప్పాటు:

జానపద స్త్రీలు గుంపుగ గూడి చేతులు తట్టుచు పాడేపాట యిది. ఇది ఒక విధముగ గొబ్బిపాట వంటిది. కైకొట్టికళి పాట్టు లలో సి. ఎం. నారాయణి అమ్మ నలచరిత్తమ్ కొత్తుణ్ణల్లూర్ విద్వాన్ ఇలయతమ్ పురాన్ కృతమగు నలచరితమ్, ఉణ్ణిరికుట్టి వైద్యన్ రచించిన నలచరితమ్‌లు విశిష్టమైనవి.

## 8. వాతిల్ తురప్పాట్టు:

వివాహానంతరము వరుడు శోభనపు గది ముందు నిలబడి

లోపలున్న వధువును తలుపు తీయుమనుచు పాడేపాట ఇది. తలుపు దగ్గరపాడే శృంగారపాటలలో కూడ నలకథ చోటు చేసికొనినది.

## 9. వంజిప్పాట్టు:

పండుగ సందర్భములందు కేరళలో మగవారు పడవ నడుపుచు పాడేపాట యిది. ఈ వంజిప్పాట్టులలో వెన్మణి కృతమగు నలచరితము విశిష్టమైనది

## 10. కోల్కాలి ప్పాట్టు:

పురుషులు ఆడుచు పాడే పాట యిది. ఇది కోలాటము పాట వంటిది. ఈ పాటలలోకూడ నలకథ వున్నవి.

పైన పేర్కొనబడిన పాట్టులందేగాక పాన (సర్పిణీ వృత్తములో కూర్చిన జానపద గేయములు), పతిన్నాలు వృత్తమ్ (పదునాల్గు రకముల ఛందస్సులలో కూర్చిన కావ్యము), రెండువృత్తమ్ (రెండు రకముల ఛందస్సులతో కూర్చిన కావ్యము), వానియందు కూడ నలకథ పేర్కొనబడినది.

పైన పేర్కొనిన అంశములనుబట్టి మలయాళ జానపద వాఙ్మయమునకు నలకథ దోహదకారియైనదని చెప్పవచ్చును.

## 1.7.2 మణిప్రవాళ సాహిత్యములో నలకథ:

మలయాళ భాషలో అతి ప్రాచీన గ్రంథములుగా పరిగణింప బడుచున్నవన్నియు మణి ప్రవాళసాహిత్యశాఖకు చెందినట్టివే. మల యాళము (మణులు) సంస్కృతము (ప్రవాళము) చేర్చి కావ్యములు రచించుట మణిప్రవాళ పద్ధతి. మణిప్రవాళ కావ్యములలో శృంగా

రమునకే ప్రాధాన్యమెక్కువ. మానందేరి మఠంలోని చందు నంబియార్ రచించిన "మరాళ సందేశం" మణి ప్రవాళ పద్ధతిలో రచితమైన నలచరిత్రలలో విశిష్టమైనది.

## 1.7.3. నలకథా వస్తుకములైన మలయాళ కావ్యములు:

మలయాళ కవులు పలువురు నలకథను రసదృష్టితో వివిధ కావ్యములుగ వెలయించినారు. పులియూర్ పురుషోత్తమన్, నంపూతిరి కృతమగు 'భాషా నైషధము' పి. జి. నాయర్ రచించిన "బాల నైషధము" ఎన్. సదాశివశాస్త్రికల్ రచితమగు "భాషా నైషధీయ చరితం", పి. కేశవన్ ఉణ్ణితాన్ కృతమగు "దమయంతీ శాప శతకము" ఎస్. క్రిష్ణపిళ్లై రచించిన లఘునైషధము, కె.పద్మనాభపిళ్లై విరచితమగు నైషధ గానమాలిక, తైక్కాట్టు నారాయణన్ మూస్సతు కృతమగు నలచరితమ్, మాటవిమాండన్ గురుక్కల్ రచితమగు నలచరితమ్, కె. ఎం. నమపనిక్కర్ విరచితమగు నలచరితమ్, నీలకంఠన్‌తంపి కృతమగు నలచరితమ్ మొదలగునవి నలకథా వస్తుకములైన మలయాళ కావ్యములలో పేర్కొనదగినవి.

కేవలము గద్యపద్య కావ్యములేగాక నలచంపూ కావ్యములు కూడా కొన్ని మలయాళమునందున్నవి. మలమంగళం నారాయణన్ నంపూతిరి కృతమగు భాషానైషధము, రామన్ ఆశాన్ రచితమగు నైషధమ్ చంపూ, నలచంపూ (కవిపేరు తెలియదు) 1967 లో ముద్రితమైనది). ఇవి నలకథాపరములగు చంపూ కావ్యములు.

## 1.7.4 ఆట్టకథా సాహిత్యములో నలకథ:

ఉణ్ణాయివారియర్ (17వ శతాబ్ది చివరి భాగము) వ్యాస భారతారణ్య పర్వమందలి నలకథను గ్రహించి, పూర్వోత్తర కథాంశ

ములలో ప్రత్యేకమైన నలకథా కావ్యమును మలయాళ భాషలో రచించెను. ఉణ్ణాయివారియర్ నలచరిత్ర, "కథకళి" రూపమున నాల్గు ఏకాంకికలందున్నది. పూర్తి కథను నాల్గు రాత్రులందు ప్రదర్శింపవచ్చును. ఉణ్ణాయివారియర్ రచించిన నలచరిత్ర మలయాళములోని అట్టకథలలో పేర్కొనదగినది. ఆటక్కథా ప్రకారములను రంగస్థలముపై ప్రదర్శించుటను "కథకళి" యందురు.

"కలిశమన ఔషధ రస మయ చరితన్, కలి శతరోపమవీధిన్
శాంఘు, పినాకి, వరార్థశీలన్, వాఙ్మానసశాలిని"

అని ఉణ్ణాయివారియర్ నలుని లోకోత్తరునిగ చిత్రించినాడు.

ఉణ్ణాయివారియర్ నలకథానుగుణముగ మూలకథలో కొన్ని మార్పులు చేసినాడు.

దమయంతీ స్వయంవరమునకు ఇంద్రాది దేవతలేగాక గంధర్వ, రాక్షస, యక్ష కిన్నరులుకూడ అరుదెంచినట్లు ఉణ్ణాయి వారియర్ తన నలచరిత్రలో కల్పించినాడు. స్వయంవరమునకు వచ్చిన వారిని దమయంతికి పరిచయము చేయుటకు ఇందు సరస్వతిని నియోగించుట హర్షనైషధము నాధారముగా చేసిన కల్పనమే.

దేవతల పనుపున దమయంతి యంతఃపురము ప్రవేశించిన నలుని అట్టక్కథలో దమయంతి సరిగా గుర్తించినట్లు లేదు.

దమయంతీ స్వయంవరానంతరము వర్ణింపబడిన సురాసురుల సంవాదము వారియర్ స్వకపోల కల్పితమే. కథకళిలో ప్రేక్షకులను తృప్తిపరచుటకే వారియర్ ఈ సన్నివేశమును కల్పించియుండవచ్చును.

ఉణ్ణాయి వారియర్ అట్టక్క్రథ ఆద్యంతములందు కథా వస్తువుకు ఒక నిర్వాహకుని సంపాదించుటకై నారదుని ప్రవేశ పెట్టి నాడు. తాను విష్ణువు దగ్గరనుండి నేరుగా వచ్చినట్లు నారదుడు నలునితో చెప్పుట, నారదుని మాటలు వినిన తరువాతనే నలునికి దమయంతిమీద కోరిక కలుగుట, కలహములు లేకుండ దమయంతీ స్వయంవరమును నిర్వహించుట కొరకే నారదుడు ఇంద్రాది దేవత లను ప్రేరేపించుట ఇందు కల్పింపబడిన వానిలో ముఖ్యమైనవి. ఈ అట్టక్క్రథలో నారదుడు కేవలము కలహభోజుడుగా గాక ఒక కార్యార్థిగా చిత్రింపబడుట గమనింపదగిన విశేషము. ఇది అద్భుతా వహమైన విషయము. మూలములో నారదుడు ఇంద్రాది దేవతలతో దమయంతీ స్వయంవర వృత్తాంతమును తెల్పినట్లు మాత్రమే కలదు.

మూలములో నలదమయంతులు పరస్పరము ఆకర్షితులగు టకు కథా ప్రారంభములో హంస ప్రవేశము తోడ్పడినట్లు తెలుప బడినది. వారియర్ తన అట్టకథ నలచరిత్రలో స్వర్ణహంసను కథాంతములోకూడ ప్రవేశపెట్టినాడు. కథాంతములో హంస ప్రవే శించి "పుష్క్రరుని చంపరాదు" అని బ్రహ్మ సందేశమును వినిపించి నట్లు వారియర్ కల్పించెను.

స్వయంవరమును జూచి తిరిగి పోవుచున్న సమయములో దేవతలు 'కలి'ని ఏకాంతముగ చూచినట్లు, అట్టక్క్రథలో చెప్పబడి యున్నది. ఇంద్రాదులు తెలుపక పూర్వమే కలికి దమయంతీ స్వయంవరము విషయము తెలిపినట్లు అట్టక్క్రథలో కల్పింపబడినది.

నలుని దేహమునందు ప్రవేశించుటకొరకు కలి పంద్రెండు సంవత్సరములు ఎదురు చూచెనని, ఒక పర్యాయము నలుడు సంధ్యాసమయములో కాళ్ళు కడుగకుండా అశుచిగావున్న సమయము చూచి కలి అతని శరీరమునందు ప్రవేశించినాడని, మూలకథలో తెలుపబడినది. అభినయ సౌకర్యముకొరకు తన కృతిని నాటక

కళతో ఏకీకరించుట కొఱకు ఉణ్ణాయి వారియర్ ఈ భాగమును వదలిపెట్టి యుండవచ్చును.

## 1.7.5 నలకథాపరములైన నాటకములు:

నలకథ మలయాళమున నాటక రూపమునందు కూడ ఆవిర్భవించినది. భైమీపరిణయ నాటక కర్తయగు ఒరవంకరుడు, భాషా భైమీ పరిణయ నాటకమును రచించిన కె. పి కరుప్పన్, భాషా నైషధము (1893 ముద్రితము)ను రచించిన బెత్తుణ్ణి వైద్యర్, దమయంతీ నాటక (1913 లో ముద్రితము) కర్తయగు రామకృష్ణ భాగవతార్, నలచరితమ్ నాటకమును రచించిన కంటియార్ కంజుణ్ణి వారియర్, సంగీత నైషధ (సంగీత నాటకము 1913లో ముద్రితము) నాటక కర్తయగు అచ్యుతమీనన్ మొదలగువారు రూపక ప్రక్రియానుగుణముగ నలకథను మలచి మలయాళములో రచించినారు.

## 1.7.6 నలకథాపరములయిన కథలు:

మలయాళ కవులు నలకథకు గల ప్రాధాన్యమును గుర్తించి కథలు కూడా వ్రాసిరి. అట్టివానిలో కుంజు కృష్ణమీనన్ వ్రాసిన "దమయంతీ కథ" (1919 లో ముద్రితము) కె. శంకరపిళ్లై విరచితమైన "దమయంతీ కథ" (1921, త్రివేంద్రమ్‌లో ముద్రితము) పరమేశ్వర శాస్త్రి కృతమగు "నలాన్" శంకరపిళ్లై వ్రాసిన "నలాన్" కథలు విశిష్టమైనవి.

పై విధముగ మలయాళ సాహిత్యములో నలకథ బహువిధ రంగములలో బహు విధములుగా విస్తరించినది. మలయాళ కవులు తక్కిన భాషాకవులవలె నలకథలో మార్పులు కూర్పులు ఎక్కువగా చేయలేదు. సంప్రదాయ సిద్ధమైన నలకథనే వర్ణించి దాని పవిత్రతను భద్రపరచినారు.

# 2. నలోపాఖ్యానము —
# నన్నయ సౌరస్యములు

భారతారణ్య పర్వమందలి నలోపాఖ్యానమునకొక విశిష్ట ప్రయోజన మున్నది. ప్రధాన కథకు ప్రతిబింబమనదగిన ఈ నలోపాఖ్యానమును ఉభయభాషా కావ్యరచనా శోభితుడగు నన్నయ కథాకథన శిల్పముతో ఒక స్వతంత్ర కావ్యమట్లు రచించి యున్నాడు. సంస్కృత భారతమున నలోపాఖ్యానము 976 శ్లోకములందున్నది. దీనిని నన్నయ 226 గద్యపద్యములలో రచించినాడు. మూలములోని నలోపాఖ్యానమును నన్నయ ఇంచుమించు నాల్గవవంతునకు సంగ్రహించినాడు.

మాయాద్యూతమున దుర్యోధనునితో నోడిపోయి ధర్మరాజు అనుజులతో పాంచాలితో, విప్రులతో, రథాళితో వచ్చి ధర్మనిష్ఠిత బుద్ధితో అరణ్యావాసము చేయుచున్నాడు. ధర్మరాజు పడు ఇడుముల

కంటె కూడ నలమహారాజు తన భార్యతోపాటు అడవులలో అనుభ వించిన కష్టములు అనంతములని బృహదశ్వుడు ధర్మరాజుకు నలకథను వివరించినాడు.

ఎన్నికష్టములు వచ్చినను, ఎన్ని బాధలేర్పడినను, ఎన్ని అవమానములు కలిగినను మానవుడు క్రుంగి కృశించి పోకూడ దని, ఇనుమడించిన ఉత్సాహముతో ఆత్మ నిగ్రహముతో సాగి పోయినపుడే విజయము చేకూరునని తెలుపుటకే బృహదశ్వుడు ధర్మరాజునకు నలచక్రవర్తి కథను చెప్పినాడు. నలుడు కూడ ధర్మ రాజువలె చంద్రవంశోద్భవుడే. తన వంశమువాడు, తనకంటె మహిమోపేతుడు అయిన నలుడు తనకంటె ఎక్కువ బాధలననుభ వించినాడను విషయము ధర్మరాజుకు వివరించినచో అతనికి చిత్త శాంతి కొంత చేకూరవచ్చును. పైగా నలచరిత్ర పాండవుల చరిత్రను పోలియుండుటవలన కూడ ధర్మరాజును అది అధికముగా ఆకర్షించు నని బృహదశ్వుడు భావించి యుండును.

ధర్మరాజు తన తమ్ములతో కలిసి కష్టతరమైన అజ్ఞాత వాస మును గడుపుటకు కావలసిన మనస్థైర్యము నలచరిత్ర వినుట మూలమున చేకూరగలదని, ఈర్ష్యాసూయలు గల కలివలె దుర్యోధ నుడుకూడ చివరకు నశించునను ధైర్యమును కలుగజేయుటకు బృహదశ్వుడు ధర్మరాజుకు నలోపాఖ్యానమును వివరించినాడు.

## 1.2 నలకథకు భారత కథకు సంబంధము ::

నలకథకు భారతకథకు గల సామ్య వైషమ్యములను క్రింద పరిశీలింతము.

ఆహుక భిల్ల దంపతులు నలదమయంతులుగ జన్మించగా, యతినాథుడు హంసరూపమున జన్మించి, నలదమయంతులను దంపతులుగ చేసెనని శివపురాణాంతర్గత నలకథనుబట్టి తెలియుచున్నది.

పూర్వజన్మమున ద్రౌపదికి ఇంద్ర, యమ, వాయు, అశ్వనీ దేవతలిచ్చిన వరప్రభావము వలననే ఆమె పంచభర్తృకయైనదని మహాభారతమందలి పంచేంద్రియోపాఖ్యానము వలన విదిత మగుచున్నది.

వీనినిబట్టి నలపాండవుల కథల రెండింటియందును దాంపత్యములు పూర్వ జన్మనియతములే ననుట స్పష్టమగుచున్నది.

దమయంతికి నలునిపైగల విరహమును చెలికత్తెల మూలమున తెలిసికొని భీమరాజు నలుని యుద్దేశించి దమయంతీ స్వయంవరమును చాటించినట్లు నలచరిత్రనుబట్టి తెలియును.

ద్రౌపదిని అర్జునునకిచ్చుటకే ద్రుపదుడుకూడ స్వయంవరమును జరిపినట్లు భారత కథనుబట్టి విదితము. రెండింటియందును వ్యాజ స్వయంవరములే వివరింపబడినవి.

కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములగు అరిషడ్వర్గములకు కలి అధిదేవత. దమయంతి తనను వరింపకుండ నలుని వరించినందులకు కలి నలునిపై వైరమును పూనిఅతనికి వివిధ కష్టములు కల్పించెను.

దుర్యోధనుడు కలియంశమునందు జన్మించినట్లు క్రింది పద్యమునుబట్టి తెలిసికొనవచ్చును.

"అనిలజు పుట్టిన దివసము
ననయుట దుర్యోధనుండు నరనుత ధృతరా
ష్ట్రునకున్ గాంధారికిన
గ్రనందను డు ఘను డు పుట్టె గలియంశమునన్"

—ఆదిపర్వము (5-105)

పాండవుల మయసభా సౌందర్యమును జూచి ఈర్ష్యాసూయ పరుడైన దుర్యోధనుడు ధర్మరాజుపై పగబూని వివిధ కష్టముల పాలొనర్చినాడు. కీడుచేయదలచిన కలి చివరకు నశించినట్లు దుర్యోధనుడుకూడ నశించునని తెల్పుటకై బృహదశ్వుడు ధర్మరాజునకు కలివృత్తాంతమును విపులముగ చెప్పినాడు.

మహాభారత కథలోను నలకథలోను జూదమునకు ప్రాధాన్య మున్నది. పుష్కరుడు నలుని జూదమాడుటకు పిలిచినపుడు తిరస్కరించుట ధర్మసమ్మతముగాదని నలుడందుకు అంగీకరించినాడట.

"ద్యూతార్థము తత్కృతవా
హూతుడనై జూదమాడకుండుట ధర్మా
వేతంబని యభిముఖుడై
యాతనితో నలుడు జూదమాడ దొడంగెన్"

—అరణ్య (2–60)

నలకథలో కలి ద్వాపరుని సహాయమున అక్షములు నలునకు ప్రతికూలమగునట్లు చేసినాడు.

భారతకథలో దుర్యోధనుడు జూదమాడుటకు ధర్మజుని ఆహ్వానించిన తీరును జూడుడు,

"అనఘు, సుహృద్ద్యూతం బిం
దొనరింతము ప్రొద్దుపోకయును నగు జూదం
బు నకుం బ్రియుడవు దక్షుడ
వన విందుము నిన్ను బ్రీతి నక్షజ్ఞులచేన్"

—సభా (2-164)

ద్యూతమున కాహ్వానింపబడిన యుధిష్ఠిరుడు తొలుత జూదము వలన కలుగు అనర్థములు వివరించియు తుదకు దుర్యోధనునితో జూదమాడినాడు.

"బలవద్ద్యూతార్థముగా
బిలువంబడి మగుడనగునె పెక్కులు పలుకుల్
పలుకంగ నేలయనియ
త్యలఘుడు ధర్మజుడు జూదమాడ గడంగెన్"

— సభాపర్వము (2-172)

దుర్యోధనుడు శకుని సహాయమున ధర్మజుని మోసగించి జూదములో అతనిని ఓడించినాడు.

జూదమాడుట క్షత్రియ ధర్మమని మానసోల్లాస సూక్తి;

నల, ధర్మజులిరువురు క్షత్రియ ధర్మమును పాటించియే జూదమాడినారు.

ద్యూత క్రీడ క్షత్రియ ధర్మముగా పరిగణింపబడినను వేదములు జూదమాడరాదనియే శాసించుచున్నవి. ఋగ్వేదమున 10వ మండలములోని 34వ సూక్తమందు జూదమాడుటవలన కలుగు అనర్థములిట్లు నుగ్గడింపబడినవి:

"జాయా తప్యతే కితవస్య హీనా మాతాపుత్రస్య చరతః క్వక్వసిత్"

(ఋగ్వేదము-34వ-10-10

(జూదరి యిల్లాలు దీనత్వముతో పరితపించును. తలదాచు కొనుటకు ఇల్లులేక అల్లాడు కొడుకును దలచి దురపిల్లును)

"అక్షైర్మా దీవ్యః కృషిమిత్కృష స్వవిత్తేరమస్వ బహుమాన్యమాన;
తత్రగావ; కితవ తత్రజాయాత్మనే విచష్టేసవితాయమర్య:"

(ఋగ్వేదము-34వ సూ-10-13)

(పాచికలాడకుము. నీ పంట పొలము దున్నుకొనుము. ఉన్న సొత్తును వాడుకొని చాలునని తనియుము. నీగొడ్లెక్కడ? నీ యిల్లాలెక్కడ? జూదరీ! ఉన్నదానితో తృప్తి పొందుము)

జూదమునకు పిలుచు విరాటరాజును మందలించుచు కంకుభట్టు చెప్పిన తీరు పరికింపుడు :

"కింతే ద్యూతేన రాజేంద్ర బహుదోషేన మానద
దేవనే బహవో దోషాస్త స్మాత్తత్పరి వర్జయేత్"

(వ్యాసభారతము—విరాటపర్వము)

జూదములో తాను ఓడిపోయిన విషయమును ధర్మజుడు విరాటునితో నిగూఢార్థముగ సూచించినాడు. కావున క్షత్రియ ధర్మమే అయినను జూదమును పరిత్యజింప వలయునని ప్రభు సమ్మితములయిన వేదములు ఘోషించుచున్నవి.

కష్టకాలము వచ్చినపుడు అబలలను బిడ్డలను బంధు గృహములందుంచుట పరిపాటి. నలదమయంతులు అడవులకు వెళ్లుటకు పూర్వము వార్ష్ణేయునిచే తమ పుత్రీ పుత్రులను దమయంతి పుట్టినింటికి పంపించినది. అరణ్యవాసమునకు వెళ్లునపుడు ధర్మజుడు ధృష్టద్యుమ్నునిచే ప్రతివింధ్యాదులను. ద్రౌపదేయులను పాంచాలమునకు పంపించినట్లు భారత కథలో కలదు.

నలకథలోను. భారత కథలోను వస్త్రాపహరణము కలదు. కలిప్రేరణవలన అక్షములు పక్షుల రూపమున వచ్చి నలుని వస్త్రము నపహరించినవి. నలుడు దమయంతి ధరించిన వస్త్రము సగమునకు చింపుకొని తాను ధరించి మానమును సంరక్షించుకొనెను. భారత కథలో దుశ్శాసనుడు నిండు సభలో ద్రౌపది వలువలూడ్చినాడు. కృష్ణుని యనుగ్రహమువలన ద్రౌపది వివస్త్ర కాలేదు.

దమయంతీ, ద్రౌపదులిరువురు అరణ్య మార్గ సంచారమున బాధపడినవారే. కాని దమయంతి భర్తరహితయై బాధపడినది. ద్రౌపది భర్తృసహితముగా బాధలనుభవించినది. అడవిలో "అల యుచు బులులుల యెలుగుల కులుకుచు ఏచిన పొదల బొరల్పడ దోచుచు" (అరణ్య 2–85, 86) దమయంతి వెళ్ళినది... ఈ దయ నీయ స్థితి ద్రౌపది విషయమునకూడ ద్యోతకమగుచున్నది చూడుడు.

"తడిసిన యేక వస్త్రపరిధానముతోడ విముక్తకేశియై
తొడరుచు దుఃఖభావమున ద్రోవదివోయె మహావహంబునం
బడిన నిజేశ మిత్త్రసుత బంధుజనంబుల శోకవేదనం
గడుకొని యిట్లయేగుదురు కౌరవభామినులన్వితంబునన్"

—సభా (2-309)

దమయంతి సార్థవాహులతో కలిసి చేదిపురికి పోయినపుడు రాజమాత ఆమెను పిలిపించినది. "ఏను సైరంధ్రినయి యుండియు నుచ్ఛిష్టంబు ముట్టను. పదధావనంబు సేయను, బరపురుషులతో పలుకనోపను; పతినన్వేషించు బ్రాహ్మణులతో బలుకుదు" (అరణ్య 2-121 )నని దమయంతి రాజమాతతో చెప్పినది. మలినార్ధవస్త్రముతో విడివడిన కేశములతో సైరంధ్రీ వృత్తిలో దమయంతి చేదిరాజపత్నిని

సేవించినట్లు ద్రౌపదికూడ సైరంధ్రి రూపమున సుదేష్ణకు పరిచర్యలు చేసినది.

దమయంతి పడు కష్టములు చూడలేక అడవిలో నిద్రించుచున్న ఆమెను నలుడు కలిప్రేరితుడై వదిలిపోయెను. నలుని నన్వేషించుచు ఒంటరిగా పోవుచున్న దమయంతిని పాముబారి నుండి ఒక బోయవాడు రక్షించెను. ఆమె రూపలావణ్యమును జూచి వాడు మోహించెను. దమయంతి శాపముచే వాడు దగ్ధుడయ్యెను.

భారతకథలో అరణ్యవాస సమయమున ద్రౌపది ఒంటరిగా ఆశ్రమమునందుండగా సైంధవుడు ఆమెను కామించి బలాత్కరించెను. ఇంతలో పాండవులు వచ్చి సైంధవుని శిక్షించినారు. అజ్ఞాతవాస సమయమున సైరంధ్రీ వేషమునందున్న ద్రౌపదిని కీచకుడు కామించెను. ద్రౌపది తన పతుల పరాక్రమమును వివరించి కీచకుని భయపెట్ట జూచినది. దమయంతికి తన పతిరక్షణ లేదు. దమయంతిని కిరాతకుడు కామించినట్లు ద్రౌపదిని సైంధవ, కీచకులు బలాత్కరింతురు. నిరాశ్రయమైన దమయంతికి శపించగల శక్తి యున్నది. పతుల రక్షణయందున్న ద్రౌపదికి శపించుశక్తి లేదు.

కర్కోటక విషదగ్ధుడై నలుడు బాహుక రూపమున ఋతుపర్ణుని సమీపించి "ఏను బాహుకుండనువాడ, నశ్వశిక్షయందు గుశలుండ, నన్ను సంస్కారంబుల శిల్పంబు బెక్కు విధంబు లరదీయిలంపనేర్తు భవత్సేవార్థినై వచ్చితి" ననెను. (అరణ్య2-130) నలుడు ఋతుపర్ణునితో తనపేరు స్పష్టముగా చెప్పక పోయినను, మాత్రము నూటి తన గుణములనుగానే తెలిపినాడు. నలునివలెనే కంకుభట్టు రూపమునందున్న ధర్మజుడు కూడ విరాటునితో సత్యమునే పలికినాడు.

అజ్ఞాతవాసమునకు భంగము కలుగనిరీతిని సత్యసంధుడైన ధర్మజుడు ఎంత ఉక్తివైచిత్రితో మాటలాడినాడో గమనింపుడు—

"ద్విజుడ గురు విషయజాతుడ
సుజన ప్రియుఁడైన ధర్మసుతు సఖుఁడ బరి
వ్రజనాశ్రయ కలితుండను
మనుజవల్లభయోగ్య బహువినోద కరుండన్

ద్యూత క్రీడకు గొండొక
సేతుంగ పటమున నొవ్వని జనంబులునా
చేతి ధనమెల్ల గొని పరి
భూతి యొనర్చిన విరక్తి పుట్టి వెడలితిన్"

(విరాటపర్వము 1–195, 196)

ఇక్కడ ద్విజుడనగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాలుగు వర్ణములలో రెండవ వర్ణమగు క్షత్రియవర్ణమునకు చెందిన వాడని అర్థము. ఈ గూఢార్థములను గ్రహింపలేక విరాటుడు 'ద్విజున'న్నంతనే కంకుభట్టుని ఆకారమునుబట్టి అతనిని బ్రాహ్మణుడనియనుకొనెను. నల, ధర్మజులు సత్యమునే వచించినను వారి ఆకారములనుబట్టి స్వస్వరూపములను గుర్తించుటకు వీలుగాక పోయినది.

నలుడు బాహుక వేషమున ఋతుపర్ణుని యొద్ద అజ్ఞాతవాసము చేసినట్లు పాండవులు ప్రచ్ఛన్న వేషములతో విరాటుని యొద్ద అజ్ఞాతవాసము గడిపినారు. నలుడు బాహుక రూపమున ఋతుపర్ణుని యింట పలు వంటపాకములు చేసెను. భీముడు వలలుడను పేరుదాల్చి విరాటునితో తన పాకరీతినిట్లు వివరించినాడు.

శా॥ "దేవా నాల్గవ జాతివాడ, నిను సర్థింగొల్వగా వచ్చితిన్
సేవాదక్షత నొందుస్మైనెఱుగ, నీ చిత్తంబు నన్మెచ్చ న
ప్లేవండంగడునేర్తు, బానసమునందిచ్చోటనే కాదున
న్నే వీటన్ మిగులంగ నెవ్వ డును తే డెబ్బంగులం జూచినన్"

-(విరాట 1-218)

భీమపాకముచే విరాటుడును, నలపాకముచే ఋతుపర్ణుడు సంతృప్తు లయినట్లు, వారి పాకశాస్త్ర పాండిత్యమును బట్టి తెలియుచున్నది. పాకములలో నలపాకము విశిష్టమైనది. ఈ సందర్భమున నలపాకమునుగూర్చి భాస్కరశతకములోని పద్యమును గమనింపుడు.

"చదువదియెంత గల్గిన రసజ్ఞత యించుక చాలకున్ననా
చదువు నిరర్థకంబు గుణసంయుతులెవ్వరు మెచ్చరెచ్చటం
బదనుగ మంచికూర "నలపాకము" చేసిననైన నందు నిం
పొదవెడు నుప్పులేక రుచి పుట్టగ నేర్చునటయ్య భాస్కరా"

-మారన-భాస్కర శతకము 42వ పద్యము.

కర్కోటక విషసర్పముచే సుందరాకారుడైన నలుడు వికృతరూపము నొందెను. "ఇట్టి రూపమువలన నీకు మేలు కలుగును. నీ సుందరాకారముతో పరుని సేవించుట కష్టము, ఋతుపర్ణుని సేవింపుము" అని కర్కోటకుడు నలునికి కర్తవ్యోపదేశమును దెలిపెను. జయంతుడు, నలకూబరుడు, మన్మథుడు, నలుడు సహదేవుడు, సుందరాకారులుగా ప్రసిద్ధి పొందినవారు. నలుడు, రూప, గుణవంతుడని వ్యాస భగవానుడు నలోపాఖ్యానమున కథారంభమున ఇట్లు కీర్తించినాడు.

"ఆసీద్‌రాజా నలోనామ వీరసేన సుతో బలీ
ఉపపన్నో గుణైరిష్టై రూపవానశ్వకోవిదః"

—వ్యాస భారతారణ్య పర్వము (5 2–1)

చేమకూర వేంకటకవి విజయ విలాసావతారికయందు కృతిపతి యగు రఘునాథ భూపాలుని రూపమును గుఱ్ఱపుస్వారిని నలునితో పోల్చియున్నాడు చూడుడు.

"ఆకారంబున నలుడంత వాడౌనెకా
హయ సమ్యగా రూఢినంత వాడె"

భారత కథలో అర్జునుడుకూడ నలునివంటి అందగాడే. తన ప్రేమను నిరాకరించినపుడు ఊర్వశి అతనికి పేడితనము కలుగునట్లు శపించును. సుందరుడగు నలుడు వికృత రూపమున బాహుకుడను పేరుతో ఋతుపర్ణుని సేవించినట్లు రూపవంతుడగు అర్జునుడు పేడి రూపమున బృహన్నల నామధేయమున విరాటుని కొల్చి అజ్ఞాత వాసమును గడపినాడు.

దమయంతి మాటలను పర్ణాదుడు ఋతుపర్ణుని సభలో వినిపింపగ, బాహుక రూపముననున్న నలుడు బాధపడుచు అతనితో నిట్లనెను—

"పురుషునందు దోష పుంజంబు గలిగిన
నెఱిగియెద సహించునేని భార్య
పురుషునందభీష్ట భోగంబు దేహాంత
రంబునందు ధర్మరతియు బడయు"

(అరణ్య 2–160)

కీచకుడు తనను కామించి తరుముకొనిరాగా ద్రౌపది విరాటుని కొలువు కూటమునకు వచ్చినపుడామెను మందలించుచు కంకుభట్టు రూపమునందున్న ధర్మరాజు క్రింది విధముగా చెప్పినాడు.

"గానవాధుల దూలంగ గాదు వినుము
సతికి దానెంత వడియును సభలలోన
దడవుగా నిల్చి యిట్లు దగ్రవృత్తి
శంకసెడి ధిక్కరింపంగ జనునె చెపుమ.

పలువోకల బోవుచు ని
చ్చలవిడి నాట్యంబు సూపు చాడ్పున నిచటం
గతుల సతుల గఱువ చందము
దొల గగనిట్లునికి దగునె తోయజ వదనా

(విరాట పర్వము. 2-148, 150)

భర్తయందు దోషమున్నను ఆత్మయందు సహించి, ఓర్పు వహించునదియే ఉత్తమస్త్రీయని, బాహాటముగ నిల్చి సభలందు భర్తను ద్వేషించుట పతివ్రత లక్షణము కాదనిచెప్పుట భారత కథ యందును కలకథ యందును కలదు.

నలకథలో విజయ సాధనముగ ఋతుపర్ణుని నుండి నలుడు అక్షహృదయ విద్యను సంపాదించెను. భారత కథలో అర్జునుడు పరమేశ్వరుని జయించి మెప్పించి పాశుపతమును సంపాదించెను.

దమయంతీ ద్వితీయస్వయంవరమునకు వెడలు ఋతుపర్ణునకు నలుడు రథసారథ్యము చేసెను. ఉత్తరగోగ్రహణ సందర్భమున అర్జునుడు ఉత్తరునకు సారథ్యము చేసినట్లు భారతములో కలదు.

మూడేండ్లని అవధి కలదు. నలదమయంతుల కష్టమునకు అట్టి అవధి లేదు.

## 2.2 నలోపాఖ్యానము - నన్నయ అనువాద విధానము:

నన్నయకు రాజరాజు ఇచ్చిన ఆదేశము "మహాభారత" బద్ధ నిరూపితార్థ మేర్పడ తెలుగున "అధికధీయుక్తి మెయిన్ రచింపుమనుటయే. అనువాదము చేయమనలేదు కనుకనే నన్నయ ప్రధానముగా వ్యాస భారతమునందలి కథనే యనుసరించినను ఎడనెడదనకు పూర్వముండిన సంస్కృత కర్ణాటక కవుల కావ్యములనుండి కూడ కొన్ని భావములు గ్రహించియు, ననుచితములని తోచిన యంశములు పరిహరించియు గొన్ని వర్ణనలు పెంచియు, గొన్ని తగ్గించియు ఆంధ్ర భారతమును సర్వాంగ సుందరముగా వెలయించెను. అందుచేతనే. యనువాదమను పెరున్నను అతి స్వతంత్ర గ్రంథము వలెనే శోభిల్లుచు నన్నయ ప్రతిభా విశేషమును వేయి విధముల వెల్లడి చేయుచున్నది" అని ఆచార్య దివాకర్ల వెంకటావధానిగారు సుదీర్ఘ పరిశోధన, కూలంకష పరిశీలన చేసిన పిమ్మట నన్నయ భారతమను గ్రంథములో చెప్పిన మాటలు అక్షరముల నిజము. నలోపాఖ్యానమున నన్నయ అనువాద విధానమును క్రింద పరిశీలింతము.

### 2.2.1 సంగ్రహించిన విషయములు :

నన్నయ ప్రధానకథ కడ్డుతగులు వర్ణనలను, సంభాషణములను, ప్రశ్నోత్తరములను చాలవరకు సంగ్రహించెను.

మూలమున దమయంతి రూపము ఐదు శ్లోకములందు వర్ణింపబడినది.

"దమయ న్తీతు రూపేణతే జసాయశసాశ్రియా
సౌభాగ్యేనచ లోకేషు యశః ప్రాపసు మధ్యమా
.........................................
.........................................
చిత్తప్రమాథినీ బాలో దేవానామపి సుందరీ.

-అరణ్య (52-10-14)

ఈ శ్లోకములందలి యతిశయోక్తులను, అనౌచిత్యములను తొల గించి. నన్నయ దమయంతి రూపముతోపాటు గుణసమృద్ధిని కూడ వర్ణించుచు ఇట్లు సంగ్రహించినాడు.

"దమయంతి యత్యంత కాంతిరూపాభిజాత్య
విపులగుణ సమృద్ధి వెలుగుచు సురసిద్ధసాధ్య కన్యకలట్టి సఖులునూర్వు
రొలసితన్ను గొలుచు చుండంగ మహినొప్పుచుండె
నధిక విభవయుక్తి జేసి"

-అరణ్య (2-9)

నలుడు దమయంతి కడకరిగి దౌత్యము నెరపి వచ్చిన తరు వాత దేవతలతో తాను అంతఃపురము ప్రవేశించుటాదిగాగల వృత్తాం తమునంతయు చెప్పినట్లు మూలమునందున్నది3. ఈ అనుచిత ప్రసంగమంతయు విడిచి "ఇంద్రాదులు నా స్వయంవరంబునకు వచ్చెదరేని వారి సన్నిధిన నిన్ను వరియించెద నట్లయిన నీకు నిర్దో షంబగు"4నని దమయంతి చెప్పిన మాటలను మాత్రము నన్నయ తెలిపినాడు.

సుదేవుడను బ్రాహ్మణుడు సుబాహు పురమునకు చని "పుణ్యా

హంబు సేమింపంబోవు విప్రులతో రాజగృహము సొచ్చి దమయం తిని చూచినపుడు అమె వర్ణన మూలమున విస్తృతముగా నున్నది. (3-65, 10-17) అందు

"పూర్ణచన్ద్రాననాం శ్యామాం చారువృత్త పయోధరమ్
కుర్వ స్తీం ప్రభయా దేవీం సర్వావితిమిరా దిశ
చారు పద్మపలాశాక్షీం మన్మథస్య రతీమివ
ఇష్టాం సర్వస్య జగతః పూర్ణచన్ద్ర ప్రభామివ"

మొదలైన శ్లోకము లప్పటియామె స్థితికి తగినట్లులేవు నన్నయ వాని నన్నిటిని పరిహరించుటయేగాక తరువాత మూలమున వాడ బడిన ఉపమానముల పెక్కింటిని ఔచితీ పరిపోషకముగ సంగ్ర హించి యిట్లు చెప్పినాడు.

"ధూమజాలనిబద్ధంబైన యగ్ని ప్రభయునుంబోలె నీలాభ్ర సంవృతంబైన చంద్ర రేఖయుంబోలె బహుపంక నిమగ్నంబైన మృణాళియుంబోలె నేర్పడకున్ననుం దదీయ భ్రూయుగ మధ్య గతంబైన సూక్ష్మ లక్షణంబిమ్ముగా నిరీక్షించి దాని దమయంతిగా నెఱింగి యాత్మగతంబున నిదిపతి విముక్తయై శుష్క ప్రవాహమైన నదియునుంబోలె శూన్య కమలయైన నళినియుంబోలె నపేత చూతం బైన వనంబునుంబోలె నొప్పకుండియుదన పతివ్రతాను గుణంబున నొప్పుచున్నది" —అరణ్య (2-142).

ఇట్లు నన్నయ పెక్కుచోట్ల మూలభావములను సంగ్రహించెను ఈ సంక్షేపములవలన ప్రధాన కథాగమనమున కెచ్చుటను భంగము కలుగలేదు. అప్రసక్త విషయ విస్తరణము తగ్గి కథకు ప్రసన్నత యేర్పడినది.

## 2.2.2 పరిహరించిన విషయములు :

నన్నయ ప్రధాన కథతోనంతగా సంబంధములేని అనవసరములు, అనౌచిత్యములు నగు కథాంశములను పరిహరించి కథను నిరాటంకముగ సాగించినాడు.

"కలి సమావేశ పరవశుండైన" నలుడు చలమున పుష్కరునితో జూదమాడుచుండగా పౌరులతని వారింపనేగిరి. సూతుడా విషయమును దమయంతితో చెప్పినాడు. దమయంతి పౌరాగమనమును నలుని కెరింగించినది. కలి సమావిష్టుడై యుండుటచే నలుడు ఆమెతో మాట్లాడలేదు. నలుడట్లే జూదమాడి యోడుచుండెను. దమయంతి బృహత్సేనయను దాదిని పంపి మంత్రులను రప్పించును. మంత్రులు వచ్చి ధనమేదియు లేదని దమయంతి కెరిగించిరి. ప్రకృతులు మరల వచ్చిరని దమయంతి నలునికి నివేదించెను. నలుడదియు వినిపించుకొనలేదు. ఈ విషయము మూలమున 56, 57 అధ్యాయములలో వివరింపబడినది. పౌరజన ప్రియుడగు నలుడు వారు వచ్చిరని దమయంతి రెండుసారులు చెప్పినను వినిపించుకొనకుండుట ఉచితముగాలేదని కాబోలు నన్నయ ఈ విషయమును పూర్తిగా పరిహరించినాడు.

నలుడు సర్వస్వము నోడిన పిమ్మట పుష్కరుడు దమయంతిని కూడ నోడుమని పల్కినట్లు దానికి మనసులో క్రుంగియు నలుడు మారు మాటాడలేదని మూలములో 58వ అధ్యాయమునందు చెప్పబడినది. నన్నయ తన అనువాదమున ఈ విషయమును కూడ పరిహరించెను.

## 2.2.3 విస్తరింపిన విషయములు:

నన్నయ తన అనువాదమున అచ్చటచ్చట మూలమునకు పెంపు కలిగించిన సందర్భములు కూడ కొన్ని కలవు.

### 2.2.2.3 మూలమునలేని వర్ణనములను చొప్పించుట:

దమయంతి మదనతాప వివర్ణవదనయై బాధపడుచున్నపుడు చెలికత్తెలు భీతలై ఆమె వృత్తాంతమునెల్ల భీమున కెరిగించుచు చెప్పిన క్రింది పద్యము చాలవరకు నన్నయ కల్పించినదే.

"కలహంస పలికిన పలుకులు గణియించు
 పడిదాని పోయిన పలను చూచు
బలుకదు సఖులతో లలితాంగి మిన్నక
 యలయుచునుండు దానను దినంబు
జార విభూషణా హార విహార శ
 య్యాసన భోగంబు లందు విముఖి
యయిరేయు బగలు నిద్రయు నోర్వ నెఱుగగ
 దమయంతి నలు డను ధరణినాథు

నందబుద్ధి నిలిపి కందర్పబాధిత
యగుచు నున్న యదిధరాధినాథ
ధరణి పతుల నొరుల నురుగుణాఢ్యుల విన
నొల్ల దొంతవిభవ యుక్తులయిన"

అరణ్య (2-26)

ఈ పద్యము సరళసుందరమై స్త్రీల విరహావస్థను వర్ణించు పట్ల తరువాతి కావ్యకవుల కెందరికో ఒజ్జ బంతియైనది.

## 2.2.3.2 భావ కల్పనము :

నన్నయ వెల్లడించిన అమూలకములైన భావములు సమయో చితముగ, రసవత్తరముగ నుండి అతని స్వతంత్ర కవితా పాటవ మును వ్యక్తముచేయును.

హంస వలన నన్యోన్య గుణరూపము లెరిగి మనః ప్రభవానల బాధ్యమానులైన నలదమయంతులను వర్ణించు క్రింది పద్యము నన్నయ కల్పించినదే.

"నలదమయంతు లిద్దరు మనః ప్రభవానల బాధ్యమానులై
నలిపిరి దీర్ఘవాసరనిశల్ విలసన్నప నందనంబులన్
నలిన దళంబులన్ మృదు మృణాళములన్ ఘనసార పాంసులన్
దలిరుల శయ్యలన్ సలిలధారల చందనచారు చర్చలన్"

అరణ్య (2-24)

మూలమున ఈ సందర్భమున

"దమయంతీతు తచ్ఛ్రుత్వా వచోహంసస్య భారత
తదాప్రభృతి నస్వస్థానలం ప్రతి బభూవసా"

(3-5)-1)

అని మాత్రమున్నది. నన్నయ పద్యమునందలి భావములనే అనుకరించి విరహావస్థను వర్ణించు సందర్భమున తరువాతి ప్రబంధ కవులు విచిత్రములైన కల్పనలతో వర్ణించి యుండుట గమనింప వచ్చును.

2.2.3.3 మూలమునమున్న ఒక పదమునో పదసమూహ

మునో యాధారముగా గ్రహించి నన్నయ తన అనువాదమునందలి భావమునె విపులీకరించును.

నలుడు ఋతుపర్ణుని నగరమున వార్ష్ణేయ జీవలులతో నివసించుచు ప్రతి సాయంకాల సమయమున—

"క్వను సాక్షుత్పి పాసార్తా శ్రాంతాశేతే తపస్వినీ
స్మరన్తీ తస్యమందస్యకం వాసాద్యోప తిష్ఠతి"

(3-64-10)

అను శ్లోకమును పఠించుచుండెనని మూలమునందున్నది. నన్నయ అందలి భావమును విపులీకరించి ఈ క్రింది పద్యమును రచించినాడు.

"ఇభరాజగమన నీకెందుల కరిగిః త
త్యురుకుచా భోగ యెందున్నదానః
వబల యెవ్వరిచేత నడవులలో బట్టు
వడిః తశనాపేక్ష బఃబుచున్న
యుగ్ర మృగంబుల యుదరంబులోనున్న
దానవేః నీ తల్లిదండ్రులొద్ద
ధృతి నున్నదానవేః దేశాంతరంబుల
నున్నదానవె యంచు నుడిత పదన

హతి విమోహితాత్ముడై హృదయేశ్వరి
దలచి రాత్రులెల్ల దాపమునను
నిద్రలేక వందినిట్టూర్పులూర్చుచు
నుండె నలుడు శోకముత్కటముగ"

(అరణ్య 2-133)

ఋతుపర్ణుడు దమయంతీ స్వయంవరము మాటవిని బాహుక చోదితమైన రథమెక్కి విదర్భకరిగిన సందర్భమున మూలమందు

"రాజానం రాజపుత్రం వానస్మపశ్యతి కంచన"

(3-71-22)

అని తెలుపబడినది. ఋతుపర్ణునికచట రాజుగాని రాజపుత్రుడుగాని కనిపించలేదట. నన్నయ ఈ సందర్భమున.

"ధరణీ గలరాజు లిటయె
వ్వరు వచ్చిన వారు లేరు వైదర్భి యొరున్
వరియింపనంత ధర్మే
తర చరితయె యనుచు నుండె దద్దయులజ్జన్"

(అరణ్య 2-185)

అని మూలభావమును పెంచి వ్రాసినాడు.

మూలములో ఇంద్రునితో నారదుడు దమయంతీ స్వయంవర ప్రస్తావనము చేయుచు "రూపసి" అని మాత్రమే అన్నాడు. నన్నయ "దేవతాధికమైన సౌందర్యవతి" అని విస్తరించినాడు. "రూపసి" అన్న పదము సామాన్య రూపవతియని మాత్రమే గోచరించును. నారదుడు ప్రస్తావించు చున్నది దేవతలతో కనుక "దేవతాధికమైన సౌందర్యవతి" యని చెప్పుటవలన దేవతా స్త్రీలుకూడ దమయంతీ సౌందర్యమునకు సరి రారని నన్నయ మూలభావమును విస్తరించెను.

## 2.2.3.4 అలంకారికమైన పెంపు :

మూలమున గొన్నిచోట్ల నిరలంకారములును శుష్కములును నై కనుపట్టు భాగములకు నన్నయ తెలుగున నాలంకారికమైన

నన్నయ ఈ సందర్భమున

"అంతరిక్ష శ్రీకాంతాహారావలియుండోలె హంసావళి యవనీ తలంబున కవతరించిన" (అరణ్య 2–11), అని సరూపకమైన చక్కని ఉపమానమును కల్పించినాడు. ఈ సందర్భముననే నలుడు హంసలతో నొకదానిని పట్టుకొనెననియు అప్పుడది నలునితో–

"దమయంతీ సకాశేత్వాం కథయిష్యామి నైషధ"

అరణ్య (52–21)

"దమయంతి సకాశమున నిన్ను వర్ణించెద"నని చెప్పెననియు మూలమునందున్నది. నలుడు హంసను పట్టుకొన్న విధమును అప్పు డితర హంసలు దానిని విడువజాలక అంతరిక్షమున తిరుగుచుండిన విధమును నన్నయ సహజముగ సాలంకారముగ ఇట్లు వర్ణించెను.

"వీరసేనసుతుడు వీరుండు హంసల
నడెబెడంగు జూచి నగుచు వాని
నెగచి యెగచి యందు నెగయ కుండగ నొక్క
హంసబట్టుకొనియె నతిరయమున"

"దాని విడిచిపోవనా నోప కఱచుచు
నంతరిక్షమునను హంసలెల్ల
బింపుగట్టి తిరుగుచుండె వాతోద్ధూత
శారదాభ్రశకలచయము బోలె"

—అరణ్య (2–12–13)

పై పద్యమునందు నన్నయ అంతరిక్షమున తిరుగుచున్న హంసల యాకృతినేగాక వాని సంక్షుభితభావమును మనస్తత్త్వమును మనోహరముగా వెల్లడించినాడు.

నన్నయ మూలమందు లేకున్నను పెక్కు పద్యములందు అర్థాంతర న్యాసాలంకారమును కల్పించినాడు. విశేషమును సామాన్యముచే గాని సామాన్యమును విశేషముచేగాని సమర్థించుట అర్థాంతరన్యాస లక్షణము.

"ఎట్లయేని నూర్తురింతలు మాకని
విశ్వసించువారు వెడగులెందు"

అరణ్య (2-165)

పై పద్యమునందు అంతమున సామాన్యాంశమును కల్పించి నన్నయ అర్థాంతర న్యాసాలంకారమునకు తావొసంగినాడు.

## 2.2.4 అమూలమూలైన కల్పనలు :

నన్నయ మూలమునకు మెరుగుదెచ్చు ఔచితీ పరిపోషకము లగు కథాంశములను కొన్నిటిని కల్పించెను.

దమయంతి నలుని వరించిన పిమ్మట ఇంద్రాగ్నియమ వరుణులు నలుగురు ప్రసన్నులై నలునకు ఒక్కొక్కరు రెండేసి వరములిచ్చినట్లు (57వ అధ్యాయము 35–38) మూలము నందున్నది. "ప్రహృష్టమనస్సర్వే నలాయష్టావరాన్దదుః" వారు నలుగురు వరములే యిచ్చినట్లు నన్నయ వర్ణించినాడు.

"వివాహంబైన యానలునకు నింద్రుండు వాని యజ్ఞంబుల యందు నిజరూపము జూపను, నగ్నియు వరుణుండును వాని వలచిన చోటనే యగ్ని జలంబులుత్పాదింపను, ధర్ముండు ధర్మువునందు వాని బుద్ధి వర్ధిల్లను వరంబులిచ్చిరి."

(అరణ్య 2–57)

## 2.2.5 మూలమునకు మెరుగుదెచ్చుమార్పుచేర్పులు :

నన్నయ మూలమునందలి అనౌచిత్యములను తొలగించి

మార్చి వ్రాసిన భాగము లనేకములున్నవి. మూలమునకు వన్నె చేకూర్చు ఈ మార్పులు నన్నయ కావ్య కళాదృష్టికి ప్రతిభా విశేష మునకు ప్రబల నిదర్శనములు.

దమయంతి ఒరులనెవరిని మెచ్చక నలుని వరించెనని దేవతల వలన నెరిగి కలి కుపితుడై నిషధ కేతెంచి నలునియందు ప్రవే శించుట కంతరముగానక పండ్రెండేండ్లు వేచియుండెనని మూలమున తెల్పబడినది (3-56-3). కలి నలుని యందు ప్రవేశించుటకు హేతువు మూలమునందు కానరాదు. తెలుగున "నలుండు చేయు చున్న యశ్వమేధాదికానేక భూరి దక్షిణ మహాక్రతువులయు జప హోమ దానాది వివిధ పుణ్యకర్మలయు కారణంబున జూచిన వసరంబుగానక" (అరణ్య–2-59) అని నన్నయ దానికి చక్కని హేతువు సూచించినాడు.

ద్యూత పరాజితుడగు నలుడు దమయంతితో నడవిలో నిద్రితురాలయిన దమయంతిని విడిచిపోవు సన్నివేశము మూలము నందు 62వ అధ్యాయమున 12 శ్లోకములందున్నది.

దైవఘటనచే దమయంతికి ఈ విధమైన కష్టములు వచ్చినవని నన్నయ మూలభావమును సంగ్రహించి, నలుడు దమయంతిని వదలుటకు గల కారణమును గూడ ఇట్లు సూచించినాడు.

"బాల నొక్కర్తు నిక్కాన పాలుసేసి
నిష్ఠురుండ నై యేనెట్లు నేర్తు బోవ
ననక కలిచేత నాకృష్టుడైన నలు డు
విగత కరణుడై దమయంతి విడిచి చనియె"

అరణ్య (2-80)

ఇది మూలమునకు మెరుగుదెచ్చు ఔచితీ పరిపోషకమగు సన్నివేశము.

మూలమున దమయంతి తన పాతివ్రత్య మహిమచే కిరాతుని భస్మము గావించి అరణ్యమున తిరుగుచు శార్దూలమును. పర్వత మును, నలుని గూర్చి ప్రశ్నించినట్లున్నది. ఆ పర్వతము "కింశు కాశోక వకుళ పున్నాగోప శోభిత" మైనట్టిది. ఈ విశేషణమును పురస్కరించుకొని కాబోలు నన్నయ –

"సహకార । మత్ప్రియ సహకారు బున్నాగ ।
పున్నాగు దిలక । భూభువనతిలకు
జందన । బుధహరిచంద ను బుష్పితా
శోక । సుహృజ్జనన శోకదమను,
వకుళ । కులైక దీపకు, విభీతక భయో
పేతా ర్తి హరునలు బ్రీతితోడ
గానరే కానలలోన లోకోత్తరు
ననిమ్రాని మ్రానికి నరిగి యరిగి"

అరణ్య (2–95)

అని అడిగినట్లు వర్ణించినాడు. సంబదములైన వృక్షములవేర్లే చివర వచ్చునట్లుగా ఇందు నలునకు వాడబడిన విశేషణము లభి ప్రాయ గర్భితములై ఆమె ఆయా వృక్షములనేల యడిగెనో లెస్సగా వ్యక్తము చేయుచున్నవి. ఇవి కరుణపూరితములై తరువాత పలువురు కవులచే అనుకరింపబడినవి.

సార్థము హస్తియూథములచే నిహతమైన తరువాత దమయంతి హత శేషులైనవారితో చేదిపురము ప్రవేశించెను. అప్పుడామెను గాంచి రాజమాత "భాసివిద్యుదివా భ్రేషు శంమే సక్యాసికస్యవా"(3-62-23)

అని అడిగినట్లు మూలమునందున్నది. నన్నయ దమయంతి యప్పుడు "దినకర ప్రభాపటల దూసరిత ప్రభాత చంద్రరేఖయుం బోలే దీప్తివిహీనమై డస్సియు రమ్యాకృతియై యుండె"నని వర్ణించెను. (అరణ్య 2-115). ఈ స్థితిలో నన్నయ దమయంతికి వాడిన ఉపమానము ఎంతో ఉచితమై యున్నది.

నలుడు దమయంతిని కలిసికొనిన పిమ్మట "ఒక్కరథంబును బదియాఱేనుంగులును నేబదిగుఱ్ఱములును నాఱునూఱు కాల్బలంబులు దనకు దోడయిరా" (అరణ్య. 2-221) భూమిని కంపింపజేయుచు నిషధ నగరమున కరిగెనని మూలమునందున్నది. మూలములో "సకంపయన్నివ మహీమ్"న్ అని ఉన్నది. కాని ఇచ్చట నలునికి తోడైన సేనభూమిని కంపింపజేయునంతటి పెద్దది కాక పోవుటచే నన్నయ ఆ మాటను తొలగించినాడు.

కలి నలుని జూదమాడుటకు పుష్కరుని ప్రేరేపించి, తాను పుష్కరునితో కలిసి వృషభ రూపమున నిషధ దేశమునకు వచ్చినట్లు మూలమునందున్నది. కలి విప్రవేషమున నిషధదేశమునకు వచ్చినట్లు నన్నయ అనువాదములో నున్నది. కలి వృషభ రూపము దాల్చిన దానివలన కథకు ప్రయోజనములేదు. కావున కలి విప్రవేషమున నలుని దగ్గరకు వచ్చి అతనితో జూదమాడుటకు పుష్కరుడు వచ్చినాడని చెప్పుటలో ఎంతేని ఔచిత్యమున్నది. ఇది నన్నయ కథా నిర్మాణ కౌశలమునకు నిదర్శనము.

## 2.2.6 వ్యాసభారతములో ఆయా వ్యక్తుల గుణగణములను తెలుపు విశేషములు:

ఆయా స్థలములందచ్చటచ్చట చెదరియుండును. నన్నయ

వాని నన్నిటిని పరిశీలించి స్థలాంతరములందున్న వానిని ఆయా పాత్రలనుగాని వస్తువులనుగాని ప్రవేశపెట్టుటకు పూర్వమే చెప్పును. ఈ పద్ధతివలన ఆయా పాత్రల లేదా వస్తువుల స్వరూప స్వభావములు పాఠకులకు ముందుగనే సుపరిచితములగును. నన్నయ తరువాత ఎక్కడో తాను వివరించబోవు కథాంశములను కూడ సందర్భాను సారముగ మొదటనే సూచించుచుండెను. ఇట్టి సూచన మూలమందు కానరాదు.

సుదేవుడను విప్రుడు చేదిపురమున కరిగి పుణ్యాహము చేయించు బ్రాహ్మణులతో రాజగృహము చొచ్చి దమయంతిని చూచెను. ఆ సమయమున దమయంతి వియోగ భారకృశయై గుర్తింప వీలులేని స్థితిలోనుండెను. సుదేవుడామెను తానెట్లు గుర్తింప గలిగినది తరువాత రాజమాత కెరిగించినట్లు మూలమందున్నది. (3-66-5) నన్నయ "తదీయ భ్రూయుగ మధ్యగతంబయిన సూక్ష్మ లక్షణంబిమ్ముగా నిరీక్షించి దాని దమయంతిగా నెఱింగె"నని ముందుగానే సూచించి యున్నాడు. (చూ. అరణ్య. 2-142).

ఇట్లు నన్నయ రచన ఉదాత్తముగ, రసవంతముగ, ఔచిత్య శోభితముగ నొప్పుచున్నది.

## 2.2.7 ప్రాచీన సంస్కృతకావ్యములలోని భావచ్ఛాయలు:

సంస్కృతమున మహాకవులు పలువురు వ్యాస భారతము నుండియే కథావస్తువును గ్రహించి దృశ్య శ్రవ్య కావ్యములను రచించియున్నారు. కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలము, మాఘుని శిశుపాలవధ, హర్షుని నైషధము, భారవి కిరాతార్జునీయము, భారతము నాధారముగా వెలసిన సంస్కృత కావ్యములలో ముఖ్యములైనవి.

వీనికి సంబంధించిన కథాభాగములన్నియు నన్నయ రచించిన భాగములో నున్నట్టివే. ఈ కవులలో పలువురు నన్నయకు పూర్వులే నన్నయ రచించిన భారత భాగమునకు వ్యాసభారతమే ప్రధానాధారమైనను పైన పేర్కొనబడిన సంస్కృత కావ్యములందలి భావములు కూడ అందు కొన్నిచోట్ల గోచరించుచున్నవి. నన్నయకు ఆ సంస్కృత కావ్యము లన్నిటితో పరిచయమున్నది. నన్నయ నలోపాఖ్యానము నందు ప్రాచీన సంస్కృత కావ్యములందలి భావములు కొన్ని చోటు చేసుకొనినవి. వానిని క్రింద పరిశీలింతము:

ఋతుపర్ణుడు బాహుక వార్ష్ణేయ సహితుడై రథమెక్కి దమయంతీ ద్వితీయ స్వయంవరమున కరుగునపుడు—

"ఎదురను దవ్వుల జూచిన పొదపులెల్ల దత్‌క్షణమ
కదియ గా నవ్వియెంతయును దవ్వయికన బడ బిఱు ద

అరణ్య (2–170)

విస్మితుడయ్యెనని నన్నయ రథగమనవేగమును వర్ణించినాడు. ఇది కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలములోని క్రింది శ్లోకమును బోలియున్నది.

"యదాలోకే సూక్ష్మం వ్రజతి సహసాతద్విపులతాం
యదర్థే విచ్ఛిన్నం భవతికృత్ సంధానమివతత్"

-అభి (1-9)

నలుడు 'అవనీతలంబున కవతరించిన' హంసలతో నొకదానిని పట్టుకొన్నపుడు దానిని విడచి పోవనోపక ఇతర హంసలు అఱుచుచు ఆకసమున పిండుగట్టి తిరుగుచుండెనని నన్నయ వర్ణించినాడు. "స్వయూథభ్రంశే కూజనం పక్షిణాం స్వభావ:" అని మల్లినాథుడు

చెప్పినట్లుగా స్వయూథమునందలి పక్షులు కొన్ని తప్పిపోయినచో ఇతర పక్షులు కూతపెట్టుట సహజము. ఈ భావము వ్యాసభారతమున కానరాదు. నైషధములో ఈ సందర్భమున ఈ క్రింది శ్లోకమున్నది:

"పతత్రిణా తద్రుచిరేణ వంచితం
శ్రియః ప్రయాంత్యాః ప్రవిహాయ పల్వలమ్
చల త్పదాంభోరుహ నూపురోపమా
చు కూజకూలే కలహంస మండలీ"

హర్ష నైషధ. (1–127)

ఇట్లు నన్నయ ప్రధానముగా వ్యాసభారతమునందలి నలకథనే అనుసరించినను అక్కడక్కడ తనకు పూర్వముండిన సంస్కృత కవుల కావ్యములనుండి కూడ కొన్ని భావములు గ్రహించి, కొన్ని చోట్ల సందర్భానుగుణముగా నూతన కల్పనలు కావించి, అనుచితము లని తోచిన అంశముల నుపహరించి, కొన్ని వర్ణనలను పెంచి కొన్ని సంగ్రహించి నలోపాఖ్యానమును సర్వాంగ సుందరముగ స్వతంత్ర కావ్యముగా తీర్చిదిద్ది అనువదించినాడు.

## 2.3 నన్నయ కథాప్రసన్నత:

ప్రధానముగ నన్నయ దృష్టి ప్రసన్న కథాకలితార్థయుక్తిపై నున్నది. "కలితార్థ యుక్తి" అనగా కథలో కూడుకొని యొక మహార్థము ప్రవేశించుట. "ఇదియొక మహాశిల్పము. ఇది నన్నయ గారి యుపజ్ఞ" అని విశ్వనాథ సత్యనారాయణగారు విస్తరించి చెప్పినారు.

నలోపాఖ్యానములో హంస దౌత్యము, నలదౌత్యము. స్వయంవరము, నలపుష్కరుల ద్యూతము, వనగమనము, పునస్స మాగ

మము, రాజ్య సంపాదనము—అనునవి ముఖ్య విషయములు. దమయంతీ బద్ధచేతస్కుడై యుండిన నలమహారాజుతో కథ ప్రారంభమగుచున్నది. నలుడు దమయంతీ పునస్సమాగమము నొంది తిరిగి రాజ్యము సంపాదించుటతో కథ ముగియుచున్నది. మధ్యలో వనగమనము, వియోగ దశలో నలదమయంతులు పొందిన ఇడుములు వర్ణింపబడినవి. కథారంభ విస్తరణోప సంహారణములు చక్కగా నిర్వహింపబడినవి. వస్త్వైక్యముతో, వివిధ సంధులతో కూడి నలోపాఖ్యానము నన్నయ కథా నిర్మాణ శిల్పమును వ్యక్తము చేయుచున్నది.

2·3.1 మూలమున గూఢముగానున్న కథా రహస్యములను సముచిత వ్యాఖ్యానముచే సువ్యక్త మొనరించి నన్నయ కథకు ప్రసన్నత చేకూర్చును.

ఒకనాడు నలుడు దమయంతీ బద్ధచేతస్కుడై మదనానలము సహింపనోపక ప్రమదవనమున తిరుగుచుండెను. అపుడు "హంసావళి అవనీతలంబున కవతరించె"ను. నలుడు అందొక హంసను పట్టుకొనెను. నలుడు దానిని పట్టుకొనుటకు కారణమేమి? హంసల నడబెడంగులాతని ఆకర్షించినవి. ఆ నడబెడంగున అతనికి దమయంతి గమన సౌందర్యము స్ఫురించెను కాబోలు. అప్పుడాతనికి నవ్వు వచ్చినది.

"నీ హృదయేశ్వరియైన దమయంతి పాలికింబోయి నీ గుణంబులు దానికి వర్ణించి యక్కన్య నన్యులనపేక్షింపక నీయందబద్ధానురాగయగునట్లుగా జేసెద" (అరణ్య 2-14), నని హంస పలికినది. దమయంతి నలుని హృదయేశ్వరియని యాహంసకెట్లు తెలియును? అది సామాన్యమైన హంసకాదు" దమయంతికి నలునకు సంగమ

కారణదూతయైన కలహంస" శివుడే ఆ హంసయని శివపురాణము చెప్పుచున్నది. ఆ హుకులను భిల్ల దంపతులు యుగాంతరములందు తపస్సు చేయుగా శివుడనుగ్రహించి "మీరిద్దరు నలదమయంతులయి జన్మింతురు. మీకు నేను దౌత్యము చేయుదు"నని వరమిచ్చెను. కనుకనే అది మనుష్య వాక్యములతో పలుక జాలినది. దానిమాటలు నలుని హృదయమునకు అమృత ధారాపాతమువలె హాయి కలిగించెను. అతడనురక్తుడై దానిని విడిచెను.

ఆ హంస ఇతర హంసలతో కలిసి విదర్భకరిగి అందు ఉపవనమున సఖీజనపరివృతయై యున్న దమయంతి యంతికమున వ్రాలెను. అచటి యువతులెల్ల నొండొరుల గడచి పఱచుచు నొక్కొక్క హంసను పట్టుకొనిరి. అపుడు నలునిచేత విడువంగ బడిన హంస దమయంతి చేత పట్టుబడెను. ఈ పట్టుబడుటలో దమయంతి కర్తృత్వము కాక హంస కర్తృత్వమే కనిపించుచున్నది. అందుచేతనె అదిపోయి ఆమె అంతికమున విహరింప మొదలిడినది. హంస దౌత్యమునకు నన్నయ చేసిన వ్యాఖ్యానమిది.

**2.3 2** నన్నయ కథలో వీలైనప్పుడెల్ల మూలమున లేకపోయినను రసానుగుణములైన విభావానుభావాదులను వర్ణించుచు ఆ రసములకు పుష్టికలిగించుచుండును.

భీమరాజు ననుమతంబున బాహుకుడు దమయంతి కడకు రావింపబడెను. అపుడు వికృతాంగుడగు నలుడు చూచిన దమయంతి యిట్లన్నది.

"దీనానన నవిరళ పంకమలిననతగాత్ర దపస్విని నతికృశ దమయంతింగనియె నలుండుచితబాష్ప కణకలితముఖిన్ "

(అరణ్య 2-205)

పై పద్యమునందు పతివ్రతయైన దమయంతి విరహిణీ మూర్తి ప్రత్యక్షమగుచున్నది. తనకొరకు అట్లు కృశించిపోయిన దమయంతిని చూడగానే నలుని హృదయము కరుణ శృంగారము లకు తావలమైనది. తనకై ఆమె పొందిన కార్శ్యమునకు కరుణము, తనయెడ ఆమె ప్రదర్శించిన పాతివ్రత్యముతో కూడిన ప్రణయము నకు శృంగారము.

"దమయంతి నలుని వికృతాంగము జూచియు నతని నన్యుగావ గవక నెయ్యమునను లజ్జను నతిసంభ్రమమున వివశాత్మ" యగు చుండెను (అరణ్య. 2-206) ఇచ్చటి నెయ్యము. లజ్జ సంభ్రమము అనునవి చిరకాల విరహానంతరము ప్రియుని చూచి ఆమె పొందిన శృంగార భావమును వెల్లడించుచున్నవి

**2.3.3** నలుడు కలిసమావిష్టుడై నిద్రించుచున్న దమయంతిని విడిచి వెడలిపోయెను. తరువాత దమయంతి మేల్కాంచి నలుగడల పరికించి పతిం గానక భయశోకవ్యాకులిత చిత్తయై "హా మహారాజ మహామహీ రక్షణ దక్ష దక్షిణ బాహుదండ దండితారాతి నిషధారాజాగ్రణినన్నిట్లు పీతదయుండవై విడిచి చనగ దగునె" — (అరణ్య. 2-82) ఇత్యాదిగా విచారించెను.

నలుడు ఋతుపర్ణునొద్ద అశ్వాధ్యక్షుడై ప్రచ్ఛన్నముగా కాలము గడుపుచూ—

"ఇభరాజగమన నీవెందులకరిగి? త
త్వ్యరుకుచాభోగ యెందున్నదాన?
వబల యెవ్వరిచేత నడవులలో బట్టు
వడి? తళనాపేక్ష బఱచుచున్న

యుగ్ర మృగంబుల యుదరంబులోనున్న
దానవే? నీ తల్లిదండ్రులొద్ద
ధృతినున్న దానవే? దేశాంతరంబుల
నున్నదానవెయంచు నుదితమదన

"హతి విమోహితాత్ముడై హృదయేశ్వరి
దల చి రాత్రులెల్ల దాపమునను
నిద్రలేక వంది నిట్టూర్పులూర్చుచు
నుండె నలు డు శోకము త్కటముగ"

(అరణ్య 2-133)

పై రెండు పద్యములలో సంబోధనలందు దమయంతియు నలుడును పొందిన దుఃఖాతిశయము వ్యక్తమగుచున్నది. మొదటి దానిలో భయముతో కూడిన శోకము, రెండవదానిలో శృంగారముతో కూడిన కరుణము వర్ణింపబడి యున్నవి. ఇచ్చట విస్తరించి భావములను చెప్పుటచేతనేకాక 'శబ్ద సంయోజన శక్తి' చేతనే ఆ రసము వ్యక్తమగుచున్నది.

2.3.4 మూల కథా భాగములందు అస్ఫుటస్ఫురితముగా నున్న పరమార్థములను తద్వివరణమును నన్నయ స్ఫుటమొనరించి పాఠకులను ప్రసన్నమగునట్లు కథా రచన సాగించును.

నలుడు నిద్రించుచున్న దమయంతిని విడిచి వెడలిపోయెను. ఆమె మేల్కొని నలుని గానక విషణ్ణయై పలుపాట్లు పడి చివరకు చేది దేశమున కరిగెను. సుదేవుడను బ్రాహ్మణుడామెను గుర్తించి విదర్భకు కొనివచ్చెను. అప్పటినుండియు ఆమె దేహసౌఖ్యములు వీడి సువ్రతయై జీవితస్వామియైన నలుని చూచు దినములకెదురు

చూచు చుండెను. తల్లిచే భీమరాజునకు చెప్పించి నలుని వెద కుటకై అతడు బ్రాహ్మణుల నియోగించునట్లొనరించెను. పర్ణాదుడు దమయంతి చెప్పుమనిన పల్కులు పల్కగా విని అయోధ్యయందు బాహుకుడు దీర్ఘ నిశ్శ్వాస పురస్సరుడై—

"పురుషునందు దోషపుంజంబు గలిగిన
నెఱిగి యెదసహించునేని భార్య
పురుషునందభీష్ట భోగంబు దేహాంత
రంబునందు ధర్మరతియు బడయు"

—అరణ్య (2-160)

అని ప్రతివచన మిచ్చెనని యెరింగించెను. నలుడు కానివాడు ప్రతి వచనమేల యిచ్చునని నిశ్చయించి దమయంతి ఋతుపర్ణునికి ద్వితీయ స్వయంవర వార్త తెలిపి రమ్మని సుదేవుని పంపెను. సుదేవుడావార్తను అయోధ్యలో తెలిపెను. ఋతుపర్ణునితో నలుడు కూడ విదర్భకరుదెంచెను. పిమ్మట దమయంతి బాహుకుని కడకు కేశిని అనుదాడిని పంపి అతడు నలుడేయని దృఢపరచుకొని అతనిని అంతిపురికి రప్పించెను. ఈ విధముగా పుట్టినిల్లు చేరినది మొదలు దమయంతి నలుని కలిసికొనుటకు ఎంతో ప్రయత్నము చేసినది. నలుడు దమయంతి విషయమున అట్టి ప్రయత్నమేదియు చేయలేదు.

దమయంతి నలునితో ఆపదలందున్న వానికి భార్య ఏవిధముగ సహాయపడుచుండునో ఇట్లు వివరించినది:

"అధిక దుఃఖరోగార్తున కౌషధంబు
సురుచిరంబుగ భార్యయ చూపెయెందు

నొనర భార్య సమేతుడై యున్నవాని
కెంతలయ్యును నాపదలెయిక పడవు
అలిసినెడ, దస్సినెడ, నా
కలి దప్పియునైన యెడల, గడుకొని ధరణీ
తలనాథ పురుషునకు ని
మ్ముల భార్యయు పాడు జిత్తమున దుఃఖముల్"

(అరణ్య 2-74, 75)

ఇందలి యభిప్రాయమే యీ కథయందు నన్నయ వెల్లడి చేయ నెంచిన పరమార్థము. దుఃఖార్తుడైన నలునికి దమయంతి యట్లౌషధమై అతని చిత్తమున గల దుఃఖములనెల్ల బాపెనో నన్నయ యీ కథ యందు చక్కగ వర్ణించినాడు. పురుషునందు దోషపుంజంబు నెఱిగియు దమయంతి యెద సహించిన కతమున కాలాంతరమున అభీష్టభోగము లందజాలినది.

దమయంతికి నలునిపైగల విరహమును చెలికత్తెలు భీమునకు తెలిపిరి. దమయంతికి భీముడు స్వయంవరమును ఏర్పరచెను. దమయంతీ స్వయంవరమును విని ఇంద్రాగ్ని యమ వరుణులు వచ్చిరి. వీరు వచ్చినది దమయంతిని వివాహమాడుటకు కాదు. దమయంతికిగల పతిభక్తి పరీక్షించుటకొరకు. దమయంతి ఇంతకు పూర్వమే నలుని భర్తగా ఎన్నుకొన్నదని దేవతలకు తెలియును. అదియునుగాక పరపురుషుని ప్రేమించిన స్త్రీని వివాహమాడినచో వారి దాంపత్యము సక్రమముగ జరుగదు. దీనివలన ప్రయోజనము కూడ నుండదు. ఇది దేవతలకు తెలియును. అట్లయినచో దేవతలు ఎందుకు వచ్చిరను ప్రశ్న ఏర్పడును. నలదమయంతుల ప్రేమ

ఎంత గొప్పదో లోకమునకు తెలియజేయుటయే వీరి ప్రధానోద్దేశము. అట్లు కానిచో "మాలో ఎవరినైన నొక్కని వివాహమాడునట్లు" చేయుమని నలుని కోరుదురా? నలాకారమునందున్న దేవతలను ప్రార్థించి దమయంతి నలుని వివాహమాడినది. వారు నిజముగ దమయంతినే వివాహమాడుటకే వచ్చినచో నలదమయంతులకు దివ్యవరము లిత్తురా? ఇదియంతయు దేవతలు దమయంతి పతిభక్తిని లోకమునకు చూపుటకు చేసిన ప్రయత్నమని నన్నయ సూచించెను.

**2.3.5** నన్నయ ఆయా ఘట్టములు జరిగిన ప్రదేశములను బట్టి కథనంతను కొన్ని ముఖ్యభాగములుగా విభజించును. ఈ పద్ధతి నాటకములందలి రంగవిభజనమును బోలియుండును. కథ ఒక రంగమునుండి ఇంకొక రంగమునకు మారుటను నన్నయ "అట, ఇట, అంతనిక్కడ' అను పదములతో సూచించుచుండును.

నలుడు నిద్రించుచున్న దమయంతిని విడిచి వెళ్ళెను. తరువాత దమయంతి మేల్కొని నలునిగానక దుఃఖించి పెక్కు ఇడుములుపడి చేదిపురమునకు చేరుకొనెను. ఇంతవరకు దమయంతి చరిత్ర చెప్పబడినది, ఇంక నలుని చరిత్ర చెప్పనారంభించుచు నన్నయ "అట నలుండు దమయంతింబాసి దారుణారణ్యంబులో నరుగువాడు ముందట" (అరణ్య 2-123) అని రంగము మార్పు సూచించెను.

నలుడయోధ్యాపురి కరిగి అట అశ్వశిక్షకుడై ప్రచ్ఛన్నముగా కాలము గడుపుచుండెను. మరల కథ దమయంతియున్న యెడకు మారినది. "ఇట్లయోధ్యాపురంబున బాహుకనామంబుతో నలుండుండె

నంతనట విదర్భేశ్వరుండు" ఇత్యాదిగా నన్నయ ఈ మార్పును సూచించెను. (అరణ్య 2-138)

2·3·6 నన్నయ కథను వివరించుచు అచ్చటచ్చట ధ్వని పూర్వకముగా భావికథాంశసూచన యొనరించుచుండును. మొదట చదువునప్పుడు ఆ సూచన సాధారణముగానే గోచరించును. కాని సూక్ష్మముగా పరిశీలించినపుడు అంచలి ధ్వని సువ్యక్తమై పాఠకుల కానందము కలిగించును.

నలుడు దమయంతీ సహితుడై అడవి కరిగెను. వారు ఏక వస్త్రులై అందు తిరుగుచుండిరి. అపుడు నలుడు దమయంతిని చూచి-

"ఇది దక్షిణాపథంబున
కిదియు విదర్భాపురమున కిది కోసల కి
య్యది యుజ్జయినికి దెరువులు
మది నన్నిటిలోన నరుగ మనకెద్దియగున్"

(అరణ్య 2-70)

అని ఆయాదేశముల కరుగుమార్గములు తెలిపెను. ముందు దమయంతిని నలుడు విడిచి వెళ్లబోవుచున్నాడు. ఆ ప్రిదావనమున ఆమె దారి తెన్ను తెలియక క్లేశపడవలసి వచ్చును. అందుచే నామెకు ఆయాపట్టణములకు బోవు మార్గములు తెలియుట మంచిది. ఆమె తరువాత విదర్భాపురమున కేగి పుట్టినింట సుఖముగా నుండవలయు నని అతని ఊహ. ఆ ఊహచే నలుడామెకు మార్గములన్నియు తెలిపియుండెను.

ఇట్లు నలోపాఖ్యానమునందు నన్నయ కథాకథన శిల్పము వెల్ల

వెల్లడియగుచున్నది.

## 2.4 నన్నయ అక్షర రమ్యత:

"పదమైత్రియే శయ్య" అని విద్యానాథుడు చెప్పినాడు. "యా పదానాం పరాన్యోన్యమైత్రీశయ్యేతి కథ్యతే" Words Worth అను ఆంగ్లకవి కవిత్వమును నిర్వచించుచు "The choice of best words in best Place" అని చెప్పిన మాట. పింగళి సూరన "పోసగ ముత్తెపు సరుల్ పోహళించిన రీతి దమలోన దొరయు శబ్దములు గూర్చి" అని చెప్పినది ఈ శయ్యను పురస్కరించుకొనియే పరివృత్త్యసహిష్ణువుగా గుణములను సంకలనము చేయుటయే శయ్య యగును. దీనినే నన్నయ "అక్షర రమ్యత" యని చెప్పినాడు.

ఈ క్రింది పద్యమున ఓజఃప్రసాద సామ్యము కలదు.

"అలయక పుణ్య వ్రతములు
సలుపుచు సైరంధ్రియన గ జైద్యేశుపురిన్
నలుదేవి యుండె నెద బతి
దలచుచు దుస్సహ వియోగ తాపార్థితయై"

(అరణ్య 2-122)

కేవల మృదు సరళాక్షర ఘటితములైన పదములచే మాత్రమే అక్షర రమ్యత ఏర్పడునని భావింపరాదు. అది పదములందలి అక్షరముల సరళతా పారుష్యములపై కంటె రసానుగుణత్వముపై ఎక్కువగా ఆధారపడియుండును.

ఈ క్రింది పద్యపాదములందు అక్షరరమ్యత ఉన్నది.

"నలదమయంతులిద్దరు మనః ప్రభవానల దాధ్యమానలై
సలిపిరి దీర్ఘవాసర నిశల్ విలసన్నవ నందనంబులన్"

## 2.5 నన్నయ సూక్తుల రుచిరార్థము :

కావ్యమునకు రసానంద సంధానమే ప్రధాన ప్రయోజనమైనను ధర్మోపదేశముకూడ నుండుట మేలని లాక్షణికులంగీకరించినారు. కవులు వ్యంగ్యముగనేకాక వాచ్యముగ కూడ నీతి ధర్మముల నుపదేశించుచుందురు. సూక్తులనగా సుభాషితములు. నన్నయ భారతమున నిట్టి సూక్తులెన్నియో కలవు.

కొన్నిచోట్ల మూలమందు బీజప్రాయముగానున్న భాగములను గ్రహించి నన్నయసూక్తిగా పెంపొందించినాడు. నీతి ధర్మములకు నిలయములైన సూక్తులను నన్నయ కథాసందర్భముతో కూడిన పద్యములందుకాక ప్రత్యేక పద్యములందే వ్రాయుచుండును. ఇవి అర్థభావములందు స్వయం సంపూర్ణములైనవి. సందర్భానుగుణముగ ఎక్కడైనను ఉపయోగించుటకు వీలయినవి.

మూలమున బీజప్రాయముగానున్న భాగమును నన్నయసూక్తిగా పెంపొందించి క్రింది పద్యమును రచించినాడు. చూడుడు–

"అలసినెడ డస్సినెడ నా
కలి తృష్ణయు నైనయెడల గడుకొని ధరణీ
తలనాథ పురుషునకు ని
మ్ముల భార్యయపాచు చిత్తమున దుఃఖముల్"

(అరణ్య 2-75)

నన్నయ సూక్తులందు ఒక్కొక్కచోట కథకు సంబంధించిన ఎంతో అర్థమును ధ్వనింపజేయుచుండును. నలుడు దమయంతిని విడిచి వెళ్ళిపోయిన తరువాత ఆమె అతనికై చుట్టుపట్ల వెదకెను. నలుడెచ్చటను కానరాలేదు. అపుడు దమయంతి దుఃఖించుచు–

"వగవగ సాంగోపాంగము
లగు నాలుగు వేదములయు నధ్యయనము వొ
ల్పగ నొక సత్యముతోనెన
యగునే? యెవ్వియును బోలవవె సత్యంబున్"

(అరణ్య 2–83)

అని పలికినది. ఇది పైకి సత్యముయొక్క మహాత్మ్యమును తెల్పు సూక్తిగా గోచరించుచున్నది. కాని నిశితముగ పరిశీలించినచో ఇందు నలునికిగల విద్యావైదుష్యములు చక్కగా ధ్వనితములగుచున్నవి. షడంగములు. వేదములు, మీమాంసా, న్యాయపురాణ ధర్మశాస్త్రములు–అనువానికి చతుర్ధశ విద్యలని పేరు. నలుడు సాంగోపాంగముగా నాలుగు వేదములను అధ్యయనము చేసినవాడు. చతుర్ధశ విద్యలందు ఆరితేరిన వాడాతడు.

శ్రీహర్షుడు నైషధమున అధీతి బోధాచరణ ప్రచారములచే నలుడు విద్యలకు చతుర్దశత్వము కలిగించెనని చమత్కరించి యున్నాడు. నన్నయ కథారంభమున నలుని వైదంష్యమును గూర్చి "ఏమియు చెప్పియుండలేదు" విపినంబులలో గడుకొని మాయట్లిడుమలబడిన నరులం గలరె, యొరులు పరమమునీంద్రా" అని ధర్మజుడడిగిన దానికి సమాధానముగా బృహదశ్వుడు నలోపాఖ్యానమును చెప్పినాడు. ఇచ్చట నలుడుపడిన ఇడుములకే ప్రాధాన్యము. నన్నయ వానినే నలోపాఖ్యానమున వివరింపనెంచినాడు. అందుచే మొదట నలుని గుణగణములను కాని, విద్యావైదుష్యమునుగాని వాచ్యముగా చెప్పలేదు. వేరొక కవియైనచో అట్లు చేసియుండును. పై సూక్తిని చెప్పుచు నన్నయ నలుని పాండిత్య విశేషమును వ్యంగ్య

ముగా వెల్లడించెను. నన్నయ సూక్తుల రుచిరార్థమున కిదియొక చక్కని దృష్టాంతము.

## 2.6 నన్నయ వర్ణనలు :

నన్నయ వర్ణనలు మితములయ్యు ఉదాత్తములై వర్ణ్య వస్తువులను పాఠకులకు సాక్షాత్కరింపజేయును. నన్నయ వర్ణనా వైఖరి పెక్కుచోట్ల చిత్రకారుని చిత్ర రచనా పద్ధతిని బోలియుండును. చిత్రకారుడు ఒక చిత్రమున ఒక విన్యాసమును (Pose) మాత్రమే ఒకసారి వర్ణింపజాలును కాని విన్యాస వైవిధ్యమును ప్రదర్శింప జాలడు. బహువిన్యాసములను చిత్రింపదలచినచో నతడు బహుచిత్రములను చిత్రింపవలయును. కవి వాక్సామ్రాజ్యమున ప్రతిక్షణ చాంచల్యమానయగు దశావిపర్యము ఒకే పద్యమున వర్ణింపజాలును. తిక్కన వర్ణనలు పెక్కు ఈ విధముగనే యుండును. నన్నయ మాత్రము చిత్రకారునివలెనే వర్ణ్యముయొక్క ఏకైక విన్యాసమును మాత్రమే (Static Pose) వర్ణించును.

"పాంసు జాలములుపై బ్రాకిన గరము రూ
క్షములగు మూర్ధ్వాలకములదాని
నతి మలినంబయిన యర్థవస్త్రంబుచే
నావృతంబగు దేహ యష్టి దాని
నా కలిత తృష నిద్రలను వీని నెఱు గక
యున్మాదినియు బోలెనున్నదాని
దమయంతి జూచి.................."

(అరణ్య 2–103)

"హంస చేదనవిని నంతకంబెను రూప
విభవాతి శయమున వెలయుదాని
సురకన్యకల యట్టి సురుచిర శతకన్య
కాళిచే పరివృతయైన దాని
హృదయేశు డైన తన్నెపుడు వినుచున్కి
నలయకాశ్వాసితయైన దాని
దమయంతి జూచి................"

(అరణ్య 2-39)

పై పద్యములందలి భావములను గ్రహించి ఒక్కొక్కదానికి ఒక్కొక్క చక్కని చిత్రమును రచింపవచ్చును. వానియందలి "దాని, దాని" అను సర్వ నామములతో ముగియు విశేషణములు ఒకే స్థితియొక్క వివిధ భంగిమలను సూచించుచున్నవి.

## 2.7 పాత్ర పోషణము :

నన్నయ పాత్రపోషణమున కృతహస్తుడు. గాంభీర్యము, ఉదాత్తత, అతని పాత్రలందలి సామాన్య లక్షణములు. స్త్రీపాత్రలను సృష్టించుటలో నన్నయ అందెవేసినచేయి. దమయంతి పతిప్రేమ, లోకజ్ఞత నన్నయ రచనలో సమగ్రస్ఫూర్తితో వర్ణింపబడినది.

దమయంతికి అడవిలో మునులు దర్శనమిచ్చినపుడు తాను నలుని భార్యనని చెప్పి, అతడు జూదములో పరాజితుడైన సంగతి వారితో చెప్పినట్లు మూలములో నున్నది. పుణ్యశ్లోకుడగు నలుని భార్యనని చెప్పినట్లు నన్నయ తన అనువాదములో వర్ణించినాడు. కాని ద్యూత విషయము చెప్పినట్లు తెల్పలేదు. దమయంతి ఉత్తమ పతివ్రత. ఆమె నోటినుండి భర్తచేసిన దుష్కార్యములను చెప్పిం

చుట అనౌచిత్యమని భావించి నన్నయ నలుని ద్యూత విషయమును పరిత్యజించెను.

చేది నగరమునుండి దమయంతి విదర్భకు వచ్చినపుడు తన తల్లిదండ్రులు సంతోషించినారని, తల్లిదండ్రులు, తన బిడ్డలు సుఖముగా నుండుట చూచి దమయంతికూడ ప్రహృష్ట అయినదని దమయంతి దేవబ్రాహ్మణులను పూజించినదని, భీముడు కూతురును తెచ్చిన సుదేవునకు గోసహస్రము దానము చేసినాడని సంస్కృత భారతములో కలదు. తెలుగులో ఈ విషయము పరిహరింపబడినది. ఇల్లు వదలిపోయిన కూతురు తిరిగి వచ్చుటవలన తల్లిదండ్రులు సంతోషించుట, ఆ విధముగనే తల్లిదండ్రులను జూచి కూతురు సంతోషించుట లోక సహజమే. ఆ వచ్చిన కూతురు భర్తను పోగొట్టుకొని వచ్చినపుడు తల్లిదండ్రులకు దుఃఖమే కలుగును కాని సంతోషమునకు తావులేదు. కూతురును జూచి తల్లిదండ్రులు సంతోషింప వచ్చును గాని దమయంతి సంతోషించుటలో ఔచిత్యములేదు. కావున నన్నయ దమయంతి పాత్రపోషణాదృష్టితో ఈ సంతోషమును తెలుగు చేయకుండ పరిహరించినాడు.

దమయంతి నలునితో అడవికేగి అతనితో పెక్కు ఇడుములు గడుచుట ఆమె పతిప్రేమకు తార్కాణము. నలుని గుర్తించుటకై ఆమె కావించిన యత్నములు, బాహుకుడే నలుడని నిర్ణయించుపట్ల ఆమె చూపిన నేర్పు అనన్య సామాన్యమైన లోకజ్ఞతను వెల్లడి చేయుచున్నవి.

నన్నయ సాధారణముగా ఆయా పాత్రలను మొదట ప్రవేశ పెట్టినపుడే వారి శీలములందలి ముఖ్యాంశముల విశేషములచే సూచించుచుండెను.

"నలుండను వా డనేశా క్షాహి ణీపతి యినవరతాక్షప్రియుండు"

(అరణ్య 2-7)

## పాత్రల మనస్తత్త్వ నిరూపణము:

నలుడు నిద్రించుచున్న దమయంతిని విడిచిపోవునపుడు సన్నాయ కావించిన అతని మనః పరిస్థితి వర్ణన మిక్కిలి నిసర్గమై అద్భుత ముగా నున్నది.

"కలిదమయంతి పాపసముకట్టు నతింబతి వాయనోప దా
లలన సుదీర్ణసౌహృద బలంబున నిట్టలు రెంట జేసి య
న్నలుడు విమోహ రజ్జుల పెనంగి గతాగతకారియైనయు
య్యేలయును బోలె సూఱడక యెంతయు బ్రొద్దువినిశ్చితాత్ము డై"

(అరణ్య 2–79)

గతాగతకారియైన ఉయ్యేలయును బోలె అను ఉపమాన మిచట నలుని మానవ స్థితిని సువ్యక్తమొనర్చుచున్నది. ప్రియు రాలిని బలవంతముగా విడిచి పోవలసివచ్చినపుడు ప్రియుడు పొందు వ్యథ ఇందు చక్కగా నిరూపింపబడినది.

నలుడుద్యానవనమున విహరించుచు ఒక హంసను పట్టు కొనెను. అపుడు–

"దాని విడిచి పోవగా నోప కఱచుచు
నంతరిక్షమునను హంసలెల్ల
బిండు గట్టి తిరుగుచుండె వాతోద్ధూత
శారదాభ్రశకల చయము భోలె"

(అరణ్య 2–13)

తమ గుంపులోని ఒక పక్షికి అపద తటస్థించినపుడు ఇతర

పక్షులిట్లే చేయును. నన్నయ ఈ పద్యమున పక్షిస్వభావమును ఎంతో సహజముగా ప్రదర్శించియున్నాడు.

## 2.8 నన్నయ ఔచిత్య పరిపోషణము :

"అనౌచిత్యాదృతే నాన్యద్రస భంగస్యకారణమ్
ప్రసిద్ధౌచిత్య బంధస్తు రసస్యోప నిషత్పరా"

అని ఆనందవర్ధనుడు తెల్పినాడు. నన్నయ ఔచిత్యపోషణ విషయమున శ్రద్ధచూపి తన రచనను ఉదాత్తముగా సాగించినాడు.

దమయంతి అడవులలో ఇడుములు పడిపడి చివరకు పుట్టినిల్లు చేరెను. అప్పటినుండి ఆమె భర్త మార్గణమునకై ప్రయత్నముచేయ మొదలు పెట్టెను. ఆమె ఏది చేయనెంచినను తల్లితోడనే చెప్పి ఆమె అనుమతి నందియే చేయుచుండెను. ఆమె తండ్రితో నేమియు మాటాడలేదు. తల్లియే ఆమె కోరికను భర్తకెరిగించి దానిని సఫల మొనరించు చుండెను. ఇది రాజగృహమందలి మర్యాద. వయస్సు వచ్చిన స్త్రీలు ఏ విషయమునగాని తండ్రికెదురుపడి మాటాడరు. వారన్నియు తల్లి ముఖముగనే తండ్రికెరిగింతురు. నలోపాఖ్యానములో నన్నయ ఈ ఔచిత్యమును చక్కగా పాటించెను.

భీమరాజు భార్యవలన దమయంతి కోరిక నెరిగి బాహుకుని దమయంతి యొద్దకు రావించెను. నలుడప్పుడు నలుడుగా లేడు. వికృతాంగుడై యుండెను. దమయంతికి మాత్రము అతడు నలుడే యని నిశ్చయము. "సందియమేల సర్వగుణ సంపద జూడగ — బాహుకుండు భూవందితుడైన నైషధు డవశ్యము దానగు"నని ఆమె తన నిశ్చయము నంతకు ముందే తల్లికెరింగించెను. బాహుకుని ఆకృతి చూచిన వారి తరులెవ్వరు నట్లు తలపరు. అట్టి స్థితిలో

బాహుకుడు ఆమె చెంత కరుదెంచెను. అతడు నలుడేయని ఇతరులు కూడ నెరుగువరకు ఆమె అతనితో మాట్లాడరాదు. ఈ ఔచిత్యమును పాటించి ఇచట నన్నయ కథనెంతో నైపుణ్యముతో సాగించినాడు.

"విజనంబయిన విపినంబునందు నలసి నిద్రవోయిన దాని నబల నతి సాధ్వినను వ్రత నగ్నిసన్నిధి బాణిగ్రహణ విధిలబద్ధయైన దానింబాసి నలునట్లోరులు నిర్దయులై యరిగిన వారు లేరు."

"సురవరుల దొఱగి తన్నున్
వరియించితి నన్ను బుత్రవతినేలొకా చె
చ్చెర విడిచె నాతనికి ని
ష్కారణున కేనేమి యెగ్గు గావించితినో
నిన్నువిడువ నోడకుండుమని పలికిన యప్పలుకులేల మఱచెనో"

(అరణ్య 2–207, 208, 209)

అని దమయంతి బాహుకుడు వినునట్లుగా ప్రథమ పురుషలో పలికినది. అపుడు శోకాతులుడై నలుడు తన్నెరిగించెను. పై సందర్భమున నన్నయ అవలంభించిన పద్ధతి మిక్కిలి ఔచిత్యమైనది.

ధర్మేతరములు, అసభ్యములు నగు విషయములను చెప్ప వలసి వచ్చినపుడు నన్నయ వానిని వాచ్యముగా చెప్పక వేరు మాట లచే ధ్వనింప జేయుచుండును. నన్నయ అట్లు చేయుటకు ఔచిత్య దృష్టియే కారణము.

కిరాతుడు దమయంతిని చూచి మోహపరవశుడయ్యెను. అతడనాగరికుడగుటచే ఎట్టి అల్ప ప్రసంగములైన కావింపవచ్చును. అట్టి సందర్భమునందు కూడ నన్నయ అనౌచిత్యమును పరిహరించు

టకై "నిజహృదయం బె ఱిగించె లతాంగి కనింద్య చరిత్రకు వేడుకతో" అని వ్రాసినాడు. (అరణ్య 2–90)

## 2.9 నన్నయ లోకజ్ఞత :

కావ్యము లోకవృత్తమునకు ప్రతిబింబము. లోకజ్ఞుడు కాని వాడు మహాకవి కానేరడు. నన్నయ రచనలో పెక్కుచోట్ల అతని లోకజ్ఞత బహుముఖముల వెల్లడియగుచున్నది.

దమయంతిని అడవిలో ఒక అజగరము (కొండ చిలువ) పట్టుకొనెను. ఇతర సర్పములయితే కరచినపుడు దాని విషము రక్తమున చొచ్చి గుండెను స్తంభింపజేయును. కొండచిలువ మ్రింగును. మ్రింగిన వెంటనే ఏ చెట్టునో చుట్టుకొని రాపిడిచేయును. అప్పుడు కాని మ్రింగబడిన జంతువు చావదు. ఈలోగా ఎవరైనను ఆ కొండ చిలువ పొట్ట చీల్చినచో ఆ జంతువు బ్రతుకవచ్చును. దమయంతిని మ్రింగిన ఆ కొండచిలువ వదనమును ఒక కిరాతుడు వ్రయ్యదరిగెను. దమయంతి సజీవయై దాని ముఖమునుండి వెలువడినది. అప్పుడా కిరాతుడు ఆమె నాశ్వాసించి సమీప సరోవరస్నాతను గావించెను. కొండ చిలువ మ్రింగినపుడు దమయంతి శరీరమును దానిలాగా ఆవరించి యుండును. స్నాతమైన పిమ్మట ఆయావరణముతొలగి ఆమెద్విగుణిత సౌందర్యముతో ప్రకాశించి యుండును. ఆ సౌందర్యము కిరాతుని మదన పరవశు నొనరించినది. ఆ సందర్భమున నన్నయ కావించిన దమయంతి వర్ణన ఆమె సరోవరమునుండి స్నానముచేసి వచ్చుచుండగా చూచి చేసినట్లున్నది. ముందు దమయంతి ముఖమును (రజని కరానన) తరువాత పయోధరమును (పీనపయోధర), పిమ్మట నడకను (విలసద్గజపతి గామిని), అనంతరమామె శరీర సౌరభ్య

మును (చందనగంధి). నన్నయ వరుసగా అందు వర్ణించినాడు.

చదుప (బేహారుల గుంపు) తెల్లవారుజామున ప్రయాణమారంభించి ఎండ ఎక్కునంతవరకు నడక సాగించి, అపుడు జల సమీపమున చెట్లనీడ విశ్రమించుట లోకమున స్వభావమే. నన్నయ ఈ క్రమమునే నలోపాఖ్యానమున వర్ణించెను. (అరణ్య 2-109)

దమయంతి నలునివిదర్భాపురమునకు రప్పించుట యందును. రథఘోషమును విని అది నలునిదే అని గుర్తించుటయందును ఆమె లోకజ్ఞత అపారముగా వెల్లడియగుచున్నది. ఇది నన్నయ లోకజ్ఞతయే.

ఇట్లు నన్నయ లోకజ్ఞత ప్రదర్శించిన సందర్భములందు అతని లోక ప్రవృత్తి పరిశీలనము సువ్యక్తమగును.

## 2.10 నన్నయ రచన :

నన్నయ అలంకారములన్నియు రచనలో ధారాళముగ అప్రయత్నముగ సమకూడినట్టివే. ఉపమ, రూపకము, అర్థాంతరన్యాసము స్వభావోక్తి అను నలంకారములు అతని రచనలో ఎక్కువ. సమయోచితములు, భావస్ఫోరకములు, అమూలకములునగు ఉపమానములను నన్నయ చాలాచోట్ల వాడుచుండును.

"అగ్నిశిఖయు బోలెనంటను డాయను జూడరానియట్టి శుభచరిత్ర"

(అరణ్య 2-91)

ఇచట పతివ్రతామ తల్లియగుటచే ఇతరులకంటను, డాయను చూడరానియట్టి దమయంతిని అగ్నిశిఖతో పోల్చుట ఎంతయు ఔచిత్యభాసురమై యొప్పుచున్నది.

"అర్ధరాత్రమునప్పుడందుల కేతెంచె గజయూథములు జల
కాంక్షింపజేసి యంబుధి విమలతోయంబు లాస్వాదింప జనుదెంచు
జలధర సమితియట్లు" (అరణ్య 2-111)

పై పద్యములోని ఉపమానము సుందరమైనది.

"చనుచ యిట్టిపాట చెనుపరి యవినీతు। సిరియుబోలె నడగి విరిసి చనియె"
(అరణ్య 2-111) అనుచోట ఉపమానము మిక్కిలి సాభిప్రాయ
మైనది.

"నలు నెచ్చటనైన కాంచితిరా" అని దమయంతి అడుగగా
సార్థవాహకుడు "నలు గాన మివ్వనంబున। గలమెప్పుడు గాంతు
మగ్రగకరులను, సింహం। బుల బుక్షంబుల" (అరణ్య 2-107)
అని సమాధానమిచ్చెను. ఇందు కొంత అపహాస్యమున్నది. దమ
యంతిని చూచి చనుపలోని వారు కొందరు భయపడిరి. కొందరధిక
హాస్యము చేసిరి. ఇట్లు ఆ చనుపలో కొందర వినీతిపరులుండిరి. ఈ
అవినీతికి ఫలితముగా వారు గజముల పాదహతిచే మర్దితులయిరి.
కొందరు దంతహతి చేత భిన్నాంగులైరి. అవినీతి సిరిని తొలగించు
నని నన్నయ నిశ్చితాభిప్రాయముగా తోచును.

నన్నయ రచనమునందు శబ్దాలంకారములుకూడ గోచరించును.
ఇందు వృత్త్యనుప్రాసముల సంఖ్య హెచ్చు. అవి యన్నియు అప్ర
యత్నముగా సిద్ధించినవే.

"అలపోలడుకుబుచ చేతులు
నొలవ శరీరంబు గలిగి యొరులకు జూడం
గొలగాకుండియు మన్మధు
నొలపుల బడియెడు నితండు యువతీ ప్రియుడై"

(అరణ్య 2-135)

ఇందలి అ కార పునరావృత్తి వర్ణితుడైన వ్యక్తి వికృతాకార మును లెస్సగా సూచించుచున్నది.

శబ్దములకు గల రెండర్థములను పురస్కరించుకొని నన్నయ చక్కని చమత్కారమును కల్పించినాడు.

"అన్నలుండు విమోహరజ్జుల బెనంగి గతాగత కారియైన యుయ్యేలయును బోలె" (అరణ్య 2–79), నలుడు విమోహరజ్జుల బెనంగి "గతాగతకారియైన యుయ్యేలవలె ముందు వెనుకల కేగు చుండును. విమోహమనగా విశేషమైన మోహమని సామాన్యమైన అర్థము. ఈ అర్థమునే గ్రహించినచో నలుడు వెనుదిరిగి వచ్చుటయే చేయవలెను. కాని ముందుకు పోవుటకు వీలు లేదు. అందుచే దీనికి మోహరాహిత్యమను నర్థముకూడ చెప్పికొనవలయును. అప్పుడాతడు దమయంతిని వీడపోజాలును. వి = విగత, విశేష, అను రెండర్థము లున్నవి. ఈ రెండర్థములను గ్రహించినపుడే అచ్చటి ఔపమ్యము సార్థకమగుట సంభవించును.

నన్నయ పెక్కుచోట్ల పదములను సాభిప్రాయముగా ప్రయోగించుచుండెను. ఆ శబ్దములను అచటనుండి తొలగించి వానికి పర్యాయములైన ఇతర పదములను వాడినచో చమత్కారమునకు భంగము వాటిల్లును.

"ఇభ రాజగమన, నీవెందుల కరిగితి....
అబల యెవ్వరి చేత నడపులలో బట్టువడితి"

(అరణ్య 2-133)

"అరిగితివి" అని ప్రశ్నించునపుడు 'ఇభరాజ గమన' అనియు "పట్టువడితి" వనినపుడు 'అబల' అని సంబోధించుట రమణీయ ముగా నున్నది.

"నిత్యసత్యవ్రత । నిషధేశనీవు మాకమరంగ దూతవై యభి మతంబు సేయుము" (అరణ్య 2-34) 'నిత్యసత్యవ్రత' శబ్దమిచట సాభిప్రాయముగా నున్నది.

పద్య గద్యములను వాడు సందర్భమున కూడ నన్నయ ఔచిత్య మును పాటించును. నీరసములును విషయ ప్రధానములును నగు అంశములను అతడు వచనముననే చెప్పుచుండును. ఏదైన కథ నారంభించునపుడు అందలి పాత్రలకు వారికి అందుగల ప్రాధాన్య మునుబట్టి గద్యమో పద్యమో వ్రాయుచుండును. నలోపాఖ్యాన మను పేరున్నను అందు నలునికంటె దమయంతికే ఎక్కువ ప్రాధాన్యమని, అందుచేతనే నలుని గూర్చి మొదట చెప్పునపుడు వచనమును (అరణ్య 2-7), దమయంతిని గూర్చి చెప్పునపుడు పద్యమును (అరణ్య 2-8), నన్నయ వ్రాసియుండెనని శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు 'నన్నయగారి ప్రసన్న కథాకలితార్థయుక్తి'లో వ్రాసినాడు. కాని ఇట్లు నన్నయ రచనలో అంతటను సమన్వయము చేయుట కష్టసాధ్యమైన విషయము. పద్యగద్యముల ప్రయోగ విషయ మున నన్నయ విచక్షణత చూపు ననుమాట మాత్రము నిజము.

భారతారణ్య పర్వమందలి నలోపాఖ్యాన వైశిష్ట్యమును అందు నన్నయ కావించిన సారస్యములను తారతమ్య దృష్టితో ఈ ప్రకరణ మున చర్చించితిమి. శ్రీ హర్షుని నైషధీయ చరితము, శ్రీనాథుని శృంగార నైషధములను గురించిన ప్రత్యేక పరిశీలనము మూడవ ప్రకరణములో చర్చించుట జరిగినది.

# 3. భారత నలకథకు నైషధకథకు గల తారతమ్యము

వ్యాసవిరచితమైన మహాభారతారణ్య పర్వమున పూర్వోత్తర కథాంశములు కలిగిన నలోపాఖ్యాన మున్నది. నలోపాఖ్యానములోని పూర్వభాగమును మాత్రము గ్రహించి శ్రీహర్షుడు (12వ శతాబ్ది) 'నైషధీయచరితమ్'ను రచించినాడు. ఇది సంస్కృత పంచ మహా కావ్యములలో విశిష్టమైనది.

శ్రీ హర్షుడు భారత నలకథయందలి పూర్వ భాగమును మాత్రమే గ్రహించి కావ్యముగా రచించుటలోగల అంతర్యమును విమర్శకులు పలువిధములుగ భావించుచున్నారు.

శ్రీహర్షుడు వారణాసి రాజగు పృథ్వీ రాజాస్థాన కవి. శ్రీ హర్షుడు తన ప్రభువైన పృథ్వీరాజునకు అతనియల్లునికినికొంత స్నేహము

కుదుర్చునుద్దేశ్యముతో రాజు సుగుణములను దృష్టిలో పెట్టుకొని నైషధీయ చరితమును వ్రాసెను. నలుని యుత్కర్షను వర్ణించుటయే శ్రీహర్షుని ప్రధానాశయముగాని నలుని రాజ్యభ్రంశాదికములతో అతనికి పనిలేదు. అందువలన శ్రీహర్షుడు నలకథలోని ఉత్తరభాగము వదలినాడని వేదం వేంకటరాయశాస్త్రిగారి అభిప్రాయము. నలకథలోను పృథ్వీరాజ చరిత్రలోను పోలికలున్న కొన్ని సన్నివేశములనుకూడ వేదం వేంకటరాయశాస్త్రిగారు క్రింది విధముగా తెల్పినారు.

నలునివలె పృథ్వీరాజుకూడ తురగ నృత్యప్రియుడే. పృథ్వీరాజుకు 'నాట్యారంభ' అను గుర్రముండెడిది.

దేవతలిచ్చిన వరమువలన నలుడు అదృశ్యుడై దమయంతీ శుద్ధాంతమును ప్రవేశించును. పృథ్వీరాజు మారువేషమున వచ్చి పొంచి యుండి సంయుక్తను స్వయంవర కాలమున హరించిన విషయమునిది తలపునకు తెచ్చును. దమయంతీ స్వయంవర వర్ణన సంయుక్త స్వయంవర వర్ణనను బోలియున్నది.

వేదము వేంకటరాయశాస్త్రిగారి అభిప్రాయము ప్రకారము పృథ్వీరాజుకు నలునకు కొన్ని పోలికలుండవచ్చును. రాజాస్థాన కవియగుటచే శ్రీహర్షుడు పృథ్వీరాజు ఔన్నత్యము వర్ణించు నుద్దేశ్యముతో నలుని గుణగణములను వివరించే పూర్వకథాభాగమును మాత్రము రచించెననుటకు వీలులేదు.

నలదమయంతుల వివాహానంతరము సరస్వతీదేవి నలునకు ఆశీస్సులిచ్చు సందర్భమున శ్రీనాథుడు చెప్పిన క్రింది పద్యమును బట్టి శ్రీహర్షునిది కాశ్మీర భూమియని తెలిసికొనవచ్చును

సీ॥ "కలియుగంబున యందు గాశ్మీర భూమిలో
పవిత్రమున ధరామరుడు పుట్టు"
(శృం. నై. 6–25)

నైషధీయ చరితమ్ మొదటి అరువది సర్గలో లేక నూరు సర్గలో రచింపబడినదని శ్రీహర్షుడు తన గ్రంథమును పారవైవగా నాతని శిష్యులు పోయి మరల తెచ్చుకొనుసరికి అందు పూర్వభాగము మాత్రము మిగిలియుండి అనంతర కథ నష్టమై పోయినదనియు, అందువలన నలచరిత్ర సమగ్రముగా లభింపలేదని కొందరి అభిప్రాయము.

"నైషధీయ చరితమ్" అని తన కావ్యమునకు పేరుపెట్టిన శ్రీహర్షుడు నలుని చరిత్రయంతయు చెప్పక నలదమయంతుల వివాహమువరకే చెప్పి యూరకుండడు. అతడు సంయోగ శృంగారమును మాత్రమే కాక వియోగశృంగారమును కూడ చెప్పియే యుండునని కొందరు విమర్శకుల అభిప్రాయము. వివాహము వరకే చెప్పదలచినచో "నలపరిణయ" మనిగాని "దమయంతీ స్వయంవర" మనిగాని పేరుపెట్టి యుండును. నలదమయంతుల వివాహమైన తరువాత కలివచ్చి చింతించి ఈ దంపతులనెట్లయిన నెడబాపక మాననని ప్రతిజ్ఞచేసి నలుని యుద్యానవనమున నొక విభీతక వృక్షము నాశ్రయించి నలదమయంతుల నెడబాపుటకు రంధ్రాన్వేషణము చేయుచున్నట్లు శ్రీహర్షుడు చెప్పియున్నాడు. పూర్వకథాభాగమును మాత్రమే వ్రాయదలచినచో కలిని ప్రవేశపెట్టి యుండడని కనుక అతడు ఉత్తర కథాభాగమునుకూడ వ్రాసియుండునని వీరి అభిప్రాయము.

నైషధమని కావ్యమునకు పేరుపెట్టుటలో పూర్వోత్తర కథాంశములుకూడ వ్రాసియుండుననుటకు ఆధారములేవు. పైగా కావ్యము పేరు ననుసరించి కథాగతి నుండుననుటకు వీలులేదు. నైషధ

కావ్యమునందు నలదమయంతుల సంభోగ శృంగారము వివరింప బడినదిగదా! ఇట్టివారు జీవితాంతము సుఖసంతోషాదులతో నుండు రనుటకు వీలులేదు. మానవుడుగా జన్మించిన తర్వాత సుఖము, దుఃఖము ననుభవింపవలయును. ఇది లోకమెరిగిన సత్యము. నలదమయంతులుకూడ కష్టము లనుభవింపక తప్పదను సూచనతో శ్రీహర్షుడు పూర్వకథాభాగములో కలిని ప్రవేశపెట్టి యుండవచ్చును. నైషధ కావ్యము సమగ్రమైన కథాకావ్యముగ కన్పించుచున్నదేగాని శిథిలమైనదిగా కన్పించుటలేదు.

తన కావ్యనాయకుని లోకోత్తరునిగా, గుణోత్తరునిగా చిత్రింప దలచియే శ్రీహర్షుడు పూర్వకథాభాగమును గ్రహించి సంపూర్ణ కావ్యముగా రచించెనని పై పరిశీలనమునుబట్టి తెలియుచున్నది.

శ్రీహర్షుడు భారత నలకథనే గ్రహించి తన నైషధీయ చరితములో కొన్ని నూతనాంశములను కల్పించినాడు. నైషధీయ చరితమును శ్రీనాథుడు శృంగార నైషధమను పేర నాంధ్రీకరించినాడు. భారత కథలోను, నైషధ కథలోను శృంగార నైషధ కథలోను ఉన్న కొన్ని సామ్యవైషమ్యములను, తారతమ్య దృష్టితో పరిశీలింతము.

## 3.1 నలమహారాజు వర్ణనము:

నైషధమున నాయకుడగు నలుడు లోకోత్తరుడు, గుణోత్తరుడు, ధీరోదాత్తుడును, సాహిత్య దర్పణకారుడు ధీరోదాత్తుని లక్షణములను ఇట్లు వివరించి యున్నాడు.

"అవికత్థనః క్షమావానతి గమ్భీరో మహాసత్త్వః
స్థేయాన్ని గూఢమానో ధీరోదాత్తో దృఢవ్రతః కథితః"

(3-37)

ప్రబంధములకు మహాపురుష వర్ణనము బంగారునకు దావి యబ్బినట్లగునని దండి, భోజుడు ఇత్యాది అలంకారికులు తెల్పి యున్నారు.

"ఆది రాజయశోబింబమాదర్శం ప్రాప్యవాఙ్మయం
తేషామ సన్నిధానేపిన స్వయంపశ్య నశ్యతి"

(కావ్యాదర్శము 1–5)

"కవేరల్పాపి వాగ్వృత్తిర్విద్వత్కర్ణావతంసతి
నాయకోయది వర్ణ్యేతలోకోత్తర గుణోత్తరః"

(శృంగార ప్రకాశము 5–8)

వీనినిబట్టి శ్రీహర్షుడు తాను రచింపబూనిన నైషధీయ చరిత మను మహాప్రబంధమునకు లోకోత్తర గుణోత్తరుడగు నలుని నాయకునిగా చేసినాడు. ప్రబంధములలో అష్టాదశవర్ణనములకు ప్రాధాన్యమున్నది. ఈ అష్టాదశవర్ణనలలో నాయకవర్ణన కూడ ఒకటి.

"పుర, సింధు, నగ, ర్త్విన, శశి
సరసీ, వనమధు, రతి, ప్రసంగ, విరహముల్
పరిణయ, తనయోదయ, నయ
విరచన, యా, త్రాజి, దౌత్య, విభువర్ణనముల్"

అందువలన శ్రీహర్షుడు తాను వ్రాయబూనిన నైషధ మహా కావ్యమునకు నలుని నాయకునిగా చేసియుండును. అదియునుగాక నలుడు పుణ్యశ్లోకుడు.

"పుణ్యశ్లోకో నలోరాజా, పుణ్యశ్లోకో యుధిష్ఠిరః
పుణ్యశ్లోకాచవైదేహీ, పుణ్యశ్లోకో జనార్ధనః"

అని అమరము. ఈ పరమార్థమును గ్రహించి శ్రీ హర్షుడు నలుని తన కావ్యనాయకునిగా చేసికొని యుండును.

సామాన్యముగ మహాకావ్యములందు మొదట దేవతా నమస్కార రూపమంగళమును చెప్పి, పిమ్మట పట్టణాదులను వర్ణించుట పరిపాటి. కాని శ్రీహర్షుడు కావ్యారంభమునందలి మంగళమును నాయక విభూతి మంగళముగ మార్చి చెప్పినాడు.

శ్లో॥ నిపీయ । యస్యక్షితి రక్షిణః కథా
స్తథాద్రియ న్తేన బుధాస్సుధామపి
నలస్సితచ్ఛత్రిత కీర్తిమణ్డల
స్సరాశిరాసీన్మహసాం మహోజ్జ్వలం

(హర్ష నైషధము 1-1)

ఇది గ్రంథమునకు మొదటి శ్లోకము. ఇందు క్షితిరక్షణ, బుధ, సుధ, మహసాం, మహోజ్జ్వల ఇత్యాది శబ్దములచే నలస్మరణము విష్ణువుయొక్కయు, దేవతలయొక్కయు ప్రసాదముచే నమృతత్వము లభింపజేసి, కీర్తిప్రకాశములతో వర్ధిల్లచేయునని, వ్యాపనశీలమును, జ్ఞానస్వరూపమును, అమృతస్వరూపమును, తేజోమయమును నగు పరబ్రహ్మస్వరూపమును సాక్షాత్కరింపజేయుననియు నైహికాముష్మిక సుఖప్రాప్తి కలుగునని శ్రీహర్షుడు సూచించినాడు.

శ్రీహర్షుని నైషధీయ చరితమును శృంగార నైషధమను పేర ఆంధ్రీకరించిన శ్రీనాథుడు 26 పద్యగద్యములందు మిక్కుటముగ నలమహారాజు వర్ణన చేసినాడు. 'నిర్మల నిజకథానిమిష కల్లోలినీ క్షాళితాఖిల జగత్కల్మషుండు' దేవనది మూడులోకములను పవిత్రీకరించినట్లు,నలకథ మూడు లోకములందు వ్యాపించి పవిత్రీకరించినదని శ్రీనాథుడు శృంగార నైషధమున అభివర్ణించినాడు. నలుడు పదునాలుగు విద్యలను కూలంకషముగ చదివి, తాను చదివిన విద్యలను ఇతరులకు నేర్పించినాడు.

"తాద్రినేత్రుని యపరావతారమగుట
చెలుపు దిక్పాలకాంశావతీర్ణు డతడు"

(శృం. నై 1-49)

నలుడీశ్వరాంశ సంభూతుడని, దిక్పాలవంశావతీర్ణుడని శ్రీనాథుడు వర్ణించినాడు.

"అష్టాభిర్లోక పాలానాం మాత్రాభిర్నిర్మితోనృపః" అని స్మృతి వాక్యము. రాజు ఎనమండ్రుడు దిక్పాలుర యంశముచేత సృజింపబడును. శ్రీహర్షుడు కూడ నలుని పరమేశ్వరునిగానే కీర్తించియున్నాడు.

శ్లో॥ దధతో బహుశైవలక్ష్మతాంధృత రుద్రాక్షమధువ్రతం ఖగః
సనలస్యయయౌకరం పునః సరసఃకోక నదభ్ర మాదివ"

(2-6)

ఏకో దేవో సర్వభూతేషుగూఢః అణోరణీయాన్మహా మేవతద్య - ఏక యేవయతో లోకాన్ విసృజామి — పరిత్రాణాయ సాధునాం - ఇత్యాది సూక్తుల ననుసరించి ధర్మసంస్థాపన మొనర్చి లోకపాలనము చేయుటకు రాజుగా పుట్టినను నలుడు కామాది వికారములు వీడి దైవారాధనాదులచే జ్ఞానము సంపాదించిన వారికి సచ్చిదానంద సంధాయకుడగు పరమేశ్వర స్వరూపుడేయని పై శ్లోకములందు తెలుపబడినది. నలమహారాజు పరిపాలనలో ఈతిబాధలులేక ప్రజలు సుభిక్షముగ నుండిరని, కృతయుగమువలె ధర్మము నాలుగుపాదము లందుండినదని శృంగార నైషధమునందు తెలుపబడినది.

"ధరసే కాంఘ్రి కనిష్ఠి కాంగుళ మయాధారంబుగా నిల్చి ని
ర్భర లీలంగృతవేళనెట్టన యధర్మంబుం దపస్విత్వముం
బొర సెందక్కిన వారలెవ్వరుతపంబుల్ సేయరమ్మేదినీ
శ్వరు సామ్రాజ్యమునందు ధర్మముచతుష్పాదంబులంగ్రాలగన్"

(శృం. నై 1-55)

నలుని పరిపాలనలో ప్రతివాడు ధనవంతుడేగాని దరిద్రుడుగా లేడు. అర్థులకొరకు దారిద్ర్య విదారకమగు ద్రవిణవర్షము వర్షించుటలో నమోఘ మేఘవ్రతదీక్ష వహించి యర్థియని విన్నంతనే రోమాంచము వహించెడి మహాదాతగ నలుడు పేరుగాంచినాడు దీనిని బట్టి నలుడు ధర్మవేత్తగాను, మహా దాతగాను పేరుపొందెనని తెలియుచున్నది.

నలుని రూపగుణ విశేషములకు, పతివ్రతలు సహితము పరవశ భావము నొందిరని శృంగార నైషధమునందిట్లు తెలుప బడినది.

"వాని గలలోన గానని వనజముఖియు
వానిమార్వున బెర్కొని మానవతియు
వాని గానాత్మభావించి వరుని గవయ
నప్పళింపని నతియు లేదయ్యెనెచట్ట"

(శృం. నై. 1-62)

లోకములోని రాజకన్యలందరు నిరంతర నలధ్యాన పరవశలయి నలప్రతిబింబమునకు తమ ప్రతిబింబములకు తారతమ్యము చూచుకొని తాము సరిపోనందున సిగ్గుచెందిరి. దమయంతి మాత్రము తానతనికి తగుదునని సంతసించినది. (శృం. నై. 1-70) దీనినిబట్టి నలుడు మన్మధుని వంటి సుందరుడని, ఆ సుందరాకారమునకు స్త్రీలోకము పరవశమందినదని తెలియుచున్నది.

మహాభారత నలకథలో నలమహారాజు వర్ణన యింత విస్తృతముగ లేదు.

## 3.2 హంస దౌత్యము :

హంస దౌత్యము నలకథకు ఆముఖము వంటిది. అష్టాదశ వర్ణనలలో దౌత్యమొక అంశమగుటవలన శ్రీహర్షుడు తన నైషధ కావ్యమునందు హంస నలదౌత్యములను విస్తృతముగ వర్ణించినాడు. భారత నలకథలో హంస, నలదౌత్యములింత విస్తృతముగలేవు.

దమయంతీ గుణబద్ధుడై నలుడు పవన విహారమునకు వచ్చినపుడు ఆకాశమునందు సంచరించు హంసావళిని జూచి సంతసించినట్లు, ఆ హంసలు నేలపై వ్రాలగ నలుడొక హంసను పట్టుకొనినట్లు

మిగిలిన హంసలు ఆ హంసకొరకై ఆకాశమున తిరుగుచుండినట్లు, నన్నయ భారతమున వర్ణింపబడినది. దీనినిబట్టి హంసల సంఘీభావముకూడ వ్యక్తమగుచున్నది. నలుడుద్యానవనమున ఒక పెద్ద తటాకముచెంత ఒంటికాలుమీద నిద్రించు ఒక హంసను జూచినట్లు శృంగార నైషధమున కల్పింపబడినది. బ్రహ్మవాహనమైన హంసను దైవఘటన కనుకూలముగ నలుడు వంచించి పట్టుకొనినట్లు శృంగార నైషధమున తెలుపబడినది. భారతములో నెగచి యెగచి యందు నెగయకుండగ నొక హంసను పట్టుకొనినట్లు కలదు. నలుని చేజిక్కిన హంస ఎగిరిపోకుండుటకు అది నలదమయంతులకు సంగమ కారణదూతయయిన కలహంస యగుటయే అని భారతమున చిత్రింపబడినది. శృంగార నైషధమునందుకూడ బ్రహ్మసంకల్పము వలననే హంస నలునకు చిక్కినట్లు తెలుపబడినది.

నలునిచే పట్టుబడిన హంప తన్ను విడువమని ఇట్లు ప్రార్థేయపడినది.

"ఎఱుగనె నీవు ప్రాంతమున నింతట నంతటనున్కి యింతయే
మరుదునె। నిన్ను విశ్వజన మాన్యుడ వంచును విశ్వసించియు
త్తరి సుఖనిద్రబొందితి వృధామతి నెట్టనయాత్మ నమ్మినం
జెరుపదలంతురే ఘనులు జిత్తమునన్ బగవారినేనియున్"

(శృం. నై. 1-106)

శ్రీహర్షుని హంస—

"నకేవలం ప్రాణివధోవధోమమ
త్వదీక్షణా ద్విశ్వసితాంతరాత్మనః
విగర్హితం ధర్మధనై ర్నిబర్హణం
విశిష్యవిశ్వాసజుషాంద్విషామపి"

(హర్ష నైషధము 1-131)

తనను చంపుట ఒక ప్రాణిని వధించుట క్రిందికి మాత్రమే రాదు. అదియొక విశ్వాస ఘాతుకత్వము క్రిందికి కూడ రాగలదు. విశ్వసించినవాడు శత్రువైనను వానిని హింసించుట తగనిపని యని ధర్మవేత్తలు భావింతురని శ్రీహర్షుని హంస నలుని నిందించినది. పైగా శ్రీహర్షుని హంసమాటలలో నొకరకమైన పెంకెతనమున్నది. శ్రీనాథుని హంసకు సాత్వికతయున్నది. ఎట్లయినను నలుని యను కూలవంతునిగ చేసికొనుటకు మెత్తగ వ్యవహరించుట యుచితమని భావించినది. మనిషి చేతికి దొరికిన హంసకు పెంకెతన ముండుట సహజము. శ్రీనాథుని హంసకొంత పెంకెతనముజూపి తరువాత సాత్వికత ప్రదర్శించినది. పూర్తిగ పెంకెతనము చూపలేదు. అట్లు చూపినచో ఆ హంస సామాన్య హంసగ గోచరించును. శ్రీనాథుని హంస సామాన్యమైనది కాదు. అది బ్రహ్మ వాహనకుల సంజాత. నలదమయంతులకు సంగమ కారణదూత. అందువలన నలుడు ద్యానవనమునకు వచ్చియుండుట తెలిసి నిద్రించినది. అందుచేత పెంకెతనము చూపక సాత్వికతను ప్రదర్శించినది. భారత నలకథలో హంస శ్రీహర్షుని హంసవలె పెంకెతనమునె జూపినది.

శృంగార నైషధమున నలునికి చేజిక్కిన హంస తన కుటుంబ సభ్యుల దయనీయ పరిస్థితిని అతనికి వివరించి, కరుణ చూడుమని యిట్లు వేడుకొనినది.

సీ॥ "తల్లి మదేక పుత్త్రిక, పెద్ద, కన్నులో
గానవిప్పుడు, మూడుకాళ్ళముసలి
యిల్లాలు గడుసాధ్వి, యేమియు నెరుగదు,
పరప పాతివ్రత్య దివ్యచరిత
వెనుక ముందర లేరు నెవ్వరైన చుట్టాలు,
లేవడి యెంతేని జీవనంబు
గానక కన్న సంతానంబు శిశువులు
జీవన స్థితి కేనతావలంబు

తే॥ కృపదలంప గదయ్యయోనృపవరేణ్య
యభయమీయవయ్య యోతుహినాంశువంశ
కావ గదయ్య యర్థార్థి కల్పశాఖి,
నిగ్రహింపకువయ్యయోనిషధ రాజ

(శృం. నై. 1–109)

నలుని చేజిక్కిన హంస మగది. ఆడువారికంటె మగవారికి కుటుంబ పోషణాభార మధికముగ నుండును. ఈ విషయమును దృష్టిలో పెట్టుకొని శ్రీహర్షుడు మగ హంసను కల్పించినాడు. కరుణ రసస్ఫోరకములైన హంస మాటలు విని మనసుకరిగి నలుడు దానిని విడిచిపెట్టెను. అది సరోవరమునకు పోయి స్నానమాచరించి కృతజ్ఞతాసూచకముగ దమయంతీ వృత్తాంతము నలునకు తెలిపినది. నలునిచేజిక్కిన హంస ఉక్కిరి బిక్కిరయి తప్పించుకొనుటకు మార్గము కానరాక దమయంతీ వృత్తాంతము చెప్పినట్లు భారత నలకథలో గలదు. హంస తన కుటుంబములోని వారిని గూర్చి దుఃఖించినట్లు భారతములో లేదు. ఇది నైషధకర్త కల్పనయే. భారత కథలో హృదయేశ్వరియైన దమయంతి మాట వినగానే నలుడు హంసను వదలిపెట్టెను. భారతములో నలుడు స్వలాభాపేక్షకుడుగ కనిపించును. నైషధములో నలుడు లోకోత్తముడుగ మనముందు సాక్షాత్కరించును.

శృంగారనైషధమున హంస నలునికి దమయంతి దివ్య సౌందర్యమును తెలిపి, అతనికి దమయంతిపట్ల గాఢానురాగమును కలిగించుటకు ప్రయత్నించినది. దమయంతితో సఖ్యములేని నలుని సౌందర్యము నిజముగ నిష్ఫలమని హంస అతనితో నిట్లనినది–

"సౌరభములేని యట్టి పుష్పంబు వోలె,
గండు గోయిల వెలియైన కానవోలె,

నధిపదమయంతితోడి సఖ్యంబులేని
నీదు సౌందర్యవిభవంబు నిష్ఫలంబు"

(శృం. నై. 2-24)

భారత నలకథలో నల, హంసల సంభాషణము నింత విస్తృతముగలేదు. కాని "నీ హృదయేశ్వరియైన దమయంతి పాలికింజని నీ గుణంబులు వివరించి యక్కన్య నన్యుల నపేక్షింపక నీయందు బద్ధానురాగయగునట్లు చేసెద" (అరణ్య 2-14)నని హంస నలునితో అన్నట్లు సంక్షిప్తముగ నున్నది.

నలుని హస్తమునుండి విడివడిన హంస విదర్భాపురము చేరినట్లు భారతములో నుండగా, కుండినపురమార్గమునననుసరించినదని శృంగారనైషధమున చెప్పబడినది. కుండినుడనగ ఈశ్వరుడు. విదర్భను కుండినపురమని మార్చుటలో నైషధకర్తకుగల ఈశ్వరతత్త్వము గమనింపవచ్చును. దైవసంకల్పితమైన నలదమయంతుల వివాహము హంస వలన జరుగవలసియున్నది, కావున దైవఘటనచే దమయంతి హంసను పట్టుకొనుటకు సంకల్పించినది.

శృంగారనైషధమునందు హంస దమయంతికి తనపై గట్టి నమ్మకము కల్గించుటకు తన వృత్తాంతము నిట్లు వివరించినది.

సీ॥ నలిన సంభవుసాహిణము వారువంబులు
కులముసాములు మాకు గువలయాక్షి
చదలేటి బంగారు జలరుహంబుల తూండ్లు
భోజనంబులుమాకు బువ్వు బోణి,

సత్యలోకముదాక సకలలోకంబులు
నాటపట్టులు మాకు నబ్జవదన
మధురాక్షరములైన మామాటలు వినంగ
నమృతాంధసులె యోగ్యులనుపమాంగి;

తే॥ భారతీదేవిముంజేతి పలుక జిలుక
సమదగజయాన సబ్రహ్మచారిమాకు
వేదశాస్త్రపురాణాది విద్యలెల్ల,
ధరణి నీయానఘంటాపథంబు మాకు"

(శృం. నై. 2-49)

ఈ తేటగీతి పద్యములోని భావమును శ్రీనాథుడు కల్పించినాడు. ఇది హర్ష నైషధములో లేదు. సరస్వతీదేవి హస్తమందలి చిలుక తనకు సహపాఠచారియని, వేద, శాస్త్ర, పురాణాది విద్యలను నేర్చితినని హంస దమయంతికి చెప్పినది. తనను సామాన్యమైన హంసగా భావింపవలదని చెప్పిన ఈ విషయము భారతములో లేదు.

భూలోకమునందు కొందరు రాజబృందారకులు కలరని, వారితో చెలికారము వాటించియుందునని విశేషించి నిషధదేశాధీశ్వరుడైన నలుడను రాజుమీద పక్షపాతము కలిగియుందునని హంస తన వృత్తాంతమును దమయంతికి తెల్పినది ఇచ్చట హంస రాజకీయ నైపుణ్యమును ప్రదర్శించినది. దమయంతికి నలునిపై గాఢానురాగ మేర్పడుటకు హంస ప్రయత్నించినది. దాని కనుగుణముగ నలమహారాజు గుణములు ప్రశంసించుచు రంభాద్యప్సరసలు నలుని సౌందర్యమును విని ముగ్ధులై నలుని పొందలేక నలనామధేయముగల నలకూబరునిపొంది తృప్తిపడిరని తెలిపినది. సాధారణముగ స్త్రీ ఒక పురుషుని ప్రేమించుచున్నపుడు అతనినే మరికొందరు స్త్రీలు కూడ ప్రేమించుచున్నారని తెలిసినచో ఆమెకు అతనిపై ప్రేమ అధికమగుట సహజము. ఈ విషయము భారతములో లేదు.

దమయంతికి నలుడు ప్రాణేశ్వరుడని చెప్పుటయేగాక నలదమయంతుల వివాహము బ్రహ్మసంకల్పమని హంస దమయంతితో ఇట్లు వివరించినది.

"అడిగితి నొక్కనాడు కమలాసనుతేరికి వారువంబనై
నడచుచు నుర్విలో నిషధనాధుని కెవ్వతె యొక్కొ భార్యయ
య్యెడుః నని చక్రఘోషమున నించుక యించుకగాని, యంతయే
ర్పడ వినవైతి నీవనుచు బల్కిన చందము దోచె మానినీ"
(శృం. నై. 2–58)

బ్రహ్మకు వాహనమై నడచుచున్నపుడు నలునికెవ్వరు భార్య యగుదురని, తాను బ్రహ్మను ప్రశ్నించినట్లు, చక్రఘోషమున బ్రహ్మపలుకులు సరిగా వినిపించలేదు కాని దమయంతినే పేర్కొన్నట్లు తోచుచున్నదని హంస దమయంతికి చెప్పినది. ఇచ్చటకూడ హంస రాజకీయపు ఎత్తుగడ వేసినది. నలదమయంతుల వివాహము జరుగనున్నట్లు బ్రహ్మ తనతో చెప్పినాడని నేరుగా దమయంతితో అన్నచో ఆమెకు ఆ విషయముపై అభిరుచి తగ్గవచ్చును. బ్రహ్మ సంకల్పము కావున తమ వివాహము తప్పదను దృఢ విశ్వాసము దమయంతికి కలుగవచ్చును. దీనివలన దమయంతి యభిప్రాయము గ్రహించుట హంసకు కష్టమగును. ఇంతవరకు హంస దమయంతి యభిప్రాయమును గ్రహింపలేదు. దమయంతి యభిమతము తెలిసికొనుటకు నలుని గుణములు, వారి వివాహము గూర్చి చెప్పినది. దీనివలన దమయంతి తన మాటలను నమ్మినచో తన కార్యము నెరవేరును. లేనిచో మరొక పద్ధతి నవలంభింపవలసి యుండును. హంస వాక్చాతుర్యమునకిది యొక చక్కని నిదర్శనము. బ్రహ్మ సంకల్పమైన నల దమయంతుల వివాహ విషయము భారతములో లేదు. ఇది నైషధకర్త కల్పనయే.

హంస పన్నిన వలలో దమయంతి దగుల్కొనినది. నలుని భర్తగ చేయమని దమయంతి హంసను ప్రార్థించినది. హంసకు తన యందు నమ్మకము కలుగుటకు దమయంతి దానితో దృఢముగా నిట్లు పలికినది

తే॥ తండ్రి నిషధాధిపతి కీకతక్కి_యొరున
కీ దలంచెనయే, విహగేంద్ర, వినుము,
దేహమనలంబునకు నాహుతిగ నొనర్చి,
యతని బొందగ గందు జన్మాంతరమున"

(శృం. నై. 2–73)

కార్యాసక్తుడయిన వ్యక్తి ఎదుట వారి యభిప్రాయము గుర్తించుటకు ప్రయత్నించునుగాని తన భావమును ఎదుటివారికి చెప్పడు. హంస దమయంతి యభిప్రాయము గుర్తించుటకు వేచియుండెను. నలుడంతఃపురమునందున్నపుడు తన ప్రసంగము చెప్పరాదని, ఎందువలననగ అంతఃపురమందు స్త్రీల ముఖదాక్షిణ్యమందున్న వ్యక్తికి పరస్త్రీలు ఎంతటి రూపలావణ్యవంతులయినను వారిమాట రుచింపదని, అధిక రోషకషాయిత స్వాంతుడైన నలునకు తన విషయము చెప్పరాదని, ఏలన అధికమైన రోషమున్నపుడు మనిషి తన వ్యక్తిత్వమును కోల్పోవునని దమయంతి హంసకు కార్యనిర్వహణాది విషయమునను సూచించినది. ఈ విషయములు నైషధకర్త కల్పించినవే. భారతమునందీ విషయములు లేవు.

దమయంతి పలికిన ప్రౌఢవాక్యములవలన, ఆమె కేవలము మన్మథాజ్ఞలో నున్నదిగాని పిత్రాజ్ఞలోగూడ లేదని, తన మనస్సును నలునకర్పించినదని హంస తెలిసికొని నలుని ప్రేమను ఆమెకు వివరించినది. హంస తొలుత దమయంతీ ప్రలోభనార్థము నలుని గుణములు మాత్రమే వివరించినది. ఆమె నలునియందు బద్ధానురాగయని తెలిసి నలుని యభిప్రాయము తెలిపినది. ఇది నలరాయబారమునందు హంసకుగల నైపుణ్యమును తెలుపుచున్నది.

దమయంతి సందేశమును హంస నలునకు వినిపించి, సత్యలోకమున కేగినట్లు శ్రీనాథుడీ గద్యము వ్రాసెను. "ఇవ్విధంబున

నానందరసమగ్నుండైన యన్నరేంద్రుఁగనుంగొని విహంగ పుంగవుండు" కార్యంబు సంఘటితంబయ్యెనింక నాకుంబంక జాసనున కుంబరిచర్యసేయంబోవలయు"నని యతనిచేత సముచిత ప్రకారంబున వీడుకోలు వడసి, బ్రహ్మలోకంబునకుం జనియె (శృ.నై. 2-106). ఈవిషయము హర్షనైషధములోలేదు. శ్రీహర్షుని హంస నలుని వీడ్కొని యెక్కడికి వెళ్ళినదో తెలియదు అది ఒక సామాన్య హంసగ మనకు గోచరించును. కాని శ్రీనాథుని హంస అటువంటిదికాదు. బ్రహ్మకు సేవచేయవలయునని యిప్పటికే ఆలస్యమైనదని సత్యలోకమునకు వెళ్ళినది. హంస సామాన్యమైన హంస కాదని, సత్యలోకనివాసియని, బ్రహ్మకు వాహనమైనదని తెలుపుటకై శ్రీనాథుడీమార్పును కల్పించెను. ఈ విషయము హర్షనైషధమున గాని, భారతనలకథలోగాని లేదు.

దమయంతి నలునిపై ప్రేమ వహించి విరహావస్థను పొందినది. ప్రబంధోచితముగ నైషధమునందు దమయంతి విరహసందర్భమున చంద్రోపాలంభనము, మదనోపాలంభనములు కల్పింపబడినవి. చెలులు దమయంతికి శిశిరోపచారములు చేసిరి. ఒక కోమలి పన్నీటిని చల్లినది. మరొక వనిత విరహతాపము చల్లారుటకు విసనకర్రను వీచినది. మరొకతె చక్కని గంధములు తెచ్చి దేహమునందు పూసినది. మరొక వనిత చల్లని నీటితో స్నానము చేయించినది. భారత కథలో దమయంతి విరహ వర్ణన ఉన్నదిగాని చెలులు చేసిన శిశిరోపచారములు లేవు. రాజమర్యాదలు, రాజాంతఃపురమునందలి విషయములు గుర్తెరిగిన నైషధకర్త చెలుల శిశిరోపచారములను ప్రబంధోచితముగ కల్పించియుండవచ్చును.

దమయంతి విరహమును చెలికత్తెలు భీమునకు తెలుపగా "ఇదియేమి కోలాహలంబని భీమభూపాలుండు దేవీసహితుండై

యడుగ దద్వయస్యాజనంబులు దామెఱింగినతెఱంగెల్లను విన్నవింప నన్నరనాథుండు ముద్దుకూతురుమనోభిలాషంబునకు ననుకూలంబుగాజగంబునందెల్ల స్వయంవరంబ జాటింపగన్"అని శ్రీనాథుడు వర్ణించెను (2–112). హర్షనైషధములో దమయంతి విరహనివారణకు భీమరాజు అధికారులైన మంత్రులను తీసికొని యంతఃపురమునకు వచ్చినట్లున్నది. (4స–116) ఆడపడచులకు సంబంధించిన వ్యవహారములందు తండ్రికంటె తల్లికి ప్రాధాన్యమెక్కువ. అటువంటి తల్లి వచ్చినట్లు హర్షనైషధములో లేదు. మంత్రులను వైద్యులను పిలిచికొని భీముడు వచ్చుటలో ఔచిత్యములేదు.దమయంతికి వచ్చినజబ్బు దేహమునకు సంబంధించినది కాదు. మనసునకు సంబంధించినది. మనసునకు సంబంధించిన జబ్బును వైద్యులు బాగుచేయలేరు. ఆడపిల్లల మనోభావము తల్లికి తెలియును. అందువలన తల్లివచ్చి దమయంతి వ్యథను మానుపుటకు ప్రయత్నించినట్లు శ్రీనాథుడు మూలభావమునుమార్చెను.

దమయంతి విరహావస్థను చెలులద్వారా తెలిసికొని భీముడు స్వయంవరము చాటించెను. దమయంతీ స్వయంవరవార్తను నారద పర్వతులింద్రునికి వినిపించిరి. ఈ విషయము భారతమునందును గలదు. నారదుని ప్రబోధముచే ఇంద్రునికి దమయంతిపై మరులు జనించినవి. ఇంద్రుని భూలోక ప్రయాణమునకు ఈర్ష్యచెందిన అప్సరసల విషయమును శ్రీనాథుడు ఇట్లు వివరించినాడు.

సీ॥ "రంభ విస్రంభసంరంభంబు దిగనాడె
మానరోషముమానె మంజు ఘోష,
దశకొత్తె పది ది లోత్త మకునుత్త లపాటు,
ప్రమ్లోచ ప్రమ్లానభావమొందె,
నుర్వశిసౌభాగ్యగర్వంబు వోరివోయె

హరిణి సంతాపాగ్ని కరణియయ్యె.
వంత బానుపు మీద పై చెమేనుఘృతాచి
మేనక సమ్మానమూనమయ్యె.

తే॥ నచ్చరలు దక్కఁ గలవారలలసిసొలసి
ప్రాణముక్తియ యుక్తిగాననుమతించి
రాత్మవల్లభు డింద్రు డయ్యవనినాథ
తనయ వరియింపధరకు బోదలచు "బెటిగి"

(శృం.నై. 3-36)

ఆత్మవల్లభుడు అన్యకాంతాసక్తుడైనాడని విన్నచో ఎట్టి సాధ్వీల లామకు కూడ ఈర్ష్య జనింపక తప్పదు. సాధారణముగ ఈయీర్ష్య సవతుల మధ్యకనిపించును. ఈసందర్భమున శ్రీకృష్ణుడు రుక్మిణికి పారిజాతపుష్పమిచ్చెనని తెలిసి సత్యభామ చెలికత్తెతో అన్నమాటలు గమనింపదగినది.

కం॥ ధనమిచ్చిపుచ్చుకొన్నను
మనమున నోర్వంగవచ్చు మగ డింతులకున్
జనవిచ్చిపుచ్చుకొన్నను
మనవచ్చునెయింక నేటిమాటలు "సెపుమా"

ధనిమిచ్చి పుచ్చుకొన్నను సవతుల మధ్య ఈర్ష్య ఏర్పడక పోవచ్చునేమోగాని మనసిచ్చినట్లు తెలిసినపుడు ఈర్ష్యకలుగుట సహజము. దమయంతి మీద మనసుకలిగి యింద్రుడు భూలోకము నకు పోవునపుడు రంభాద్యప్సరసలకు కూడ ఈర్ష్య కలుగుట సహజము. స్త్రీల మాత్సర్యమును దృష్టిలో పెట్టుకొని దీనిని శ్రీహర్షుడు కల్పించియుండును. ఈవిషయము భారతనలకథలో లేదు.

## 3.3. నలదౌత్యము:

నలకథలో నలదౌత్యము ఇంద్రాగ్ని యమ, వరుణులు నలుని దమయంతి యంతఃపురమునకు పంపుటతో ప్రారంభమగును. శృంగారనైషధమునందు ఇంద్రుడు ప్రసాదించిన తిరస్కరణీ విద్యా ప్రభావమువలన నలుడు వెళ్ళినాడు.

ఐం హ్రీం శ్రీం ఐం–క్లీం సౌః ఓం నమో భగవతీ తిరస్కరిణీ మహామాయే, మహానిద్రే, సకలపశు జనమనశ్చక్షుశ్శ్రోత్రతిరస్కరణం కురుకురుస్వాహసౌః క్లీం ఐం శ్రీం హ్రీం ఐం–శ్రీ తిరస్కరిణ్యాం బాశ్రీః ఇది తిరస్కరణీమంత్రము. ఇంద్రాగ్నియమ వరుణులను నల్వురిని మాత్రమే కథకు తీసికొనుటకు తిరస్కరణీ మంత్రమునకు సంబంధమున్నదని శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారిట్లు భావించిరి. వారి భావనకు ఆధారమిది–

> "శ్రుతిప్రతిభటీకృత్యాన్వితాఖ్యాపదాం, శుభ్రాద్వయావేశనాత్
> ద్రవ్యాణాం. శితిపీతరోహితహరిన్నామాన్వయమ్"

ఇంద్రాగ్ని యమవరుణులకు శ్లోకమందలి శితి, పీత, రోహిత హరిద్వర్ణములకు సంబంధమున్నది. భారతనలకథలో అదృశ్యవిద్యా ప్రభావమువలన నలుడు దమయంతి యంతఃపురము ప్రవేశించి నట్లున్నది.

నలుడు దమయంతి యంతఃపురము ప్రవేశించినపుడు స్త్రీల వివిధ శృంగార చేష్టలను శ్రీనాథుడు ఇట్లు వర్ణించినాడు.

> "ప్రిదిలిన నీవి గేలసవరించుతరోదరి నోర్తు గాంచి, లో
> గదిరిన పాపభీతిబడి గన్నులు మోడ్చ, నొకళ్లొకళ్లకై
> యెదురుగ వచ్చివచ్చి యొకయిద్దరు ముద్దియలొత్తిరవ్విభున్
> మదగజరాజకుంభముల మచ్చరికించుకుచద్వయంబులన్"

(శృ. నై. 3–86)

వదలినపోక ముడిని బిగించుకొనుచున్న యౌవనవతిని జూచి నలుడు పాపభీతిచే మరలి మరొకవైపు జూచెను. ఇంతలో ఇద్దరు స్త్రీలు రెండువైపులనుండి వచ్చి రాజును ఢీకొనిరి. తత్ఫలితముగ వారు చకితలయిరి. ఇట నలుడు దృశ్యుడు. స్త్రీలు అదృశ్యలు. అంతః పుర స్త్రీలు నలునిజూడలేదు. కాని నలుడు మాత్రము వారిని చూచు చుండెను. పరిహాసముగ ఇద్దరు పడతులు ఒండొరులు మోహరించి బంతులతో కొట్టుకొనసాగిరి. అందొక బంతి రాజునకు తగిలి మిట్టి పడి మరలినది. రాజు కనిపించనందున దేనికిని తగులకయే మిట్టి పడి మరలినదని తలచి అచటి స్త్రీలందరు ఆశ్చర్యపడినట్లు శృంగార నైషధమునందు గలదు. ఈ విషయములు భారతమునందు లేవు.

నలుడు చూచుచుండగ వేడుకకై ఒకతె నలవేషముదాల్చి నలునివలె వ్యవహరించుచుండగ, ఇంకొకతె దమయంతివేషము దాల్చి నలవేషధారిణిమెడలో స్వయంవర మాలను వైచినది. ఇందు వలన దమయంతి నలునినే వరింపదలచికొన్నదనియు, అందులకు కాలవిలంబము, నోర్వకున్నదనియు నలునకు తెలిసెను. నలదమ యంతులు పరస్పరాలింగనము చేసికొనియు ఆయాలింగనసత్యత్వము నెఱుగకయే యుండిరి. ఇంద్రదూతికలు దమయంతి యంతఃపురము ప్రవేశించి మహేంద్రుని గుణములు వివరించి, అతని వివాహమాడు మని ప్రాధేయపడిరి. అందులకు దమయంతి దేవేంద్రుడన్నచో పూజ్య భావమే గాని నామనసు నలునకర్పించితిననెను. ఆ వృత్తాంతము విని నలుడు దమయంతి దృఢనిశ్చయమునకు సంతోషించినాడు. దమయంతి నలునిపై ప్రేమ నిలిపినదని నలునకు తెలుపగోరి నైషధకర్త ఇంద్రదూతికల ప్రవేశపెట్టియుండవచ్చును. హర్షనైషధ ములో దిక్పాలురు తమ దూతికలను వేర్వేరుగ దమయంతి కడకు, భీమరాజువద్దకు కానుకలతో పంపినట్లున్నది. శృంగారనైషధములో దమయంతికడకు మాత్రము దూతికలు వచ్చినట్లున్నది. వేర్వేరుగ

దూతికలను పంపుటలో శ్రీహర్షుని యభిప్రాయమిట్లుండును. రహస్యముగ బాలిక యొక్క దానితోడనే వ్యవహారము నడుపుట యంత పెద్ద మనిషి తరహాగా తోపకుండుట యొకటి. దేవేంద్రుడంతటివాడు తన కుమార్తెను కోరుచున్నాడనెడి ఘనభావమాతండ్రికి కలుగుట సహజము. ఆ ఘనభావము వలన తన కుమార్తెను ఇంద్రాదుల వైపుకు మరలింపవచ్చును. ఆ రకముగ తమ కనుకూలముచేకూరగలదన్న యాలోచన దేవతలకుండును. ఇంద్రదూతికల ప్రశంస భారతకథలో లేదు.

నైషధములో నలుడు దమయంతీ సౌందర్యమును తిలకించిన విషయము 62 పద్యములలో విస్తృతముగ నున్నది. భారతములో దమయంతీసౌందర్య వర్ణన లేదుగాని నలుడు దమయంతీ యంతఃపురము ప్రవేశించినపుడు నలుని హృదయేశునిగా భావించుకొని చెలికత్తెలతో దమయంతి యుండినట్లున్నది. నైషధము మహాకావ్యమగుటవలన కావ్యదృష్టితో నాయికా సౌందర్యవర్ణన కల్పింపబడి యుండవచ్చును.

దమయంతి నలునకు హేమరత్నసింహాసనము చూపి కూర్చుండుమనినది. దమయంతి నలునకు చేసిన మర్యాద సంస్కృతాంధ్రములందు పెద్ద వ్యత్యాసమున్నది. "అనఘా! యిదిగో రత్నసింహాసనము. తమకిష్టమున్నచో వచ్చి కూర్చుండుడు. అట్లుకాక మరియొక చోటికి పనిమీదపోదలచితివేమో" (4-6) అని దమయంతి నలునితో అనినట్లు శృంగారనైషధమునందున్నది. హర్షనైషధములో "తాను కూర్చుండిన యాసనము అతని దర్శనమైనపుడే అర్పింపబడినది. ఈ యాసనము కొనియాడదగినంతటిది కాకపోవచ్చును. క్షణకాలమైనను సింహాసనమధిష్ఠింపుము" (8 స-3) అని దమయంతి

నలునకు గద్దె చూపినది. శృంగారనైషధపద్యభావమును బట్టి దమ యంతి నలుని గౌరవించెడి రీతి భ్రంశమైనది. కూర్చుండుము లేనిచో పోవచ్చునను వ్యంగ్యపు మాటలు దమయంతి పలికినది. దీనినిబట్టి దమయంతికి అతిథిమర్యాదక్రమము తెలియనట్లున్నది. ఆ వచ్చినవాడు నలుడని సూచనగ దమయంతికి నింతకుముందే తెలిసియున్నది. అటువంటి అతిథిని మర్యాదగ చూడక అమర్యాదగ తనకిష్టమున్నచో కూర్చుండుము, లేనిచో వెళ్ళిపొమ్మనుట సమంజ సముకాదు మూలభావమును శ్రీనాథుడెందులకు మార్చినాడో తెలియ కున్నది. "అయితే శ్రీహర్షుని దమయంతీ పాత్రచిత్రణకు శ్రీనాథుని పాత్ర చిత్రణకు నెంతో వ్యత్యాసమున్నది. శ్రీహర్షుని చిత్రణమున దమయంతి సామాన్య. శ్రీనాథుని చిత్రణమున దమయంతి ధీరో దాత్త-ధీరోదాత్త గావున ఆ వచ్చినవాడు నలుడు కావచ్చును. మరొకడు కావచ్చును. ఆమె ధీరత్వముతో రాజఠీవిని ప్రదర్శించినదనుకొన వచ్చును. హర్షనైషధములో దూతగా వచ్చిన నలుని జూచి యింత అందమైనవానిని రాయబారిగా పంపిన దేవతలకు తెలివితేదని మన సులో తలపోసినది (9 స-22). సుందరమైన పురుషునిగాని, స్త్రీని గాని దూతకార్యమునకు నియోగింపరాదని భరతుడు తన నాట్యశాస్త్ర మునందిట్లు తెల్పినాడు.

> "నజడమ్ రూప సంపన్నం నార్థవంతంన చాతురమ్
> దూతం వాప్యథనా దూతీం బుధః కుర్యాత్కదాచన"
>
> (23-1½,13)

ఈ విషయమును శ్రీనాథుడు పరిహరించినాడు.

శృంగారనైషధములో సింహాసనాధిష్ఠుడయిన నలుడు దిక్ప తుల ఆస్థానమునుండి దూతకారణముగ వచ్చి దమయంతితో సంభా షించిన విషయము 50 పద్యములందు సుదీర్ఘముగ వర్ణింపబడినది

ఈ విషయము భారతనలకథలో ఇంత విపులముగ లేదు భారతము లో నలుడు దిక్పతులనుండి దమయంతీ యంతఃపురము ప్రవేశించి తాను దేవదూతనని, నలుడనుపేరు గలవాడనని చెప్పుకొని తనదూత కార్యము నెరవేర్చుటకు ప్రయత్నించెను. కాని శృంగారనైషధములో నలుడు తనపేరు మొదట చెప్పుకొనడు, దమయంతి తనను వివాహ మాడదలచినదని తెలిసి నలుడు తనపేరు చెప్పుకొనుటలో ఔచిత్యము లేదు. తాను కోరుకొను పురుషుడు తనచెంత నున్నపుడు దమయంతి పరపురుషులను కోరుకొనక పోవచ్చును. దీనివలన భారతనలకథలో నలదూత్యమునకు ప్రయోజనములేదు. నైషధములో నలుడు తన పేరు చెప్పకుండుటయను నొక యంశముపైననే ఈ దౌత్యమంతయు నాధారపడియున్నది. పేరుచెప్పకుండుట దమయంతిని వంచించు టకు కాదు. పేరు చెప్పినచో నిరంతర నలధ్యానపరవశురాలైన దమయంతి దేవతలను నిరాకరింపవచ్చునను ఊహ నలునకున్నది. తన కార్యము విఘ్నమగునని తలచి నలుడు పేరు చెప్పకయే దౌత్య ముచేయనారంభించెను. ఇది నలుని ఉదాత్తగుణమునకు ప్రబల నిదర్శనము. నైషధకర్త తమ కావ్యనాయకుని లోకోత్తర గుణోత్తర నాయకునిగా చిత్రించుటకు ఈ మార్పును కల్పించెను.

నలుడు ఇంద్రాదుల మహిమలను దమయంతికి వివరించి, వారిని వివాహమాడుమని ప్రాధేయపడెను. దమయంతి నలునితో నిట్లన్నది.

తే॥ "అధికతరులైన గాని దిశాధిపతులు
కౌతుకము నాకు నీవంశకథలయందె
దప్పిగొన్నట్టి వారికాదప్పి దీఱ
సలిలపూరంబు హితవౌయాజ్యంబుహితవొ"

(శృం. నై. 4–52)

నేయి యుత్కృష్టమే అయిననుదప్పికొన్నవారికి మంచినీళ్లే చేత దప్పిక తీరునుగాని నేతిచేత తీరదని దమయంతి చెప్పినది. మంచినీళ్లచేత దప్పిక తీరుట సహజము. నేయి నీళ్లకంటె అధిక మైన పదార్థమే కావచ్చును. నేతిచేత నీళ్లదప్పిక తీరదు.తీరకపోగా దప్పిక అధికమగును. ఇది శాస్త్రీయ విజ్ఞానముకూడ. తాను మానవ స్త్రీనని, ఇంద్రాదులగు దేవతలతో సఖ్యము కుదురుట దాహము కొరకు నీళ్లకు బదులు నేతిని పుచ్చుకొనుట వంటిదని దమయంతి నలునితో చెప్పినట్లు నైషధమందున్నది. హర్షనైషధములో "దప్పి గొన్నవారికి యుదక పానముచేత మాత్రమే శాంతికలుగును.అంతియే గాని యధిక పదార్థములైన పాలుగాని, తేనెగాని త్రాగినచో నాదప్పి శాంతింపనేరదని" (9—5) దమయంతి నలునకు చెప్పినట్లున్నది. ఈ సన్నివేశమున శ్రీనాథుడు మూలభావమునకు మెరుగుదిద్దెను. మాతృకలోని పాలు, తేనెలకు బదులు దప్పిగొన్నవారికి నేయి త్రాగినచో దప్పి తీరదని శ్రీనాథుడు మార్చి వ్రాసెను. భారతకథయందీ విషయము లేదు.

దమయంతి నలుని పొందలేని స్థితియందు రజ్జు విషాగ్నిజల ములందు ప్రాణత్యాగము చేసికొందునని చెప్పినట్లు భారత,శృంగార నైషధములందును గలదు. కాని భారతములోలేని మరొక మార్పును నైషధకర్త కల్పించెను.

సీ॥ రజ్జువల్లరి మీద బ్రణయంబుగలదేని
యంతరిక్షంబేలు హరివరించు
నగ్నికాహుతిగా గ నాత్మ గోరెదవేని
జాతవేదునియదృష్టముఫలించు
సలిలప్రవేశంబు సమ్మతించెదవేని
నంబుధీశ్వరుండు పుణ్యంబుసేయు
నెబ్బంగి బ్రాణముపేక్షించి తేనియు
వైవస్వతునికబ్బువాంఛితంబు

తే॥ ఘట్టికుటికాప్రభాతంబు క్రమమునంది
దమసహోదరినీకు నయ్యమరవరుల
నొల్లననియును దుది బొందకుండరాదు
సమ్మతింపుము నామాట చలముమాని"

(శృ నై. 4-75)

మానవుడు తన ప్రాణమును పోగొట్టుకొనుటకు నాలుగు మార్గములున్నవి. అవి ఉరివేసుకొనుట, అగ్నిలోదూకుట, జలములో ప్రవేశించుట. బలత్కారముగ మరొక ఉపాయముతో ప్రాణము విడుచుట. ఈ నాలుగు మార్గములకు అధిదేవతలు ఇంద్రాగ్నియమ వరుణులు. వీరు దమయంతిని కాంక్షించుచున్నారు. వీరినుండి తప్పించుకొనుట సాధ్యముకాదని, తనమాటనమ్మి దేవతలలో ఒకరిని వివాహమాడినచో దేవతలను పొంది సౌఖ్యము నందగలవు. అంతే కాదు తన దూతకార్యమునకు సహకరించినదానివగుదువని. దీని వలన రెండు కార్యములు నెరవేఱగలవని నలుడు దమయంతికి చెప్పెను. దేవతలను నిరాకరించి తుదకు వారి సన్నిధినే చేరగలవు. అందులకు నిదర్శనముగ నలుడు ఘట్టికుటికాప్రభాత న్యాయమును కూడ చెప్పినాడు.

## ఘట్టికుటికాప్రభాతన్యాయము :

"క్రీత్వాకశ్చిత్పణ్యవస్తూని పుర్వాం। శుల్కం హృత్వాగను కామోని శాయామ్ తుర్యేయామే గచ్ఛదారాత్ కుమార్గాత్। గత్వా గత్వాఘట్ట కుట్యాం ప్రభాతమ్"

ఒక దొంగవ్యాపారి సుంకమియ్యక తప్పించుకొనుటకై రాత్రి పూట నేదో యొక మార్గమునుబట్టి పోవగా త్రోవతప్పి రాత్రి యంతయు పయనించి పయనించి తెల్లవారుసరికా సుంకపుగృహము కడనే చేరుట. అనగ ఎవరికి భయపడి రాత్రియంతయు తిరిగి చివ

రకు తెల్లవారిసరికి వారియిల్లు చేరిన దొంగవ్యాపారివలె నీవు దేవతలను వలదని చెప్పికూడ వారిని పొందగలవను సూచనను నలుడు దమయంతికి తెలిపెను. ఈవిషయము హర్షనైషధమునగాని, భారత నలకథలోగాని లేదు. దీనిని శ్రీనాథుడు నూతనముగ కల్పించినాడు. చివరకు దమయంతి దుఃఖించినది. ఆ దుఃఖమునకోర్వలేక నలుడు తనపేరును చెప్పినాడు. దమయంతి గద్దెమీద కూర్చుని నలునితో వాదోపవాదములు చేసినది. నలుడని తెలియగనే ఆమెకు సిగ్గు జనించి, తెరవెనుకకు పోయినది.

తే॥ "అనివిచారించుచుండె దయ్యవ నినాథు
డంతకునుమున్న నలుని గాన తనినెటిగి
యెదురు గద్దియ డిగ్గి, పృథ్వీశతనయ
యవనికాంతరమున నోల మాసగొనియె"

(శృ. నై. 4–97)

చేమకూర వేంకటకవి తన విజయవిలాసములో అర్జునుడు ఉలూచి సంవాదఘట్టములో ఈ విషయమును అనుకరించినాడు.

"చక్కెరబొమ్మ నావ్రతముచందము దెల్పితి, నింతె కాకనీ
చక్కదనంబు గన్న నిముసంబయినన్నిలు వోపశక్యమే
యక్కున జేర్ప, కంచు దయ నానతియీ, దలవంచె, నంతలో
నెక్కడనుండి వచ్చె దరశేక్షణకున్ ననుసిగ్గుదొంతరల్"

ఇపుడు నలుడు తనపేరు చెప్పకొనుటలో స్వార్థములేదు. అతడు తనకు సాధ్యమైనంత వరకు దేవకార్యము నెరవేర్చుటకే ప్రయత్నించెను. అది విఫలమయినది. విఫలమగుటయేగాక తన దూతకార్యము దమయంతికి దుఃఖకారణమయినది. ఇక మార్గములేక నలుడు తనపేరు చెప్పకొనినాడు. ఇందులో దోషములేదు. దేవకార్యము భంగమైనందులకు నలుడు అంజనేయాదులను పోలనైతి

నని వ్యథచెందెను. దమయంతి తాను తెలియక తన మనోవల్లభునితో మాటలాడినందులకు పశ్చాత్తాపము చెందెను. ఆ సమయమున నల దమయంతులకు సంగమ కారణదూతయైన కలహంసయంతః పురము ప్రవేశించి బ్రహ్మసంకల్పమైన వారి వివాహము తెల్పి దుఃఖోపశమనము చేసినట్లు శృంగారనైషధకర్త కల్పించెను. హర్ష నైషధమున దూత్యము విఫలమయినదని నలుడు చింతించు సంద ర్భమునందు హంస వచ్చినట్లున్నది. శ్రీనాథుడీ సందర్భమునందు హంస వచ్చినట్లు అంగీకరింపలేదు. నలదమయంతులిరువురు దుఃఖించునపుడు హంసను ప్రవేశపెట్టుటలో శ్రీనాథునకు గల కథా కౌశలము వ్యక్తమగుచున్నది. నలదమయంతుల పశ్చాత్తాపము-హంస పునరాగమనము భారతకథలో లేవు. ధీరోదాత్తుడగు నలుడు దేవతల కార్యము నెరవేర్చలేకపోవుట, అంతఃపుర స్త్రీయగు దమయంతి యన్యపురుషునితో మాట్లాడుట. ఇవి రెండును ఒకవిధమగు దోష ములే. ఈ దోషపరిహారణకు నైషధకర్త హంసపునరాగమనమును కల్పించినాడు. దమయంతి నలునితో దేవతల సమక్షమున వివాహ మాడుదునని మాటయిచ్చినది. ఈ విషయము భారత, నైషధము లందును గలదు.

నైషధకథలో నలుని దూతకార్యమునకు అంతరిక్షమందు నిగూఢాకృతినందున్న దేవతలు నలుని మనశ్శుద్ధికి సంతోషించిరి. ఇది భారతనలకథలో లేదు. నలుని చిత్తశుద్ధిని లోకమునకు తెలియ జేయుటకై దేవతలు నలునకు దూతకార్యము నప్పగించిరి. తన స్వార్థము లేకుండ నలుడు దేవతల దూతకార్యమునకు సహక రించెను. కాని అది దమయంతి దృఢనిశ్చయముతో విఫలమయినది. నలుడు దేవతలను సమీపించి జరిగినవిషయమును పూసగుచ్చినట్లు చెప్పెను. దేవతలు దమయంతీ స్వయంవరమునకు పోవనిశ్చయించు కొనిరి.

## 3.4. భారతీదేవి దమయంతికి స్వయంవరాగతులను గురించి తెలుపుట:

దమయంతీ స్వయంవరమునకు వివిధదేశములనుండి రాజులు వచ్చిరి. ఆ వచ్చినవారిలో కొందరు దమయంతిని వివాహమాడుటకు, కొందరు తమ బలపరాక్రమములతో ఆమెను చేజిక్కించుకొనుటకు, కొందరు స్వయంవరోత్సవమును జూచుటకొరకు వచ్చిరి. వీరి సందడి తిలలు నెత్తిపై జల్లిన నేలపడలేదని శృంగారనైషధకర్త కల్పించెను. స్వయం వరమునకు కర్కోటకుడను భుజంగపుంగవుడును, ఫణీంద్రుడైన వాసుకి కూడ వచ్చిరి. అష్టదిక్పతులలో ఇంద్రాగ్నియమ వరుణులు మాత్రమే దమయంతి స్వయంవరమునకు వచ్చిరి. తక్కినవారు రాకపోవుటకు గల కారణమిది.

సీ॥ రాజు నొజ్జల మంత్రరక్షాబలంబున
రా బొందు గాదయెరాక్షసునకు
దమయంతి తోడినేత్రస్పర్ధకతమున
నిజవాహనమురామినిలిచెగాలి
తనరూపుకైలాస దర్పణంబున జూచి
వ్రీడ గుబేరు డిల్వెడల డయ్యె.
నర్ధనారీశ్వరుండగుట నీశానుండు
సామేని యంకలి జాగ కుండె

తే॥ దానువహియించు ధాత్రికెవ్వాని బెట్టి
వచ్చునటుగాన శేషుండువచ్చుటుడిగె.
ముదిసిముప్పున బెండ్లికైమొగమువేల్పు
దగవు గాదని రాడయ్యె దాతవేల్పు

(శృ.నై. 4-129)

రాజపురోహితుల మంత్రబలము-రక్షణబలము ఉండుట వలన నిర్ఋతి స్వయంవరమునకు రాలేదు. దమయంతి నేత్రస్పర్ధవలన తనవాహనమైన జింక రానందున వాయుదేవుడు నిలిచినాడు. గౌరీ శాపఫలితముగ కుబేరుడు వికృతాకారుడగుట వలన రాకుండెను. అర్ధశరీరాంగుతగుటవలన పార్వతి పోనివ్వదని ఈశ్వరుడు నిలచెను. భూమిని మోయుభారమెవ్వరికిని నొసగుటకు వీలులేక ఆదిశేషుడు నిలచెను. బ్రహ్మకు నాలుగు మొగములుండుటవలన అందవిహీనుడనని రాకుండెను. భారతకథలో స్వయంవరాగతుల వృత్తాంతము గాని, ఇంద్రాగ్నియమవరుణులు మాత్రమే వచ్చి తక్కిన వారు రాక పోవుటకు గల హేతువుగాని లేదు. దిక్పతులలో ఇంద్రాగ్నియమవరుణులు మాత్రమే వచ్చి తక్కినవారు రాకుండుట అసమగ్రము; అసమంజసము. దీనిని తొలగించుటకొరకు నైషధకర్త ఈ మార్పును కల్పించెను. దిక్పాలకులందరు దమయంతీస్వయంవరమునకు రాక ఇంద్రాగ్ని యమవరుణులు మాత్రమే వచ్చుటకు గల కారణమును గుంటూరుశేషేంద్రశర్మగారిట్లూహించిరి:- మంత్రశాస్త్రమున యం. రం, లం, వం, హం--అనునవి పంచభూతములకు చెప్పిన బీజాక్షరములు. యం,లం,రం,వం వరుసగా యమ-అగ్ని, వరుణ, ఇంద్రులను చెప్పును. ఇంద్రాగ్నియమవరుణులనగా మూలాధారాది చక్రపంచకము. ద్రవ్యాణాంశితిపీతరోహిత హరిన్నామాన్వయం అనగా ఇంద్రాగ్నియమవరుణులు అధిష్టాన దేవతలు గాగల ధవళమేచక పీత రోహితహరిద్వర్ణసమన్వితములైన మూలాధారాది పాంచభౌతిక చక్రములయొక్క సమాహార రూపమైన శరీరము.

స్వయంవరాగతులైన రాజులను పరిచయము చేయుటకు భీమరాజు సరస్వతిని ప్రార్థించెను. భారతీదేవి సాక్షాత్కరించి దమయంతికి రాజుల వృత్తాంతములను తెలిపినది. హర్షనైషధములో

భీమరాజు దమయంతికి స్వయంవరాగతులను పరిచయము చేయుటకు విష్ణువును ప్రార్థించినట్లు విష్ణువు సరస్వతిని పంపినట్లున్నది. (10వ సర్గ. 67,73,) శ్రీనాథుని యనువాదములో భీమరాజు స్వయముగ సరస్వతీదేవిని ప్రార్థించినట్లు, ఆమె ప్రత్యక్షమైనట్లు మార్చెను. నైషధకర్త సరస్వతీదేవిని ప్రవేశపెట్టుటలోగల అంతర్యమును విశ్వనాథ సత్యనారాయణగారిట్లూహించిరి". సరస్వతి యనగా నెవరు? జీవునియందు ప్రతిబింబించుచున్న వాగ్రూపమైన శివమూర్తి. శివుడు సర్వజీవమయస్వరూపుడు. జీవునకు మాటలకు నిత్యసంబంధమున్నది. శివునకు సగస్వతికినిదియే సంబంధము. శివుడే సరస్వతి సరస్వతియే శివుడు, శివుడు. తేజోమూర్తియైన జీవుడు. సరస్వతి వాఙ్మయమైన జీవశక్తి. నలుని కథలో శ్రీహర్షుడు సరస్వతిని తీసికొని వచ్చుటకు కారణమిది. భారతనలకథలో సరస్వతీదేవి సాక్షాత్కరించి దమయంతికి స్వయంవరాగతులను చూపిన విషయము లేదు. ఇది నైషధకర్త కల్పించినదే.

సరస్వతీదేవి దమయంతికి మొదట దేవతలను గూర్చి వివరించుచు వీరు ముప్పదిమూడు కోట్లున్నారని, వీరిని వర్ణింపవలెనన్నచో వేయేండ్లుపట్టుననెను. దేవతలను వివాహమాడుట దమయంతికి యిష్టములేదని తెలిసి, సరస్వతీదేవి ద్వీపాధిపతులను జూపినది. పుష్కర ద్వీపాధిపతిని, శాకద్వీపాధిపతిని, క్రౌంచద్వీపాధిపతిని, కుశద్వీపాధిపతిని, శ్మాలి ద్వీపాధిపతిని, ప్లక్షద్వీపాధిపతిని, జంబూద్వీపాధిపతిని, వేర్వేరుగ వర్ణించిచెప్పినది. వీరిని దమయంతి నిరాకరించినది. తరువాత సరస్వతీదేవి ఉజ్జయినీపతి. గౌడరాజు, మధురాధిపతి. కాశీరాజు, అయోధ్యాపతి పాండీడు, కాళింగుడు. నేపాళరాజు, కామరూపాధిపతి, ఉత్కలుడు, కీకటుడు వీరి బలపరాక్రమములను వివరించినది. వీరినికూడ దమయంతి నిరాకరించినది. నలుని

నలాకారములో కూర్చునియున్న ఇంద్రాగ్నియమవరుణులను దమయంతిసమీపించినది. పంచనలులను జూచి దమయంతికి సందేహము కలిగినది సరస్వతిదేవి నలపరముగ అర్థమువచ్చునట్లు ఇంద్ర, అగ్ని, యమ, వరుణుల వృత్తాంతమును వివరించినది. పంచనలులను దమయంతి నిశితముగ పరిశీలించి మొదటి నలుగురు దేవతలుగాను, ఐదవవాడు నలునిగ భావించినది. కాని ఐదవవాడు నలుడని పూర్తిగ తెలిసికొనుటకు శక్తురాలు కాలేకపోయినది. మరల నిశితముగ ఐదు మందిని పరిశీలించినది. మానవులకు లేని కొన్ని ప్రత్యేక లక్షణములు దేవతలకున్నవి. అవి

"ధరణింబొందని కోమలాంఘ్రి కమలద్వంద్వంబులన్, ఘర్మశీ
కరయుక్తంబులుగాని ఫాలములు, వక్షఃక్షోణులంబత్త్రికే
సరముల్ గందని పూవుదండలు, నిమేష వ్యాఖ్యగైకొని దృ
క్సరసీజంబులు, నల్వురందు గనియెంగాంతాలలామంబొగిన్"

(శృ. నై. 5–182)

ఈ లక్షణాంతరములే భారతమునందిట్లు చెప్పబడియున్నవి.

సా పశ్యద్విబుధాన్సర్వా నస్వేదాంస్తబ్ధలోచనాన్
హృషిత స్రగ్రజోహీనాన్ స్థితానస్పృశతః క్షితిమ్
ఛాయాద్వితీయోమ్లానస్రగ్రజఃస్వేద సమన్వితః
భూమిష్ఠోనైషధశ్చైవ నిమేషేణచసూచితః"

(వ్యాసభారతారణ్యపర్వ–నలోపాఖ్యానము)

నలుగురు దేవతలనుండి దమయంతి నలుని గుర్తించు విషయము భారతములో చెప్పబడలేదు, ఇది నైషధకర్త కల్పనమే.

ఇంద్రాదులు నలదమయంతులకు వరములిచ్చుట భారత, నైషధముల రెండింటియందును గలదు. హర్షనైషధమున అగ్ని

నలునకు పక్వముచేయబడిన యన్నము, మత్స్యములు మొదలగు మాంసాదుల రసములును, సూపశాకాది సమస్తమైన వంటకము గూడ నమృత రసమును మించి వండగలడని వరమిచ్చెను. (14వ సర్గ-75). దీనికి ఆంధ్రానువాదములేదు. అగ్నిదేవుని వరప్రభావము వలననే నలునకు పాకవిద్య యబ్బినదని, దీనిని బట్టి తెలిసికొన వచ్చును. శ్రీనాథుడు తన నైషధాంధ్రీకరణమున వరములతోపాటు, దేవతలు ఆశీర్వచనములను కూడ నిచ్చినట్లు కల్పించినాడు.

ఉ॥ ఆదిమశక్తియైన తుహినాచలరాజతనూజ వోలె ము
త్తైదువపై నిజేశ్వరుని యర్ధశరీరము పాలుగొమ్ము నీ
పాదసరోరుహంబులతి భక్తిభజింతురుగాక యొప్పు బ్ర
హ్మాదిక దేవతాసదృశులైన మహామహిమండలేశ్వరుల్

(శృ. నై. 6–14)

వివాహ సమయమునందు ఆశీర్వచనమన్నది సుప్రసిద్ధము. అందువలన దేవతల ముఖమున శ్రీనాథుడు నలదమయంతులకు ఆశీర్వచనమును చెప్పించినాడు. సరస్వతీదేవి నలునకు చింతామణి మంత్రము నిట్లుపదేశించినది.

"సకలంబై హిమరుక్కళాభరణమై సవ్యాపసవ్యార్థయు
గ్మక రూపంబయి శైవమైగత కళంకంబై శివంబై యుపా
సక చింతామణియై ప్రసిద్ధభగవచ్ఛబ్దాభిధేయార్థమై
యొక మంత్రంబు మదీయమొప్పు, నది నీకుర్వీశ, యేనిచ్చితిన్"

(శృ.నై. 6–18)

"నారదుడు ఇంద్రసభలో ప్రకటించిన రత్నమునే శారదాదేవి మంత్రముగా నిర్ధారణ చేసినది. ఈ తాత్పర్యార్థనిర్ధారణము నందు బుద్ధిని లగ్నముచేసినాడు గనుకనే శ్రీనాథుడు అక్కడ ఒకరత్నమని

చెలులు కలకల నవ్వగా కట్టుపుట్టము గబగబ విప్పివైచినది. ఒక సుందరి ఒకనికి మొగము కడిగికొనుటకై దోసిట నీళ్లుపోయుచుండగా ఆతడు దాని చెక్కుటద్దములను ముద్దుపెట్టుటకై ప్రక్కల నున్నవారు ఏక్షణములో తమ్ము చూడకుండ ఏమరియుందురో యని నిరీక్షించుచుండెను. ఆయువతి యాతని యాశయమున కనుగుణముగ ప్రవర్తించినది. నలునకు విసనకర్ర వీచుచు ఒక యువతి తనివితీర నలుని సౌందర్యము తిలకించినదట. పెండ్లి బంతులలో వడ్డించు వివిధఫలహారములు వడ్డనలలో స్త్రీ, పురుషుల హాస్య సంభాషణలు విరివిగా నున్నవి.

"ఉష్ణశీతాన్న కబళంబులొకడు సూప
బవలొ రాత్రి మొగెడ గూడ నవసరమని
దాని కత్తెర మొకలతా తన్వియిచ్చె
నధర బింబము విరిచి సంధ్యాగమమని"

(శృ.నై. 6-135)

సాధారణముగ పెండ్లికి వచ్చినవారు ఊరక కూర్చుండరు. వారు లోకములందలి జరుగు హాస్యపోషకములైన విషయములు చెప్పుకొని నవ్వుకొనుచుందురు. దీనిని గుర్తించి శ్రీహర్షుడు బువ్వపు బంతిని కల్పించి యుండవచ్చును. భారతకథలో హాస్యరసస్ఫోరకములైన విషయములు గాని, బువ్వపుబంతి ప్రశంసగాని లేదు.

భీమరాజుకు, దమయంతిని నత్తవారింటికి పంపునపుడు కలుగు దుఃఖముకంటె అల్లుడగు నలుని యెడబాటు వలన అధిక దుఃఖము కలిగినట్లు మూలములో లేకున్నను, శ్రీనాథుడు శృంగార నైషధమున చెప్పినాడు.

భీమరాజు దమయంతిని నత్తవారింటికి పంపునపుడు ఆమెకు

హితోక్తులిట్లు పలికినాడు,

సీ॥ "పాటించికొలువుము భవనదైవతముల
    సవతుల గొనియాడు సఖులబోలె
నారాధనముసేయుమత్త మామలనెప్డు
    బరిజనంబుల మీద గరుణగలుగు
మలుగకు కోపించినపుడు నాధునితోడ
    మదిలోన నుబ్బకు మన్ననలకు,
దోడికోడండ్రతో గూడిమాడి చరింపు,
    దాసీ జనము బ్రోవు తల్లికరణి.

తే॥ బ్రాహ్మణులయందు గురులందుబంధులందు
భక్తివిశ్వాస సౌహార్దపరతనెరపు
భవ్య. పతిదేవతాచారపరమపుణ్య
ధర్మమేమరకుండు మీతల్లికాన "

(శృం. నై. 17-9)

ఇవి అభిజ్ఞాన శాకుంతలమున కణ్వుడు అత్తవారింటికి పంపునపుడు చెప్పిన హితోక్తులను తలపించును. రామరాజు రంగప్పరాజు కూడ సాంబోపాఖ్యానములో (3–61)జాంబవంతుడు తనకుమార్తెకు బుద్ధులు గఱపినట్లు తెల్పియున్నాడు.

భీముడు దమయంతికి బుద్ధులుచెప్పిన విషయము భారతములో లేదు. ఇది నైషధకావ్యకర్త కల్పించినదే.

శృంగారనైషధమున దమయంతి సోదరులైన దమ, దమనులు తండ్రియాజ్ఞ ప్రకారము దమయంతికి వస్తువు లిచ్చుటయేగాక, "పసుపు కుంకుమ మాన్యములిచ్చినట్లు తెలుగుదేశమునందలి సంప్రదాయమును దృష్టిలో పెట్టుకొని శ్రీనాధుడు ఒక పద్యమును సంతరించెను,

ఉ॥ "సంకుమదంబు గస్తురియు జాదు బటీరము గప్పురంబునుం
గుంకుమ పువ్వునుంబునుగు గొజ్జగ నీరు ననేక భారముల్
కంకణ కంఠికా కటకకాంచి ముఖాభరణవ్రజంబుతో
గొంకక తోడ బుట్టువులు గూరిమి చెల్లెలి కిచ్చిరిద్దరున్"

(శృం. నై. 7-11)

ఈవిషయము హర్షనైషధమునగాని, వ్యాసభారతము నగాని, నన్నయ నలకథలోగానిలేదు. ఇది శ్రీనాథుని స్వతంత్రకల్పనము.

## 3. 6. కలివృత్తాంతము :

అరిషడ్వర్గములగు కామక్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్య ములవలె కలి ఒకగుణముకాకపోయినను వాటికి అధిదేవతగ పేర్కొనవచ్చును.

భారత నలకథ ఉత్తర భాగములోవచ్చు కలిని పూర్వకథా భాగములో ప్రవేశపెట్టుటలో శ్రీహర్షుని యభిప్రాయము నలునివంటి మహాపురుషునికైనను కష్టములు తప్పవని సూచించుటకు కావచ్చును కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయమను నాటకములో లోభ, మోహ, క్రోధులకు రూపములు కల్పింపబడినవి. కలివృత్తాంతము భారతము నందును గలదు. కాని నైషధములో కలివృత్తాంతమే కాక క్రోధుడు. లోభుడు, మోహుడు, వీరుముప్వురును ఇంద్రాదులకు కన్పించిన విషయము కూడ తెలుపబడినది. వీరి సందర్శన వలన నల దమయంతులకు కష్టములు కలుగనున్నవను భవిష్యత్కథ సూచింపబడుటకై నైషధకర్త కల్పించియుండును.

శృంగారనైషధములో ఇంద్రాదులకు కనిపించిన కలి ఆకార మిట్లున్నది.

సీ॥ కలుషమ్మై పెరిగిన కుటుమెంద్రుకల తోడ
బట్టమౌదల గావి పాగయమర

నిగిడిపూతేకు బాగుగ గత్తిరించిన
గడ్డంబు కొనరొమ్ము గమ్మిరింప
బండి కందెన తోడ బ్రతివచ్చుమై చాయ
నీలి పచ్చడముతో మేల వింప
నవరక్తచందన ద్రవ కల్పితంబైన
నూత్న త్రిపుండ్రంబు నొసల నొప్ప

తే॥ గోరమీసలు మిడిగ్రుడ్లు కుఱుచ పొడవు
దొప్ప చెవులును గొగ్గిపండులను గలిగి
యున్న మద్గ్రీవుడై వచ్చుచున్నవాని
గలిమహారాజు గనిరి దిక్పాలవరులు"

(శృం. నై. 7.93)

ఏ విధముగనైనను దమయంతిని పట్టితెత్తునని పాంచాలిని పాండవులు పొందినట్లు తామందరు కలిసి దమయంతిని పొంద వలయునని కలి యింద్రాదులతో పలికెను. దేవతలు పంతము వల దని కలిని నివారించిరి. తాను తలపెట్టబోవు కార్యమును కలి దేవతలతో నిట్లనెను.

" వాని దుర్వృత్తి నెపముగా, వసుధయేలు
నలునిపై బ్రత్యవాయంబు గొలుపు వాడ
గొలిపి యతని బ్రవేశించి నిలుచువాడ
నిలిచి యాతని మనసీక యలచువాడ,

(శృం. నై. 7-117)

ఈ విషయము భారతనలకథలోలేదు. ఇంద్రాదులు కలిని వదలి పోవుటకుగల కారణము శృంగారనైషధమునందిట్లు చెప్ప బడినది. "కలియుత్సాహంబు దైవకల్పితంబు గావున నన్యథాకరింప నలవిగాక" దేవతలు వెళ్లిపోయిరి. ఈ విషయము హర్షనైషధమున గాని, భారత నలకథలోగానిలేదు. కలిపురుషుడు కామ, క్రోధ,

లోభ, మోహములకు వేర్వేరు అధికారములు పంచిన విషయము శృంగార నైషధమునందున్నది. ఇది హర్షనైషధమునగాని, భారత నలకథలోగాని లేదు.

## 3. 7. నలదమయంతుల శృంగారము :

నవవధువైన దమయంతి లజ్జాభయములను పోగొట్టుటకు నలుడు వివిధ శృంగార విలాసములతో ఆమెను అనునయించిన విధము శృంగార నైషధమునందిట్లున్నది.

సీ॥ అధరంబు చవిసూపు, మన్యమేమియు నొల్ల
ననిచెక్కు జేరి మంతనము వలుకు,
దైన్యంబు దోప బ్రార్థనసేసి, తుది బొంచి
బలిమి సొంపునన చుంబన మొనర్చు
'వదనార విందాసవము ప్రసాదము సేసి
ననునేలికొంటిగా' యనుచు మెచ్చు,
'నను గు భృత్యునకు నీపనియర్హమగు, నంచు
నూరు సంవాహనంబొయ్య జేయు

తే॥ నేలకుసుమాస్త్రి కేలికినింత వెఱవ?
వెఱవకేనేమినీ సఖీవితతి యేమి?
యనుచు దగబుజ్జగించి హస్తాంబుజమున
వలపు గీలు దెమల్చు భూవల్లభుండు"

(శృం. నై. 7-176)

నూతన దంపతులైన నలదమయంతుల శృంగారమునకు ఆలంబన విశేషము లెన్నిటినో భారతమునందు లేకున్నను కావ్య దృష్టితో నైషధగ్రంథకర్త కల్పించినాడు. కులస్త్రీ ధర్మము రాజ శేఖరుడు కావ్యమీమాంసలో ఇట్లు తెల్పినాడు.

" అభ్యుత్థానముపాగతే గృహపతౌ, తద్భాషణేనప్రతా,
తత్పాదార్పిత దృష్టి, రాసనవిధి, స్తనోపచర్యాస్వయమ్,
సుప్తేతత్రశయీత, తత్ప్రథమతోజహ్యాచ్ఛయ్యామితి,
ప్రాచ్యైః పుత్రినివేదితః కులవధూసిద్ధాన్త ధర్మాగమః"

(శృం. నై. 4–15)

దమయంతి కులస్త్రీ ధర్మమును పాటించి పతిని నిత్యము సేవించినట్లు నైషధకర్త చెప్పినాడు. శృంగార నైషధమున ప్రాభాతిక వైతాళిక గీతములకు నలుడు లేచి మామయిచ్చిన ఈశ్వర వరదత్తమైన కామగమనరథము మీద మిన్నేటికేగి స్నానముచేసి వచ్చినట్లు శ్రీనాధుడు స్వతంత్రముగ కల్పించెను. రాజాస్థానకవి యగుట వలన శ్రీనాధుడు రాజమర్యాదలు గుర్తించి ఈ కల్పనలు చేసియుండవచ్చును. ఈ విషయము హర్షనైషధమునగాని, భారతనలకథలో గాని లేదు.

శృంగార నైషధమునందు నలదమయంతుల గోష్టిసందర్భమున భార్యాభర్తల మధ్య సహజముగ కలుగు ప్రణయ కలహములున్నవి. దమయంతి చెలికత్తె నలుని సమీపించి "ప్రణయ కోపములు రతి దీపనౌషధములు పోలయలుక లేక మగవారికి మగువల బొత్రులు గారు దీర్ఘంబులయ్యోనేని యవియే ప్రేమభంగ కారణములు కావున కోపము మానుమని ప్రాధేయపడినది. ఈ మాటలు లోకప్రసిద్ధములు కూడ. ఎందుకనగ భార్యాభర్తల మధ్య ప్రణయకలహములేర్పడును. ఆ తగవులే వారి ప్రేమకు అలంబనములగును. ఈ కలహము తాత్కాలికముగ నుండవలెను. ఎక్కువ కాలముండినట్లయినచో అది ప్రేమకు భంగకారణమగును. కావున కలహములను మానుడని చెలికత్తె నలుని యనునయించినది. ఈ విషయమే భారతములోలేదు

శృంగారనైషధములో చెలికత్తెయగు కళావతి నలుని సమీపించి దమయంతి అతనిని మాయా నలునిగా భావించుచున్నదనెను. అందులకు నలుడు సందేహనివృత్తి కొరకు శయ్యారహస్యములను దెలిపినట్లు, శయ్యారహస్యములు చెప్పవలదని దమయంతి లజ్జచే అతనిని వారించినట్లు, చెలికత్తెను విననీయక దమయంతి తన చేతులతో దాని చెవులను మూసినట్లు నైషధకర్త తెలిపెను. ఈ విషయము భారత నలకథలో లేదు.

నలుడు శివస్తోత్రములు చేసినట్లు విష్ణుని దశావతారములను కూడ కీర్తించినట్లు నైషధకర్త కల్పించినాడు. దీనినిబట్టి, నైషధకర్త హరిహరాభేదమును పాటించుటయే గాక భగవంతుని వివిధరూపము లందు సేవించెనని తెలియుచున్నది. అదియునుగాక నూతన దంపతులగు నలదమయంతులకు వివాహానంతరము తమ భవిష్యత్తు సుముఖముగ జరుగవలయుననెడి ఆశయముతో శ్రీహర్షుడు నలుని దైవారాధనమును చిత్రించినాడు. ఈ విషయము లేవియు భారత నలకథలో లేవు.

ఈ విధముగ సంస్కృత భారతారణ్యపర్వనలోపాఖ్యానమును గ్రహించి శ్రీహర్షుడు పలు మార్పులు కల్పించి "నైషధీయచరితమ్" ను రచించినాడు. దీనిని శృంగార నైషధమను పేరుతో రసవత్ప్రబంధముగ శ్రీనాథుడు ఆంధ్రీకరించినాడు.

# 4. ద్విపద నలకథా కావ్యములు

తెలుగులో ప్రత్యేక కావ్యములుగా రచితములైన నలచరిత్ర లన్నియు ద్విపద ఛందస్సునందే వెలువడినవి. తెలుగున ద్విపద వాఙ్మయము నిసర్గమాధుర్యము తోడి శిల్పమునకు, నిడారంబరత్వము తోడి విజ్ఞాన వికాసమునకు, సౌలభ్యసహితమైన శైలీవైశిష్ట్యమునకు కూడలి అయినది గేయమును, పాఠ్యమును నయిన ద్విపద కవితకు జనసామాన్యమున విపుల ప్రచార ప్రశస్తులేర్పడినవి, వస్తురచనా విధానములందు ద్విపద నలకథాకావ్యములకు గల పోలికలను డా॥ జి. నాగయ్య గారు తమ ద్విపద వాఙ్మయము (పుటలు 196–207) నందు వివరించియున్నారు. ద్విపద నలచరిత్ర వస్తురచనా వైశిష్ట్యాదులను మరికొంత సమగ్రముగ క్రింద వివరించడమైనది.

నలచరిత్రను ద్విపదలో రచించిన కవులందరికి భారతారణ్య పర్వములోని నలోపాఖ్యానమే మూలము. తెలుగులో ముద్రితా ముద్రితములగు ద్విపద నలకథాకావ్యములు పందొమ్మిది యున్నట్లు తెలియుచున్నది.

1. నలచరిత్ర – చక్రపురి రాఘవాచార్యుడు (క్రీ.శ. 1545) ముద్రితము.
2. " తిమ్మనకవి (16వ శతాబ్దము) అముద్రితము.
3. " రఘునాథనాయకుడు (క్రీ.శ. 1614-1633) ముద్రితము.
4. " - పిళ్ళారిసెట్టి రాఘవయ్య – ముద్రితము.
5. " - కాకర్లపూడి రాఘవాచార్యుడు - ముద్రితము.
6. " - వరకవి రాఘవకవి, ముద్రితము.
7. కలి నివారణము.
(వ్రత విధాన నలచరిత్ర) - ఆల్యకొండ కృష్ణమూర్తి (20వ శతాబ్దము) ముద్రితము.

ఇవిగాక పేరు తెలియని అముద్రిత నలచరిత్ర ద్విపద గ్రంథములు కొన్ని మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము నందు కలవు. వాని ప్రతుల వివరణములివి :

8. ఆర్. నెం. 145 - అసమగ్రము.
9. " 769 - అసమగ్రము.
10. " 972 - అసమగ్రము.
11. " 1065 "
12. " 1066 "
13. " 1067 "
14. " 1068 "
15. " 1069 "
16. " 1072 "
17. " 1073 "
18. " 1075 "
19. డి. నెం. 301 సమగ్రము.

## 4.1. చక్రపురి రాఘవాచార్యుని నలచరిత్ర:

చక్రపురి రాఘవాచార్యుని కాలనిర్ణయమును గురించి భిన్నాభిప్రాయములున్నవి. రాఘవాచార్యుని నలచరిత్ర రచనము క్రీ. శ. 1620 అయియుండునని బ్రౌన్ దొరగారి అభిప్రాయము. రాఘవాచార్యుని గురువు దొడ్డయాచార్యులు. దొడ్డయాచార్యులు క్రీ.శ.1545 లో నున్నట్లు ఆచార్య యస్వీ. జోగారావు అభిప్రాయపడినారు. రాఘవాచార్యుడు ద్విపద నలచరిత్రనేగాక విప్రనారాయణ చరిత్ర అను యక్షగానమును కూడ వ్రాసెను. ఈ రెండింటియందును గ్రంథాంతమున దొడ్డయాచార్యుల ప్రశంసగల ద్విపద పంక్తు లొక్కతీరుగా నున్నవి. చూడుడు—

"అనుచు వాధూల గోత్రాబ్ధి చంద్రుండు
చిరకీర్తిమంతుడాశ్రిత హితోదయుడు
కరుణాపయోనిధి కందాళ దొడ్డ
యాచార్యులకు శిష్యుడైనట్టి వైష్ణ
వాచార తత్పరు డతి దయాపరుడు"

(నలచరిత్ర)

"అలర వాధూల గోత్రాబ్ధి చంద్రుండు
చిరకీర్తి వెలసి యాశ్రిత హితోదయుడు
కరుణాపయోనిధి కందాళ దొడ్డ
యాచార్యులకు శిష్యుడైనట్టి వైష్ణ
వాచార తత్పరు" .............

(విప్రనారాయణ చరిత్ర)

రచనా విషయమున కూడ నలచరిత్రకు, విప్రనారాయణ చరిత్రకు పెక్కు పోలికలున్నవి. కందాళ దొడ్డయాచార్యులు వైష్ణవ మత గురువు. క్రీ. శ. 16వ శతాబ్దమునకు చెందినవాడు. అతని శిష్యుడైన రాఘవాచార్యుడు 1545 కాలమునందుండి యుండునని జోగారావు తెల్పినాడు. వీరి అభిప్రాయమును కేతవరపు రామకోటి శాస్త్రి కూడ అంగీకరించినాడు. చక్రపురి రాఘవాచార్యుడు కందుకూరి రుద్రకవికి సమకాలికుడో లేదా కొంచెము తరువాతి వాడో కావచ్చునని, ఎడ్ల బాలక్రిష్ణారెడ్డి అభిప్రాయపడినాడు కందుకూరి రుద్రకవి కృష్ణదేవరాయల అష్టదిగ్గజములలో నొకడు. అతడు భువనవిజయములో ఈశాన్యపీఠము నలంకరించెడివాడని ప్రతీతి. బాలక్రిష్ణారెడ్డి అభిప్రాయము ప్రకారము కూడ రాఘవాచార్యుడు క్రీ.శ. 1545 వాడని తెలియుచున్నది. వీనినిబట్టి రాఘవాచార్యుని కాలము క్రీ శ. 1545 అయి యుండుననుటలో విప్రతిపత్తి లేదు.

ద్విపద నలచరిత్రలో చక్రపురి రాఘవాచార్యుని నలచరిత్రయే మొట్టమొదటిది. రాఘవాచార్యుని నలచరిత్ర పూర్వోత్తర కథాభాగములుగల ఐదాశ్వాసముల ద్విపదకావ్యము. ఇది ఘటికాద్రి నరసింహున కంకితమీయబడినది. రాఘవాచార్యుని తరువాత తెలుగులో మరికొన్ని సంపూర్ణ నలకథా కావ్యములు వెలసినప్పటికి అతని నలచరిత్రకు వచ్చిన ప్రాశస్త్యము మిగిలిన వాటికి లభింపలేదు రాఘవాచార్యుని నలచరిత్రలో ప్రాతివ్రత్యమహిమ, పరదారాసక్తి వలన కలుగు అరిష్టములు, వ్యసనాభిలాష వలన కలుగు కీడులు, మున్నగు కథాంశములు పండిత పామర జనాకర్షణీయముగ కరుణరసాత్మకముగ వర్ణింపబడినవి.

చక్రపురి రాఘవాచార్యుని ద్విపద నలచరిత్ర ఆంధ్రలోకమున

పండిత పామరులలో విపుల ప్రచారము పొందినది.

"కొంకొక యీ కథ కోరిక సభల
వెలయ బ్రఖ్యాతిగా వేడ్కచెన్నొంద
సలలిత సారాంధ్ర శబ్దసంగతుల
దెలిపెద నీకథ ద్విపద కావ్యముగ
వలనొప్ప నలచక్రవర్తి చరిత్ర
విరచింతు నానేర్చు విధమెల్ల దెలియ"

(58-63)

అని గ్రంథావతారికలో రాఘవాచార్యుడు తెల్పినాడు. తెలుగు నాట పల్లెలలో అపత్సమయములందు రాత్రివేళ దీనిని ఆసక్తితో చదువుట నేటికిని గలదు.

రాఘవాచార్యుడు వైష్ణవ బ్రాహ్మణోత్తముడు. తిరువేంగడాచార్యుని తనయుడు. ఇతడు వైష్ణవుడయ్యు శివకేశవులకు భేదము పాటింపక నలచరిత్రలో మొదట గణేశుని, హరుని, పార్వతిని స్తుతించి పిమ్మట విష్ణ్వాది దేవతలను కీర్తించియున్నాడు. ఇష్టదేవతా స్తుతియందు గణపతిని, త్రిమూర్తులనిట్లు స్తుతించినాడు.

శ్రీ గణపతిని మహాత్ముని
నాగమ సంవేద్యులైన హరుని భవానిన్
భోగీశ శయుని గమలను
బాగుగ బద్మజుని వాణి బ్రస్తుతి సేతున్

ఇష్టదేవతా స్తుత్యానంతరము రాఘవాచార్యుడు వ్యాసవాల్మీక్యాదులను స్తుతించినాడు. దీనినిబట్టి యాతనికి పూర్వకవుల మీద గల గౌరవ భావము వ్యక్తమగుచున్నది.

రాఘవాచార్యుని నలచరిత్రలో కథాప్రారంభము భారత నలోపాఖ్యానము నందున్నట్లేయున్నది. ధర్మజుడడిగిన ప్రశ్నకు బృహదశ్వుడీ నలకథను దెలిపెను. నలకథేతివృత్తమును భారతము నుండి గ్రహించినను రాఘవాచార్యుడు తన నలచరిత్రలో వివిధ మార్పుచేర్పులు చేసినాడు. రాఘవాచార్యుడు కథారంభమున ప్రబంధోచితముగ సుదీర్ఘముగ చేసిన నిషధాపుర వర్ణనను పరికింపుడు.

"శ్రీకర నవహేమ చిత్రగేయములు
ప్రాకార గోపుర ప్రసాదతతులు
కనకంపు మేడలు ఘన మండపములు
వినుతింప దగినట్టి విపణి మార్గములు
కోటల మట్టళ్ళు కొలువు కూటములు
నాటక శాలలు వళిన దీర్ఘికలు
కేళికావనములు గృతకాచలములు
బాలానిలంబులు బహు పుష్పములును
మహనీయ దేవతా మండపంబులును
బహుచిత్రగతులచే బరుగు హర్మ్యములు
శృంగార వనములు చెఱకు దోటలును
వారణశాలలు వాజిశాలలును
మేరుశైలము కన్న మించు తేరులును
పచ్చ తోరణములు బహువిలాసములు
నచ్చుగా గొప్పముత్యముల ముగ్గులును
విమల భూషణములు విహరించు హరులు
వేదశాస్త్రపురాణ విద్యలన్నిటికి
నాదియై వర్తించు నట్టి భూసురులు
రాజులు బలపరాక్రములు రాహుతులు

భూజన సుతులైన బుధులు బాంధవులు
ధనదుని పురినైన ధరయెల్ల జాలు
కొని దాచ గల వైశ్యకోటి చెన్నొంద
హరిభక్తియుతులైన యట్టి శూద్రులును
సరసులు సత్కవీశ్వరులు పాఠకులు
గాముకులును వారకాంతాజనంబు
గామితార్థములెల్ల గలుగు సంగళ్ళు
నానావినోదముల్ నడుపు నాటకులు
మానిత పతిభక్తి మతులైన సతులు
మదమున మించిన మగలును మిగల
మదగజంబుల నిల్పు మల్లులు గలిగి
పురుహూతుడేలిన పురమొకోయనగ
నిరుపమగతి నొప్పు నిషధాపురంబు

(ప్రథమ 2-40)

ఇది అమూలకమే.

నలుని పరిపాలనమును వివరించుచు నలుడు భుజబలోన్నతుడని, గజకంఠీరవుడని, అతని పాలనలో నెలకు మూడు వానలు కురియుననని, దొంగలు లేరని, యాచకులు లేరని, కలహములులేవని అంగహీనులు లేరని. వడ్డిరేట్లు అధికముగ నుండెడిది కాదని, రైతు పదిపాళ్లలో ఒకపాలు మాత్రము రాజునకిచ్చెడి వాడని, గోక్షీరము, పంటలు సమృద్ధిగ నుండెడివని, బ్రాహ్మణోత్తములకు తగినమర్యాద జరుగుచుండెడిదని రాఘవాచార్యుడు తెల్పినాడు. మూలమునందు గాని నైషధమునందుగాని నలుని పరిపాలనకు సంబంధించిన విశేషాంశములు గానరావు.

నలుని సత్యపరిపాలనా దక్షతను వివరించుటకు రాఘవా చార్యుడు గోవ్యాఘ్ర సంవాదమును కల్పించినాడు. అరణ్యమున సంచరించుచున్న వ్యాఘ్రము గోవును జూచి "నీవు నా భయమునకు వెరవకున్నావు. ఇది నలుని పరిపాలనగదా. అందువలన నీకు భయము లేదు. ఈ నలచక్రవర్తి చిరకాలము రాజ్యపాలనచేయునా? చూతము. నలచక్రవర్తి పాలనానంతరమైన నిన్నుపట్టి చంపెదను." అని బెదరించినది. ఇంతలో విష్ణుచక్రము వచ్చి యావ్యాఘ్ర కంఠమును ఛేదించినది. నలుని పరిపాలనలో బలవంతులు బల హీనులను హింసించుట లేదని గోవ్యాఘ్ర సంవాదము వలన నిరూపిత మగుచున్నది. ఈ విషయము నేటికిని జానపదులలో బహుళ వ్యాప్తి చెందియున్నది. గోవ్యాఘ్ర సంవాదము భారత నలకథయందుగాని నైషధమునందుగాని కానరాదు. రాఘవాచార్యుని కల్పనలో నిది ఒకటి.

నలుడు ఉపవన విహారమునకు మంత్రితో వచ్చి హంసల సమూహమును జూచినట్లు, ఆ హంసలను పట్టుకొనుటకు వారు ప్రయత్నించినట్లు, అవి క్రూమానెక్కినట్లు నలుని మంత్రి యాహంసల ను దరిమినట్లు, అవి భూమిపైవ్రాలగ నొక హంసను నలుడు పట్టు కొన్నట్లు రాఘవాచార్యుడు తెల్పినాడు. మూలము నందు హంస లన్నియు ఎగిరిపోయినట్లు, ఎగురలేని ఒక హంసను మాత్రము నలుడు పట్టుకొన్నట్లున్నది. హంస నలునకు దమయంతి వృత్తాంత మును వివరించి చెప్పినది. భీముడు సతీసమేతముగ వనమునకేగి తపమాచరించినట్లు, దమనమహర్షి వారి తపమును మన్నించి తాను వారి పుత్రప్రాప్తికై బ్రహ్మనుగూర్చి తపస్సు చేసినట్లు, బ్రహ్మ ప్రత్య క్షమై వారికి పుత్రప్రాప్తి కలుగునని వరమిచ్చినట్లు, ఆ వరప్రభావము వలన దమయంతి దమనుడు మాత్రమే జన్మించినట్లు రాఘవాచా

ర్యుడు తెల్పెను. భారత నలకథలో దమన మహర్షి వలన భీమరాజుకు దమయంతి దమదాంత, దమనులను పుత్రులు జన్మించినట్లు తెలుపబడినది.

తను గట్టుటకు దాళ్ళు తా దెచ్చుకొన్నట్లు హంసను పట్టుకొన్నదని దమయంతి సఖులు భీమరాజుతో దమయంతి వృత్తాంతమును చెప్పిరి. ఎవరైన తాము చేసిన పని తమకే యిక్కట్లు తెచ్చినపుడు తరుచుగ ఈ లోకోక్తిని వాడుచుందురు. జానపదుల అభిప్రాయమును గుర్తించి రాఘవాచార్యుడు ఇట్టి లోకోక్తులను తన నల చరిత్ర కావ్యమునందు విరివిగా వాడియున్నాడు.

భీమరాజు దమయంతి విరహమును గూర్చి చింతించి ఆడుబిడ్డలను కన్నతండ్రికి పౌరుషము చెడునని పెద్దలు చెప్పిన మాట నిజమని యిట్లు వాపోయెను.

"ఆడు బిడ్డల గన్నయట్టి మానవుని
పాడిపంతంబులు పౌరుషంబులును
జెడునంచు బెద్దలు చెప్పిన మాట
తడయక నిజమాయె దమయంతి వలన
ఏమి సేయుదు నింక నిటమీద నేను
నా మహీపతి బిల్వనఁ పుట గొట్టు
లారాజు బిల్వంగ నలవియేనాకు
నారాజు బిలిచిన నతడేలవచ్చు?"

(1-1144-50)

పుత్రికలున్న తల్లిదండ్రులు వరకట్నములిచ్చుకొనలేక తమ బిడ్డలకేవిధముగ వివాహము చేయుదుమని బాధపడుట, వివాహము

చేయనిచో తమపరువు ప్రతిష్ఠలకు భంగము కలుగునని భావించుట నేటికిని గలదు.

దమయంతీ స్వయంవరమునకు బయలుదేరు నలుని సౌంద ర్యమును జూచి పురస్త్రీలు ముగ్ధులయినట్లు వారాతనిని విష్ణువుగ బ్రహ్మగ, మహేశ్వరునిగ, మన్మథునిగ భావించినట్లు రాఘవా చార్యుడు ప్రబంధోచితముగ వర్ణించిన తీరు చూడుడు.

"చూడరె యీ రాజు సొంపును బెంపు
వేడుకలయ్యెడు వెస జూడ జూడ
దనియ దీతని చక్కదనము యౌవనము
తనరారె నిట్టి యందంబు చందంబు
బొలు పొందునే యెందు భువియందు నివియు
కలవె లోకముల నెక్కడ విచారింప
గంతు డో శ్రీరమాకాంతు డో అలజ
యంతుడో లోక మోహన వసంతుండో
ఈమనుజేశ్వరుండినుడొ చంద్రుండొ
యీ మహామహుడు దేవేంద్రు డొ హరు డొ
నన విల్లుపుష్పబాణములుండెనేని
మనసిజు డని వీనిమది జెప్పవచ్చు
కరముల శంఖచక్రములుండెనేని
పరగ నీతని రమాపతి యనవచ్చు
మూడు కన్నులు ముఖంబున గల్గెనేని
వేడుక బార్వతీ విభు డనవచ్చు
వేయి కన్నులు మేన విలసిల్లెనేని
యా యమరాధిపు డని చెప్పవచ్చు"
2-(67-84)

నలదౌత్యఘట్టమున నలదమయంతుల సంభాషణను స్వయ ముగ దేవతలే అదృశ్యాకారులై విని, నలుని చిత్తశుద్ధికి మెచ్చినట్లు

రాఘవాచార్యుడు పాత్రపోషణాదృష్టితో తన నలచరిత్ర యందు కల్పించినాడు.

స్వయంవరాగతులైన రాజులను గురించి దమయంతికి వసుదేవుడను విప్రుడు వివరించినట్లు రాఘవాచార్యుడు తన నలచరిత్రలో తెల్పినాడు. స్వయంవరాగతుల వృత్తాంతము భారత నలకథయందు కానరాదు. శృంగార నైషధమునందు స్వయంవరాగతులను దమయంతికి సరస్వతీదేవి వివరించినది. నలాకారులైన దేవతలను దమయంతి ప్రార్థించి• నలుని వివాహమాడినది. నలదమయంతుల వివాహమునందు దేశీయములగు శోభనములను, ఆశీర్వాదములను సంగీత వాద్యములను రాఘవాచార్యుడు వర్ణించి తెలుగు ప్రజల వివాహాది ఆచారములకు వన్నెదెచ్చినాడు• చూడుడు-

"కరమొప్ప నవరత్నఖచితమైనట్టి
బంగారు పీటలపై వధూవరుల
నంగ నలటు నిల్పి హారతులొసగ
నవ నీసురాంగన లతి వేడ్కతోడ
ధవళముల్ పాడంగ దండి వాద్యములు
పటహ ధ్వనులు నభోభాగము నింద
దటుకున భేరీ మృదంగ గంభీర
రవమున ధారాధరములు ఘూర్ణిల్ల
గవ గూడి వందిమాగధులు గీర్తింప
సంగతి గా నాగ సరములు పాడ
సంగీత వాద్యఘోషంబులు చెల గ
బూరగల్ గంచు కొమ్ములు కాహళములు
బోరుకల్గుటను నంబుధులెల్ల గల్గ
వేత్తలై హోమముల్ వేల్పించి భూసు
రోత్తములక్షత లొసగి దీవింప
వెలమె వారాంగనల్ నృత్యముల్ సలుప

చెలగి పుణ్యస్త్రీలు నేసలు సల్లి
పలు తెఱంగులను శోభనములు పాడ
చెలువంగ బెద్ద లాశీర్వాదమొసగ
తరలాయతాక్షిని దమయంతి నపుడు
నరపతి నలరాజునకు ధారవోసె"

2 (540-560)

మూలమునందీ విషయము లేదు.

తల్లి దమయంతికి పతిగృహవర్తన విశేషములనిట్లు వివరించినది

"మతితోడ గురుభక్తి మానకెల్లపుడు
సతత పతి వ్రతాచర్యల విడకు
పతిమాట నడచుచు బరిచర్యచేసి
పతిని శ్రీపతిగా గ భావింపుమమ్మ
వసుపతి మనసరి వారల లోన
బొసగ సత్కీర్తుల బుట్టింపు మమ్మ
మదిరాక్షి, చెలువొంద మన వంశమునకు
వదలక మఱిమొక వన్నెదేవమ్మ
కుసుమ కోమలి, బంధుకోటి కీర్తింప
వసుమతీశుడు మెచ్చ వర్తింపుమమ్మ
సరసత నాధుండు చనవిచ్చునపుడు
నరమురి బలుమాటలాడకుమమ్మ"

ద్వితీయాశ్వాసము, ద్వి. పం. 771-782.

పుత్రికల తల్లిదండ్రులు తమ కుమార్తెలకు బుద్ధులు నేర్పి యత్తవారింటికి పంపు ఆచారము నేటికి కలదు. మూలమునందు లేని ఈ సన్నివేశమును రాఘవాచార్యుడు సాంప్రదాయముగ వర్ణించినాడు. నలదమయంతుల వివాహమునందలి శోభనాది విషయములను వర్ణించుటలోను, దమయంతికి తల్లిదండ్రులు బుద్ధులు నేర్పుటలోను

రాఘవాచార్యుడు ఇంచుక నైషధకథను అనుసరించినట్లు కన్పించు చున్నది.

కలి ఇంద్రసభకేగి దమయంతీ స్వయంవరమునకు తాను వెళ్ల దలచినట్లు తనకు కనిపించిన దుశ్శకునముల పరిహారార్థము తగిన ఆశీస్సులను ప్రసాదించుమని ఇంద్రుని కోరినట్లు రాఘవాచార్యుని నలచరిత్రలో కలదు. దమయంతీ స్వయంకన్పించినట్లు భారత వరమునుండి తిరిగి వచ్చు ఇంద్రాదులకు మార్గమధ్యమున కలి నైషధ కథలందు కలదు. నలుడు విష్ణుస్వరూపుడని, ఆచారవంతు డని అతనిని పట్టవలదని, పంతము మానుమని ఇంద్రాదులు కలిని వారించినట్లు రాఘవాచార్యుడు కల్పించినాడు. ఇది నలపాత్రౌచిత్య దృష్టితో చేసిన అమూలకమైనకల్పనము తాను దమయంతిని యింతకు పూర్వమే వలచినట్లు తాను వలచిన స్త్రీని పరపురుషుడు పాణిగ్రహణము చేసికొనుట తనకు సమ్మతముకాదని కలి ఇంద్రా దులతో బాధపడి చెప్పినాడు. కలి నలునిపై పగబూనుటకు గల కార ణమును, కలి అసూయాగ్రస్త మనస్తత్వమును రాఘవాచార్యుడు తన ద్విపదనలచరిత్రలో చక్కగా చిత్రించెను. కలి నలుని పట్టుటకు నిషధదేశమున రంధ్రాన్వేషణము చేసినట్లు శృంగారనైషధముననుస రించి రాఘవాచార్యుడు చెప్పినాడు.

నలుని శరీరమునందు ప్రవేశించుటకు కలి చిరకాలము నిరీక్షించినాడు. అంత ఒకనాడు నలుని పాదశౌచము నొకించుక తడియక యున్నపుడు కలి నలుని శరీరమునందు ప్రవేశించెను. పాదములు కడుగకుండ అపరిశుభ్రముగా నున్న వ్యక్తిని కలిపట్టునని జానపదులనుకొను విషయమిందు తెలుపబడినది.

కలి మాయా కిరాత వేషమున నలుని సమీపించి అతని వేటకు పురికొల్పినట్లు రాఘవాచార్యుడు కల్పించెను. నలుడు పురమార్గమున ఒక కొలనును గాంచుట, ఆ కొలనులోని జలము సేవించి విశ్రాంతి తీసికొనుట, తన భార్యతోపాటు రాజ్య బహిష్కృతుడయినట్లు

నలుడు కలుగాంచుట, —అనునవి రాఘవాచార్యుడు కథౌచిత్యము కొరకు కల్పించినవే. కలి పుష్కరుని నలునితో జూదమాడుటకు పురికొల్పెను. పుష్కరుడు నలుని జూదమాడుటకు పిలువగా అందులకు నలుడు నిరాకరించి ఇట్లు పల్కినట్లు రాఘవాచార్యుడు తెల్పినాడు.

"ధరలోనమాకు జూదంబాడ దగదు
ప్రవిమల సత్యసంపద వాసిపోవు
నవివేక మొలయుదురాగ్రహంబొదవు
నటుగాన జూదంబు నాడంగ దగదు
అటు వంటి పని సేయ నర్హమేమనకు"

నల. చ. త్రి. ద్వి. పం. (496-500)

నలుడు పుష్కరునితో జూదమాడుటకు అంగీకరింపకుండుట వలన కలి నలుని ద్యూతకార్యమునకు పురికొల్పవలసి వచ్చినది. నలుడు పుష్కరునకు జూదమున కోల్పోయిన వస్తుసామగ్రిని రాఘవాచార్యుడు ఇట్లు ఏకరువు పెట్టినాడు.

"సరిలేది మత్త గజంబుల నోడె
గరకరి గజతురంగంబుల నోడె
దడబడ కరుగు రథంబుల నోడె

గడగి నిండిన ధాన్యకణజంబులోడె
బసగల్గు బంగారు పల్లకీ లోడె
మసలక ఛత్త్రచామరముల నోడె
రంగైన దివ్యాంబరములనోడె
సంగీతములు పాడు సకియల నోడె
రమణీయ మగు ధనరాసుల నోడె
వారక భటజనవర్గంబు నోడె"

3 (583-594)

ఇది అమూలకాంశమే. పౌరులు నలుని జూదమాడరాదని ప్రాధేయ పడుట, అందులకు నలుడు నిరాకరించుట. నలుడోడుటను జూచి పౌరులు దుఃఖించుట, నలుడు భార్యతో కలిసి యరణ్యమేగుట, అచ్చట వారికి వసిష్టుడు కన్పించి కర్తవ్యోపదేశము దెల్పుట, అను విషయములను రాఘవాచార్యుడు సందర్భోచితముగ చిత్రించెను. నలుడు దమయంతి నూరార్చుచు పూర్వజన్మమునందు చేసిన కర్మ వలన తమకు ఈ జన్మమున కష్టములు ప్రాప్తించినవని తెలిపినట్లు రాఘవాచార్యుని నలచరిత్రలో కల్పింప బడినది. పక్షులు నలుని వస్త్రమపహరించి తాము కలిప్రేరణచే వచ్చితిమని చెప్పినట్లు ఇందు కల్పింపబడినది. మూలమునందీ విషయము లేదు.

అరణ్యమున నలదమయంతులు ఏకవస్త్రధారులై దుర్భర కష్టములనుభవించు చున్నపుడు కలి వారికి మాయా బ్రాహ్మణ వేషమున కనిపించి, వారి పరస్పర వియోగమునకు నాలుగు త్రోవలు చూపినట్లు నిందు తెలుపబడినది.

"ఇదిగో నాలుగు త్రోవలేర్పడియున్న
వది విదర్భపురికి నరుగుచు నుండు
నది ఋతుపర్ణుపురాధ్వంబు గాన
నది యయోధ్యాపురి కరుగుచునుండు
నది సుబాహుని పురి కరుగుచునుండు"

(నల చరిత్ర, తృతీ. 1125–30)

కలి నాలుగు త్రోవలు చూపిన విషయము భారతమునందు లేదు. ఇది రాఘవాచార్యుని కల్పనయే. కష్టములనుభవించుచున్నపుడు నలుడు దమయంతితో చెడి చుట్టములచెంత చేరరాదని చెప్పెను. ఐశ్వర్యవంతుడైనపుడున్న గౌరవము ధనహీనుడుగ నున్నపుడుండదు. కావున ఐశ్వర్యహీనుడు చెడి చుట్టములచెంత చేరినచో తప్పక పరాభవము చెందునని జానపదులు విశేషముగ చెప్పుకొనుచుండు విషయమునిందు తెలుపబడినది.

నలుడు దమయంతి వస్త్రములో సగము చించుకొని వెడలి పోవుచు భూదేవిని, ఆకాశవాణిని ప్రార్థించి దమయంతిని పుట్టింటికి చేర్చుమని ప్రార్థించి నట్లు నిందు తెలుపబడినది.

నలుని రూపము చెరచుటకు కలి అగ్నిని పుట్టించుట అనునది రాఘవాచార్యుడు కల్పించినదే. అగ్ని యందు కర్కోటకుడను సర్పము దహింపబడుట, దానిని రక్షింపబోయి నలుడు వికృత రూపుడగుట అనునది మూలమునందు కూడ కలదు.

అడవిలో దమయంతి మేల్కొని నలుని గానక దుఃఖించుచు తిరుగుచుండగా ఆమెను ఒక పాము కరచెను. కలిమాయచే బోయ వాడు వచ్చి సర్పమును చంపును. దమయంతి పాతివ్రత్యమును భంగపరచుటకు కలి బోయవానిని పంపినట్లు రాఘవాచార్యుడు తెల్పి కథకు ఔచిత్యమును గూర్చెను. బోయవాడు దమయంతిని తనతో రమ్మనుట, అందులకు దమయంతి నిరాకరించి ధరణిలో గురుసతి, రాజుసతి, అన్న సతి, తన సతి తల్లి, తన తల్లి అని ఐదు గురిని తల్లులుగా బోయవానికి నెరిగించుట ఇందు తెల్పబడినది. దమయంతి తన పాతివ్రత్యమహిమచే తుదకు బోయవానిని శపించి భస్మము చేసినది.

అడవిలో దమయంతి నలుని వెదకుచు ఒక మున్యాశ్రమము జొచ్చెను. మునులు యోగదృష్టితో నలుని వస్త్రమును పక్షులపహరించి నట్లు, నలుని పాము కరచినట్లు, నలుడు వికృతరూపము పొంది అయోధ్యాపురముచేరి ఋతుపర్ణుని సేవించినట్లు తెలిసికొని దమ యంతికి కలిగిన కష్టములు సవిస్తారముగ దెల్పి, కర్తవ్యోపదేశము చేసినట్లు నిందు కలదు. మున్యాశ్రమమును రాఘవాచార్యుడు కల్పింపక పోయినను మునులు చెప్పిన బాహుక రూపవృత్తాంత మును దమయంతికి రాగల సైరంధ్రి వృత్తాంతమును కల్పించి రాఘవాచార్యుడు భావికథావిశేషమును సూచించెను.

నలుడు బాహుక రూపమున ఋతుపర్ణుని సేవించెను. రాత్రి వేళలలో బాహుకుడు దమయంతిని గూర్చి విలపించుటను రాఘవాచార్యుడు కరుణరసపూరితముగ నిట్లు చిత్రించెను.

"అకటా! నిన్ను ఘోరాటవిడించి
పొక్కుచు వచ్చి యీపురి జేరినాడ
నను నీవు వెదకి కానలలోన దిరిగి
కనలేక యెట్టి దుఃఖము బొందినావొ,
గిరిగృహంబుల నన్ను గెరలుచు వెదకి
గురుమృగంబుల చేత గూలితివేమొ
పన్నుగా బొదలలోపల నన్ను వెదకి
పన్నగంబుల కగపడితివో లేమ
ఆయెడ నను గాన కడలుచు నుండ
బోయల మాయల బోయితో భామ
వెలవెల పాటున వెదకుచు నన్ను
బలుమారు నీవెంత బడలితో చెలియ
విడువక ననునీవు వెదకంగ వచ్చి
యిడుమల బడచు నెవ్వేగితో తరుణి
కలనైన నను బాయగా జాలనంచు
బలికితి విపుడెట్లు బాసితో లలన
నిదుర మేల్కాని నన్ను నెమ్మితోగాన
కదరి యొంటిగ మూర్ఛనందితో తరుణి"

పంచ ద్వి. పం. 9-28.

నలకథ ఉత్తరభాగమంతయు దమయంతి మీదుగా జరిగినది. ఇది నలకథయనుటకంటె దమయంతి కథయనుట సమంజసము. వసుదేవుడను విప్రుడు దమయంతిని చేదిపురమున కనుగొనుట, పిన తల్లి దమయంతి కష్టములు గ్రహించి బాధపడుట, తల్లిదండ్రులు దమయంతిని జూచి వగచుట, దమయంతి బిడ్డలనుజూచి వగచుట,

వసుదేవుడు దమయంతి పలికిన పలుకులను ఋతుపర్ణుని ఆస్థానమున చెప్పుట, అందులకు బాహుకుడు ప్రత్యుత్తరమిచ్చుట, దమయంతి తండ్రితో నలుని రప్పించు నుపాయము దెలుపుట, భీముడు దమయంతీ ద్వితీయ స్వయంవరమునకు ఋతుపర్ణుని రప్పించుట, ఋతుపర్ణ బాహుకులు విదర్భకు పోవు మార్గమున పరస్పరము విద్యలు గ్రహించుట వంటి అంశములు భారత నలకథయందున్నట్లే యిందును గలవు. నలుఁడు దమయంతిని పరీక్షింపగోరుట, దమయంతి అగ్నియందు ప్రవేశించుట, దమయంతి పతిభక్తికి మెచ్చి దేవతలు ప్రత్యక్షమగుట, నలుడు విష్ణువును స్తుతించుట, భగవంతుడు నలునకు కర్తవ్యము దెలిపి వరములిచ్చుట, వసిష్ఠుడు నలునకు పదేశమిచ్చుట అను అంశములను మూలమునందు లేని వానిని రాఘవాచార్యుడు నూతనముగ కల్పించెను.

రాఘవాచార్యుడు భారత నలకథను గ్రహించి అందు కథాగతమైన వివిధ కూర్పులనేకాక, సందర్భానుగుణముగ ప్రబంధోచితములగు వివిధాలంకారములను, వర్ణనలను కూడ ప్రవేశపెట్టినాడు, నలుడు ఉపవనవిహార సందర్భమునందు చేసిన వసంత వర్ణన కథాగమనమున కనువుగ నున్నది. చూడుడు—

"అంతట గొన్నాళ్ళ కతిచిత్రముగను
సంతత గతిని వసంత కాలంబు
సనుదెంచె మందార జంబీరములును
పనస పిప్పల నింబ పారిభద్రములు
జందన పున్నాగ సహకారములును
కుంద కురంటక కోవిదారములు
లుంగ లవంగ మాలూర వృక్షములు
సంగత ఖర్జూర చంపకంబులును
సురపొన్నలును మంచి చూత పోతములు
కురవకంబులు గేదగులు నశోకములు

పుల్లమామిళ్ళ కర్పూర భూజములు
నల్లని యరటులు నారికేళములు
నారద పాటలీ నాగ తింత్రిణులు
గోరింట లరటులు కుడజ భూరుహము
లాదిగా గలిగిన యారామ భూమి
పాదుగా నప్పుడేర్పడుపంగ నాకు
రాలిమొక్కట నతిరమ్యమైయుండి
యాలోన జిగురించె నంతలో గానె
పూచి ఫలించె బుప్పొడి చల్లగాలి
వీచె నేలను వ్రాలె వింత వింతగను
పలుమాఱు బలుమాఱు పంచవన్నియల
చిలుకలు తేనియల్ చింద బల్కుచును
గోరి కోకిలలెల్ల గుమికూడి ముద్దు
గార వివిధముల గలయ గూయుచును
నళులు జుమ్మనుచు నెయ్యమున మ్రోయుచును
నలరుల తేనియలంది క్రోలుచును
శారికల్గుమిగూడి సామగానమును
దీరుగా నందంద దెలియ బల్కుచును
జెలువొంది చూడ విచిత్రమై"

(1-121—150)

ఇది అమూలకమే. నలుడు ధీరలలితుడు, సత్యవ్రతుడు, ఆచారవంతుడు. నలునిచేత వసంతుని పూజ గావింప వలయునని మంత్రులు వివిధమేళతాళములతో ఉద్యానవనమునకు వచ్చిరి. అట్టి వసంతోత్సవ సమయమున హంసలు ఉద్యానవనమున నలునకు కన్పించినవని రాఘవాచార్యుడు తెలిపెను. ఈ వసంత వర్ణన నలకథకు బీజప్రాయమైనది. ఇది నలునకు హంస దొరుకుటతో మొలకెత్తినది. హంస దౌత్యముతో చిగురించినది. నలదౌత్యముతో శాఖోపశాఖలుగ విరిసినది. దమయంతీ స్వయంవరముతో ఫలించినది.

దమయంతికి నలునిపై గల విరహవేదనను చెలులిట్లు భావించిరి.

"ఇదియేమి నెలత, నీకిటువలె నలత
యిదియేమి చెలియ, నీకిటు వలె సొలయ
నిదియేమి లలన, నీకిటు వలె జలన
మిదియేమి మగువ, నీకిటు వలె వగవ
నిదియేమి తెఱగు నీకిటు వలె మఱుగు
నిదియేమి వింత నీకిటు వలె జింత
యిదియేమి యబల, నీకిటు వలె బడల
నిదియేమి కన్నె, నీకిటు వలె జిన్నె
యిదియేమి పొలతి, నీకిటువలె యలతి
యిదియేమి భామ, నీకిటువలె ప్రేమ
యిదియేమి కొమ్మ, నీకిటు వలె నమ్మ
యిదియేమి తరళాక్షి. యింత నీమదికి
నిదియేమి మమత నీకిటు వలె నలత
యిదియేమి మదిరాక్షి, యింత బాలార్చి
యిదియేమి యింతి, నీకింత విభ్రాంతి"

1-(923-937)

ఇది శబ్దాలంకారయుక్తమైన రచన. దమయంతి విరహవేదనను దెల్పు సందర్భముననే రాఘవాచార్యుడు కావ్యోచితము సాయంకాల వర్ణనము, చంద్రోదయ వర్ణనము, విప్రలంభవర్ణనము. ప్రాతఃకాల వర్ణనము, సూర్యోదయ వర్ణనములను చేసినాడు. ఇవి ప్రబంధోచితముగ చేసిన వర్ణనలే.

భీమరాజును వీడ్కొని నలదమయంతులు నిషధదేశమునకు వెళ్ళిరి. పౌరకాంతలు నవవధువులైన దమయంతిని జూచి అన్న మాటలను రాఘవాచార్యులు అలంకారిక శైలిలో ఇట్లు వర్ణించినాడు.

ముక్తపదగ్రస్తము: "నీ మానినీమణి నిదె చూడరమ్మ
రామాభిరామ నిర్భరపుణ్యసీమ

సీమకాదిది మంచి చెలువైన లేమ
లేమకాదిది మంచి లేమావి కొమ్మ
కొమ్మగాదిది మంచి కులుకు కెందమ్మి
తమ్మిగాదిది మంచి తావి పూలతిక
లతిక కాదిది మంచి లావణ్య ప్రతిమ
ప్రతిమ గాదిది పుష్పబాణుని దంతి
దంతి గాదిది రతి గతమెచ్చు కాంత
కాంత గాదిది సీటు గలభోగి కన్నె
కన్నెగాదిది మెచ్చు కనకంపు దిన్నె
తిన్నెగాదిది తావి తేట పన్నీరు
నీరుగాదిది చిన్నినెలరాజు తేరు
తేరుగాదమ్మ యీదేవి లావణ్య
మంతయు వర్ణింప నలవియే మనకు
వింతగా?"

నల. (2-811-825)

దమయంతీ సౌందర్యమును జూచి పౌరకాంతల అన్యోన్య ప్రసంగ మును ముక్తపదగ్రస్తాలంకారమునందు రాఘవాచార్యుడు శోభాయ మానముగ వర్ణించినాడు. ఇది అమూలకమే.

ఇట్లు రాఘవాచార్యుడు భారతనలకథను విస్తరించి వ్రాసెను. ప్రబంధోచితములగు వర్ణనాలంకారములనేగాక జానపదుల భావము లను సంప్రదాయములను మేళవించి నలచరిత్రను రచించుటచే రాఘవాచార్యుని ద్విపద నలచరిత్రకు తెలుగునాట తక్కిన నల చరిత్రలకు లేని ప్రశస్తి ఏర్పడినది.

## 4.2 తిమ్మయ కవి నలచరిత్రము:

నన్నయ భారతారణ్య పర్వములోని నలోపాఖ్యానము నాధార ముగ చేసుకొని ద్విపద భారత కవిత్రయములో నొకడైన తిమ్మయ (16వ శతాబ్ది) ద్విపదలో నలచరిత్రను రచించెను. ఇది

అముద్రితము. ఇందు పూర్వోత్తర కథాంశములున్నవి. సంపూర్ణ నల కథాకావ్యముగ కల్పించినను ఇందు విషయము సమగ్రముగ లేదు.

సంస్కృత వ్యాసభారతమును మాతృకగా కవిత్రయము వారు తెలుగులోనికి అనువదించినట్లే, కవిత్రయమువారి భారతమును తిమ్మన, సోమన, బాలసరస్వతి అనువారు ద్విపదలోనికి అనువదించిరి తిమ్మయ ద్విపద భారతములో అరణ్య పర్వమును అనువదించినను అందలి ఉపకథలను పూర్తిగ విస్మరించి ప్రధాన కథ యగు కురుపాండవుల కథను ఐదాశ్వాసములుగ రచించెను. అరణ్య పర్వాంతర్గతమగు నలకథను తిమ్మయ తన ద్విపద భారతానువాదమున వదలినాడు. తిమ్మయ సంగ్రహముగ చెప్పిన అరణ్య పర్వమును సోమన మరికొన్ని ఉపాఖ్యానములతో విపులీకరించి అయిదాశ్వాసముల నేడాశ్వాసములుగా వ్రాసెను. ద్విపద భారత రచనమున తాను విడిచిన నలోపాఖ్యానమును తిరిగి ప్రత్యేక కావ్యముగ వ్రాయుటలో గల అభిప్రాయమును తిమ్మయ క్రింది విధముగ తెల్పినాడు

"నలుని చరిత్రంబు నరులెవ్వరేని
వెలయంగ వ్రాసిన చదివినవారు
పుర్విసారాజు పేర్కొని దలచినను
సర్వగ్రహంబులు సంతోషమొసగు
నాశనీశ్వరుడుగనవనీశునుతిని
జేసిన వారల చేరడీ చరిత
వినిన పుణ్యులు పాపగతికిని జనరు
ఘనత వ్రాసిన వారి కాంక్ష లీడేరు
విను తత్త్వద్విష్ణు పృధ్వీపతియనగ"

నలనామస్మరణము వలన సర్వగ్రహణదోషము తొలగుననని, శనేశ్వరుడు చేరడని, నలుని కథను విన్నవారు పాపగతి చెందరని, దీనిని వ్రాయుటవలన ఇష్టార్థసిద్ధి కలుగునని నలకథకు గల ప్రాశస్త్యమును

తిమ్మయ కవి అవతారికయందు వివరించెను. తిమ్మయ ద్విపద నలకథా కావ్యము శ్రీరామచంద్రుని కంకితమీయబడినది. ఆశ్వాస విభాగముల వివరములిందు తెలియరావు. భారత నలకథను శృంగార నైషధకథను చక్రపురి రాఘవాచార్యుని నలకథను అనుసరించి తిమ్మయ ద్విపద నలచరిత్రను రచించినట్లు తెలియుచున్నది.

కథారంభము భారత నలకథయందున్నటే బృహదశ్వుడు ధర్మరాజుకు నలకథను తెలిపినట్లున్నది. నలుని రాజ్యము సుభిక్షముగా నుండెనని చారులు, చోరులు, క్రూరులు, నలరాజ్యమున శోధించినను లేరని చెప్పి, నలుని సత్యధర్మ పరిపాలన నిరూపించుటకు గోవ్యాఘ్రసంవాదమును రాఘవాచార్యుని ద్విపద నలచరిత్ర ననుసరించి తిమ్మయ తన ద్విపద నలచరిత్రయందు తెల్పినాడు.

నలునిచే పట్టుబడిన హంస తన కుటుంబ పరిస్థితులను వివరించి తన్ను విడువుమని నలుని వేడిన విషయము శృంగార నైషధముననుసరించి కాబోలు తిమ్మయ వర్ణించినాడు. రాఘవాచార్యుని ద్విపద నలచరిత్రలో నున్నట్లుగానె తిమ్మయ తన నలచరిత్రలో దమన మహర్షి దయవలన దమయంతి దమనాఖ్యుడు జన్మించినట్లు తెల్పియున్నాడు.

భారత నలకథలో కలిప్రవేశము కలదు. తిమ్మయ ద్విపద నలచరిత్రలో శని ప్రవేశము కలదు. నలకథలో కలిని బదులు శనిని ప్రవేశ పెట్టిన మొట్టమొదటి తెలుగు కవి తిమ్మనయే.

పుష్కరుడు తన్ను జూదమునకు ఆహ్వానించినపుడు నలుడు నిరాకరించుట, జూదమాడు బుద్ధిని, నలునకు శని కల్పించుట, వివాహానంతరము నలదమయంతులు నిషధకు పోవునపుడు వారి వెంట 21 మంది రాజులు వెళ్లుట, శని నలునిపై పంతము పూనుట, అడవిలో తిరుగుచున్నపుడు, నలుడు దమయంతితో తన బిడ్డల సంగతి దలచి దుఃఖించుట, ఆకలి బాధకై దమయంతి విషపత్రి

ములు తినుట, అవి జీర్ణమై ఆకలిని చల్లార్చుట, కామాతురుడైన బోయవానికి దమయంతి పరస్త్రీ సంగమము వలన కలుగు అరిష్టము లను దెల్పుట, బోయవానిని శపించి దమయంతి తనలో ఆడబుట్టుగ పుట్టిన దోషము, మరి పగ వారికి వలదని భావించుట, నలుడు దమయంతికి నాలుగు త్రోవలు జూపుట, జూదము వలదని నలుని వసిష్ఠుడు వారించుట, నలుడు జూదమున కోల్పోయిన వస్తువులను దమయంతి స్వయముగ చూచుట, నలదమయంతుల వివాహమును పార్వతీపరమేశ్వరులు, లక్ష్మీనారాయణులు, సరస్వతీ చతుర్ముఖులు రోహిణీచంద్రులు జూచి వారినాశీర్వదించుట అనువానిని తిమ్మయ తన ద్విపద నలకథాకావ్యమున నూతనముగ తెలిపెను.

కథావిషయమునందేగాక రచనావిషయమునందును తిమ్మయ చక్రపురి రాఘవాచార్యుని అనుసరించినాడు.

దమయంతి విరహమును గూర్చి చెలులు భీమునితో చెప్పు సందర్భము.

## చక్రపురి రాఘవాచార్యుడు చెప్పిన ద్విపదలివి:

ఇగురు పానుపు మీద నింతినిజేర్ప
జిగురాకులన్నియు జెచ్చెర గపులె
దలచి తామర పూల తల్పంబు నందు
బొల తుక నుంచిన బొగలుగా నెగసె
జల్లని నీటిలో సకియ నుంచినను
గల్లగాదది వెచ్చగానాయె జలము
ముత్తెపు సరములు ముదితకు నిడిన
గ్రొత్త నీలము లాయె గుసుమాస్త్రవహ్ని
జందనంబల దిన జలజాక్షి మేన
బన్నీరు కడవల బట్టి తెప్పించి
వెన్నున బోసిన వెలది శోషించు

చ. నల. 1- (1120-1131)

పై ద్విపద పంక్తులను బోలిన ద్విపదలనే తిమ్మయ తన నలచరిత్రలో క్రిందివిధముగ రచించినాడు.

"ఇగురుపానుపు మీద దమయంతి నుంచితే
చిగురు లంతయు నంత జుప్పన గమలె
తలచి తామర తూళ్ళ తల్పంబు మీద
చల్లని నీటిలో సఖియ నుంచినను
కల్లగాదవి యెల్ల వెచ్చజా వాయు
ముత్యంబు సరులును ముదితకు నిడిన
కొత్త నీలములాయె కుసుమోష్ణ్యవహ్ని"

నారదుడింద్రునితో దమయంతీ సౌందర్యమును వివరించు సందర్భమున రాఘవాచార్యుని ద్విపదరచన క్రిందిది.

చూచితి బార్వతి జూచితి లక్ష్మి
జూచితి భారతి జూచితి రతిని
జూచితి తారను జూచితి శచిని
జూచితి మేనక జూచితి రంభ
చ. నల, 2- ( 32_35 )

దీనిని తలపింప జేయు తిమ్మయ ద్విపద రచనను చూడుడు.

వాణి జూచితిని శర్వాణి జూచితిని
రాణించు నాహరి రాణి జూచితిని
కన్న విన్నది గాదు కాంత రూపంబు

రాఘవాచార్యుని రచనలోని ఆలంకారికమైన సొగసు తిమ్మయ రచనయందు కానరాదు.

స్వయంవరాగతులైన రాజుల వృత్తాంతమును దమయంతికి వసుదేవుడు తెలిపిన విధమును రాఘవాచార్యుడిట్లు వివరించినాడు.

కలకంఠి యీతడు గౌళభూనాథు
డలివేణి యితడు మహారాష్ట్ర విభుడు
లలన యీఘనుడు మాళవమహీశ్వరుడు
నెలత యీనరపతి నేపాళ విభుడు

..............................

..............................
చెలియ యీ ధీరుండు సింధు భూనాథు
డనియిట్లు రాజుల నందరి జూపి"
నల. 2-(445-459)

రాఘవాచార్యుని ఈవర్ణన నాటకీయమున కనువుగ దృశ్యమానమగు చున్నది. స్వయంవరాగతులను దమయంతికి పార్థివేశ్వరుడు జూపి నట్లు తిమ్మయ తెలిపిన విధము గమనింపుడు—

"కుంతలేశ్వరుజూపి కాంభోజ జూపి
ఘూర్జరుజూపి గౌళాధిపతి జూపి
మాళవేశ్వరు జూపి మగధుని జూపి
చోళాధిపతి జూపి..........

..............................

..............................
అనుచు రాజేంద్రుల నందఱ జూపి"

తిమ్మయ ఈ రచన కేవలము కథాకథన పద్ధతిని నడచినట్లు గమనింప వచ్చును.

దమయంతి నేలపై పరుండిన దృశ్యమును గాంచి నలుడు శోకించిన తీరును రాఘవాచార్యుడిట్లు వర్ణించినాడు.

"చటుల మధ్యాహ్న భాస్కర కిరణముల
స్ఫుటముల కందిన పూదీగె వోలె
నటవుల, ద్రిమ్మరి యాకట సొలసి

మదిరాక్షి తన దేవి మహిమీద బండి
నిదుర వోవగ జూచి నృప కుంజరుడు
సన్నుత సకల రాజన్య కామినులు
కన్ను సంజ్ఞలనూడిగంబులు సేయ
హంస తూలికల శయ్యను నిద్ర బోవు
హంస యానకు పానుపయ్యె బోనేల"

చ. నల. (3-1238—1247)

ఈ సందర్భమున రాఘవాచార్యుని అనుకరించి తిమ్మన చేసిన రచనను చూడుడు.

"చటుల మధ్యాహ్న భాస్కర ఘోరకిరణ
స్ఫుటవల్లి గందిన పూదీగె వోలె
కసిగంది ధరమీద కన్నులు మోడ్చి
కుసుమ కోమలి నిద్ర కోరియున్నదియు
సన్నుత బహురాజ సతులెల్ల గొలువ
కన్నెలు బహునూడిగములు సేయగను
హంస యానకునేడు అడ్విపాలయ్యె"

ఇట్లు తిమ్మయ రాఘవాచార్యుని అనుసరించి రచించినను రాఘవాచార్యుని నలకథకు వచ్చిన ప్రజాదరణ తిమ్మయ నలకథకు లభింపలేదు.

## 4. 3 రఘునాథ నాయకుని ద్విపద నలచరిత్ర:

రఘునాథనాయకుని నలచరిత్ర పూర్వోత్తర కథాంశములున్న ఎనిమిదాశ్వాసముల ద్విపద కావ్యము. దీనిని మొట్టమొదట చెలికాని లచ్చారావుగారు 1929లో తమ "ఆంధ్రభాషావిలాసిని" పత్రికలో అచ్చువేసినారట. ఆ తరువాత ఇది గ్రంథ రూపమున ఆవిష్కరింప బడినదట. ఈ గ్రంథము ముద్రితమయినప్పటికి ఇప్పుడు లభించు

టలేదు. తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయములో రఘునాథ నాయకుని ద్విపద నలచరిత్రలోని రెండు ఆశ్వాసము లు మాత్రమే లభ్యమైనట్లు, వానిని పరిశీలించి అందలి సాహితీ విశేషములు రఘునాథనాయకునివి కావని ఆచార్య కె. వి. ఆర్. నరసింహంగారు తమ దక్షిణాంధ్రవాఙ్మయ చరిత్ర యందు నిరూపించిరి. డా॥ జి. నాగయ్యగారు తమ ద్విపదవాఙ్మయములో రఘునాథనాయకుని నలచరిత్ర నుండి కొన్ని ఉదాహరణములిచ్చుచు రఘునాథరాయల నలచరిత్రలో ఆశ్వాసాంతగద్యము కన్పట్టుటలేదని తెలిపిరి. వీరి అభిప్రాయము ప్రకారము రఘునాథనాయకుని ద్విపద నలచరిత్ర సంపూర్ణముగ లభించుటలేదని తెలియుచున్నది. ఏ. వీర ప్రసాద రావు రఘునాధనాయకుని కృతులు విమర్శనాత్మక పరిశీలనము అను తన సిద్ధాంత వ్యాసములో తనదగ్గర ఎనిమిదాశ్వాసములు గల సంపూర్ణమైన నలచరిత్ర యున్నదని, అదియే రఘునాధనాయకుని కృతియని స్పష్టపరచెను. కాని అది ముద్రితమా? అముద్రితమా? అను విషయము వారు తెలుపలేదు.

రఘునాథనాయకుని ద్విపద నలచరిత్రలోని విశేషములను వివరించుటకు డా॥ మద్దూరి సుబ్బారెడ్డిగారి దగ్గరున్న అముద్రిత తాళపత్రప్రతి నాకెంతో ఉపకరించినది.

రఘునాథుని నలచరిత్రకు భారతారణ్యపర్వములోని నలోపాఖ్యానమే మూలమని గ్రంథాంతమందలి క్రింది ద్విపదలను బట్టి తెలియును.

"రంగుగా జెలగు భారత పురాణమున
పన్నుగా నారణ్య పర్వంబు నందు
చెన్ను రంజిల్ల మించిన నలచరిత్ర"

భారత నలకథకు శృంగార నైషధకథనుకూడ జోడించి రఘునాధుడు నలచరిత్రను రసవత్ప్రబంధముగా చిత్రించెను. రఘునాధనాయకుని

కి కలలో శ్రీరామచంద్రుడు కన్పించి నలచరిత్ర కావ్యమును రచించి తనకు అంకితమిమ్మని కోరినందువలన నలచరిత్రను రామాంకింతముచేసినట్లు అవతారికలోను, ఆశ్వాసాంతగద్యములోను చెప్పికొనినాడు.

"నానావినవశోభవి విధానమైన
యీ నలోపాఖ్యానమెవ్వరు భక్తి
వినిన వ్రాసిన చదివిన వారలెల్ల
ఘనరారోగ్య భాగ్యములుల్లసిల్ల
పుత్రమిత్ర కళత్ర పూర్ణులై యపుడు
ధాత్రిపై యశము ప్రతాపసంపదల
చేత వర్ధిల్లుచు సరవి నెల్లెడల
పాలు వొంగిన భంగి బహుళభోగముల
వెలయుదురిది విన్నవెనక సద్భక్తి
ఋతుపర్ణవిభుని బల్ రూఢికీర్తింప
సతతంబు సామ్రాజ్యరాజ్యము గోరు
దాయాదులను గెల్వదలచిన యతడు
పాయక యీకావ్యపఠనంబు చేయ
సకల దాయాదులక్షణమె జయించి
యకళంకముగ భూమి యెల్లను నేలు
నిదియ గాదీకావ్యమెవ్వడెవాల
పదిలంబు గాజూచి ప్రతిపదార్థంబు
తెలుసుకున్న సరస్వతీ ప్రసాదంబు
కలిగి యఖిలకార్యకర్తయౌనతడు
సీకృతి యెవ్వాని యింటిలో మెరయ
శ్రీకాంత వానింట చెలగుచు నుండు"

నల. 8వ ఆశ్వాసము. (1235-1257)

పూర్వోత్తర కథాంశములున్న సంపూర్ణ నలచరిత్రను తాను రచింప బూనినట్లు రఘునాథనాయకుడు ఇట్లు తెల్పినాడు.

"అరసి యీ కథ తొల్లి వ్యాసమహర్షి
వరుడె యాద్యంతముల్ వ్యక్తంబుగాగ
పలికె పిమ్మట నట్లు పలుకంగ లేక
యలసులయి యేమొ శ్రీహర్షాదికవులు
పూర్వభాగము జెప్ప బూనిరి గాని
సర్వంబు జెప్పంగ జాలరైరెందు
పూర్వోత్తర కథాంశములు సకలంబు
నిర్వహించెద"

ప్రథమాశ్వాసము. (157-170)

పూర్వకవుల మీద రఘునాథునకు అమితమైన గౌరవమున్నది. కవిత్రయము వారిని గూర్చి నిట్లు వినుతించెను.

"శిలలలోపల వెన్న చిలికిన కరణి
నలఘుసంస్కృతముల యర్థంబులెల్ల
దెలుగు మాటలదేట తెల్లంబుగాగ
జెలువొంద బల్కనేర్చిన నన్నపార్య
దిక్కయజ్వను నెఱ్ఱదీమణి దలచి"

-అవతారిక (105-110)

నవరసములపై రఘునాథనాయకునకు ప్రత్యేకమైన మక్కువ యున్నది. అతడు శ్రీనాథుని నవరసనాథునిగా పేర్కొని పొగడినాడు.

"అక్కజంబుగనిటు తాననుభయ
భాషల నానార్థభంగులింపార
నైషధాది ప్రబంధములెన్నేని
భువినిల్పి సత్కీర్తి బొందినయట్టి
నవరస నాథు శ్రీనాథుని బొగడి"

(నలచరిత్ర-అవతారిక భాగము)

రఘునాథనాయకుని నలచరిత్ర రచనకు పూర్వమే చక్రపురి

రాఘవాచార్యుని ద్విపద నలచరిత్ర, బట్టేపాటి తిమ్మయ ద్విపద నలచరిత్రలు వెలువడినవి. ఇవి రెండును సంపూర్ణనలకథాకావ్యములే. చక్రపురి రాఘవాచార్యుని నలకథ ప్రజాదరణ పొందిన ప్పటికి అందలి రచన పేములవగా నున్నది. పైగా శ్రీనాథుడు శృంగార నైషధములో చూపిన పెక్కు సొగసులు నతడెక్కడ గ్రహించి నట్లు లేదు. తిమ్మయ నలచరిత్ర రాఘవాచార్యుని రచనను అనుసరించినట్టిదే. కథానిర్వహణమునను, రచనా విషయమునను శ్రీనాథుని అనుకరించి రఘునాథనాయకుడు ఈ నలచరిత్ర ద్విపద కావ్యమును రచించినాడు.

నలుని సౌందర్యము భోగకాంతలకేగాక పతివ్రతలకు కూడ మోహకముగానుండెనని శృంగార నైషధమునందు వర్ణింపబడిన భావమును రఘునాథనాయకుడు తన నల చరిత్ర యందిట్లు పొందు పరచినాడు.

వలపుల సొలపుల వదనంబు వాడ
దలకని యింతియు దలపలేదయ్యె
నిలలోన వెదకిన నెల్లడలందు
నలకృప చంద్రుసౌందర్యంబు కథలె
బలభేరి పురములోపల నెల్ల నెగడె
నచ్చర నెచ్చెలులారాజు జూడ
నిచ్చ నిచ్చలు జాల నించిరి ప్రేమ
యక్షు పక్ష్మలనేత్రులతని రూపంబు
వీక్షింప గోరిరి వేడుకల్ నెరయ
గంధర్వ సింధుర గమనలు ప్రేమ
బంధంబులను వాని భావింతురెపుడు
భోగి కన్యకలు నాభూపాల చంద్రు
యోగంబె గోరుచు నుండిరి."

నలచరిత్ర 1 ఆ. (374-387).

నలుని ఆత్మయందు భావించి తమ భర్తతో "నప్పళింపని సతియు లేదయ్యోనెచట" అని శ్రీనాధుడు వర్ణింపగా రఘునాధుడు "వలపుల సొలపుల వదనంబు వాడ, దలకని యింతియు దలపలేదయ్యో" అని వర్ణించినాడు.

నలుని చేత పట్టుబడిన హంస తన కుటుంబములోని వారల దలచుకొని దు:ఖించినదని శృంగార నైషధమునందిట్లు వర్ణింపబడినది.

"తల్లి మదేక పుత్త్రిక, పెద్ద, కన్నులు
గానవిప్పుడు, మూడుకాళ్ల ముసలి;
యిల్లాలుగడు సాధ్వియేమియు నెఱుగదు
పురుష పాతివ్రత్య భవ్యచరిత
వెనుక ముందర లేరు నెవ్వరైన చుట్టాలు
లేవడి యెంతేని జీవనంబు
గానక కన్నసంతానంబు శిశువులు
జీవన స్థితికేన తావలంబు;
కృప దలంగగదయ్య యో నృపవరేణ్య
యభయమీయవయ్య యోతుహినాంశవంశ
కావగదవయ్య యర్థార్థి కల్ప శాఖి
నిగ్రహింపకుమయ్య యోనిషధరాజ"
(శృం. నై. 1ఆ. 110.)

చక్రపురి రాఘవాచార్యుని ద్విపద నలచరిత్ర కావ్యమునందీ పద్య భావము కానరాదు. రఘు నాథనాయకుడు తన ద్విపద నలచరిత్రలో తెలుగుదనముట్టి పడునట్లు ఎంత చక్కగా శ్రీనాధుని పద్య భావమునకు మెరుగు పెట్టినాడో చూడుడు,

"ఒంటి గాడనె నాకు నూరంత బలగ
మింటి కెల్లను గర్త నేనొక్కరుండ

నా తల్లి యంతయైనంగలదయ్య
యాతల్లి కూటికి నవయ దెన్నడును
నూరేండ్లు పండు కన్నులు గానదిపుడు
గారాబు పట్టిమొక్కరుడ నేనరయ
నను జూడకున్న కన్నర నొందునదియు
వినిననే మగునొక్కో .వెతలచే బొగలి
ఇల్లాలుకడుగోల యంద కన్నెరుగ
దల్లిబిల్లి గ నుండు నట్టిది యేను
ఇంటికి రాకున్న నేయేమొ తలచి
కంటికి నిద్దుర గానక బడలి
వనరుహాయని పుత్ర వర్గంబుదాను
కొడుకులు గ్రుడ్లలో కూనలు తన్ను
యెడబాయరెన్నడు పెంచిన మమత
బిస ఖండములు దెచ్చి పెట్టినదాక
దెసలు జూచుచు నోరు దెరచి యుండుదురు
కన్నవారికి జాలి గాన్పించుగాని
విన్నవారల కట్టివేదనలీడ
దయజూడుమయ్య సంస్తునీయచరిత
నయమొంచు మయ్య యోయవనీయభావ"

( నల. 1ఆ. 930-951)

"నూరేండ్లు పండు" "కడుగోలట" "గ్రుడ్లలో కూనలు" ఇత్యాది పదప్రయోగములలో తెలుగుదనముట్టిపడుచున్నది.

హంస దమయంతితో నలుడు తనను మిక్కిలి ఆదరముతో చూచుచుండునని చెప్పుట రఘునాథనాయకుడు శృంగార నైషధమునను సరించి కల్పించెను. ఇది మూలమునందు కానరాదు. వేల్పులు ప్రసాదించిన తిరస్కరణీ విద్యాప్రభావముచే నలుడు దమయంతి యంతఃపురము ప్రవేశించుట, నలుడు దమయంతీ

సౌందర్యమునకు ముగ్ధుడగుట, దమయంతి నలునిపై పుష్పమాల వైచుట, నలదమయంతుల పరస్పరాలింగనము, నలుని నీడను అద్దమున చూచి దమయంతి చెలులు గజగజపోవుట వంటి సన్నివేశములు అమూలకములే. భారత నలకథయందివి లేక పోయినను రఘునాథుడు శృంగారనైషధముననుసరించి వీనిని కల్పించెను.

చెలులు చుట్టుచేరి యుండగా దమయంతి వీణవాయించుచు నలునిపై గీతములు పాడినట్లు రఘునాథుడు మాత్రముగ కల్పించెను. ఈ దృశ్యము భారత నలకథయందుగాని, నైషధము నందుగాని లేదు. ఇది రఘునాథుని సంగీత సాహిత్యకళానిధిత్వము నకు నిదర్శనముగ భావింపవచ్చును. నైషధమునందున్నట్లే ఇందు స్వయంవరాగతులను దమయంతికి శారదాదేవి తెలిపినట్లున్నది.

వివాహ సందర్భమున నలుడు దానములొసంగుట, నలుడు దమయంతి తోడ భద్రగజముపై నధిరోహించి రాజవీధిని వెడలుట, వెలదులు హారతులొసగుట, వంటక, పానీయముల వర్ణన, రాజు నకు సపర్యలు చేయుట, రాజు తాంబూల సేవనము, దంతపు టుయ్యాల మంచముపై పాన్పు సిద్ధపరచుట వంటి రాజోచితము లగు సన్నివేశములను రాజకవియైన రఘునాథుడు కల్పించి కావ్య మునకు సౌందర్యము నాపాదించినాడు.

నలుని శరీరమునందు ప్రవేశించుటకు దారి దొరకక, చివరకు కలివిభీతక వృక్షము నాశ్రయించెను. కలిచేరిన విభీతక వృక్షమున్న ప్రదేశమును రఘునాథుడిట్లు వర్ణించినాడు.

"చనుదెంచి నిషధేంద్ర చంద్రుని నగరి
ప్రహరిలో నొక పజ్జ భామినులెపుడు
విహరించు కలువ బావికి నుత్తరమున
పనస కర్పూర రంభానారికేళ
కనక చందన మల్లికాసహకార

కర్ణికారాది వృక్షలతా విశేష
వర్ణితంబగు కేళి వనములోపలను
కేళాకు లలికి డాయ కెందమ్మికొలని
మూలలతాకుంజముల సంతతంబు
పగలు కోకటి నీడ బర్వభయంబు
సిగుడ జేయుచు, నూరు నిలువుల లోతు
కలిగిన యొక కన్నెబాపియోర
సలలిత శాఖోపశాఖాని తాయ
చుంబి తాంబరమయి యొప్పంబుగానియు
తంబు నలిపెడు విభీతక మహాతరువు
నాశ్రయించి నశించె నంతట జూడ"

( నల. చ. 5ఆ. ద్వి. పం. 591_617)

విభీతక వృక్షమున్న ప్రదేశమును గూర్చిన ప్రశంస భారత నలకథ యందుగాని, నైషధకథయందుగాని, ఇతర నలకథా కావ్యములందు గాని లేదు. ఇది రఘునాథనాయకుని కల్పనయే.

నలుడు దమయంతి సముఖముననే పుష్కరునితో జూదమాడుట, మొదటి పందెములో పుష్కరుడోడుట, తరువాత పందెములో పుష్కరుడు నలుని గుర్రములను, మదగజములను గెలిచికొనుట మంత్రి పుంగవులు జూదము వలదని నలుని వారించుట, అందులకు నలుడంగీకరింపకుండుట. చివరకు దమయంతి జూదమును మానుమని నలుని ప్రాధేయపడుట అనునంశములను రఘునాథుడు ఔచితీపరముగ తన నలచరిత్రయందు గూర్చెను. జూదమును మానుమని దమయంతి నలునికిట్లు ఉద్బోధించినది.

"నీయంత వాడిట్లు నెత్తంబు మీద
పాయక చిత్తంబార నీయదగునె
జూదంబు పానంబు జూడ రెండునప

వాదుహేతువులను వచనంబు వినవె
పానంబు చేనొక్క పాపంబు వచ్చు
గాని జూదంబున గలయర్థమెల్ల
బోవ బోయినవేవి బొడము నాలేమి
జీవనపబ్బదు జీవనంబునకును
నన్నేసి పాపంబు లేజేయ వలయు
నన్నియు నూహించి యిది మానవయ్య"
( నల_5ఆ. 138_145 )

రాజ్యసంపదలు గోల్పోయిన నలుని జూచి పుష్కరుడు చివరి పందెముగా దమయంతి నొడ్డి రాజ్యము గెలిచికొమ్మని నలుని పురి కొల్పినట్లు రఘునాథుడు కల్పించెను. ఇది మహాభారతమున కౌరవ పాండవ ద్యూతమున ద్రౌపదిని పందెమొడ్డి ధర్మరాజు ద్యూతము కొనసాగించుటను మనమున నిడుకొని రఘునాథుడు కల్పించి యుండవచ్చును. కాని నలుడందులకు సమ్మతింపకుండుటను రఘునాథుడు నూత్నముగ కల్పించి ఔచిత్యమును బోషించెను. రాజ్యబహిష్కృతులయిన నలదమయంతులను పొడిచివేయుడని పుష్కరుడు శాసించెను. అట్లు వారు హతులైన తరువాత తనకు ఎదురుండదని పుష్కరుడు తలంచి యుండును. జ్ఞాతి సోదరుల మత్సరమును దృష్టిలో పెట్టుకొని రఘునాథుడు ఈ కల్పనచేసెను.

తను పుట్టింటికి పోవుదమని దమయంతి నలునితో నన్నపుడు సిరిగలిగిన నాడె చెలులు చుట్టములని సిరిదొలగిన యేని చెలులు శత్రువులగుదురని, సుఖదుఃఖములు వెన్నెల – చీకటి వంటివని నలుడు సమాధానమిచ్చెను. నలుడు దమయంతిని పుట్టింటికి పొమ్మనెను. అందులకు దమయంతి "ఆర్తునకు బోలు నాపన్నుడైన భర్తకొమ్మ పత్నియె పరమౌషధంబు" అని ఉద్బోధించినది. ఈ భావము మయాతుమునందు లేదు. ఇది రఘునాథుని కల్పనయే. "ఇడుమలబడు వేళ నెడరైనవేళ, బడలినవేళ – నాపద నెందువేళ – కడుకుందు వేల

నాకట జెందు వేళ - నిజసతిదగ్గర నిలుచుట నీతి" యని సతీధర్మములను రఘునాథుడు సూచించినాడు. మూలమునందుగాని, రాఘవాచార్యుని నలకథలో గాని ఇవిలేవు.

తనను, తన భర్తను వేరుచేసిన వారిని దమయంతి యిట్లు నిందించినది.

"నీకిట్లు దుఃఖమొందించిన పాపి
యాకల్పమంజిరాయైయుండుగాక
నాపతి బాపి యీనలుకువనన్ను
ప్రాపింపజేసిన పాపకర్ముండు
దుఃఖంబు మీదనె దుఃఖంబునొంది
దుఃఖవార్థి మునింగి తుదముట్టుగాక
నను నిన్ను యెడబాపి నలుకువబెట్టి
వనముల పాల్జేసి వర్థిల్లు నతడు
వనితయుదాను నీవగననిపత్ర
వనమున వెయ్యేండ్లు వసియించుగాక"
(నల. 6వ. 858-867)

పతివ్రతయైన దమయంతి వచనములన్యథా పోవని కలి నశించుటను సూచనతో రఘునాథుడీ కల్పన చేసెననవచ్చును.

నలదమయంతులు ప్రొద్దు బోవునంతలో అరణ్యమున ఒక ప్రదేశము చేరిరి. ఆ ప్రదేశమును 30 ద్విపద పంక్తులందు రఘునాథుడు వర్ణించినాడు. మూలమునందీ ప్రదేశ వర్ణన లేదు. ప్రయాణపు బడలికచే నలదమయంతులు నిద్రించిరి. కలిప్రేరణచే చలిచీమలు నలుని కుట్టగా నలుడు మేల్కొనినాడు. చలిచీమలు నలుని కుట్టినవిషయము మూలము నందెచ్చటనులేదు. ఇది రఘునాథనాయకుని కల్పనయే. దమయంతి మేల్కొని విదర్భకు చేరగలదని నలుడూహించెను. రెండు పక్షులు పొదలో నుండుటకంటె ఒక పక్షి చేతి

యుండుండుట మేలుకదా, ఇద్దరు కష్టపడుటకంటె ఒకరైన సుఖముగా నుండుటయే మేలు అను సామెతను పురస్కరించుకొని రఘునాథుడు ఈ సన్నివేశమును కల్పించి యుండును.

బోయవాడు తన పల్లెకు దమయంతిని ఆహ్వానించుచు తన పల్లెయందలి విశేషములను ఆమెకు దెలిపిన తీరును పరికింపుడు.

"ఏవేళ మాకు కారెనపట్ల పాలు
యావుల పాలును యరచేతి దళము
మీగడ గట్టంగ మేడలయందు
కాగులు నిండంగ కాగుచు నుండు
వెలది యీ యడవుల పీడెంబు సేయ
దళమైన కస్తురి తమల పాకులును
పచ్చిపోకలు చుట్టుపట్లనె యుండు
పచ్చకస్తూరి తెప్పలు గాగ కలదు
ఖండ చక్కెర కన్నెకడుతియ్యనైన
కొండమామిడి పండ్లు కొల్లగా కలవు
ఎలనాగ విన్నియు సెన్నంగ నేల
పులిజున్ను గలవు మాపొలములయందు
మాపల్లె కరువచ్చి పైసేద దేర
మాపాడిపంటల మహిమలుజూచి
మరి పొమ్ము.................."

( నల. 7ఆ. 57-70 )

ఇవి మూలమందు లేవు. ఇతర నలకథా కావ్యములందును కానరావు. ఇవి రఘునాథుడు చేసినాడు. అచట తాపసుల దినప్రవృత్తిని నాటకీయముగ చిత్రించినాడు. దమయంతి రాజమాతతో "ఫలములె నాకును పరమ భోజ్యము" లని, మాంసములు తిననని చెప్పిన విషయము మూలము నందు లేదు. అది రఘునాథుడు

నూతనముగ కల్పించినదే. దమయంతి శాఖాహారియని దీనివలన తెలియుచున్నది.

దమయంతి విదర్భ చేరిన తరువాత నలుని కొరకు దుఃఖించి తన అభిప్రాయమును నేరుగా తండ్రితో కాక తల్లితో మొరపెట్టుకొని నట్లు రాజమర్యాద లెరిగిన రఘునాథుడు మూలమునొకించుక మార్చి రచించినాడు.

బాహుక రూపమునందున్న నలుని వంటపాకములను రఘునాథుడు చిత్ర విచిత్రముగ ఇట్లు చిత్రించెను.

"కలను కూరలు మంచి కమ్మగూరలును
చక్కెర గెరలెడు సన్నగూరలును
కక్కెర కెందుల కడ్డపేపుడులు
క్రొవ్విన పేటగుండె యూర్పులును
పువ్వులవలెనుండు బొరగులవగలు
నుడిగొళ్ల నుడుపనంజూటి తాళిదములు
పొడినల్లలును క్రొవ్వపొరమండి గలును"
( 8వఆశ్వాసం,673-682 )

ఇత్యాది వంట విశేషములు మూలమునందెచ్చటను లేవు. చక్రపురి రాఘవాచార్యుని నలచరిత్రలోను నలుని వంట విశేషములు లేవు. ఇవి రఘునాథుడు కల్పించినవే

"కపట మెన్నటికి పొంకముగాదుచూడ
నెపుడు సత్యము గెల్చు నెన్నాళ్ల కయిన
నీతి దప్పని మేదినీ పతికెనయు
ఖ్యాతి వైభవములు నఖిల సంపదలు"
నల. 8ఆ. ద్వి. పం. (1107-1110)

ఈ వాక్యములు కావ్యమునకు ఫలశ్రుతి వంటివి. కలి కపటముతో నలదమయంతులకు కష్టములు కలిగించెను. తుదకుతానే నశించెను.

సత్యమన్నది సార్వకాలికమైనది. దానిని అధిగమించుటకు ఎవరికి వీలుపడదు. మోసముచే నలదమయంతుల రాజ్యసంపదలను జూదమున కలి పుష్కరునిచే హరింపజేసి చివరకు తాను పుష్కరుడు నలునిచేతిలో పరాభవము చెందిరను దృష్టాంతమును కవి లోకమునకు చూపెను.

మూలమునందు వాయుదేవుడును, చక్రపురి రాఘవాచార్యుని నలకథలో దేవతలును దమయంతి పాతివ్రత్యము నిరూపించినట్లుండగా రఘునాథుడు తన నలచరిత్రలో ఆకాశవాణి నలదమయంతులను దీవించి దమయంతి పాతివ్రత్యమును నిరూపించి నట్లు కల్పించినాడు.

రఘునాథనాయకుడు కథావిషయమునందేగాక రచనా విషయమునందుకూడ తన నలకథాకావ్యమున కొక విశిష్ట స్థానము కల్పించినాడు. కావ్యౌచిత్య దృష్టితో సందర్భోచితముగా వివిధ వర్ణనలను చేసినాడు. పెక్కు అలంకారములను వాడినాడు. మహాభారత నలకథలోగాని, నైషధములోగాని లేని దమయంతి బాల్యక్రీడావిశేషములను, యౌవనము నందలి వేడుకలను రఘునాథుడు కల్పించినాడు రఘునాథుడు చేసిన దమయంతి యౌవన వర్ణనలోని ప్రాబంధికతను పరికింపుడు.

"చిన్నారి పొన్నారి చిరుత ప్రాయంపు
సొన్నారి యానారి సొబగు నమ్మేన
నవమణుల్ నించె ననంగ సీలంపు
రవల చందమున రహిమించె కురులు
మగరాల తళుకులమాడ్కి నెంతయును
నిగనిగ మనుచు గాన్పించ పల్వరుస
సొగసు సిద్ధపు జాతి చురుకు కెంపనగ
జాదేరె మిక్కిలి చిన్ని కెమ్మోవి
మహనీయ మరకత మణి శలాకనగ
రహిమించె నవరోమ రాజిరాజిల్లె"

నల. 1ఆ. 471-480.

కథానిర్వహణములోను, వస్త్వైక్యములోను రఘునాథుడు సిద్ధహస్తుడు. అతని వర్ణనలన్నియు స్వాభావికముగ నాటకీయమున కనువుగా నున్నవి. నలుడు హంసను పట్టుకొనునపుడు అది అతని చేతినుండి తప్పించుకొనుటకు చేసిన ప్రయత్నమును ఎంత స్వాభావికముగా రఘునాథరాయలు చిత్రించినాడో గమనింపుడు.

"ఉండంగ గనుగొని నుర్వీధవుండు
యండజ రాజంబు నండకునేగి
పదరక వంచనా పరతచే దృష్టి
చెదరక యటు రెండు చేతులుపొదిగి
పట్టెపట్టిన నుల్కిపడి పైడియంచ
చెట్టుపలిట్టిటు చెదరి తటతట
కొట్టుకొంచును గింజుకొని క్రీంకరించి
మిట్టించి కన్నులు యెగరు దాకల్పు
నిగిడి దండస పూని నెరవాది ముక్కు
తుదకరయుగము నెత్తురుగార గరచి
పదములనెక్కియె పాటులు బడిన
మెదలకుండగ బట్టి మేదినీశ్వరుండు"
నల. 1 (300-312)

నలుని వలెనే దమయంతియు హంసనుపట్టుటకు ప్రయత్నించును కాని హంస దొరకదు. అపుడు దమయంతి చిత్తవృత్తిని రఘునాథరాయలు ఇట్లు చిత్రించినాడు.

"ఇది మంచికన్నగాడికకూడు దనుచు
మదిరాగ మెడలి యమ్మదిరాయతాక్షి
యీ నీరజంబేల యిచ్చోటవ్రాలె
యేనేల యీపక్షి నీక్షించితినిట్లు
నాతిట్లని నీడాగిన సరోజనంబు
నే తెరంగున బిల్తు నిక గ్రమ్మరంగ

చిక్కనంచును చరించి దీనివెంట
చిక్కల బెట్టుము యించుట యెరుక
ప్రతిన జేసియు దీనిపట్టలేకున్న
సతులెల్లనగరే మోసమువచ్చె నేడు
యనుచు డెందము చాలనాందోళమంద"

నల. 2 (625_635)

రఘునాథనాయకుని వర్ణనలన్నియు ప్రధాన కథకు పరిపోషకముగ నున్నవి.

నలునిపై దమయంతికి గల విరహబాధను రఘునాథుడు కథాగతికి పరిపోషకముగా ఇట్లు చిత్రించినాడు.

"భైమియునాథూమి పాలు నీక్షించి
యేమియు నెరుగక యించుక తడవు
నివ్వెరగున బొంది నిరుపమప్రేమ
నివ్వటిల్లుచునుండ నిలువున గరగు
కరణి తేజమట యంగములందుగ్రొమ్మ
తరుణి చెుక్కర్తు కైదండగా గొనుచు
మెరుగు చన్నుల మీది మేలిమి చేల
మరియు మాటుగ వైచి మదన బాణములు
గురిగారినటువలె కుంకుమరసము
రవికె పై రక్తవర్ణముగ జిప్పిల్ల
ధవళ ధీధితులు చంద్రకళలుసీస
కన్నులల్లార్చి చక్కని పలువరస
మిన్నలు కెమ్మోవి మీదట వొలుక
దమయంతి పలికె వింతగ పంచదార
వమృతంబు దారలు నందంబు దొరుగ"

నల. చ. 4_ (369-384)

నవవధువైన దమయంతి శృంగారమును రఘునాథుడిట్లు వర్ణించినాడు.

"పెండ్లి గావింత మీబిడ్డకు ననిన
యిండ్లలోపల డాగి యేమేమొయనుచు
కూడియు కూడని కురులును సిగ్గు
వీడియు వీడని వెకలి చూపులను
వెళకియు బెళకని బెడగు లేనడుము
కులికియు కులకని కుదురు నెన్నడుము
బొదవియు బొదవని పొంకపు పిరుదు
మదనుని కొక వింత మదము గల్పించ
నంతయై యింతయై యా దమయంతి"
నల.చ. (1.445-458)

తన కావ్య నాయిక యగు దమయంతికి కావలసిన సౌందర్యమును రఘునాథుడు ఈ ద్విపద పంక్తులందు శబ్దాలంకార యుక్తముగ చెప్పినాడు. ఇది ప్రబంధనాయికల సౌందర్య వర్ణనను తలంపించుచున్నది.

కలిరూప చిత్రణము మూలభారతము నందిట్లున్నది.

"వృతేతు నైషధే భూమ్యాలోకపాల మహౌజసః
యాంతో దదృశు రాయాంతం ద్వాపరం కలినాసహ
ఇతి తస్మిన్వదత్యేవ దేవాః స్యందనమందిరమ్
కలి మాకలయాంచ క్రుర్ద్వాపరం చాపర పురః"
వ్యాస, భారతారణ్య పర్వము (59-770)

## శృంగార నైషధమునందలి కలిరూప చిత్రణ మిది

"గగన మండలము గాలాయసపు దేర

మాల కాకి పడగ దూలి యా డ
ద్వాపరంబు దాను దన్మధ్య వర్తియై
వచ్చువాని నీలవర్ణ దేహు"

"గోర మీసలు మిడిగ్రుడ్లు కుఱచ పొడవు
దొప్ప చెవులును గొగ్గిపండులును గలిగి
యున్న మద్గ్రీవుడై వచ్చు చున్నవాని
గలిమహారాజు గనిరి దిక్పాలవరులు"
శృం. నై. 7(92_93)

రఘునాథ నాయకుని ద్విపద నలచరిత్రలోని కలిరూప చిత్రణమును చూడుడు.

"కాకధ్వజంబు ముంగల మెరయంగ
బండికందని ఛాయ బంగు కాయమున
నిండి జోలుగ వ్రేలు నెరసీలివన్నె
పేరణి మీద ముప్పిరి గొన్న నల్ల
చారల మైన పచ్చడము ధరించి
రక్తవర్ణంపు తేరుగ పాగజుట్టి
రక్తగంధ త్రిపుండ్రము బెట్టినుదుట
గళమున నతిరిక్త కరవీరకుసుమ
కవిత మాలికలు నేకముగ వ్రేలంగ
మిడిగ్రుడ్లు పెనుకోరమీసలు గండ
పెదగొగ్గి పండులు నెగ్గు గొల్పంగ
సంచుల పంచమహాపాతకములు
పంచమవాద్యపటిమ ఘోషింప
నుపపాతకములు సాహసి నాదములు
విపరీతములుగ గావించు నుండ
కలిరాజు తక్కి_తక్కి_ల యొరచూపు

మరచి యార్తకధూమముల నిందింప
చాపలంబున నలుదెసలు గనుగొను
ద్వాపర సహితుడై వచ్చి నిర్జనుల
గనుగొంచు కొలుకుచు కళవళ పడుచు
వినయ వినమ్రుడై వినుతి గాంచె"
నల. 5 (270_290).

వ్యాస భారతమునందు గాని, శృంగారనైషధమునందు గాని కలిరూప చిత్రణము ఇంత విస్తృతముగ వర్ణింపబడలేదు. కలిదేహమందలి యవయవములను ప్రత్యేకముగ వర్ణించి కలిరూపమును కన్నులకు కట్టినట్లు నాటకీయతకనువుగ అతని అసూయాగుణముకూడ దృశ్యమానమగునట్లు రఘునాథుడు చిత్రించెను.

నలదమయంతుల విహార వర్ణన సందర్భమున చక్రపురి రాఘవాచార్యుని రచన:

"సంతసంబున గూడి సరసులయందు
కేళీవనములందు కృతకాద్రులందు
మేలిమి పొదలందు మేడలయందు
నిరుపమాన విశ్రుతి నిరతంబు నిట్లు
సురత భాసురకేళి సొక్కి-సోలుచును"
నల. చ. 2-(856_860)

రఘునాథనాయకుడు రాఘవాచార్యుననుసరించి చేసినరచనను పరికింపుడు.

"కలిసి యిద్దరికి నొక్కటి ప్రాణమనగ
మలచిన లీలనమ్మతి గూడి మాడి
కేళీవనములందు కృతకాద్రులందు
మేలి పూపొదలందు మేడలమీద

రేరాజు ముఖియగు ప్రియ వధూటియును
ఆరాజు వరుడును నర్థి సల్పుచును"
(5వ ఆశ్వాసము)

ఏకవస్త్రధారులయిన నలదమయంతుల అరణ్య సంచారము ను చక్రపురి రాఘవాచార్యుడిట్లు చెప్పినాడు.

"మగువ కొంగుముడి త్రోవ మలయు కంపలను
దగిలిన దనచేత దప్పించు కొనుచు
మురువు జూలిన వాడి ముండ్ల జేదీయ
వెఱచి మెల్లనె తీసి వెలవెల బాఱి
పఱకెంచి కంపల బయ్యెద కొంగు
నరిమురి దగిలిన నవితీయలేక;
తనువాడిగల ఱాలు దాకి పాదముల
కనుమల నెత్తురు గాఱ నందంద
గన్నుల ముత్యాల క్రైవడి నీరు
చన్నుకట్టుల మీద జలజలరాల
జాఱిన వెంట్రుకల్ సరిపడనేల
సారెకు సారెకు జక్క జేయుచును
గదలి పోవుచు వట్టుగట్టిన తనదు
పెదవుల దడుపుచు బెగడుచు నవని
నడుగిడ లేక హా! యనుచు శోకింప
పుడమితే దాత్మలో బురపుర బొక్కి"
రాఘవాచార్యుని నలచరిత్ర 3.(935-950)

ఈ సందర్భమున రఘునాథనాయకుని రచనావైశిష్ట్యమును పరికింపుడు.

"దారుణంబున కాళ్ళు దడబడుచుండ,
జారెడు కుప్పల చెమట చేమేను

నడవంగ లేక కంటకములుగాడి
అడుగులు చిమ్మచిమన రొక్కరొక్కరి
కన్నీరు దుడుచుచు కళవళింపుచును
మిన్ను చూచుచు మది మెరమెర పడుచు
తలయూచి కొనుచు నుత్తలపాటుగనుచు
పలికియేమరుచు దిగ్భ్రమల చింతిలుచు
పదము ద్రొట్టిల్ల నాపద లిట్టివనుచు
బెదరుచు నెట్టి కిల్మిష మొందెననుచు
పెదవుల దడుపుచు బిమ్మరి గొనుచు
చిదికిల బడుచు వెచ్చంగ నూర్చుచును
యుస్సురు మనుచు నయ్యో విధియనుచు
లెస్సాయనుచును చాలించెబోయనుచు"

నల. 6 (465-480)

పై ద్విపదలను పరిశీలించినచో రాఘవాచార్యుని రచన రఘునాథనాయకుని ద్విపద రచనముకంటె నొకింత పేలవముగా నున్నది. "రఘునాథకృత నలచరిత్ర రాఘవాచార్యుల రచన కంటె రసవత్తరమైనదని" శ్రీ నేలటూరి వేంకటరమణయ్య గారు అభిప్రాయపడిరి రచనా విషయములో రాఘవాచార్యుని నలచరిత్ర పేలవముగ నున్నను కథాకథన విషయమున మాత్రము రాఘవాచార్యుని కథకు జానపదులలో విపుల ప్రచారము లభించినది.

బోయవాడు దమయంతి సౌందర్యమును జూచి మోహితుడైన సందర్భమున రఘునాథుని రచనను జూడుడు.

"అత్తలోదరి యర్ధవస్త్రముజూచి
గనిపించ నమ్మేని కళయెల్ల జూచి
గండు తుమ్మెద గప్పుకలకప్పు జూచి
నిండు జందురు మోము నెమ్మోము జూచి
వెలికి చూపులలోని వింతలు జూచి

చిలికి యందపు పెక్కు చెక్కులు చూచి
కెరలు చక్కెరరాలు కెమ్మోవి జూచి
సరిలేని బిగి గబ్బి చనుగవ జూచి
చిగురు కీతులుగల చేతులు జూచి
గగనంబు దెగడు చక్కని కౌనుజూచి
తొడలరటుల తోడ తులతూగ జూచి
యడుగు దమ్ములుగల యందమ్ము జూచి"
నల. 7 (29-38)

దమయంతి దేహమందు కామోపేతుడయిన బోయవానికి తలనుండి పాదము వరకు కనిపించిన సౌందర్యమును రఘునాథుడు అలంకార యుక్తముగ చిత్రించి తన కావ్యమునకు ఔచిత్యమునాపాదించినాడు.

పై విధముగ రఘునాథుడు కథావిషయమున భారత నలకథనే గ్రహించినను, రచనా విషయమున శృంగార నైషధకథను అనుసరించి వివిధమార్పు కూర్పులు చేసి తన ద్విపద నలచరిత్రను కావ్యకళాదృష్టితో రచించినాడు.

## 4. 4 పిళ్లారిసెట్టి రాఘవయ్య - ద్విపద నలచరిత:

ఇది ముద్రితము. చక్రపురి రాఘవాచార్యుని ద్విపద నలచరిత్రయే దీనికి మూలము. కాని ముద్రణ భిన్నముగా కన్పించుచున్నది. కథలో ప్రత్యేకముగ మార్పేమియు లేదు.

## 4.5 కాకర్లపూడి రాఘవాచార్యుని ద్విపద నలచరిత్ర

కాకర్లపూడి రాఘవాచార్యులు ద్విపద నలచరిత్రను రచించినట్లు, అది 1916లో ముద్రితమైనట్లు కేటలాగును బట్టి తెలియుచున్నది. గ్రంథాలయములందెచ్చటను దీని ఉనికి లేదు.

## 4. 6. వరకవి రాఘవకవి - ద్విపద నలచరిత్ర:

ఐదు భాగములుగల ఈ ద్విపద కావ్యము ముద్రితము. దీనికే బృహదశ్వ ధర్మరాజసంవాదమని కూడ నామాంతరము. కథా క్రమమంతయు చక్రపురి రాఘవాచార్యుని ద్విపద నలచరిత్రనను సరించి రచింపబడినది. విశేషించి కథలో మార్పేదియు లేదు. రాఘవాచార్యుని నలకథలో కలి ప్రవేశము కలదు. ఇందు శని ప్రవేశమున్నది. రాఘవాచార్యుని నలకథలో స్వయంవరాగతులను దమయంతికి వసుదేవుడను విప్రుడు జూపినట్లుండగా ఇందు భీముని అస్థాన పురోహితుడగు పార్థివేశ్వరుడు జూపినట్లు తెలుపబడినది.

## 4. 7. అల్వకొండ కృష్ణమూర్తి ( 20వ శతాబ్దము ) ద్విపద నలచరిత్ర:

ఆధునిక కాలమునందు వెలువడిన నలకథాకావ్యములలో ఇది విశిష్టమైనది ఐదాశ్వాసముల మంజరీ ద్విపద కావ్యమిది. ఇందు పూర్వోత్తర కథాంశములున్నవి. దీనికే కలినివారణము, వ్రత విధాన నలచరిత్ర అను పేర్లున్నవి

"కర్కోటకస్య నాగస్య, దమయంత్యా నలస్యచ
ఋతుపర్ణశ్చ, రాజర్షేః కీర్తనం కలినాశనమ్"

అను భారత నలోపాఖ్యాన శ్లోకమందలి "కలినాశనమ్" ను గ్రహించి అల్వకొండ కృష్ణమూర్తి "కలినివారణమను" పేరుతో నలచరిత్రను వ్రాయదలచెను. ఇది కలియుగము కావున కలిదోష నివారణార్థము నలచరిత్రయందలి విషయములను వ్రతముతో నాచరింపవలెనని కవి యాశయము. కవి జానపదుల అభిప్రాయములను దృష్టిలో పెట్టుకొని జనసామాన్య సుబోధకముగ ద్రాక్షాపాకమున ఈ కావ్యము వ్రాసి

నట్లు తోచును. మంజరీ ద్విపద యందున్నను ఇందు కథానుగుణ ముగ కవి భారత, శృంగార నైషధ, ఉత్తర రామాయణ, భాగవతము లందలి పద్యములను సందర్భోచితముగ కూర్చినాడు.

అల్వకొండ కృష్ణమూర్తి భారత నలకథనే గ్రహించి పెంచి వ్రాసెను. కాని కథానుగుణముగ కొన్నిమార్పు కూర్పులను కూడ చేసినాడు. కథారంభము భారతమునందున్నట్లే దుఃఖోప శమనార్థమై ధర్మజునికి బృహదశ్వుడు నలకథను చెప్పినట్లు కలదు. పర్వత నార దులు దేవేంద్రాదులకు దమయంతీస్వయంవరమును గురించి చెప్పు సందర్భమున కలి దమయంతిని వివాహమాడబోయి పరాజయము పొందినట్లు పర్వతుడింద్రునితో చెప్పినట్లు కృష్ణమూర్తిగారి నలచరిత్ర యందు కలదు. ఇది మూలమునందుగాని, పూర్వకవి కృత ద్విపద నలకథలందుగాని లేదు. కలి స్వయంవరమునకు ముందే దమయం తినికోరి ఆమెచే తిరస్కృతుడైనట్లు ఈ కలి నివారణ కావ్యమునందు కల్పింపబడినది.

ఇంద్రుడు ప్రసాదించిన అదృశ్య విద్యాప్రభావము వలన నలుడు దమయంతి యంతఃపురము ప్రవేశించినట్లు భారత నలకథలో నుండగా, ఇందు ఇంద్రుడు తన మెడలోని హారమును నలుని మెడలో వేసి పంపినట్లు గలదు. ఈ హారము ప్రభావము వలననే ఇంద్రునికి తన శరీరము నందున్న వేయి కన్నులు ఇతరులకు కన్పించుటలేదని ఇంద్రహారమును ధరించుటవలననే నలుడు ఇతరులకు కన్పించక దమయంతీ యంతఃపురము ప్రవేశించినాడని యిందు కల్పింపబడి నది. నలుడు అంతఃపురము చేరక మునుపే దమయంతి చెలికత్తెకు నాల్గవ జామునందు కలవచ్చినట్లు, ఆకలలో నలుడు అంతఃపురము ప్రవేశించి దమయంతితో మాట్లాడిపోయినట్లు ఇందు తెలుపబడినది.

ఇంద్రాదులను మొదట కాదనుకొన్నను తుదకు వారినే పరిం

పకే తప్పదని నలుడు దమయంతికి చెప్పిన విషయమును శ్రీనాథుని శృంగార నైషధ పద్యమునందలి భావము ననుసరించి కృష్ణమూర్తి గారు రచించియున్నారు. శృంగార నైషధమునందలి పద్యమిది.

సీ॥ రజ్జువల్లరి మీద బ్రాణయంబుగలదేని
యంతరిక్షంబేలు హరి వరించు;
నగ్నికాహుతి గాగ నాత్మ గోరెదవేని
జాతవేదుని యదృష్టము ఫలించు;
సలిల ప్రవేశంబు సమ్మతించెదవేని
నంబుధీశ్వరుడు పుణ్యంబు సేయు
నెబ్భంగి బ్రాణముపేక్షించి తేనియు
వైవస్వతుని కబ్బువాంఛితంబు
ఘట్టికుటికా ప్రభాతంబు క్రమము నంది
దమసహోదరి నీకు నయ్యమర వరుల
నొల్ల ననియును దుది బొందకుండరాదు
సమ్మతింపుము నామాట చలము మాని"
శృం.నై. (4-76)

దీనికి కృష్ణమూర్తిగారి ద్విపద రూప మీక్రిందిది.

"అబలరో, నీవు పెల్లాక్రోశపడుచు
మెడకు త్రాడిడు కానిమేను వీడినను
నమరేశుడుప్పొంగి యచెనినుం గొనడె
అటు గాదటంచును నాత్మజింతించి
యగ్నియందున, జొచ్చియసువుల వీడ
వీతిహోత్రుడు మెచ్చి వేకౌగలించు
బదపడి జలముల ప్రాణముల్ విడువ
వరుణ దేవుడు భాగ్యవంతుడు గాడె
కాదని నీవెట్టు కాయమీగినను

గాలుండు జేపట్టు గడుసంతసమున
గావున గాంతరో కామార్థులయిన
వేల్పుల మనముల వేగింప బోకు

-కలినివారణము 2-(207-219)

స్వయంవరాగతులను దమయంతికి సుదేవుడను విప్రుడు చూపినట్లు నిందు తెలుపబడినది. ఇందు 13 మంజరీ ద్విపదలందు స్వయంవరాగతుల వృత్తాంతమున్నది. సుదేవుడు దమయంతికి రాజులనందరిని జూపి నలాకారములతో నున్న దేవతల సమీపించి యూరకుండెను. అపుడు దమయంతి వీరు కామోపేతులుగా నున్నారు. వీరిని వేడికొనుటవలన ప్రయోజనములేదని తన పుట్టుకకు కారకుడైన దమన మహర్షిని ప్రార్థించినట్లు, అయన ప్రత్యక్షమై నలుని జూపినట్లు ముని కోపమునకు భయకంపితులై దేవతలు నిజ రూపమును పొందినట్లు నిందు తెలుపబడినది. కాని భారత, శృంగార నైషధములలో దమయంతి దేవతలను ప్రార్థించినట్లు, వారు కరుణించినట్లున్నది. ఇందు దేవతలకు గల దయాభావము తొలగించి వారు కేవలము కామోపేతులుగ చిత్రింపబడుట గమనింపవచ్చును.

ఈ కావ్యమునందు నలపుష్కరుల సోదర ప్రేమ అపారముగ చిత్రింపబడినది. భారత నలకథలో పుష్కరుడు నలునకు జ్ఞాతి సోదరుడు. ఇందు ప్రేమ సోదరుడు. నలునితో జూదమాడుటకు పుష్కరుడు నిరాకరించునని కలి తన సహచరులైన కామక్రోధులను పంపి పుష్కరునకు నలునిపై వైరభావమేర్పడునట్లు చేసెనని యిందు తెలుపబడినది. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనునవి అరిషడ్వర్గగుణములు. వీటికి అధిదేవత కలి. కామక్రోధాది గుణములు సహజముగమానవుడికి అసూయ, కోపములుకలిగించును అందువలన సజ్జనుడుకూడ వీని ప్రభావము వలన దుర్జనుడుగా మారకతప్పదు. తుదకు కలి పుష్కరుని నుండి కామక్రోధులను తొల

గించినపుడు. పుష్కరుడు తెలివితో తాను చేసిన పొరబాటును తెలిసికొని విదర్భకు పోయి నలుని కాళ్లపై బడినట్లు, నలుడు పుష్కరుని నమ్మకుండునట్లు తమ సోదరప్రేమ నిరూపణకై కత్తితో పుష్కరుడు తన తలను నరుకుటకు ప్రయత్నించినట్లు, ఆ కత్తి పూలమాలగా మారినట్లు, మునులు ప్రత్యక్షమై పుష్కరుని నిష్కళంకమును నిరూపించినట్లు నిందు కల్పింపబడినది. నలుని రాజ్యమపహరించిన పుష్కరుని ప్రజలు దూషించకుండ, అతని శరీరమునందేదో నొక అపూర్వశక్తి ఆవహించినదని వాపోయినట్లు నిందుకల్పించి పుష్కరుని పాత్రకు ఎనలేని భ్రాతృప్రేమ కల్పింపబడినది. మూలమునందీ విషయము లేదు. మూలములో పుష్కరుడు క్రూరుడు, నికృష్టుడు. పైగా దమయంతిని పందెమున పెట్టి రాజ్యము గెలిచికొమ్మనిన నీచుడు. జూదమున దమయంతిని ఓడినచో ఆమెను అనుభవించవలయుననెడి కాంక్షాపరుడు. అన్నభార్య తమ్మునికి తల్లితో సమానము. రాజ్యముతోపాటు అన్నభార్యనుకూడ చేజిక్కించుకొనుటకు ప్రయత్నించిన కామాంధుడుగ పుష్కరుడు భారత నలకథయందు చిత్రింపబడినాడు.

నలుడు పుష్కరునిచే జూదమున పరాజయమొందిన విషయము వార్ష్ణేయుడు దమయంతితో చెప్పెను. అందులకు దమయంతి తనకు కుడి కన్నదురుచున్నదనెను. స్త్రీకి కుడికన్ను, పురుషునకు ఎడమ కన్ను అదురుట అశుభ సూచకము. అదే విధముగా స్త్రీకి ఎడమ కన్ను, పురుషునకు కుడికన్ను అదురుట శుభసూచకమని జ్యోతిశ్శాస్త్రము నందు చెప్పబడినది. దమయంతికి కుడికన్ను అదురుట వలన తమకు కష్టములు రాగలవను సూచనతో కవి ఈ కల్పన చేసెను. ఇది జానపదుల నమ్మకము కూడ. ఏదేని శుభాశుభనిర్ణయములను జానపదులు కన్నదురుటను బట్టి చెప్పగలరు. నలుడు దమయంతిని వదలునపుడు "ఆకాశవాణి, మేదినీ, వనలక్ష్మి దేవతలను ప్రార్థించి దమ యంతిని వారి అమ్మవారింటికి చేర్చుమని

కోరినట్లు" నిందు తెలుపబడినది.

కర్కోటకుడు నలునితో పూర్వము తాని అడవిలో భూసురుని పోనీయక అడ్డుపడినట్లు, అందులకతడు కొండచిలువై పడియుండు మని శాపమిచ్చినట్లు, శాపవిమోచనగ ఆముని భార్యావియోగుడైన నలుడు వచ్చి కాపాడునని చెప్పినట్లు నిందు తెలుపబడినది. కర్కోటకుని శాపవృత్తాంతము భారత నలోపాఖ్యానమందు గాని, పూర్వకవి కృత నలచరిత్రయందు గాని కానరాదు. ఇది కృష్ణమూర్తిగారు చేసిన కల్పనయే.

సుదేవుడను విప్రుడు దమయంతి మాటలను ఋతుపర్ణుని ఆస్థానమున చెప్పి నలుని దూషించెను. నలదూషణమునకై చింతించి ఋతుపర్ణుడు నలమహారాజును కఠిన వాక్యములతో నిందించకూడదని నలుడు నిర్దోషుడని, తొలికర్మములను తొలగద్రోసికొనుటకు బ్రహ్మకు కూడ సాధ్యముకాదని, ప్రారబ్దమన్నది అనుభవించక తీరదనెను. బాహుక రూపమునందున్న నలుడు తనదగ్గర నున్నాడని ఋతుపర్ణునకు తెలియుదు. అయినను సాటిరాజును సభలో నిందించుట సమంజసము కాదని నివారించినట్లు నిందు తెలుపబడినది. బాహుకుడు చూచిన విభీతక వృక్షమునందు రెండు కొమ్మలు, అందు ఒక్కొక్క కొమ్మకు ఎనిమిది చిగురుకొమ్మలు, రెమ్మకు ఏడు పత్రములు, ఒక్కొక్క పత్రమునకు మూడు పువ్వులున్నట్లు నిందు తెలుపబడినది.

అక్షహృదయ విద్యాప్రభావము వలన నలునకు కలిప్రత్యక్షమై తాను దమయంతిని యింతకు పూర్వమే వివాహమాడదలచి ఆమెచే తిరస్కరింపబడినట్లు, అందుకు పరిహారముగా దమయంతిని, ఆమెను వరించిన నలునికి తాను కష్టములు కలిగించినట్లు చెప్పెను, నలునికి కష్టములు ఈడేరినవని, దమయంతీ ద్వితీయ స్వయంవర మను నెపముతో భీముడు అతనిని రప్పించుటకు పన్నిన పన్నాగమే

సని, దమయంతి అనన్యమనస్కురాలు కాదని, అతనికి శుభమగునని కలి నలుని యాశీర్వదించి కర్తవ్యోపదేశము చెప్పినట్లు ఇందు తెలుపబడినది. కలి నలునకు వరములిచ్చుట కలి పుష్కరుని సమీపించి నలుని అభిషిక్తునిచేయుమనుట ఇందు నూతనముగ కల్పింపబడిన విషయములు.

బాహుక రూపమునందున్న నలుడు కట్టిన వస్త్రము, దమయంతి కట్టిన వస్త్రము నొకటిగానుండుట వలన, దమయంతి చెలులు వారి వస్త్రముల విషయమును భీమరాజుతో చెప్పుట ఋతుపర్ణుడు వాటిని పరీక్షించి బాహుకుడు నలుని గుర్తించినట్లు నిందు తెలుపబడినది. దమయంతి పతివ్రత. నలుడు ఏకపత్నీవ్రతుడు వీరు వియోగులయినది మొదలు తాముకట్టిన వస్త్రములతోనే నుందిరనుటకు దృష్టాంతముగా కవి ఈవస్త్రముల విషయము కల్పించెననవచ్చును. భీముడు రప్పించినపుడు బాహుకుడు ఋతుపర్ణుని ముందర నేలపై కూర్చుండెను. ఇందులకు భీముడు కనకాసనముండగ నేలపై కూర్చొనరాదనగా, ఇది రాజమర్యాదకు విరుద్ధము, రాజు ఆసనముపై కూర్చుండగా, సేవకుడు క్రింద కూర్చుండుట రాజ సేవాధర్మము. దీనిని అతిక్రమించనని బాహుకుడనెను. బాహుకుడింతవరకు నలుడుగా గుర్తింపబడలేదు. అందువలన సేవాధర్మమును పాటించెనని యిందు తెలుప బడినది.

ఎంతసేపటికి బాహుకుడు తాను నలుడుగా ఒప్పుకొనలేదు. చివరకు వస్త్రపరిశీలన వలన బాహుకుడు నలుడుగా అంగీకరించెను. దమయంతి నలుని కాళ్ళపై పడెను. దమయంతిని నలుడంగీకరింపవచ్చును. కాని లోకమునుమెప్పింప వలయును గదా. అందులకు దమయంతి యగ్నియందు ప్రవేశించెను, దేవతలు ప్రత్యక్షమై దమయంతి పాతివ్రత్యమును నిరూపించిరి. అపుడు దమన మహర్షి వచ్చి నల దమయంతులచే శాస్త్రోక్తముగా కలినివారణ వ్రతము గావించినట్లు, భారత కథా శ్రోతయైన జనమేజయుడు తనకు కలిగిన వ్యాధి

నివారణార్థము కలినివారణ వ్రతమాచరించినట్లు నిందు కల్పింపబడినది. భారత నలకథయందుగాని, పూర్వకవుల ద్విపద నలకథలందుగాని కలినివారణ వ్రతము లేదు. ఇది కృష్ణమూర్తిగారి కల్పనయే.

పై విధముగా కృష్ణమూర్తిగారు భారతారణ్య పర్వములోని నలోపాఖ్యానమును గ్రహించి వివిధ మార్పులు కల్పించి ప్రత్యేకమైన నలకథా కావ్యముగా వ్రాసెను.

**4.8** కవి పేరు తెలియని ద్విపద నలచరిత్రలు కొన్ని మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము నందున్నవి.

ఆర్. నం. 145 లో ఉన్న ద్విపద నలచరిత్ర యందు తప్పులధికముగా నున్నవి. కథ రాఘవాచార్యుని నలకథను బోలియున్నది

ఆర్. నం. 1072, 1073. ఈ రెండు నంబర్లు ఒకే వ్రాత ప్రతిగలవి. అసమగ్రమైనవి. ఈ నలకథను అగస్త్యుడు శ్రీరామచంద్రునికి చెప్పినట్లున్నది. ఈ గ్రంథము రామాంకితము.

ప్రారంభము; శ్రీరామచంద్రు రాజీవ దళాక్షు
గారుణ్యవారిధి గమనీయ గాత్రు
మనమున దలచి తామర చూలి గొలిచి
యనువొందగా శారదాంబను బొగడి
సరసులు బుధులు మెచ్చగ నలచరిత
తెరగొప్ప దెనుగున ద్విపద చేసెదను
గరమొప్ప జెప్ప నక్కథయెట్టిదనిన

అంత్యము: కదనంబు సదనంబుగా జేసి మరియు
మదనునేనుగుల నున్మత్తులై కొలిపి
చెక్కను ముక్కను శిరమును నురము
బ్రక్కయు బిక్కయు బరులును గురులు
గాలును గీలును గరమును

వానికంటే మిన్నయని చెప్పదగియున్నను. చక్రపురి రాఘవాచార్యుని ద్విపద నలచరిత్రకే ప్రచార ప్రశస్తులు ఎక్కువగా లభించినవని జానపదుల భావములు అతని ద్విపద నలచరిత్రలో చోటు చేసికొని యుండుటయే అందుకు ప్రబల కారణము కావచ్చునని తక్కన ద్విపద నలచరిత్రలన్నియు కథాకథన దృష్టితోనే రచితమైనవని సోదాహరణముగ చర్చించి, అందలి కథా విశేషములను వివరించితిమి. తెలుగులోని నలకథావస్తుకములైన తక్కన కావ్యప్రబంధ ద్వ్యర్థికావ్య వచన కావ్య, నాటకము లందలి విశేషాంశముల పరిశీలన ఐదవ పకరణములోని ప్రధాన విషయము.



# 5. కావ్య, ప్రబంధ, వచన, నాటక సాహిత్యములలో నలకథ

భారత నలోపాఖ్యానము ననుసరించి తెలుగులో నలకథ ప్రత్యేక కావ్య ప్రబంధములుగా, ద్వ్యర్థికావ్యములుగ, వచన కావ్యములుగా నాటకములుగ కూడ రూపొందినది. వానియందు ఆయా కవుల స్వీయ ప్రతిభా వైదుష్యములు వ్యక్తమగుచున్నవి. వివిధ కావ్యప్రక్రియలందు వెలసిన నలకథా విశేషములను క్రింద వివరింతము.

## 5. 1 పూర్వోత్తర నలకథా ప్రబంధములు:

నలకథను పూర్వోత్తర భాగములుగ విభజింపవచ్చును. నలదమయంతుల పరస్పరానురాగము, వారి వివాహమును పూర్వనలకథా భాగముగా, నలదమయంతులు పడిన కష్టములను వారి పునస్సమాగమమును ఉత్తరకథా భాగముగను విభజింపవచ్చును. మహాభారతారణ్య పర్వాంతర్గత నలోపాఖ్యానమునందు పూర్వోత్తర కథాంశము లున్నవి.

## 5·1·1 బెహరా రామకృష్ణకవి నలచరిత్ర

ఇది ముద్రితము ఇది ఐదాశ్వాసములుగల ప్రబంధము. విజయనగర సంస్థానమందున్న మేడూరి అప్పల నరసింహశాస్త్రిచే ప్రచురింప బడినది. ఇందు నిషధాపురీ వర్ణనము. పుష్పలావికాది వర్ణనములు ప్రబంధోచితముగా చేయబడియున్నవి. నలచక్రవర్తి ప్రజాపాలనాది వర్ణనమిట్లున్నది.

" పండు సస్యంబులు జడిపాళ్ళనౌకపాలు
నొడయని కర్పింతురుర్వి జనులు
పలుమారు దున్నక పండును సైరులు
గోవులు దసుయంత గురియు పాలు
ధర్మము నాల్గుపాదమ్ముల నడచును
గ్రహదోషములు లేక కాలమొప్పు
సకల దేశస్థ రాజన్య వద్యులు గరం
బర్పించుచుండు దురాజ్ఞ బూని

తే॥ హితులు మంత్రులు బుధపురోహితులు గొలువ
కమలనాభుని దివ్య చక్రంబు పంపు
గా గ నలచక్రవర్తి యఖండ మహిమ
నేడు దీవుల పుడమి దానేలుచుండు "

(నల. 1—26)

నలుని సత్య పరిపాలనను ప్రకటించు గోవ్యాఘ్రము సంవాదమిందు కలదు.

గర్భిణీ స్త్రీ వర్ణనమును కవి యిట్లు చేసినాడు.

నడుమున గరిమంబును నె
న్నడలం జడిమంబు మోమునన్ బాండిమమున్

బడలిక మొదలం బడతికి
గడుకొని గర్భంబు బరువుగా గను పట్టెన్

తనువు గృశియించె నిట్టూర్పు లెనసిమించె
నన్నరుచి దప్పె మంటిపై నాసమొప్ప
నారు దీపించె సోయగంబతిశయించె
జెలి చెలగు చుండె బ్రసవింప నెలలు నిండె

(1-50)

ప్రథమాశ్వాసమున హంసదౌత్యము దమయంతీవర్ణనము హంస దమయంతీ సల్లాపములు నలచక్రవర్తి విరహ వర్ణనము, వనవిహారము పుష్పాపచయము, జలక్రీడా వర్ణనములు ప్రబంధోచితముగా చేయ బడియున్నవి. దమయంతి విరహ సందర్భమున సూర్యాస్తమయాది వర్ణనము, చంద్రోదయ వర్ణనము. చంద్రాద్యుపాలంభనము. చంద్రాస్తమయ సూర్యోదయ వర్ణనములుకూడ ప్రబంధోచితముగా చేయబడినవి.

దమయంతీ స్వయంవర్ఘోష సమయమున పౌరకాంతాన్యోన్య ప్రసంగమిందు కల్పింప బడినది. స్వయంవరాగతులగు రాజులను దమయంతికి సుదేవుడను విప్రుడు జూపినట్లు నిందు తెలుపబడినది. వివాహానంతరము కేళీ గృహాలంకారాది వర్ణనము, దమయంతిని చెలులు కేళీగృహమునందు చేర్చుట, నలదమయంతుల సంభోగ వర్ణనము భీముడు దమయంతికి పతి గృహవర్తన విశేషములు చెప్పు ట ఇత్యాదులిందు తెల్పబడినవి. భీమరాజు దమయంతికే గాక తన అల్లునకు కూడ నీతులుపదేశించినట్లు నిందు కల్పింపబడినది.

అడుగద భీష్ట వస్తువుల నాశ్రితులన్ గరుణావిహీనయై
నుడువదు క్రూర వాక్కులెదనొవ్వ నెటింగినిజేశు నానతిన్
గడువదు కైతవంబు మదిగానదు యాచక కామ్యమీకతా

గుడువదు పాపచింతనల గూడదు సుమ్మివివేక భూషణా
(5—12)

ఆడపిల్లల కనిన తండ్రి తన కుమార్తె నత్తవారింటికి పంపు నపుడు నీతులుపదేశించుట, అదే విధముగా అల్లునికి కొన్ని సూచనలి చ్చుట అను సంప్రదాయములు తెలుగుదేశమునందు హైందవ సమాజమున నేటికి పాటింపబడుచున్నవి.

బెహరా రామకృష్ణ కవి నలచరిత్ర ప్రబంధమున కలిపురుషుని 'కలి'యని 'శని'యని రెండు పేర్లతో వ్యవహరించినట్లున్నది. అపరి శుద్ధతతో సంధ్యోపాసన చేయుచున్నపుడు నలుని శని పట్టినాడని యిం దు తెలుపబడినది. నలదమయంతుల విలాప సందర్భమున గ్రీష్మర్తు వర్ణనము, వర్షర్తు వర్ణనము, శరదృతు వర్ణనములను సమయోచితముగ ప్రబంధోచితముగా కవి కల్పించెను. శని బ్రాహ్మణ వేషధారియై నలదమయంతులకు కన్పించి, వారి వియోగమునకు నాలుగు మార్గ ములు చూపినట్లు నిందు కల్పింపబడినది.

నాలుగు దేశంబులకీ
నాలుగు మార్గంబులరుగు నరవర నీకుం
బోలిన తెరవున జనుమని
యాలోన నతండదృశ్యుడయినన్ బిదపన్
(3—15)

దమయంతి తన పాతివ్రత్యముచే కామాంధుడై తన్ను కామిం చిన బోయవానిని శపించి పతివ్రతల జోలికి పోయినవారి కెల్లను ఈ పరాభవము తప్పదని చెప్పినట్లు కవి తెలిపెను.

నలుడు కర్కోటకుని కాపాడి అతనిచే దష్టుడైనపుడాత్మ గత మున అనుకొను మాటలివి.

కృపతోనుపకృతి సలిపిన

విపరీతోపకృతి జూపి వికృతాకృతిగా
నిపుడొనరించితి వకటా
కపటాత్ములగావనగునె కలలోనైనన్

గోరుచుట్టుమీద ఘోరంబు ముస
లంబు వడినగతి చలంబు జూపి
లేవు ఖళిరె కుటిల వృత్తులు విషధరుల్
సహజ గుణము విడువజాల గలరె

.నల: (4—15, 16)

కపటాత్ములను కాపాడినవారికి కష్టములు తప్పవు. కుటిల వృత్తిగల విషధరుల కెంత మేలు గలిగించినను వారు తమ సహజమైన మోసమును విడువజాలరు. "గోరుచుట్టుపై రోకటి పోటు" అన్నట్లు నలుడు రాజ్య పరిత్యాగుడగుటయేగాక భార్యా వియోగుడై వివిధ కష్టములు పడు సమయములో కర్కోటక విషదష్టుడై వికృతాకారుడయ్యెను. దమయంతి ద్వితీయ స్వయంవరమును విన్న నలుడిట్లు దుఃఖించినాడు.

ఇడుమల బడదన్నడవిని
విడనాడిన కతన నలిగి వెలదుక యిట్లుం
డడయక దలంచె బురుషుని
పడతుల నమ్మంగ దగునె భావింపమదిన్

4 — 2

నలుడు బాహుకరూపమున ఋతుపర్ణునకు రథసారథ్యము చేయునపుడు మార్గమధ్యమున శని ప్రత్యక్షమై "దమయంతి తన భర్తను రప్పించుకొనుటకే పన్నాగము పన్నినదని" మరొక తలంపు ఆమెకు లేదని నిరూపించెను.

వనిత దనకు రెండవ స్వయంవరమనిద్విజ
వరుని చేత నయోధ్యకు వార్తపంపె
నీవు రాకోరికనెగానె నెలతరిపుడు
వేఱు తలపున గాదు వివేక ధుర్య

(4—13)

ఆ సందర్భమున నలునిచే స్తుతింపబడిన శని అతనికి వరము లిచ్చినట్లు నిందు మార్చబడినది. నలుని రథసారథ్య ధ్వని విని దమయంతి బాహుకుడే నలుడై యుండునని భావించి, బాహుకుని దగ్గరకు కేశిని యను దాసిని పంపినది. కేశిని నలుని పాక ప్రావీణ్యము ను పరిశీలించి దమయంతికి నివేదించినది.

నలుని యందలి పాక ప్రావీణ్యముచే దమయంతి బాహుకుని నలునిగ గుర్తించినదని కవి యిందు తెల్పినాడు. భారతములో నున్నట్లే యిందును దమయంతి పాతివ్రత్యమును వాయుదేవుడు నిరూపించెను. పునర్ద్యూతము నందు నలుడు పుష్కరుని ఓడించి తన రాజ్యమును స్వీకరించెను. నలదమయంతుల పునస్సమాగమ సమయమున హరిహరాదులు వచ్చి నలునికి పట్టము గట్టినట్లు నిందు తెలుపబడినది. ఈ విషయము భారతనలకథయందుగాని, శృంగారనైషధమునందుగాని, యేయితర నలకథాకావ్యమునందుగాని కానరాదు. కొన్ని వర్ణనలు మార్పుకూర్పులు తప్ప మిగిలిన కథాభాగమంతయు భారత నలకథానుసరణమే. బెహరారామకృష్ణకవి నలకథాప్రబంధమునందును పాటింపబడియున్నది.

## 5.1.2 సిరిప్రెగడ ధర్మనామాత్యుని నలచరిత్రప్రబంధము:

ఇది అముద్రితము. వ్రాత బాగున్నది. విషయము సమగ్రము. ఆశ్వాసములుగల ఈ నలచరిత్ర ప్రబంధము తిరుమల వేంకటేశ్వరస్వామికి అంకితమీయబడినది. సిరిప్రెగడ ధర్మన భారతాంత

గ్గతమైన నలకథను, శృంగార నైషధము నాధారముగా చేసికొని ఈ ప్రబంధమును రచించినాడు. నలకథను ప్రబంధముగా రచించుటలో ధర్మనామాత్యుని ఆశయమిది.

"వృద్ధింపనీరీతి వరగుణాచితవృత్తి
నమరి పుణ్యశ్లోకు డైనయట్టి
యీనలచరిత్ర యెవ్వరేనియు భక్తి
నేకాగ్రచిత్తులై యపుడు వినన
వ్రాసిన జదివిన వారల దోష
దూరులై ధర్మ విచారలీల
నలరుచు పుత్రపౌత్రాభివృద్ధిఁదనచ్చి
విపుల సంపదలచే విఱ్ఱవీగి
యాయురున్నతి బొదలి సత్త్వమున దవిలి
శిష్టభాగవత ప్రియశీలు రగుచు
నాపిదప విష్ణు సారూప్యమొందగలరు
భద్రగుణధుర్య శ్రీవేంకటాద్రివర్య"

సిరిపెగ్రడ ధర్మనామాత్యుడు కావ్యారంభములందలి ఇష్టదేవతాస్తుతిలో బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను, భారతీదేవిని, శ్రీరాముని, ఆంజనేయాదులను కీర్తించినాడు. దీనినిబట్టి హరిహరభేదము కవికి లేదని తెలియుచున్నది. వాల్మీకి, వ్యాస, భట్టహర్ష, కాళిదాసు వంటి సంస్కృత కవులను, నన్నయ, తిక్కన, ఎర్రనవంటి తెలుగు కవులను కవి కావ్యారంభమున వినుతించినాడు. దీనినిబట్టి కవికి పూర్వ కవులమీద గల గౌరవభావము వ్యక్తమగుచున్నది. కవిసుకవి స్తుతితోపాటు కుకవి నింద కూడ చేసినాడు. కృత్యావతారికలో కవి వివరించిన వంశావళిని బట్టి హరిశతగోత్రుడగు కొండన పద్మక్కలకు ఆర్గురు పుత్రులు కలరని, వారిలో ప్రసిద్ధిచెందిన కొండధీమణి తిప్పయమంత్రిగలడని, అతనికి వేంకటాంబ భార్యయయ్యెనని వారికి వరుసగ ధర్మన, నరసన, రంగన, తిమ్మనలు కలిగిరని, వారిలో

అగ్రజుడే సిరిప్రెగడ ధర్మన అనియు తెలియుచున్నది.

కావ్యారంభమున కవి తిరుమలేశుని గూర్చి విస్తృతముగ వివరించినాడు. అంజనాద్రి, వృషభాద్రి, ధర్మాద్రి, వేంకటాద్రి, శేషాద్రి నారాయణాద్రి, గరుడాద్రి అను ఏడు కొండలను, అందు వెలసిన వేంకటేశుని కీర్తించినాడు. తిరుమల పైగల తీర్థముల మాహాత్మ్యములను వివరించుచు, వాని సేవించుటవలన సకల పాపములు పోవునని యిందు కవి పేర్కొనినాడు. ఈ పుణ్యతీర్థములు సేవించి తరించిన వారి పేర్లను కూడ కవి తెలిపినాడు. అగస్త్యముని మర్త్యాదులకు మేలుచేయుటకు జన్మించినాడని, తరచుగ సప్తర్షులు వేంకటేశుని కొండకు వచ్చుచుందురని, బ్రహ్మ ఋషులకు తిరుమలేశుని మహిమలు చెప్పుచుండునని కవి యిందు తెల్పినాడు. తన కావ్యమును తిరుమలేశుని కంకితమిచ్చుటవలన కొండపై జరుగు పుణ్యతీర్థములను, పూజావిధానమును, తీర్థస్నానమాచరించిన వారికి కలుగు ఫలితములను వివరించుచు తిరుమలేశుడు కలియుగావతారపురుషుడని కవి తెల్పినాడు.

వీరసేనుడు తన కుమారుడైన నలునికి పట్టాభిషేకము చేసి, తండ్రి చెప్పినట్లు పనిచేయువాడే నిజమైన కుమారుడని, తండ్రి చెప్పినపని చేయనివాడు కుమారుడు కాడని చెప్పినట్లు ఇట్లు తెలుపబడినది. పుత్రుడు తండ్రికి ప్రతిరూపుడు. తండ్రియే తన సతీగర్భమున పుత్రుడుగ జన్మించుచున్నాడు. కనుక "జాయా" అన్నది సార్థకమగును. "జాయతే అస్యాః ఇతి వ్యుత్పత్తిః" మరియు ఆమె భూతి అభూతిశబ్దములచే గూడ పిలువబడుచున్నది. "భవతి జాఅస్యాఃపుత్రరూపేణ భవతి ఇతి ఏషా-భూతిః రేతోరూపేణ అగత్య అస్యాం పుత్రరూపేణ భవతి ఇతి అభూతిః" ఈమెయందు వీర్యరూపమగు బీజముంచబడును. కావున జాయా భూతి, అభూతి శబ్దములుత్పన్నమగును. కనుక దేవతలు, ఋషులు, రేతోరూపమగు మహత్తేజస్సును పుత్రోత్పాదన కొరకు సంపాదింతురు. తండ్రీకొడుకులకు అవినాభావ

సంబంధమున్నది. తండ్రిచెప్పినపని నలుడు తూ. చ. తప్పకుండ చేసెడి వాడని యిందు తెలుపబడినది. నలచక్రవర్తి పట్టాభిషిక్తుడైన పుడు సురులు పుష్పవృష్టి కురిపించిరని దేవదుందుభులు మ్రోగిన వని, రంభాద్యప్సరసలు నాట్యమాడిరని యిందు కల్పింపబడినది. నలుడు కేవలము మానవమాత్రుడే కాదని, సాక్షాత్తు విష్ణ్వావతారు డని తెల్పుటకై కవి యిట్టి కల్పనము చేసి యుండును.

నలుని పరిపాలనలో నెలకు మూడువానలు కురియుచుండె నని కాగుల కొలది ధేనువులు పాలిచ్చుచుండెడివని, పంటలు దున్న కనే పండునని కోటికి పడగలెత్తని వారు లేరని యిందు తెలుపబడి నది. నలుడు సకలరాజులను జయించి ఏకచ్ఛత్రాధిపత్యము వహిం చెనని, నలపుష్కరులకు ఘోరయుద్ధము జరిగెనని, అయుద్ధమున పుష్కరుడు పరాజయము పొందెనని, ఆ పరాజయమువలననే నల, పుష్కరులకు విరోధమేర్పడెనని కవియిందు తెలిపెను. నలపుష్క రుల అకారణద్వేషము భారత నలోపాఖ్యానమునందుగాని, ఇతర నలచరిత్రకావ్యములందు గాని కానరాదు. పుష్కరునేకాక నలుడు అంగ, వంగ, కళింగ, లలాట, చోళ, మరాట, కర్ణాటాధిపతులను ఓడించినట్లు నిందు కల్పింపబడినది. సుమారు 50 పద్యములందు నలుని దిగ్విజయాత్ర పరాక్రమాది విశేషములను సిరిప్రెగడ ధర్మన వివరించినాడు.

నలుడు కొలువు తీరియున్న సమయమున చెంచు దొరలు వచ్చి తాము నివసించు కోనలలో క్రూరమృగముల భీతిని గూర్చి సవిస్తరముగ వివరించి, నలుని వేటకై పురికొల్పినట్లు సిరిప్రెగడ ధర్మనామాత్యుడు తన నలచరిత్ర ప్రబంధమునందు కల్పించినాడు. నలుడు తుపాకులు, కటారులు తీసికొని వేటకువెళ్లి మృగములను వధించినట్లు ఇందు తెలుపబడినది. వేటనుండి పురమునకు వచ్చుచు మార్గమధ్యమునందొక తటాకమును జూచినట్లు అందు పసిడి రెక్కలు, నపకాంచనపర్ణ ముఖము గలిగిన ఒక రాజహంసమును నలుడు చూచి, దానిని బంగారుపంజరము నందుంచుకొనుటకు

పట్టుకొనినట్లు, అది భయపడి భూతతతికి ప్రాణహాని చేయుట రాజ ధర్మము కాదని వాపోయినట్లు నలుడు వెంటనే దానిని వదలినట్లు ఇందు తెలుపబడినది. దమయంతీ గుణబద్ధానురాగుడై ఉద్యాన వనమున విహరించు నలునికి హంసల గుంపొకటి కనిపించినట్లు అందులో ఒక దానిని పట్టుకొనినట్లు భారత నలకథయందు కలదు. ఈ ప్రబంధములో కార్యాసక్తుడయిన నలునకు హంస తన్పించినదని చెప్పుటలో ఎంతెని ఔచిత్యమున్నది.

దమయంతి తల్లిపేరు భారత నలకథలోగాని, నైషధకథలోగాని లేకున్నను ఇందు సుశీల యని పేర్కొనబడినది. భీముడు తనసతీమణియగు సుశీలతోకలిసి పుత్రసంతానమునకై అరణ్యమునకువెళ్లినట్లు అక్కడ దమనమహర్షి ఒక మంత్రముపదేశించినట్లు, ఆ మంత్ర ప్రభావముచేత దమకాంతుడు, దమనుడను ఇద్దరు కుమారులను దమయంతియను కుమార్తె జన్మించినట్లు ఇందు తెలుపబడినది.

హంస నలునకు తెలిపిన దమయంతీ సౌందర్యవర్ణనమిది.

"దాని జూచిన కన్నులు మానవేంద్ర
యితరకాంతల జూడంగ నేవగించు
నట్టి సౌభాగ్యవతిని జేపట్టితేని
నీకు సాటెన్నగలరె ముల్లోకములను"
"వెన్నెలచందమామకును వెన్నెలకుందగ చందమాయున్
సున్నత లీలనందమగు చందమునంధరణీతలేశ య
క్కన్నియనీకు వేడ్క నలన్నియకేవును జోడుగూడునే
గన్నుల జూతునేమొయని కాంక్షమెనర్చెద నెమ్మనంబునన్"

ప్రబంధములలో కానవగు నాయికా సౌందర్య వర్ణనకిది సన్నిహిత మైనది.

ఆడుబిడ్డల వివాహ విషయములో తండ్రి స్వయముగ ఏ నిర్ణయము తీసికొనగూడదు. తన సతీమణితో ఆలోచించి తగునిర్ణయము

తీసికొనవలెలను. ఆడుబిడ్డల బాగోగులు తల్లిదండ్రులకు సంబంధించినది. తండ్రి ఒక్కడే ఆడుబిడ్డవివాహము నిర్ణయించుట సమంజసముకాదు. పైగా వివాహ విషయములో తండ్రికంటే తల్లికి బాధ్యత అధికముగా నుండును. అందువలన దమయంతికి స్వయంవరముచాటించుటకు భీముడు తన కులకాంతతో ఆలోచించినట్లు ఇందు తెలుపబడినది.

ఇంద్ర సభలో నారదుడు దమయంతీ స్వయంవరమును ప్రస్తావించి, అంతటితో ఊరుకొనక ఆమె సౌందర్యమును గూడ వర్ణించినాడు.

త్రిమూర్తులకు సహితము దమయంతీ సౌందర్యము మోహకముగ నుండునని నారదుడు వర్ణించుటచే ఇంద్రాదులు దమయంతీ స్వయంవరమునకాయత్తులయిరని కవియిందు తెలిపినాడు. మార్గమధ్యమున దేవతలు నలునిజూచి అతనిని ఒక కార్యమునకు నియోగింపవలచి "పరోపకారార్థమిదం శరీరమ్" అనిరి. "ఇతరులకు సేవ చేయుట పరమార్థముగ ఈ శరీరమును భగవంతుడు ప్రాణులకు ప్రసాదించి నాడని, అట్టి శరీరమును వృథాచేయరాదని, శరీరమశాశ్వతమని, ఉపకారమన్నది శాశ్వతమైనదని దేవతలు నలునకుద్బోధించిరి. నలచక్రవర్తినె దమయంతి వివాహమాడునని తెలిసి యింద్రాదులు మెత్తని మాటలతో నలుని మెత్తపరచి దమయంతీ యంతఃపురమునకు వెళ్లి తమ సందేశమును ఆమెకు వినిపింపుమని కోరిరి. దానికి నలుడంగీకరించినాడు. దేవతలు ప్రసాదించిన తిరస్కరణీ విద్యా ప్రభావముచే నలుడు దమయంతి యంతఃపురము ప్రవేశించినట్లు నైషధములో నున్నట్లే యిందును గలదు. అంతఃపురమునందు ఒక రమ్యప్రదేశమునందు నలుడు నిలబడెను. అంతఃపురకాంతలకనుమానమేర్పడినది. అతడు కంతుడో, జయంతుడో, నిశాకాంతుడో, ధనేంద్రసుతుడో కావలయునని వారూహించిరి. కాని నిక్కముగ నిషధేంద్రుడైయుండునని నిర్ణయించిరి,

ఇది అమూలకాంశమే. నలుడు మొదట తనపేరు చెప్పక ఇంద్రాగ్నియమవరుణుల ప్రత్యేకగుణములు ప్రస్తావించి వారిని వివాహమాడమని దమయంతిని కోరెను. నరభోగ్యమైన వస్తువులు సురలకు నర్హము కాదనీ, తాను ఇంతకు పూర్వమే నలచక్రవర్తిని వరించితినని దమయంతి సమాధానమిచ్చెను. అందులకు నలుడు దేవతల నొల్లక మానవ మాత్రుడైన నలుని కోరుట అమృతమునకు బదులు నీరును కోరుట వంటిదనెను. దమయంతి తన అభిప్రాయమును మార్చుకొనలేదు. చివరకు నలుడు తానే నలుడని తెలుపుకొని, ఆమె అభిప్రాయమును దేవతలకు వినిపించెను.

శృంగార నైషధములో నున్నట్లే యిందును సరస్వతీదేవి స్వయంవరాగతులగు రాజులను దమయంతికి పరిచయము చేసినది. శారదాదేవి మొదట దేవతలను, ద్వీపాధిపతులను, తరువాత రాజులను వర్ణించినది. వీరి వర్ణన సుమారు 50 పద్యములందున్నది. ఈ వర్ణనాక్రమము నైషధానుసరణమే. భారతములో స్వయంవరాగతుల వృత్తాంతముగాని, వారి వర్ణనగాని లేదు. ఇందు శారదాదేవి నలదమయంతుల నిట్లు దీవించినది.

"పార్వతీదేవియును శూలపాణిబోలి
వనజ గేహిని గరుడ కేతనుని బోలి
యీ రమణీగూడి మనుమని వైరసేని
జాల దీవించె జగదంబ శారదాంబ"

వివిధాలంకారములతో దమయంతిని పెండ్లి మండపమునకు చేర్చి భీముడు, నలునకు కన్యాదానము చేసినట్లు నిందు తెలుపబడినది. కాళ్ళు కడిగి కన్యాదానము చేయుట అను మాట తరచుగ వివాహ సందర్భములందు వినిపించును. ఇది తెలుగుదేశములోని ఆచారముకూడ. పిల్లనిచ్చువాని కాళ్ళపై పెండ్లికుమార్తె నీళ్ళుపోయుచుండగా, పెండ్లికొడుకు మామ కాళ్ళు కడుగును. అతడు కని, పెంచి,

కన్యాదానము చేసిన దానికి ప్రతిఫలము కాళ్ళు కడుగుట వలన కలుగునని తెలుగు ప్రజల నమ్మకము. అట్లే పెండ్లికొడుకు తండ్రి కాళ్లను పెండ్లికుమార్తె కడుగుట కూడ ఆచారముగ నున్నది. వివాహానంతరము భీముడు నలునకు వివిధ వస్తువులను అరణముగ పంపెను. ఇదికూడ తెలుగు ప్రజల ఆచారమే. దమయంతికి తండ్రి పతిగృహవర్తన విశేషములనిట్లు ఎరిగించెను.

"పతియే దైవము గురుడును
పతియే హితుడగును ప్రాణ బంధుడుతపస్
సతతంబుగ నేడుగడయు
పతియె సుమీ సుతులకెల్ల పంకజ వదనా"

"తామరస నేత్రి పతిసేవయే పరకము
ప్రోదయై యత్తమామలబుద్ధి మెలగు
మతిధి సంతతి పోషించు మంటకరణి
వినయములు సేయు మీబంధు జనులకెపుడు"

ఈ నలకథా ప్రబంధమునందు కలిపంతములు విస్తృతముగ వర్ణింపబడియున్నవి.

కలి నలుని పట్టుటకు సాధ్యముగాక తాండ్ర చెట్టునందు చేరి నిరీక్షించినట్లు నలుడు కృతమూత్రుడై పాదములు కడుగుట మరచినపుడు కలి నలుని శరీరమునందు ప్రవేశించినట్లు నిందు తెలుపబడినది. కలి పుష్కరుని సమీపించి నలునితో జూదమాడమని కోరెను అందులకు పుష్కరుడు దుర్జయ వృత్తికి తానోడంబడనని నిరాకరించినట్లు. అందులకు కలి అదృష్టము వరించుచుండగా వలదని చెప్పు అవివేకి యుండడని చెప్పినట్లు, జ్ఞాతిసోదరులు పరమ శత్రువులని, అదిత్య దైతేయులు, వాలిసుగ్రీవులు. ధర్మపుత్రసుయోధనులు, రావణ విభీషణులు అన్నదమ్ములయ్యు జ్ఞాతి వైరము చేత

రాజ్యము బడసిరని, జ్ఞాతివైరము సామాన్యమైనది కాదని కలి పుష్కరునకు ప్రబోధించినట్లు ఈ నలకథాప్రబంధమునందు తెలుపబడినది. వివిధపురాణములలోని జ్ఞాతిసోదరుల వృత్తాంతమును వినిపించి, బలమైన మీనము బలహీనమీనములను మ్రింగుచున్నదను లోక దృష్టాంతమును జూపి ఎంతటి ఉత్తమసోదరులైన వైరము తప్పదని, అన్నదమ్ముల ఐక్యము, భార్యాభర్తలు విడిపోవుట లోకములో సహజముగ జరుగునని కవి నిరూపించెను. భారత నలకథలో పుష్కరుడు కుటిలుడు. తనకు సహాయముచేయు వాడున్నచో నలుని యంతము చూడవలెనని కాంక్షించెడివాడు. ఇందు పుష్కరుడు జ్ఞాతి సోదరుడుగ కాక ప్రేమ సోదరుడుగ నిరూపింపబడినాడు.

అడవిలో కష్టములు పడుచున్నపుడు నలుడు దమయంతితో "నీవు నాతో కష్టపడలేవని విదర్భదేశమునకు పొమ్మని" యావేశించినపుడు దమయంతి భార్యాభర్తల అనుబంధము విడదీయరానిదని, పైగా భర్త అడవిలో తిరుగుట, భార్య అంతఃపురమునందుండుట సమంజసము కాదనెను. దమయంతి యుత్తమ పతివ్రతయని నిరూపించుటకు కవి ఈ మార్పుచేసెను.

నలుడు కర్కోటక విషదగ్ధుడయి ఋతుపర్ణుని సేవించినట్లు, వార్ష్ణేయుడు నలదమయంతుల బిడ్డలను విదర్భలో వదలి తిరిగి వచ్చుచు మార్గమధ్యమున నలరాజ్యభ్రంశమును విని జీవలుడను నామముతో ఋతుపర్ణుని సేవించినట్లు నిందు తెలుపబడినది.

దమయంతి మేల్కొని నలునిగానక దుఃఖించి అడవిలో నడువసాగినది. పామొకటి ఆమెను కరిచినది, బోయవాడామెను రక్షించి, కామించెను. అందులకు ఆమె నిరాకరించినది. అపకారము చేసిన వారికి ఉపకారము చేయవలయునని ఆర్యోక్తియై యుండగ ఉపకారము చేసిన తనకు అపకారము చేయుట ధర్మము గాదని బోయవాడు చెప్పినట్లు ఇందు తెలుపబడినది. దమయంతి కిరాతుని

శపించి భస్మము చేసినది.

బాహుక రూపమునందున్న నలుడు నిరంతరము దమయంతిని దలచుకొని బాధపడుచుండెను. ఒకరాత్రి వేళ నలునకు మహావిష్ణువు ప్రత్యక్షమై కర్తవ్యోపదేశము చేసినట్లు విష్ణువును నలుడు బహువిధముల కీర్తించినట్లు నిందు కల్పింపబడినది.

పర్ణాదుడు ఋతుపర్ణుని సభలో దమయంతి పంపిన సందేశమును వినిపించినపుడు "భర్త దుర్మతియై చేసిన పనికి కులాంగనయైన స్త్రీ యిట్లు సభలో ప్రశ్నింపరాదని" బాహుకుడు సమాధానమిచ్చెను. పర్ణాదుడీ విషయమును దమయంతికి దెలిపెను. దమయంతీ ద్వితీయ స్వయంవరమునకు ఋతుపర్ణుని రప్పించుట. బాహుకుడు ఋతుపర్ణునకు రథసారధియగుట, నల• ఋతుపర్ణులు పరస్పరము విద్యలను స్వీకరించుకొనుట ఇత్యాద్యంశములు భారత నలకథలో ఉన్నట్లే యిందును కలవు.

ఇట్లు భారత నలకథను, నైషధకథలోని కొన్ని భావములను దృష్టిలోపెట్టుకొని సిరిప్రెగడ ధర్మన ప్రబంధోచితముగ ఈ నలకథాకావ్యమును వ్రాసెను

## 5·1·3 శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి - నైషధీయ చరితమ్

శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి (క్రీ. శ. 1886 - 1960) గారి నైషధీయ చరితము తెలుగులో ఆధునిక యుగమున వెలువడినది. దీనికే మరొక పేరు శృంగారః తరంగిణి. సంస్కృతమున శ్రీహరుడు "నైషధీయ చరితమ్" అను పేరుతో మహాభారతారణ్యపర్వ నలోపాఖ్యానమునందలి పూర్వకథాభాగమును మాత్రము గ్రహించి ప్రత్యేకమైన కావ్యముగ రచించెను. దానిని శ్రీనాథుడు శృంగార నైషధమను పేరుతో నాంధ్రీకరించినాడు. అందు పూర్వకథాభాగము మాత్రముండు

టకు శాస్త్రిగారు చింతించి పూర్వోత్తర కథాంశములుగల "నైషధీయ చరితమ్" ను వ్రాసినాడు.

వివిధావధానములు చేయుటవలన శాస్త్రిగారికి కవిసార్వభౌముడను బిరుదు లభించినది. ప్రాచీన సాహిత్యమునకు శ్రీనాథుడెట్టి కవిసార్వభౌముడో, ఆధునిక సాహిత్యమునకు శాస్త్రియట్టి కవిసార్వభౌముడు. నలచరిత్రనెందరో యింతకు ముందు వ్రాసియుండగ మరల శాస్త్రిగారెందుకు వ్రాసినట్లు అను సందేహమేర్పడును. ధర్మార్థకామమోక్షదాయకమైన, కీర్తినొసంగ జాలునది కావ్యనిషేవణమే యని తెలిసి, అద్దాని వలన పొందు నానందమే బ్రహ్మానందమని గుర్తించి 'స్వయంతీర్థ పరాం స్తారమేత్' అను నార్యోక్తిననుసరించియే శ్రీపాదకృష్ణమూర్తి నైషధీయచరితమును రచించెను.

ఈ ప్రబంధమునందు ఆరు తరంగములున్నవి. ఆశ్వాస విభాగములను తరంగములని విభజించుట యిందలి ప్రత్యేకత. నైషధీయ చరితము శృంగార తరంగిణి కాన దీని భాగముల పేరు "తరంగము" లయ్యెను. ఇందుకవి ప్రథమ, ద్వితీయ, పంచమరంగములందు శివుని తృతీయరంగమున రంగవిభుని, చతుర్థరంగమున శ్రీశుని, షష్టతరంగమున శ్రీరామచంద్రుని పేర్కొనెను. ఇందు వచనము సుమారైదింటనొకపాలుండును. శ్రీపాదవారివచన రచన నన్నయ వచన రచనను పోలియుండును. చంపకమాల వృత్తములే కాక సందర్భానుగుణముగ అలసగతి, సుగంధి, పద్మనాభము వంటి విశేష వృత్తముల ప్రయోగము కూడ ఇందు కాననగును.

నలుని కష్టములకు కారణము జూదము. అట్టి జూదమాడరాదని శాస్త్రిగారు ఈ ప్రబంధము మూలమున ప్రబోధించెను. భారతారణ్య పర్వమండలి నలకథను, శ్రీనాథుని శృంగార నైషధమును అనుసరించి రచించినను శాస్త్రిగారు ఇందు కథానుగుణమున కొన్ని కల్పనలను చేసినారు.

దమయంతి గుణగణములను నలునికి వర్ణించి చెప్పుటకు శాస్త్రిగారు తన శృంగార తరంగిణియందు ఒక వైదేశికుని సృష్టించి నాడు ఈ వైదేశికుని స్థితిగతులను చెప్పునెపమున రాజమహేంద్ర వరమును గౌతమిని వర్ణించి శాస్త్రి తన దేశాభిమానమును నేర్పుగా వ్యక్తము చేసినాడు.

నలదౌత్యసందర్భమున దేవేంద్రుడు దమయంతికడకు దేవ దూతికలను పంపినట్లు నిందు కల్పింపబడినది.

పుష్కరుడు స్వయంవరానంతరము నలునెదిరించి యోడిపో యినట్లు, దమయంతి కార్చిచ్చులో ప్రవేశింపనది చల్లబడినట్లు శాస్త్రి గారు కల్పించియున్నారు.

చేదిపురమున సుదేవుడు జూచిన దమయంతి దీనావస్థను శాస్త్రిగారు ఇట్లు వర్ణించినారు.

"పారదపుది సోకబసచెడు బంగార
  మనవెలవెలబోవు తనువు కలిగి
చపురెఱుంగక మట్టి జమురుటనటుగట్టి
  నటుసినట్లగ పడునెఱులు గలిగి
బొట్టుగాకొక నల్లపూసయుందాల్పమి
  జానెడు వికృత వేషంబుగలిగి
నెఱమాసి తోలు నానెటి బాసితుండెమై
  సరిపోనియేకవస్త్రంబుకలిగి
కోలయగుమోము లోతైన వాలుగనుఱు
వాడివత్తలై కిక్కిసకాడలైన
కాలుసేతులు కలిగి యిక్కడ మెలంగు
నీమె యొకపేద ము తెదుపేమొయనుచు"
  నైషధీయ ·ితమ్ (5–42)

నలదౌత్యసందర్భమున దమయంతి చెలుల శీలమునకు భంగము కలిగించు వారి చర్యలను శాస్త్రిగారు తొలగింపజేసెను. పురుష ప్రవేశములేని ఏకాంతమందిరమున నలుడు పైటకొంగు జారిన స్త్రీని జూచుట, అంతఃపురస్త్రీ శరీరము నలునకు తగులుట, స్త్రీలు బంతులాడుకొనుట, ఇత్యాద్యంశములు శ్రీహర్షుని నైషధము నందు వలె నిందును గలవు.

దమయంతి యంతఃపురమున నలుడు జూచిన దమయంతి చెలికత్తెలకు భర్తలు లేరని, అందువలన వారికి దోషమంటదని కృష్ణ మూర్తిగారు అభిప్రాయపడినారు. "ఇయ్యది నాచనసోముని కవిత యందలి నాడెమును, తిమ్మనార్యుని ముద్దుపలుకులలోని తియ్యదనమును, చేమకూర వారిలోని చమత్కారమును కూచిమంచివారి లోని మంచిదనమును ఒక్కసారియే కొంతకొంత పుణికి పుచ్చు కొన్నది. అంతేకాదు అఖండ గౌతమీతీర నివాసులైన నన్నయ శ్రీనా థుల రచనా ప్రాబల్యముకూడ నిందు బాగుగా గోచరించుచునే యున్నదని "నైషధీయ చరితమునకు వ్రాసిన పీఠికా భాగమునందు మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు తెల్పినారు.

## 5. 2. పూర్వనలోపాఖ్యానములు:

శృంగార నైషధమునందు పూర్వకథాభాగమున్నది. దీనికి అనుసరణలు తెలుగులో చాలా వెలువడుటకు కారణమిట్లూహింప వచ్చును. నలకథపూర్వభాగమందు నలదమయంతుల పరస్పర ప్రేమానురాగమును, వారి సమాగమునకు హంస దౌత్యము చేయుట, నలుడు దేవతల పనుపున దమయంతి యంతఃపురము ప్రవేశించి దౌత్యము నెరపుట, నలదమయంతుల వివాహము ఇత్యాది శృంగార

హాస్య రసస్ఫోరక ములైన సన్నివేశములున్నవి. ఇవి పాఠకులకు చదువుచున్నంతవరకు తనివి తీరనివి. అందువలన తెలుగు నలకథా కావ్య కర్తలు పూర్వకథాభాగమునే గ్రహించి వ్రాసిరి.

## 5. 2. 1. రుద్రరాజు తిరుమలరాజకవి - నలచరిత్ర ప్రబంధము:

తిరుమలరాజకవి రచించిన నలకథా ప్రబంధమునందు ఐదాశ్వాసములున్నవి. ప్రథమాశ్వాసము లభింపలేదు. ఇందలి విషయము అసమగ్రము. ఈ ప్రబంధము తాళపత్రము నందున్నది. ఐదాశ్వాసములుగల ఈ ప్రబంధమునందు హంస సందేశము మొదలు దమయంతీ పరిణయాంతము వరకు గల నలకథ వివరింపబడినది. రుద్రరాజు తిరుపతిరాజకవి క్షత్రియుడు, ధనంజయ గోత్రుడు, కూనరాజు కుమారుడు. ఇతని నలచరిత్ర ప్రబంధము అంతర్వేది లక్ష్మీ నృసింహస్వామి కర్పింపబడినది. ప్రథమాశ్వాసము లేని కారణము చేత కవికి సంబంధించిన వివరములేవియు ఇందు కానరావు.

భీముడు స్వయంవరాగతులైన రాజులను దమయంతికి జూపుటకు శారదాదేవిని ప్రార్థించినట్లు, ఆమె ప్రత్యక్షమై వివిధ దేశాగతులైన రాకుమారులను జూపినట్లు శృంగార నైషధమును ననుసరించి యిందు చెప్పబడినది. ఇది తప్ప కథలో ప్రధానముగ మూలమునకు మించి పెద్దమార్పేమియు లేదు. ప్రబంధోచితముగ శబ్దాలంకారములు, వర్ణనలు, విశేషవృత్తములు సందర్భానుగుణముగ చేర్పబడినవి. నలదమయంతుల వివాహ సమయమున శోభనములు, కేళీ విలాసములు శృంగార నైషధముననుసరించి యిందు వర్ణింపబడియున్నవి.

# 5. 2. 2. మల్లారెడ్డి - షట్చక్రవర్తి చరిత్రలోని నలకథ:

కామినేని మల్లారెడ్డి (క్రీ శ. 1578–1618) షట్చక్రవర్తి చరిత్ర ముద్రితమైనది షట్చక్రవర్తి చరిత్రలోని ఆరుకథలలో నలునికథ యొకటి. మల్లారెడ్డి షట్చక్రవర్తి చరిత్రను సిద్ధరామేశ్వరాంకితముగా రచించినాడు. ఇది పూర్వ నలకథాభాగములుగల ఆర్వాశ్వ ముల ప్రబంధము.

షట్చక్రవర్తి చరిత్రలోని నలకథకు మూలము వ్యాసభారతశృంగార నైషధములు. భీమునకు దమన మహర్షి వరప్రభావము వలన దమ, దాంత, దమనులు, దమయంతి పుట్టినట్లు భారత నలకథయందున్నది. దమనముని, దమయంతి సోదరుల ప్రసక్తి తొలగించి భీమునకు దమయంతియను కుమార్తె మాత్రమే జన్మించినట్లు ఇందు తెలుపబడినది

హంస దమయంతి యుద్యానవనము సమీపించినపుడు ఆమె హంసను పట్టుకొనుటకు ప్రయత్నించి విఫలమయినది. తనను పట్టుటకు నలమహారాజునకు తప్ప మరొకరికి సాధ్యము కాదని సరసులలో నిరంతరము వసింతుననని, సకల వేదములు తెలిసినదానననని, మత్స్య కూర్మ, వరాహాది పురాణమహిమలు వీక్షింతునని కవులతో సంఘర్షణ కలిగియుందునని, సన్మార్గ వర్తనము కలదానినని, నిత్యము, బ్రహ్మకు సన్నిహితముగ మెలగుదునని హంస దమయంతితో చెప్పినది. ఈ విషయములు భారత నలోపాఖ్యానమునందు లేకున్నను శృంగార నైషధముననుసరించి కల్పింపబడినవి.

ఇంద్రుడు ప్రసాదించిన శాంబరీ విద్యాప్రభావముచే నలుడు దమయంతి యంతఃపురమును ప్రవేశించినట్లు నిందు తెలుపబడినది.

దమయంతి నలునితో ఇంద్రాదులను నిరాకరించుటకు గల కారణమిట్లు చమత్కారముగ చెప్పినది.

"ఏనెట్లు వరింతు నింద్రుండు గోత్రారి
యతడన్నమాటాడహితవు గొలుప
ద నలుని తోడనే గనియట్లు గోరుదు
మరియు స్నేహము ఉన్న మండుచుండు
దండంబు గైకొని దండించు సౌరివి
ర్దయుడయ్యె జేపట్టదగ వెయతవి
వరుణుండు జడపతి వర్ణింపనాయన
నెటిగియెట్లు పరిగ్రహింప వచ్చు
దెలియవా వీరిదోషముల్ దిట్టమయ్యె
ననుచు శ్లేషోక్తి బరిహరబాండుటరసి
యపర కార్యంబునకు విఘ్నమయ్యెననుచు
బ్రబలు చింతాభరము దాల్చి ప్రార్థింపుడు"

( 2-32 )

ఈ విషయము భారత నలకథయందుగాని. మరియే యితర నలచరిత్రలందుగాని చెప్పబడలేదు. శృంగార నైషధములో నున్నట్లే యిందును శారదాదేవి స్వయంవరాగతులను దమయంతికి జూపినట్లున్నది.

దాదులు దమయంతికి బుద్ధులు గఱపి యత్తగారింటికి పంపి నట్లు నిందు మల్లారెడ్డి కల్పించెను.

"అత్తమామలయాజ్ఞ యావంతగడువక
మనసురానడుపు మీమందమాన
పెనిమిటి యాజ్ఞలోననె ప్రవర్తింపు మీ

ప్రతివాక్యమాడక పంకజాక్షి
తోడికోడండ్ర వంతులు చూపకతి భక్తి
గలసి మెలంగు మీకంబుకంఠి
బంధువర్గంబుల పట్టున వినయంబు
వెలయ భాషింపు మీనలినగంధి
తాల్మిదాసీజనంబుల దాసజనుల
దయను బోషింపు మీతల్లి కరణి
నత్తవారికి బుట్టింటికనుదినంబు
వన్నెరా సంచరింపు మీసన్నుతాంగి"

(3_15)

దమయంతి చక్కగ చూచుకొమ్మని దాదులు నలునితో చెప్పి నట్లు ఇందు తెలుపబడినది.

ఇది తప్ప మిగిలిన కథాంశములన్నియు భారత నలకథలో నున్నట్లెయిందున్నవి. ప్రధానముగ కథలో మార్పేమియులేదు.

## 5. 2. 3. రామచంద్రకవి - షట్చక్రవర్తి చరిత్రలోని నలోపాఖ్యానము:

ఇది అముద్రితము. **Oriental Manuscripts Library, Madras**లో కాగితమునందు వ్రాయబడియున్నది. విషయము సమగ్రముగలేదు. తప్పులెక్కువ. ఇందు పూర్వోత్తర కథాంశములున్నను ఉత్తారకథా విషయములేమియు కానరావు. భారతారణ్యపర్వనలోపాఖ్యానమే దీనికి మూలము. విశేషించి కథలో మార్పేమియు లేదు. ఒకచో మాత్రము మార్పుచేయబడియున్నది. స్వయంవరాగతులగు రాజులను దమయంతికి శారదాదేవి జూపినట్లు నిందు కల్పింపబడినది. నలుడు తనతో రావలదని, పుట్టింటికివెళ్లి సుఖముగా నుండమని చెప్పినపుడు దమయంతి యన్నమాటలు గమనింపదగినవి.

" పతియెగురుండు దైవము బంధుచయంబును మిత్రవర్గమున్
నతవివిధవ్రతంబనిమనంబున నమ్మిన పుణ్యసాధ్వికం
చితిమతి మోక్షలక్ష్మియరచేతిదియైదనరారు దాని స
ద్మతి పతియేమియూసతినిగాంచిన కాంతలు ముక్తి జెందరే "

భార్యాభర్తల అన్యోన్యమును గుర్తించిన కవి యూహకిది చక్కని నిదర్శనము. సందర్భానుగుణముగ ఇతర పురాణములోని పద్యము లిందు పొందుపరుపబడినది. ఉదాహరణమునకు భాగవతపురాణములో నారదుడు ధర్మజునకు నీత్యుపదేశము చేయుసందర్భము నందలి పద్యమిందు చేర్చబడినది.

" ఉపవాసవ్రతములు ఘన
తపములు వెయ్యాలపతియె దైవంబని ని
ష్కపటమతి గొల్చు సాధ్వికి
నృపవర దుర్లభము లేదు నిఖిల జగములన్ "

## 5. 3. మల్లంపల్లి వీరేశ్వరశర్మగారి ఉత్తరనైషధము

నలకథ ఉత్తరభాగమందు నలదమయంతుల వివిధ కష్టములు చోటు చేసికొన్నవి. ఇవి కరుణ రసాత్మకములు. మానవులు కష్టములకంటె సుఖములనే ఎక్కువగా కాంక్షింతురు. ఇది మానవ స్వభావము కూడా. అందువలన తెలుగు నలకథా కావ్యకర్తలు పూర్వకథా భాగమునకు, పూర్వోత్తర కథాభాగములకు ప్రాధాన్యమిచ్చిరిగాని ప్రత్యేకించి ఉత్తర కథాభాగమునకు ప్రాధాన్యమీయజాలరయిరి.

తెలుగులో పూర్వకథాభాగము నిమిత్తము లేకుండ ప్రత్యేకించి ఉత్తర నలకథాభాగమునకు ప్రాధాన్యమిచ్చిన మొట్టమొదటి కవి మల్లంపల్లి వీరేశ్వర శర్మ. అతడు ఉత్తర నైషధమును మూడాశ్వాసములలో రచించినాడు. వీరేశ్వరశర్మ నలనామసంవత్సరము

నందు జన్మించినట్లు, అందువలన కలిదోష నివారణార్థమై నలచరిత్రము వ్రాయదలచినట్లు కృత్యవతారికలో చెప్పుకొన్నాడు. మహాభారతారణ్యపర్వాంతర్గతమగు నలోపాఖ్యానమే దీనికి మూలమైనదని చెప్పదగియున్నను నలదమయంతుల పూర్వజన్మకు సంబంధించిన అమూలకమైన కథలిందు చోటుచేసికొన్నవి.

పుష్కరాగమనముతో ఈ ఉత్తర నైషధకథ ప్రారంభమైనది. పుష్కరుడు వినోదమునకై జూదమాడుటకు నలుని యాహ్వానించుట ఆ వినోదజూదము నలుని సకలైశ్వర్యములపహరింపజేయుట, నలుని ద్యూతవైఖరిని కలావతి దమయంతికి చెప్పుట, రానున్న ప్రమాదము గ్రహించి దమయంతి తన బిడ్డలను వార్ష్ణేయునిచే విదర్భకు పంపుట నలుని ద్యూతవైఖరిని జూచి వార్ష్ణేయాది ప్రముఖులు దుఃఖించుట, దమయంతి వారిని వారించుట, ఇత్యాద్యంశములు భారత నలకథయందున్నట్లే ఇందును వర్ణింపబడినవి దమయంతి వార్ష్ణేయునితో నిట్లన్నది.

" వలదు శోకింపమీయంతవారలకును
విషమఘటనమ్ము దుర్విధివిలసితమ్ము
నయినదానికి మీప్రతిభాతిశయము
సకల లక్ష్మికిని ధ్రువతారకము గాదె "

ద్యూత పరాజితుడైన నలుడు భార్యతో గూడి అరణ్యావాసమునకు బయలుదేరెను. రాజ్యబహిష్కృతులయిన నలదమయంతులను జూచి పురప్రజలు నిద్రాహారములు మానుటయేగాక నీరుకూడ ముట్టలేదని యిందు తెలుపబడినది. నలుడుత్తమ పరిపాలనాదక్షుడు. నలచక్రవర్తి పరిపాలన ప్రజలకన్నివిధములుగ సుభిక్షముగ నుండెడిదని వ్యక్తముచేయుటకే నలుని కష్టములను తలచుకొని ప్రజలు దుఃఖించిరని కవి తెల్పినాడు.

నలాన్వేషణమునకై దమయంతి యరణ్యమునందు ఒంటరిగ తిరుగుచున్నపుడు కలి యొక సర్పమును సృష్టించి దమయంతిని కరవపొమ్మనినట్లు, అది దమయంతిని కరవగ తాను కిరాతరూపమున వచ్చి సర్పమును వధించి దమయంతిని రక్షించినట్లు నిందు కల్పింపబడినది. స్వయంవరమునకు మునుపటి నుండి కలికి దమయంతిని వివాహమాడవలయునని కోరిక యుండినది. నలదమయంతుల వివాహముతో కలికోరిక ఫలించలేదు. నలదమయంతులను పరస్పరము వేరుచేసి ఒంటరిగానున్న దమయంతిని చెరుపవలయునని కలి కోరిక. అందువలన సర్పమును సృష్టించి, కలిబోయవాని వేషమున సర్పము బారినుండి దమయంతిని రక్షించి ఆమెను పొందదలచినట్లు నిందు కవి కల్పించెను. దమయంతి బోయవానిని శపించి మున్యాశ్రమమునకు వెళ్ళినది. ఆ మున్యాశ్రమములోని ఒక ముని దమయంతికి నలదమయంతుల పూర్వజన్మ వృత్తాంతమును వినిపించెను.

## శివపురాణాంతర్గత నలకథ - ఉత్తర నైషధకర్త అనుసరణము:

నలదమయంతుల పూర్వజన్మ వృత్తాంతమును దెల్పు గాథలు గణేశపురాణమునందును, శివపురాణమునందును కలవు. వీనిని యథాతథముగ తెలుగులో నలకథను వ్రాసినవారెవ్వరును స్వీకరింపలేదు. తుదకు పూర్వోత్తర కథాంశములలో ప్రత్యేకమైన నలకథాకావ్యములు వ్రాసిన చక్రపురి రాఘవాచార్యులు, తిమ్మయకవి, రఘునాథనాయకుడు వంటి ద్విపద కవులు కూడ నలదమయంతుల పూర్వజన్మ కథలను స్మరింపలేదు. నన్నయ తన భారతానువాదమున శివపురాణ కథను పూర్తిగ అనుసరింపకపోయినను ఆకథను స్మరించి నలోపాఖ్యానమును రచించెను. గణేశపురాణములోని నలకథను అనుసరించిన తెలుగు కవులులేరు. ఉత్తరనైషధకర్త శివపురాణనలకథను కొలది మార్పులతో

అనుకరించిన విధమును పరిశీలింతము.

అలకాపురమునకు సమీపమునందున్న ఒక అరణ్యమునందు కిరాత దంపతులు నివసించుచుండిరి. వీరు నిత్యము జంతువులను వేటాడి తద్వారా జీవనమును గడుపుచు భక్తితత్పరులై యుండిరి. మునియొకడు కాశికిబోవుచు ఆ అడవియందు ప్రవేశించెను. ఆ భీకరారణ్యమున తనకాశ్రయమిచ్చువారెవ్వరు లేక ఆ ముని బాధపడుచుండెను. ముని ఆర్తనాదమును విని భిల్లసతి పరువున సమీపించి మునిని తనకుటీరమునకు తీసికొని వెళ్ళినది. అది రాత్రి సమయము. భీకరమైన గాలితోపాటు వర్షము కూడ కురియుచుండెను. ఆకుటీరము ఇద్దరికంటె ఎక్కువమంది నివసించుటకు వీలుపడదు. అందువలన వనేచరుడు తన భార్యను, మునిని గృహమునందు పరుండుమనెను. అందులకు భిల్లసతి నిరాకరించినది. భార్య భర్తను కాపాడవలయును. అది పతివ్రతాధర్మము. కావున తన భర్తను మునిని గృహమునందు పరుండుమని కోరినది. తాను బయట పరుండుటకు సంసిద్ధమైనది. దీనినిబట్టి కిరాతదంపతులు ప్రాణమునకైనను వెనుదీయక అతిథిమర్యాదను, కుటుంబగౌరవమును నిలబెట్టుటకు ప్రయత్నించినట్లు తెలియుచున్నది. వీరి మర్యాదను జూచి ముని లోలోన వారి ఆత్మస్థైర్యమునకచ్చెరువందుచు "తనకు దారి కన్పింపక యిటు ఏల రావలెను? వచ్చి వీరి కేల కన్పింపవలయును? వీరు తన్నింటికు ఆహ్వానింపవలెను? వీరి ఆహ్వానము దొరికినవెంటనే జడివాన ఏల రావలయును?" అని తనలోప్రశ్నించుకొనెను. కిరాత దంపతులలో ఎవరైనను ఒకరు మరణించినచో తత్ఫలితముగ మునికి పాపము వచ్చును. అందువలన ముని వారి నుద్దేశించి "తన్నుమాలిన ధర్మము మొదలు చెడ్డబేరము' ఇప్పటికి సకల తీర్థములు సేవించితిని. శివుని యాజ్ఞలేనిదే చీమకూడ కుట్ట" దని బయటపరుండుటకు సంసిద్ధుడయ్యెను. ఆ మాటలు విని కిరాతుడు "గాలి వానతో కూడిన రాత్రి యందు మిమ్ములను బయట పరుండబెట్టుట ధర్మముగాదని" తన భార్యను మునిని గృహమునందు

పరుండబెట్టి, తాను బయటప్రదేశమునందు బాణమును చేతపట్టుకొని వారి రక్షణార్థమై తిరుగుచుండెను. పగలంతయు నిదుర లేకుండుటచే కిరాతకుడు అలసి యొకచోట నిద్రించెను. ఇంతలో బెబ్బులి ఆ కిరాతకుని సంహరించినది. ఆ శబ్దమువిని కిరాతి పులిని సంహరించి, మునికి నమస్కరించి తాను భర్తను అనుసరించుటకు సంసిద్ధమయ్యెను. తన వలన వారికి వియోగము సంభవించినదని ముని శివరూపము దాల్చి కిరాతితో నిట్లనెను.

"నాకతననిట్టి శోకము
చేకూరెంగాన ముందు చేపడుజనిమన్
మీకల్యాణముగూర్చెద
గాకీ ఋణమెట్లు తీర్పగా దగునాకున్"

ఉత్తర. నైష. (2-183)

కిరాతి చితిపేర్చుకొని మరణించెను. మునికూడ తనువు చాలించెను. ఇట్లు ముగ్గురును స్వర్గస్థులయిరి. ఆముని ప్రభావము వలననే ముని హంసగ, కిరాత దంపతులు నలదమయంతులుగ, బెబ్బులి పాముగ జన్మించినదని దమయంతికి ముని హితోపదేశము చేసి ఇక మూడు వత్సరములందు నలదమయంతులకు పునస్సమాగమగునని దెలిపెను.

ముని కాశికి బోవుచు దారితప్పి అరణ్యము ప్రవేశించుట, చలి గాలి వీచుట అలకాపురమున భిల్లదంపతులు నివసించుట, భిల్లసతి పులిని సంహరించుట, భిల్లుని సంహరించిన బెబ్బులి తరువాతి జన్మమున పామై దమయంతిని గరచుట వంటి విషయములు శివపురాణ కథలో లేవు. భిల్లసతి పులిని చంపిన కారణముగ ఆ బెబ్బులి వ్యాళముగ పుట్టి దమయంతిని కరచినదనుట, పరమౌచిత్యము. అట్లే ముని అరణ్యమునకు వచ్చుటకు గలకారణమేమొ శివపురాణకథయందు కానరాదు. కాశికిబోవుచు ముని మార్గము తెలియక కిరాత దంపతు

లున్న అరణ్యము ప్రవేశించినట్లు ఉత్తర నైషధమునందు తెలుప బడినది.

ఇట్లు శివపురాణాంతర్గత నలకథను కొలది మార్పులతో ఉత్తర నైషధకర్త అనుకరించెనని స్పష్టమగుచున్నది. మల్లంపల్లి వీరేశ్వర శర్మగారు తప్ప మరెవ్వరును శివపురాణకథననుకరింపలేదు.

దమయంతి సార్ధవాహులతో పయనించినది. వారు నిషధదేశపు వారమని, నలుడు రాజ్యబహిష్కృతుడయిన తరువాత తాము చేదిపురమునకు పోవుచున్నారమని చెప్పిరి. ఆమె రూపమును బట్టి దమయంతి కాబోలునని వారు సందేహించిరి. అందులకు దమయంతి -

"అనిన దమయంతి హృదయమ్ము నలవరించి
యెఱుక పడనీక భావమ్ము నిట్లు పలికె
మానిసిని బోలుమానిషి మహిని లేరె
యెవరు దమయంతి? యకటనేనెవరనయ్య" (2-202)

తన దుఃఖమును మాపుకొని తాను దమయంతిని కాదని ఇష్ట మున్నచో మీవెంట చేదిపురమునకు వచ్చెదనని, లేకున్నచో తన దారిన తాను పోవుదునని దమయంతి సార్ధజనముతో చెప్పినది. దమయంతి సార్ధజనముతో కలిసి ఒక జలాశయమునందు నిద్రించి నది. ఇంతలో జలపిపాసార్థితమైన ఏనుగుల గుంపొకటి వారిపైపడి నది. సార్ధజనులు భయకంపితులై ఒకరి త్రోవ మరొకరికి లేక పరుగిడిరి. చివరకందరు గుమిగూడి "ఇదొక పిశాచమో కాకపోయి నచో ఇది మన చెంత చేరిన వేళ మంచిది కాదేమో" నని ఆమెను దూషించిరి. ఇట్లు వారు తర్కించుకొనుచుండగ ఆగజయూథము దమయంతి చుట్టుచేరి ఘీంకరించినది. ఆమె కదలినచో అది కద

ట్టును. ఆమె నిలిచినచో అవి నిలుచును. ఇట్లు ఆమె వెంట ఏనుగుల గుంపుండుట జూచి ఆమె వనదేవతయై యుండునని సార్థజనులు భావించిరి. గజయూథమునుద్దేశించి దమయంతి చంపదలచినచో తనను చంపుమని. సార్థజనులను చంపవలదనెను. అందులకు మదగజము తనవీపు జూపి అందు కూర్చుండుమని దమయంతిని కోరెను. దమయంతి కన్నులనుండి బాష్పములు రాలినవి. "నీయీ కోరిక మీ అన్నవచ్చినపుడు తీరును" అని దమయంతి చెట్టును జూపి నీతృప్తిని తీర్చుకొనుమనెను. ఆ అర్థమెరిగి మదగజము గజాళితో వెళ్లినది.

"సార్థవాహుని మరిపించు చందమరసి
తమదుపట్టంపుటేన్గు విధమ్ము దలచి
జానపదమ్ములనజ్ఞాత సరణి నెఱప
వేల్పులను లేడి, దమయంతి వెడలి యచట"

ఉత్తర నైష. (2–213)

చివరకు దమయంతి చేదిపురమునకు వెళ్లినది. గజయూథము దమయంతిని సేవించుట, విశేషించి పట్టపుటేనుగు దమయంతిని తనపై కూర్చుండుమని వీపుచూపుట, అందులకు ప్రత్యుత్తరమిచ్చుట అనునవి ఉత్తర నైషధకర్త కల్పించినట్టివే.

చేదిరాజపత్ని దమయంతి ఆకారమునుజూచి దమయంతిగ అనుమానించుట, అందులకామె తాను దమయంతిని కానని. దమయంతి వద్ద పరిచారికగ నుంటినని, ఆమె ఇల్లువదలినప్పటినుండి యిటు తిరుగుచున్నదని నిగూఢార్థములో చెప్పుట, తనకొక వ్రతము గలదని, తనభర్త నలునివెంట వెళ్లినాడని. అతని అన్వేషించు బ్రాహ్మణులతో తప్ప పరపురుషులతో మాట్లాడనని చెప్పుట అనునవి యిందు నూతనముగ కల్పింపబడిన విషయములు. తన భర్తకు నలాన్వేషణము. తనకు దమయంతీ పరిజ్ఞానము, నవశ్యకర్తవ్యము లైన పని. అందువలన తన భర్తను వదలి యిట్లు రావలసివచ్చినట్లు చెప్పి

నది. తన భర్త నలునితో నుండుట వలన నలాన్వేషణమునకై తిరుగు పురుషులతో మాట్లాడుదునని పరోక్షముగ చెప్పినది. నలుడు తన భర్తయని రాజమాతకు తెలియరాదు. తాము గడుపు సమయము అజ్ఞాతవాసమువంటిది. రాజమాత పినతల్లియగుటవలన తననుగుర్తించినచో రాజగౌరవముతో చూచును. తనభర్త పరదేశములందు నూడిగములు చేయుచుండగ తాను రాజమర్యాదలు పొందుట కులస్త్రీ లక్షణము కాదు. అందువలన దమయంతి నలునివెంట తన భర్త ఉన్నట్లు తాను దమయంతి సన్నిధిలోనున్నట్లు చెప్పినదని కవి కల్పించి కథౌచిత్యమును చేకూర్చినాడు.

దమయంతిని వదలి వెళ్లుచున్న నలుడు అగ్నిలో మండుచున్న కర్కోటకుని రక్షించి వానిచే దష్టుడై వికృత రూపము పొందెను. నలుడు చేసిన ఉపకారమునకు కర్కోటకుడుపకారము చేసినాడు. ఇది దేవకార్యము. కలిమాయచే భార్యా వియోగుడై అరణ్యమున తిరుగుచుండు నలుని రక్షించుటకు ఇంద్రాది దేవతలు కర్కోటకునికి విషమునిచ్చి నలుని కరువుమని కోరిరట. " ఆ విష ప్రభావముచే కలినాశనమగునని, మూడేండ్లు అజ్ఞాతవాసము ఋతుపర్ణుని ఆస్థానమునందు గడపవలయునని. అపుడు ఈ వికృత రూపము నీకుపకరించునని, ఋతుపర్ణునుండి అక్షహృదయ విద్యను పరిగ్రహింపుమని. ఆవిద్య కలినాశనమునకు పరాకాష్ఠమని" కర్కోటకుడు కర్తవ్యోపదేశముచేసి అదృశ్యుడయ్యెను. ఇంద్రాదుల పనుపున కర్కోటకుడు వచ్చిన విషయమును ఈ కావ్యకర్త కల్పించెను. నలదమయంతులకు స్వయంవరసందర్భమున దేవతలు దివ్యవరములిచ్చిరి. వారికి కష్టములు కలిగినపుడు ఆ కష్టములు తొలగించు నిమిత్తమై వారు కర్కోటకుని పంపిరని ఉత్తర నైషధకర్త తెలిపెను. భారతాదులందు కర్కోటకునకు శాపమున్నట్లు అది నలుని చేతి స్పర్శతో విమోచనము కలిగినట్లున్నది. ఇందు తన శాపవిమోచనమునకుగాక నలదమయంతులకు మేలుచేయనుద్దేశ్యముతో కర్కోటకుడు వచ్చినట్లు కల్పింప

బడినది. భీముడు నలదమయంతుల అన్వేషణకు చారుల పంపెను దమయంతి చెలికత్తె కలావతి దమయంతి బిడ్డలను తన బిడ్డలుగా చూచుకొనుచుండెనని ఈ కావ్యమునందు తెలుపబడినది.

ఋతుపర్ణుడొకనాడు గుఱ్ఱపుశాలయందున్న అశ్వమును జూచి వార్ష్ణేయ, జీవలులతో దీని విశేషమేమని ప్రశ్నించుట, అందులకు వారు ఇదియుత్తమాశ్వమని, దీనివిశేషము నిర్ణయించుటకు నలునికి తప్ప నన్యులకు సాధ్యముకాదని నలుఁడిక్కడికి వచ్చు సూచనలు కన్పించుచున్నవని చెప్పుట, ఋతుపర్ణుడు నలదమయంతుల కష్టముఁదలచి దుఃఖించుట. గుఱ్ఱము సకిలించుట. దాని నివార్ష్ణేయుఁడు గమనించుట. ఆసందర్భమునసే వికృతరూపమున నలుఁడయోధ్యాపురమునకు వచ్చుట అను నంశములు ఉత్తర నైషధకర్త కల్పించినవే. నలుడశ్వహృదయ పరిజ్ఞానుఁడు, అతని రాకను మానవులు గుర్తింపలేకపోయిననుగుఱ్ఱములు గుర్తింపగలిగినవని కవియిందు తెలిపెను. బాహుక రూపమునందున్న నలుడు ఋతుపర్ణునితో అశ్వహృదయ పరిజ్ఞానుఁడనని, పాకశాస్త్రనిపుణుడనని, అక్షహృదయ విద్యను స్వీకరించుటకై అతని వద్దకు వచ్చితినని చెప్పినాడు. ఆ విషయమును విని ఋతుపర్ణుడాశ్చర్యపడెను. కర్కోటకుఁడిచ్చిన సందేశముప్రకారము తాను ఋతుపర్ణుని సేవించి అక్షహృదయవిద్యను స్వీకరింపదలచి బాహుకుడీ మాటలు చెప్పియుండునని కవి తెలిపెను. ఋతుపర్ణుడు బాహుకుని అశ్వహృదయ విద్యాకౌశలమును పరీక్షించెను. బాహుకుడు అశ్వముపై స్వారి చేయుచు తన్ను పరీక్షించువార్ష్ణేయ జీవలులకు గూడ అగమ్య గోచరముగ కల్పించి, ఋతుపర్ణునుద్దేశించి యిట్లనెను. "ఇది అగ్నిమయముగు గుఱ్ఱము. దీని యాగమునకొక మహాపురుష సమాగమము కలుగును. మరొక విషయము చెప్పెద నాకర్ణింపుమనెను." రెండు లేక మూడు గడియలలో శతయోజన దూరము వెళ్ళు గుఱ్ఱములు కూడ నున్నవి. ఇది యొక విద్య. ఒక గుఱ్ఱమును జూప ఇది నలుని అశ్వశాలలో పెరిగిన ముద్దుగుఱ్ఱము. ఆ రాజుకు కుమారుడు

పుట్టిన రాత్రి యిదికూడ పుట్టినది. నలదమయంతులు రాజ్యబహిష్కృతులయిన తర్వాత వారి అన్వేషణకు కానలకోనల తిరుగుచు ఈ గుర్రము చివరకు మీ అశ్వశాల చేరినది. మీకు గుర్తున్నదోలేదో గాని నలదమయంతులు రాజ్యబహిష్కృతులయినప్పటినుండి ఈ గుర్రము మీ అశ్వశాలయందుండిన" దనెను. అతని మాటలు విని వార్ష్ణేయుడు అశ్రుకలితుడయ్యెను. ఆ అద్భుతసంఘటన కత్యాశ్చర్యముపొంది ఋతుపర్ణుడు బాహుకుని నలునిగ అనుమానించెను. బాహుకుడిని నలునిగ నిర్ణయించుటకు దమయంతికి తప్పనన్యులకు సాధ్యము కాదని కూడ ఋతుపర్ణుడు భావించినట్లు నిందు తెలుపబడినది. ఋతుపర్ణుడు వార్ష్ణేయాదులను గుర్రముల విశేషములడుగుట, బాహుకుడశ్వహృదయవిద్యా కౌశలము చూపుటకు ఈ విషయములను ఉత్తర నైషధకర్త కల్పించియుండును.

భారతమునందున్నట్లే యిందు సుదేవుడను బ్రాహ్మణుడు చేదిపురమున దమయంతిని కనుగొనినట్లున్నది. పర్ణాదుడు ఋతుపర్ణుని సభలో ప్రవేశించు సమయమున నలుడు అశ్వహృదయ విద్యను, పాకనైపుణ్యమును ప్రదర్శించినట్లు. ఆ విద్యానైపుణ్యమును జూచి వచ్చి కలావతీ ముఖమున దమయంతికి నివేదించినట్లు ఈ కావ్యమునందు తెలుపబడినది. అదివిని దమయంతి మునులు తనకు ప్రబోధించిన విషయమును గుర్తునకు తెచ్చుకొని ఆవికృత రూపుడే నలుడని నమ్మినది. అతనిని రప్పించుటకు దమయంతి కలావతితో ఆలోచించినట్లు నిందు తెలుపబడినది. ఋతుపర్ణుని సభలో కవితాగోష్ఠి నలుడశ్వవిద్యను, పాకవిద్యా నైపుణ్యమును ప్రదర్శించుట, దమయంతి తల్లికి సుదేవుడు అయోధ్యకువెళ్ళి బాహుకుని తోడ్కొని వచ్చినట్లు కలవచ్చుట వంటి అంశములు మూలములోలేవు.

ఋతుపర్ణుడు బాహుకునకు సుదేవుని జూపి "అతడు విదర్భ

దేశమునుండి వచ్చినవాడు. నలునిగానరాక విదర్భరాజు తన కుమార్తెకు ద్వితీయ స్వయంవరము ప్రకటించెను. అదియు రేపే జరుగును. నీ అశ్వహృదయ కౌశలము ప్రదర్శింపుమనెను". అందులకు బాహుకుడంగీకరించెను. బాహుకుడు సుదేవుని పలుకులువిని అశ్వశాలకు బోయి దేవతలను కూడ నిరాకరించిన దమయంతి యిట్లు రెండవ వివాహమునకు దిగజారినదని దుఃఖించి, గుర్రమును నుద్దేశించి "వాయువు, అగ్నికంటె నతివేగముగ వెళ్లి మమ్ములను విదర్భకు చేర్చు" మని ప్రార్థించెను. ఆ మాటలు విని గుర్రము శుభసూచకముగ తలయూచెను. బాహుకుని రథవేగమునకు ఋతుపర్ణ, వార్ష్ణేయులు ఆశ్చర్యపడిరి. ఇది నిజముగ నలమహారాజు నైపుణ్యమేనని యూహించిరి. మార్గమధ్యమున నలుడు ఋతుపర్ణుని నుండి అక్షహృదయ విద్యను పరిగ్రహించెను. ఆవిద్యాప్రభావముచే నలుడు కలి విముక్తుడయ్యెను.

కుండిన పురము ప్రవేశించునపుడు నలరథసారథ్యమునకు దమయంతి హృదయము శోభించినది. బాహుక రూపమునందున్న నలుని పరీక్షించుటకు భారతాదులందలి కేశినికి బదులు ఇందు కళావతి అను చెలికత్తెనుపయోగింపబడినది. బాహుకునితో "అశ్వహృదయమునెరిగిన నిన్ను నలునిగ మా దమయంతి భావించుచున్నదని' కళావతి యనగా అందులకు నలుడు

"అశ్వహృదయము నెఱిగిన యంతమాత్ర
వయసు పండిన బుద్ధి వైభవము మాత్ర
ఒక్కయశ్వము నిట్టిదియున్న మాత్ర
బాహుకుడెట్లు నలభూమి పాలు డగును"

ఉత్తర. నైషధ. (3-277)

అని సమాధానమిచ్చి పరపురుషులతో దీర్ఘ సంభాషణము

తగదని కలావతిని వారించి, రాజునకు ఆహారము చేయుటకు వెళ్లెను. అందులకు కలావతి "ఇంతవరకు ఋతుపర్ణుని సారథియంటివి, ఇపుడు సూదకుడవంటివి, నీవిషయము నిశితముగ పరిశీలించెద" ననెను.

కలావతి యింకను పరీక్షింపగోరి బాహుకుని సమీపించినది. నలునకు పాకపదార్థ విషయమున కొన్ని ప్రత్యేకలక్షణములున్నవి. తాను వంటచేయుటకు అగ్ని, నీరు అవసరముండదు. వీటి సహాయము లేకనే రుచికర పదార్థమును తయారుచేయుటలో నలునకు నేర్పున్నది. ఆ నేర్పు నలునకు వివాహసందర్భమున అగ్ని, వరుణులవలన లభించినది. ఈ విషయము దమయంతికి తెలియును.

తలపు బడివచ్చు జలముల దానమాడి
జపము తపమున విధులను సవదరించి
పొయ్యి యిడలేదు నీళ్ళను బోయలేదు
చేయి కదుపుట సవియ సంసిద్ధమైన"
(3-283) ఉత్తర.నైషధ.

"షడ్రసోపేతమగు పాకసరణి నెఱప
యాఘుమంఘుమ వ్యాపించె యచటునెల్ల
ప్రాణికోటికి ఘ్రాణతర్పణము
యల్లవైదచ్చ యుల్లంబు పల్లవింప"
(3-284 ఉత్తర.నైషధ.)

షడ్రసోపేతమగు నలపాకము యొక్క ఘుమఘుమల వాసన భీమపురియందలి జనమునకు దమయంతికి ఆశ్చర్యము కలిగించి నట్లు ఈ కావ్యమున పేర్కొనబడి యున్నది. పాకపదార్థసామాగ్రి సమగ్రముగ నున్నప్పటికి అందరు రుచికర పదార్థమును తయారు

చేయలేరు. కొందరుమాత్రమే రుచికరపదార్థమును తయారుచేయ గలరు. ఇట్లు రుచికరపదార్థమును తయారుచేయుటలో నల, భీములు సిద్ధహస్తులని పురాణప్రసిద్ధి. పురాణప్రసిద్ధమైన ఈ విషయమును దృష్టిలో పెట్టుకొని జానపదులు రుచికర పదార్థములను నలభీమపాక మనుచుందురు. బాహుకుడు దమయంతి బిడ్డలను దలచి దుఃఖిం చినాడు. కలావతి "ఎందులకేడ్చెద" వన తన కిటువంటి బిడ్డ లున్నార" ని చెప్పి కప్పిపుచ్చెను. కలావతి నిశితముగ బాహుకుడు కట్టిన వస్త్రమును. దమయంతి కట్టిన మలినవస్త్రమును పరిశీలిం చినది. రెండు వస్త్రములొక్కటిగానున్నవి. నలుడు దమయంతిని వదలినపుడు ఆమె వసనమును చింపి కట్టుకొని వెళ్లెను. నలుడు ఏక పత్నీవ్రతుడు. దమయంతి పతివ్రత. కావున పరస్పర వియోగమై నప్పటికి వారు ఏకవస్త్రధారులయి యుండిరనుటకిది చక్కని దృష్టాం తము. భారతాదులందు కన్పింపని కలావతీ నిశిత దృష్టియిందు రమ్యముగా చిత్రింపబడినది. బాహుకుడు దమయంతి బిడ్డలను గుర్రముపైనెక్కించి స్వారి చేయించెను. దమయంతి కనులార బాహుకరూపమునందున్న నలుని జూచి విస్మితురాలయి. గుర్రమును సమీపించి బిడ్డలను దించినది. దమయంతి బాహుకుని ఆకృతిని జూచి పరవశురాలయినది. నలదమయంతులు పరస్పరము పరవశ మందిన విషయము ఉత్తర నైషధకర్త కల్పించెను.

"నలసమాక్షయ ప్రభవెన్ విలసనమ్ము
చిత్రభాను స్వభాన్వధిశీర్షముఖమ్ము
కలిఖల విరోధివికృతి ధిక్కారకమ్ము
వెలయు నందన విజయమీ నలచరిత్ర"

సకల శుభములకు సూచనగా కలిదోషనివారణమునకై ఈ ఉత్తర నైషధమును మల్లంపల్లి వీరేశ్వర శర్మగారు వ్రాసినట్లు విదిత మగుచున్నది.

## 5. 3. 1. ఉత్తర నైషధము:

శృంగార నైషధమునకు ఉత్తర కథాభాగముకల ఉత్తర నైషధ మను గ్రంథమొకటి వెంకటగిరి సంస్థానము వారికోటలో గల గ్రంథాలయమునను న్నది. దీనిని రచించినది ఇమ్మడి జగదేవరాయలని గ్రంథమున గలదు. ఆని లక్షణమంజరి యనెడు ఛందోగ్రంథమును రచించిన తిమ్మనకవి దీనిని రచించి జగదేవరాయల పేరు పెట్టెననియు, ఉత్తరనైషధము రచించుటచే నీ తిమ్మనకవికి నైషధము తిమ్మనకవియని పేరుకలిగినదనియు తెలియువచ్చుచున్నది. ఈ గ్రంథమును చూచుటకు నేను చేసిన ప్రయత్నములు ఫలించలేదు.

"వెంకటగిరి సంస్థానములు – సాహిత్య సేవ" అను నంశముపై పరిశోధన చేసిన డాక్టర్ పురుషోత్తము (నెల్లూరు సర్వోదయ కళాశాల ఆంధ్రోపన్యాసకులు) గారి దగ్గర ఉత్తర నైషధతాళపత్రప్రతి మిక్కిలి శిథిలావస్థలో కలదని అందు కృతికర్త చెన్నయామాత్యుడని యున్నదని వారు రత్నాకరం శంకరనారాయణరాజుకు తెలిపినట్లు విదితమగుచున్నది.

## 5. 4. నలకథాపరములగు ద్వ్యర్థి కావ్యములు:

రెండర్థములు స్ఫురించునట్లు రచించిన శ్లేషకావ్యమునకు ద్వ్యర్థికావ్యమందురు. ద్వ్యర్థి కావ్యములలో చమత్కారమెక్కువ. కథలొమార్పు చాల తక్కువ. అర్థ సంవిధానానుకూలముగ కథలో కొన్ని సందర్భములందు మార్పు కన్పించును.

తెలుగులో వెలసిన మొదటి ద్వ్యర్థికావ్యము పింగళిసూరన "రాఘవపాండవీయము." ప్రసిద్ధమైన రామాయణ భారత కథలను కలిపి రచించిన కావ్యమిది. రాఘవపాండవీయము తరువాత వెల

సిన కావ్యములలో పేర్కొనదగినది రామరాజ భూషణుని "హరి శ్చంద్ర నలోపాఖ్యానము".

## 5. 4. 1. రామరాజ భూషణుని హరిశ్చంద్ర నలోపాఖ్యానము:

రామరాజ భూషణుడు (16వ శతాబ్దము) హరిశ్చంద్ర కథను గౌరన ద్విపద హరిశ్చంద్రోపాఖ్యానమునుండి, నలకథను సంస్కృత భారత నైషధములనుండి గ్రహించి ఈ ద్వ్యర్థికావ్యమును వ్రాసెను. హరిశ్చంద్ర కథకు సంస్కృత వాఙ్మయమున వ్యాప్తితక్కువ. ఉన్న రెండు లేక మూడు నాటకములు కూడ అప్రసిద్ధములే. ఋగ్వేద ములోనున్న హరిశ్చంద్రకథకు తెలుగులో ప్రసిద్ధిపొందిన హరి శ్చంద్రకథకు సంబంధములేదు. వేదహరిశ్చంద్రుడు క్రూరుడు. తన కుమారుని యాగమునకు బలియిచ్చిన దుష్టుడు. తెలుగు హరి శ్చంద్రుడు సత్యసంధుడు. అందువలన రామరాజభూషణుడు హరి శ్చంద్రుని సత్యసంధత తెల్పుటకై తెలుగు హరిశ్చంద్ర కథనే గ్రహించెను. తెలుగులో వెలువడిన నలకథలన్నింటికి సంస్కృత భారతమో లేక సంస్కృత నైషధమో మూలమైయున్నది. తెలుగు లోని నలచరిత్రలలో కథావిషయమున మార్పులు ఏమియు కన్పిం చుటలేదు. అందువలన రామరాజభూషణుడు అనువాదములాదరిం పక సంస్కృత భారత నైషధములలోని నలకథనే గ్రహించెను. కాని అర్థద్వయసంఘటన కొరకు రామరాజభూషణుడు నలకథలో కొన్ని మార్పుకూర్పులు చేసినాడు.

హరిశ్చంద్ర కథానుగుణముగ రామరాజభూషణుడు నల కథలో కల్పించిన మార్పులను గమనింతుము.

హరిశ్చంద్ర కథలో ఇంద్రసభలో సత్యసంధత అను నంశముపై

జరిగిన వాగ్వివాదము జతపడుటకై నలకథాపక్షమున భీమరాజు సభ చేసి దమయంతికి తగిన వరుడెవ్వని మునుల నడిగినట్లు, వారు నలు డర్హుడని పేర్కొనగా రూపసుందరుడగు మన్మథుడు మత్సరించి నలదమయంతులను పీడించినట్లు భారత నైషధములందు లేని భాగమిందు కల్పింపబడినది.

హరిశ్చంద్ర కథాపక్షమున గౌరన చేసిన భేతాళ వృత్తాంతము సుఘటిత మగుటకు నలకథాపక్షమున నలుడు తాళవనమున తిరుగు లాడెనని భారత నలకథలో లేని విషయము కల్పింపబడినది.

హరిశ్చంద్ర కథాపక్షమున నున్న నక్షత్రకపీడయు, చంద్రమతి తన్నమ్ముమని రాజుతో చెప్పుటయు మున్నగు విషయములను నిర్వ హించుటకై దమయంతికి ఓనుడగు భర్తృస్మరణమునకు వచ్చినట్లు భారతనలకథయందు లేని విషయము కల్పింప బడెను.

(చూ. హరి. న 4-37)

ఇంద్రసాక్షాత్కార రూపవరమునకు వినియోగము చూపుట కయి సంస్కృత భారత నలకథలో లేకున్నను రామరాజభూషణుడు హరిశ్చంద్ర నలోపాఖ్యానమునందు కథాంతమున నలుడు యజ్ఞము చేసినట్లు నందు ఇంద్రుడు ప్రత్యక్షమైనట్లు వర్ణించెను.

(చూ. హరి. న. 5-62)

## 5. 4. 1. (అ) కృష్ణాధ్వరి నైషధపారిజాతీయము:

దాక్షిణాత్యాంధ్ర కవితా నాయకుడైన రఘునాథనాయకుని ఆస్థాన కవియైన కృష్ణాధ్వరి నైషధపారిజాతీయమును రచించి రఘు నాథనాయకునికంకితమిచ్చెను. నలదమయంతుల వివాహము వరకు గల నలకథ, పారిజాతాపహరణ కథ ఇందు జోడింపబడినది. ఈ

గ్రంథమునందు నాలుగాశ్వాసములు పూర్తిగను, ఐదవ ఆశ్వాసము అసమగ్రముగ నున్నట్లు హైదరాబాద్ స్టేట్ ఆర్కైవ్స్‌లోని మైక్రోఫిల్మ్స్ వలన తెలియుచున్నది.

దమయంతి నలుని వరించుటయు, వివాహానంతరము నలుడు దమయంతీ సహితముగ స్వపురమునకెగుటయు గలకథ ఈ గ్రంథమున చెప్పబడియున్నది. కవి నలదమయంతుల కష్టములను గూర్చి చెప్పనుద్దేశించినట్లు కానరాదు. ఈ గ్రంథప్రతిని వ్రాసిన యాతడిద్దానికి "శృంగారనైషధపారిజాతీయమని" పేర్కొనియున్నాడు.

ఇందు పారిజాతాపహరణ కథానుగుణముగ నలకథ మలచబడినది.

శ్రీకృష్ణుడు వనవిహారమున కేగినపుడు దేవతలు రక్షణ గోరుదురు. కృష్ణుడంగీకరించును. కృష్ణునికడకు కవీంద్రుడేతెంచి (వయోధకుడు) షోడశరాజపుత్రికల తెలుంగెటిగించును. తన్నా రాజపుత్రికలు ప్రేమించునట్లు చేయుమని శ్రీకృష్ణుడు వేడగా కవీంద్రుడు కన్నియలకడకేగి వారు కృష్ణుని ప్రేమించుచున్నట్లు చేసెను. ఈ కథాసందర్భమున కనుగుణముగ నలకథాపక్షమున దమయంతిని గూర్చి నలుడు చారుల వలన విని ఉద్యానవనమున ప్రొద్దుపుచ్చుటకై పోయి అచట హంసను పట్టుకొనినట్లు, హంస దమయంతి కడకేగి నలుని రూపురేఖాదుల వర్ణించి, ఆమెకు నలునియందను రాగము కలుగునట్లు కూర్చెను.

పారిజాత కథాపక్షమున నారదుడు కృష్ణునికడకేగి, యాతనికి పారిజాతకుసుమమునిచ్చెను. అతడా కుసుమమును రుక్మిణికి నివ్వగా సత్యభామ కృష్ణునిపై ఆగ్రహించెను. సత్యభామకు శ్రీకృష్ణుడు పారిజాత వృక్షమును కొని తెచ్చియిచ్చెను. తరువాత శ్రీకృష్ణుడు నరక

వధకు పూనుకొనెను. నలకథా పక్షమున నారదుడు దేవలోకమునకేగి దేవతలకడ దమయంతీ రూపరేఖావైభవముల ప్రశంసించెను. వారామె యందు బద్ధానురాగులయి స్వయంవరమునకు వచ్చుటకు నిశ్చయించుకొనిరి. భీమరాజు స్వయంవర సన్నాహమొనర్చినట్లు నిందు కూర్చబడినది.

పారిజాతకథలో కృష్ణుడు కృతవర్మ సాత్యకి, బలరామాదులతో గూడి నరకునిపైకేగినట్లు మార్గమధ్యమున దేవేంద్రాదులాతనిని దర్శించినట్లున్నది. ఈ కథానుగుణముగ నలకథలో దేవేంద్రాదులు నలుని మార్గమధ్యమునకలిసి.నలుని దమయంతి యంతఃపురమునకు దూతగ పంపినట్లు, నలుడు దమయంతిని జూచి యామెతో సంభాషించినట్లు మలచబడినది.

పారిజాత కథాపక్షమున సత్యభామ కన్యకలకోర్కె నెఱింగి వారికి శ్రీకృష్ణుని గూర్చి చెప్పనది. నలకథాపక్షమున భీమరాజు ప్రార్థింప సరస్వతీదేవి ప్రత్యక్షమై స్వయంవరాగతులగు రాజులను గూర్చి దమయంతికి చెప్పినట్లు కలదు.

ఇట్లు సామ్యములగు సన్నివేశములను మాత్రము గ్రహించి కృష్ణాధ్వరి అలతియలతి మార్పులతో ఈ ద్వ్యర్థి కావ్యమును వ్రాసెను నలకథానుగుణముగ పారిజాత కథలోను, పారిజాత కథానుగుణముగ నలకథలోను మార్పులు పెక్కు కల్పించక పోయినను ఇందు చమత్కారమెక్కువగ కన్పించుచున్నది.

కృష్ణాధ్వరి కవితా విశేషముతెలుగుటకు క్రింది ఉదాహరణములను పరిశీలించునది.

నలకథాపరముగ హంసవర్ణనము పారిజాత కథాపక్షమున

కవీంద్రుని వర్ణనము క్రింది పద్యములో చూడుడు.

"సరసులలోననేమెలగు జాణకవుల్మది మెచ్చ పెద్దలౌ
సురుతర బుద్ధి జృంభణవశోగణనం బ్రధుకాంతిమత్త్వసం
భరణుడు రక్తిరంగినయు పాటల వర్ణసృదువ్రిచారణం
బరగుపదక్రమంబులను బ్రహ్మరథోచితుడెంచిచూచినన్"

నలునితో కృష్ణునితో కవీంద్రుడు పలుకు ఈ క్రిందిది.

"పార్థివభోగ భవ్యగుణ భాగ్యదురంజన దుర్నిరీక్షతే
జోభర ఘోరదాణ జయశోభిత పాదవినమ్రరాజద
త్రాభయవీరసేన తనయాహిత రాజ్యధురీణ, నీదయా,
వైభవమే నెఱంగి యిటవచ్చితి నీకొకమేలు కూర్పగన్"

ఇట్లు కథాద్వయము కనువుగ నైషధపారిజాతీయమున వర్ణన లెక్కువ కల్పింపబడినవి.

## 5. 4. 2. నలకథాపరములైన నిరోష్ఠ్యకావ్యములు:

నిరోష్ఠ్యము అచ్చతెనుగు, నిర్వచనము మొదలగు నియమములను జోడించి ప్రత్యేక కావ్యములను వెలయించు సంప్రదాయము తెలుగులో ప్రబంధయుగమున చోటుచేసికొనినది. తెలుగు సాహిత్యమున నేర్పడిన విశిష్టము నూతనములైన నిరోష్ఠ్యము, నిర్వచనము అచ్చతెనుగు సంప్రదాయమునందును నలకథ చోటుచేసికొని తెలుగు పాండితీలోకమున ప్రశస్తి పొందినది.

## 5. 4. 2. 1. శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము:

దీనిని కందుకూరి వీరేశలింగము పంతులు రచించినాడు. పూర్వోత్తర కథాంశములున్న మూడాశ్వాసములుగల నలకథాకావ్యమిది. భారతా

రణ్యపర్వములోని నలోపాఖ్యానమే దీనికి మూలము. విశేషించి కథలో మార్పేమియు లేదు. ఇదియొక ప్రౌఢ రచన. ప్రక్రియా వైవిధ్య దృష్టితో జూచినచో ఈ నైషధము శుద్ధమైన ఆంధ్ర భాషలో నిరోష్ఠ్య నిర్వచనముగ వెలువడినది. అచ్చతెనుగు కావ్యములలో మొదటిది పొన్నికంటి తెలగన యయాతి చరిత్రము. ప్రథమ నిర్వచనకావ్యము తిక్కన నిర్వచనోత్తర రామాయణము. నిరోష్ఠ్యపద్యములు నాచన సోముని ఉత్తర హరివంశములో చోటుచేసికొని యున్నవి. వీటినన్నింటిని తమ కావ్యమునందు నిక్షిప్తము చేయవలయునని సంకల్పించి కాబోలు వీరేశలింగము "ఈ శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము" ను వ్రాసియుండును.

నలునిచే పట్టుబడిన హంస తన కుటుంబ సభ్యుల దలచి యిట్లు దుఃఖించినది.

"ఎల్లవో నారాక కెదురు చూచుచునుండు
నెలంత్రుక యెదనెంత తలకెనొక్కొ
యేరేయి నన్గాంచి నిలువాడు సీకుండు
కన్నతల్లియదెంత కలగెనొక్కొ
తోడునీడల రాగ తొలగని చెలికాండ్రు
సోలియన్ గనకెంత తూలిరొక్కొ
నే జేరుట యెడంగి నెనరున జనుచెంచు
కొడుకులు తారెంత కుందిరొక్కొ

కూడి యెల్లరిది తెలిసి కొన్నయంత
కపోకటా తాలసి చేత గడకు నేను
చిక్కగా జేసె నేద్దిసేయుదింక
హానినన్నేలు పేదనేననదనైతి"

శుద్ధాంధ్ర; ని. నైషధ. (1-23)

ఈ పద్యభావము శ్రీనాథుని శృంగార నైషధములోని పద్యభావమును తలపింప జేయుచున్నది. దమనమహర్షి వరప్రభావమువలన దమయంతి మాత్రమే జన్మించినట్లు ఇందు తెలుపబడినది. ఇవి తప్ప భారతనలకథకు, ఈ నైషధకథకు కథావిషయమున మార్పేమియు లేదు.

## 5. 4. 2. 2. నలరాజ చరిత్ర — నిరోష్ఠ్యప్రబంధము:

ఇది అముద్రితము. దీని కర్త క్రొత్తలంక మృత్యుంజయ కవి. ఈ నలరాజచరిత్రలో మూడాశ్వాసములున్నవి. మొదటి రెండాశ్వాసములు సంపూర్ణముగను. మూడవ ఆశ్వాసము అసమగ్రముగనున్నది. వ్రాతసరిగాలేదు. తప్పులధికముగా నున్నవి. నన్నయ భారత నలకథయే దీనికి మూలము. హంస దమయంతితో నలునిగూర్చి చెప్పిన పద్యమును గమనింపుడు.

"నలలితాకారరేఖ సత్యలీల
సత్యనీలా నిరతి హరిశ్చంద్రరీతి
చంద్రరీతియె కాంతి నాగేంద్రయాన
యానరాగ్రణి కేనధాత్రి నరయగలరె"

ఇట్లు ముక్తపదగ్రస్త, శబ్దాలంకారపూరితముగ వ్రాయబడిన ఈ నిరోష్ఠ్యకావ్యమునందు ప్రధానముగ కథలో మార్పేమియు లేదు.

## 5. 5. నలకథాపరములగు వచన కావ్యములు:

పండితపామరులకు సహితము సులభసాధ్యమైనది సుబోధకమైనది. వచనము నన్నయ నలోపాఖ్యానము నాధారముగ చేసికొని తెలుగుకవులు కొందరు సులభమైన వచనశైలిలో పూర్వోత్తర కథాంశములతో నలకథా కావ్యములను రచించియున్నారు. శ్రీనాథుని శృంగారనైషధము నాధారముగ చేసికొని రచింపబడిన పూర్వనలకథాభాగములు కలిగిన వచన

కావ్యములు కొన్ని నన్నయ శ్రీనాథుల ప్రభావములేని స్వతంత్ర నల చరిత్రలు కొన్ని తెలుగులో రచింపబడినవి.

బాల బాలికలకు ధైర్యము, సాహసము, ఆత్మవిశ్వాసము, సత్ప్రవర్తనము ఇత్యాది గుణములను నేర్పవలెనని. వారికొరకే ప్రత్యేకముగా సులభశైలిలో వచనముగా వ్రాయబడిన నలకథలు కొన్ని తెలుగులో వెలసినవి. ప్రధానకథను సూటిగా పిల్లలమనస్సులకు హత్తుకొనునట్లుగా అతి క్లుప్తముగా రచించుట వీరి యుద్దేశ్యము ఎన్నికష్టములు వచ్చినను మనిషి క్రుంగిపోకూడదని, ఆత్మవిశ్వాసముతో ఆసమస్యల నెదుర్కొనవలయునని, అటువంటి వారినే చివరకు విజయలక్ష్మి వరించునని, బాలబాలికలు ఆత్మవిశ్వాసమును పెంపొందించుకొనవలయునని ఈ నల చరిత్ర వచనకావ్య కర్తలు బాలురకుద్బోధించారు.

## 5. 5. 1. పూర్వోత్తర వచన నలచరిత్రలు:

తెలుగులో వెలసిన పూర్వోత్తర కథాంశములు గల వచన నలోపాఖ్యానములన్నియు నన్నయ భారతములోని నలకథ ననుసరించినట్టివే

### 5. 5. 1. 1. పురాణం పిచ్చయ్యశాస్త్రి-నలచరిత్ర:

పూర్వోత్తర కథాంశములు గల ఈ వచన నలచరిత్రలో ప్రధానముగ చెప్పుకొదగిన మార్పులేవియు లేవు. కావ్యారంభమునందు కవి ఇష్టదేవతా పూజనమును ఎనిమిది పద్యములందు చేసినాడు, ఈ కావ్యమునందు చిత్రపటములుండుట చెప్పుకోదగిన విశేషము. దీనివలన చదువరులకు కథావగాహనము కొంతవరకు కలుగును. పాండవులు ద్యూత పరాజితులై అరణ్యవాసమునకు వచ్చినట్లు, అప్పుడువారు వివిధ పురాణకథలను మార్కండేయాది మునులవలన వినినట్లు పాండవులకు బృహదశ్వుడను ముని ఈ నలకథను చెప్పినట్లు ఈ కావ్యమున చెప్పబడినది. ఈ కావ్యమునందు కథానుగుణముగ కొన్ని విభా

గములున్నవి. అవి కథావగాహనమునకు తోడ్పడుచున్నవి. దీనికితోడుగ లోకానుభవముతోకూడిన కొన్ని అంశములిందు చేర్చబడియున్నవి ఉదాహరణమునకు కలి పుష్కరుని నలునితో జూదమాడుటకు ప్రేరే పించినపుడు పుష్కరుడు తనలో "మంచికాలము చేకూరినపుడు సమస్త కార్యములును తమకు తామే సంఘటిల్లి యనుకూలములగుచుండు నని"యనుకొనెను. అంతకు పూర్వము నలుని చేతిలో చిత్తుగ ఓడింప బడిన పుష్కరునికి కలియుపదేశము అగ్నికి ఆజ్యము పోసినట్లయినది ఇటువంటి అంశములు తప్ప ఈవచనమునందు ప్రధానకథలో మార్పే మియులేదు.

## 5. 5. 1. 2. జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రి- నలమహారాజు కథ:

సుబ్రహ్మణ్యశాస్త్రిగారు భారతారణ్యపర్వనలోపాఖ్యానమునే గ్రహించి అలతియలతి మార్పులతో సులభశైలిలో "నలమహారాజు కథ" అను కావ్యమును రచించినారు. చదువరులకుత్సాహము కలిగించు నుద్దేశ్య ముతో కొన్ని పద్యములను ఇందు చేర్చినాడు. అరణ్యవాసమనుభ వించుచున్న పాండవులకడకు బృహదశ్వుడొక్కడే వచ్చినట్లు భారత నలోపాఖ్యానము నందుండగా, ఈ వచన కావ్యమునందు బృహ దశ్వుడు శిష్యసమేతముగ వచ్చినట్లు శాస్త్రి మార్పు చేసినాడు. నిషధ రాజుకు పుత్రసంతానములేదని, పుత్రప్రాప్తికై అతడు పరమేశ్వరుని గూర్చి తపస్సుచేసి నలుని పొందినట్లు నిందు తెలుపబడినది. నలునిది ధర్మపరిపాలనయని, అతని పాలనలో దుష్టశిక్షణ, శిష్ట రక్షణార్థమై విష్ణుచక్రముండినదని, అడవిలో వ్యాఘ్రము గోవును బెదిరించినపుడు విష్ణుచక్రమువచ్చి వ్యాఘ్రకంఠమును ఛేదించి నదని ఈ కావ్యమున వర్ణింపబడియున్నది. దమన మహర్షి తండ్రి వాలఖిల్య మహామునియని మూలమందులేని విషయమిందు చెప్ప

బడియున్నది. దమన మహర్షి వరప్రభావము వలన దమనాభుడను కుమారుడు, దమయంతి యను కుమార్తె భీమునకు కలిగినట్లు ఈ వచనమునందు చెప్పబడినది. నారదుడు ఇంద్రునకు నలుని గొప్ప తనమును వివరించు నుద్దేశ్యముతో దమయంతీ స్వయంవరము తెలి పినట్లు ఇందు కల్పింపబడినది. దేవతల సందేశమును నలుడు విని పించినపుడు దమయంతి "స్త్రీలకు గల దృఢ చిత్తము పురుషులకు లేదను మాటమీయందు ధ్రువపడుచున్నది. పురుషజాతికి మీరప కీర్తి తెచ్చుచున్నారని" నలుని నిందించినది. ఆమాటలు విన్న నలుని మనసు చలింపలేదని యిందు తెలుపబడినది. స్వయంవరాగతుల వృత్తాంతముగాని, వారిని పరిచయము చేసిన వారి వివరములుగాని భారతనలోపాఖ్యానమునందు కానరావు. స్వయంవరాగతులను దాది దమయంతికి జూపినట్లు ఇందు కల్పింపబడినది.

ఈ వచనకావ్యములో కలిపురుషునిపేరు శనియని మార్చబడి నది. దమయంతి దిక్పతులను వరింపక పోవుటతో శనికి కోపము గలిగి నలదమయంతులకు కష్టము కలిగించుటకు ప్రయత్నించినట్లు నిందు కల్పింపబడినది. బ్రాహ్మణ వేషమున శని నలుని యంతః పురము ప్రవేశించి, అతనిని పట్టుకొనుటకు ప్రయత్నించి, విఫలుడై తిరిగి వచ్చినట్లు నిందు మార్చబడినది. వివాహానంతము ఆడుబిడ్డ అమ్మవారింటియందుండుట పొరబాటని, పుట్టినింటికి గౌరవము గూర్చునది పుత్రికయని, అగౌరవము కూర్చునది సత్పుత్రిక కాదని లోకసహజమైన మాటలను కవి చెప్పినాడు.

ఒకనాటి వేకువ జామున నలమహారాజు నిదురలేచి పాత్ర నిండుగ నీరుతీసికొని బహిరంగ ప్రదేశమునకు పోయి దేహబాధతీర్చు కొని, చెంబెడు నీళ్ళతో శుద్ధిగావించుకొన్నట్లు, అట్టియెడ అతని ఎడమకాలి మణికట్టుపైన సూదిమోపినంతటి పరిమాణముగల

ప్రదేశమున నీరంటకపాడిగానున్నట్లు, దానిని జూచి సమయమునకై నిరీక్షించుచున్న శని నలుని కాలిమడమకట్టుపై సోకినట్లు జానపదులలో వ్యాప్తి నొందిన విషయమిందు తెలుపబడినది. శని పుష్కరుని సమీపించి తాను దమయంతిని వివాహమాడదలచినట్లు దమయంతి దేవతలనుకూడ నిరాకరించి నలుని వివాహమాడుటతో తన ఆశ నిరాశయైనట్లు, శని ప్రేరితుడైన నలుడు పుష్కరునితో జూదమాడుటకు అంగీకరించినట్లు, తొలుత పుష్కరుడోడినట్లు, శని నలుని ద్యూతనైపుణ్యమునకచ్చెరువు నందినట్లు ఇందు తెలుపబడినది. ద్యూతవిద్యానైపుణ్యమున నలుడు అఘటనాఘటన సమర్థుడని తెల్పుటకై కవి యిట్టి మార్పుచేసి యుండును.

రాజ్యబహిష్కృతుడయి నలుడు దుఃఖించుచున్నపుడు దమయంతి ధైర్యమిట్లు కలుగజేసినది.

ఉ॥ జ్ఞానికి గష్టసౌఖ్యములనారతయున్ సమవృత్తిదోచున
జ్ఞానికి సౌఖ్యకాలమునగల్గుబ్రిమోదము, కష్టకాలమె
ధ్యైన విచారమున్ గలుగనట్టిద, ఇయ్యవిరెండు పూర్వక
ర్మానుకృతంబులై తనరు నందున ధైర్యమునొందజెల్లునే.

"పతితోడ సుఖము సతులకు
పతియే దైవమ్ము ప్రాణవల్లభునకు నా
గతియేసద్గతి తమకదె
హితమగునిను బాయుటెట్టులిపుడు హృదీశా"

ఆపదలు వచ్చినంత మాత్రమునకు మనిషి కుంగిపోకూడదని ధైర్యముతో ఆపదల నెదుర్కొనవలయునని, భర్తతో కలిసిమెలసి యుండుటయే స్త్రీకి సుఖము, సద్గతికలుగునని దమయంతి భర్తకు

ప్రబోధించినది. దమయంతి నలునితో ఈ కష్టకాలము గడుపుటకు విదర్భకు పోవుదమనెను. "అత్తవారింటికనాహూయమానముగా పురుషులరుదెంచుటయే తగదు. ఒకవేళ నటులేగినను నొకటి రెండు దినములు గడపి తమంతటతామే యనుమతి గొని బయలుదేరి రావలయును. అంతకు మించి యెంతకాలమున్నను గౌరవము పల్చనగును" అని దమయంతికి నలుడు చెప్పినట్లు శాస్త్రిగారు లోకానుభవముతో వర్ణించినారు. దమయంతి సాహసమును జూచి శని ఖిన్నుడై అగ్నిదేవుని శాంతింపుమని ప్రార్థించుట, దమయంతి ఏది తినిన అది అమృతాహారముగా మారుట ఇత్యాద్యంశములను శాస్త్రి నూతనముగా కల్పించినాడు.

భీమరాజు పురోహితుడగు కృష్ణశర్మ దమయంతిని సుబాహు పురమున జూచినట్లు నిందు తెలుపబడినది. ఋతుపర్ణునకు సారధియైవచ్చిన నలునకు మార్గమధ్యమున కలి ప్రత్యక్షమై తాను సూర్యనందనుడని తెలుపుకొనినట్లు, అందులకు "సూర్యనందన, నేను సూర్య వంశ సంజనితుడను. మీరు సూర్యపుత్రులు. కావున మీరు నాకన్యులు గారు. నా విధివలన నాకీక్లేశములు కలిగినవి. గాని మీరు నాకు పగతురైచేసిన యపకారమేదియు లేదు. నా పేరు జగమున స్థిరముగ నుండునట్లనుగ్రహింపుడు. నరులు నా చరితమును, వినినను, జది వినను, వ్రాసినను, వారికి కలిబాధ కలుగకుండునట్లు ఈ శమీక వృక్షము క్రింద నిలచిన వారిని సోకకుండునట్లు వరమొసంగుమని" నలుడు శనిని ప్రార్థించినట్లు ఇందు తెలుపబడినది. దమయంతి "చతుర" అను దాదిని పిలిచి, నలుని పరిశోధించుటకు పంపినట్లు ఈ వచన కావ్యమున కలదు. త్రిమూర్తులు ప్రత్యక్షమై దమయంతి పాతివ్రత్యమును నిరూపించినట్లు కావ్యాంతమున తెలుపబడినది.

## 5. 5. 1. 3 నలమహారాజు చరిత్ర:

కవి పేరు తెలియని వచన నలమహారాజు చరిత్ర ఒకటికలదు లక్ష్మణమొదలారి వారిచే 1922 లో ఇది ప్రచురింపబడినది. పూర్వోత్తర కథాంశములుగల ఈ వచన కావ్యములో కథావగాహన కనుకూలముగ వివిధ చిత్రపటములున్నవి. కథాసంవిధానములో భారతనలకథనే ప్రధానముగా అనుసరించినను ఇందు కొన్నిమార్పులు కూర్పులు లేకపోలేదు. "పూనిన కర్మము పొరుగూరేగిన పోదు." "కలిమిలేములు కావడి కుండలు" ఇత్యాది లోక దృష్టాంతములతో బృహదశ్వుడు ధర్మజుని మనసును శాంతిపరచినట్లు ఇందు తెలుపబడినది. నలుని పరిపాలనలో నెలకు మూడువానలు కురియునని కవి తెలిపి, బలవంతులు బలహీనులను హింసించుటలేదని గోవ్యాఘ్ర సంవాదము ద్వారా నిరూపించినాడు.

స్వయంవరమండపమునకు రాక పూర్వము దమయంతి రమానాథుని గొల్చినట్లు కవియిందు కల్పించెను. తాను తలపెట్టిన కార్యము నిర్విఘ్నముగా కొనసాగుటకు ఇష్టదేవతా పూజనము చేయుట ఆచారమగుటవలన కవి యిట్టి మార్పు చేసియుండును. భీమరాజు ఆస్థాన బ్రాహ్మణుడు దమయంతికి స్వయంవరాగతులను జూపినట్లు ఇందు తెలుపబడినది. స్వయంవర మండపమున వంచ నలురను జూచి దమయంతికి అనుమానమేర్పడినది. మానవులకులేని కొన్ని ప్రత్యేక లక్షణములు దేవతలకున్నవి. అవి కనురెప్పపాటులేకుండుట, భూమి స్పర్శము పాదములకు లేకుండుట, ధరించిన పూలమాలలు వాడకుండుట. ఇవి లేని వానిని నలునిగా దమయంతి గుర్తించినదని కవి శృంగార నైషధముననుసరించి కాబోలు తెలిపియున్నాడు. కలి దేవేంద్రాదులతో తాను కోరిన దమయంతిని నలమహారాజు వివాహమాడుట వలన కష్టము పెట్టుట పాపముకాదని చెప్పినట్లు ఇందు తెలుపబడినది. శని ఒకనాడు కురుచ వెంద్రుకలపై కుళ్ళాయిబెట్టి ఎర్రని మీసములు దాల్చి కిరాతవేషమున నలమహారాజును వేటకు ఆహ్వానించినట్లు

నలుడు వేటకు వెళ్ళి శనిమాయచే అడవిలో నిద్రించినట్లు. నలమహా రాజుకు దుస్స్వప్నమువచ్చినట్లు నిందు మార్పుచేయబడినది. కలి పుష్కరుని సమీపించి తన పరాక్రమము దెల్పుకొనుచు, దమయంతి తనను వరింపక పోవుటచే నలుని రాజ్యమును భ్రంశము చేయదలచి నట్లు,నలునితో జూదమాడుటకు పుష్కరుని పురికొల్పినట్లు ఈ వచనము నందు తెలుపబడినది. రాజ్యబహిష్కృతులయిన నలదమయంతు లకు శని కన్పించి వారు పోవు సన్మార్గమును తప్పించి, రాళ్ళు రప్పలుగల మరొక త్రోవను జూపి ట్లు నిందు తెలుపబడినది.

ఈ వచనకావ్యమున నలు డిక్ష్వాకుల సంజాతుడుగ తెలుపబడి నాడు.నలుడు దమయంతిని వదలినపుడు ఆమె మేల్కొని దుఃఖించుచు ఇక్ష్వాకువంశములో పుట్టిన వారందరు ఆడితప్పుట ఎరుగరని, హరి శ్చంద్రుడుగాని శ్రీరాముడుగాని ఆడితప్పనివారని,విశ్వామిత్రునకిచ్చిన మాటను తప్పకొనలేక ఆలుబిడ్డలను అమ్మి చాలని ధనమునకు హరి శ్చంద్రుడు కాటికాపరికి అమ్ముడుపోయెనని, శ్రీరాముడు కైకేయి కిచ్చిన మాటప్రకారము అరణ్యవాసము గడిపెనని, అటువంటి సద్వంశములో జన్మించిన నలుడు తనను వదలి వెళ్ళిన దానికి దమయంతి నిందించి నట్లు కవి యిందు కల్పించినాడు.

సుబాహుపురము చేరిన దమయంతి రాజమాతతో సైరంధ్రిజాతి నని, నలమహారాజు అను గంధర్వుడు తన ప్రాణనాథుడని, తనపేరు ప్రభరాణియని చెప్పికొన్నట్లు ఇందు తెలుపబడినది. ఈ విషయము భారత నలకథయందు గాని, మరియే ఇతర నలకథాకావ్యములందు గాని లేదు. దమయంతి శీలమును నలుడు శంకించినపుడు ఆమె అగ్ని యందు దుమికినట్లు, దేవతలు పుష్పవర్షము కురిపించినట్లు, విష్ణువు నలమహారాజుకు కర్తవ్యోపదేశముచేసినట్లు ఇందు కల్పింపబడినది.

## 5. 5. 1. 4 దొరసామయ్య – నలచరిత్ర:

సామాన్య ప్రజానీకమునకందుబాటులో నుండు సులభమైన వచన శైలిలో వ్రాయబడిన నలకథాకావ్యమిది. ఇందు పూర్వోత్తర కథాంశములున్నవి. నన్నయ భారతనలోపాఖ్యానమును, చక్రపురి రాఘవాచార్యుని ద్విపద నలచరిత్రమునాధారము చేసికొని ఈ వచన కావ్యము రచింపబడినది. కథారంభము భారతములో నున్నట్లే కలదు. రాఘవాచార్యుని నలకథలోని "గోవ్యాఘ్ర సంవాదము" ను గ్రహించి ఈ కవి నలుని సత్యధర్మపరిపాలనను విశేషముగ కొనియాడెను. హంస దమయంతితో నలుని గుణగణములను కొనియాడుచు నలుడు "నల కూబరుడికన్న, మన్మథు కన్నను, సూర్యునికన్నను, చంద్రునికన్నను విష్ణువుకన్నను, జయంతునికన్నను సౌందర్యమునందు మిన్నయైన వాడని" చెప్పినట్లు ఇందు తెలుపబడినది. హంస దమయంతి మనసును నలునిపై మరల్చుటకు చేసిన ప్రయత్నమిది.

స్వయంవరాగతులను దమయంతికి వసుదేవుడను విప్రుడు జూపినట్లు దమయంతిని అత్తవారింటికి పంపునపుడు తల్లిదమయంతికి పతిగృహవర్తన విశేషములు చెప్పినట్లు ఇందు తెలుపబడినది. ఇవి రాఘవాచార్యుని ద్విపద నలచరిత్ర నుండి గ్రహింపబడినవే. శని పుష్కరునితో దమయంతి తనను నిరాకరించి నలుని వివాహమాడి మాణిక్యములవంటి యిద్దరు ముద్దుబిడ్డలను గని యలరారుచున్నదని, దానిని జూచి తన మనసు ఓర్వక నలదమయంతులను రాజ్యబహిష్కృతులను చేసి, వారిని వేసచేయదలచినట్లు ఈ కావ్యమున తెలుపబడినది.

అరణ్యములో తిరుగుచున్న నలదమయంతులకు వశిష్ఠమహర్షి యెదురుపడి కర్తవ్యోపదేశము చేసినట్లు, నలదమయంతులను రాజ్య బహిష్కృతుల చేయుటతో తృప్తిపొందక, శని తన మాయచేత వారిని త్రోవ తప్పించి, వారు పోవు దారియందు రాళ్ళు ముండ్లుండునటు కల్పించి, అంతటితో తృప్తిపడక వారికి ఇంద్రుడు ప్రసాదించిన మామిడి

పండ్లను కూడ అపహరించినట్లు ఈ నలకథా కావ్యమునందు తెలుప బడినది.

గుర్రపు శాలలో దమయంతిని దలచుకొని దుఃఖించు బాహుకుని జూచి జీవలకుడు "నీచేత దలపబడు స్త్రీ యెవరని" అడిగినట్లు భారత నలకథలో నుండగా ఇందు ఋతుపర్ణుడు ప్రశ్నించినట్లుగ కవిమార్చెను. నలుడు దమయంతి శీలమును శంకించినపుడు ఆమె అగ్నిలోదూకి నట్లు, ఆమె పాతివ్రత్యమహిమకు అగ్ని ఏమియు చేయజాలకుండినట్లు విష్ణువు ప్రత్యక్షమై నలమహారాజునకు పట్టాభిషేకము చేసినట్లు ఈ కావ్యమునందు తెలుపబడినది.

## 5. 5. 1. 5 మంత్రిప్రెగడ భుజంగరావుగారి - వచననైషధము:

భారత నలోపాఖ్యానమును, శృంగారనైషధమునాధారముగ జేసి కొని మంత్రిప్రెగడ భుజంగరావు వచన నైషధమును వ్రాసెను. విశే షించి కథలో మార్పులేమియు లేవు. ఇందు పూర్వోత్తర భాగముల విభజన కలదు. కావ్యారంభమున పద్యరూపమున ఇష్టదేవతా స్తుతి యున్నది. నలుని చేజిక్కిన హంస దుఃఖవర్ణన శృంగారనైషధములో హంస దుఃఖవర్ణనకేమాత్రము తీసిపోని విధముగ నున్నది. కథలో మార్పేమియు లేకపోయినను ఇందు చక్కని లోకోక్తులు కోకొల్లలు.

"కీర్తికై చిరకాలము పట్టునుగాని యపకీర్తి కనురెప్పపాటులో వచ్చును."

"సమాన యత్నంబొనరించిన లాభాలాభంబులు భాగ్యా ధీనంబులు"

"కామాభిలాషునకు ముందు వెనుకలు దోచవు"

"ఇల్లలికినం బందువయ్యెనే"

"పాదములు గడుగుట మరచి సంధ్యానుష్ఠానంబొనరించె"

"ధనహానికి సహింతునుగాని మానహానికి నోర్చుట దుష్కరంబు"

"దైవానుకూలంబు తప్పినచో పురుషయత్నము ఫలదాయకంబు గాదుగద"

"శుక్లపక్షంబున నున్నవెన్నెల కృష్ణపక్షంబున నుండునగునా"

"స్వకర్మఫలంబులు మారుతోవంబోవు నపుడెద్దియేని యుం జేకూరునే"

రాజ్యబహిష్కృతులై నలదమయంతుల దుర్భర కష్టములను భవించుచున్నపుడు నలుడు దమయంతిని పుట్టినింటికి పొమ్మని యాదేశించెను. అందులకు దమయంతి భార్యాభర్తల న్యోన్యానురాగమును గూర్చి యిట్లు చెప్పినది. "పురుషునికి మగువ యనునది శరీరమునకు కించుక నొప్పియొదవక యుండ కాపాడుచు సుఖింప జేయుటకై యేర్పడెను. ఎండగాయున్నపుడు గొడుగై, పరస్థలములందు బోవునపుడు పాదరక్షయై, నిర్వాతస్థలమున దీవనయై యుండును. క్షుత్తృష్ణా పీడితుడైయున్నపుడు ఆ పీడ తీర్చుటకు భార్యయే తగును. భర్త ధనవంతుడైన, నిస్స్వుండైన, సుఖియై యున్న రోగార్తుడైన, కోపావిష్టుడైన ప్రసన్నుడైన, సర్వభోగములొసంగిన, పీడించిన నొక్కతెరంగున జూచుచు నాతనితో సుఖదుఃఖములననుభవించుచుండునదే కులాంగన" అగుటచే మగువను సుఖింపజేయుట కర్తవ్యమగును. కష్టములు పెట్టుట కర్హుడగునా? పూర్వజన్మసుకృతఫలవిశేషమువలన తనకా కష్టము కలిగినది కాని నలుని వలన మాత్రము కాదని" దమయంతి నలునికి ప్రబోధించినట్లు ఇందు తెలుపబడినది. దమయంతి పతిభక్తి కలిగినదని, అటువంటి పతిభక్తిని ప్రతి స్త్రీ అవలంబింప వలయునని కవి ఈ నలచరిత్ర ద్వారా లోకమునకు ప్రబోధించెను.

## 5. 5. 2 పూర్వ నలకథాభాగములుగల వచనకావ్యములు:

తెలుగులో పూర్వోత్తర కథాంశములుగలవచన నలోపాఖ్యానములతో పాటు పూర్వకథాభాగములుగలిగిన వచన నలకథాకావ్యములుకూడ అవిర్భవించినవి. తెలుగులో వెలసిన పూర్వనలకథా వచన కావ్యములన్నింటికి శ్రీనాథుని శృంగారనైషధమే మూలము. శృంగార నైషధము ప్రౌఢ ప్రబంధకావ్యము. అందలి సొగసులు పండితులకు మాత్రమేగాని సామాన్య చదువరులకు గోచరించవు. అందువలన వచనకావ్యకర్తలు సామాన్య ప్రజానీకమున కందుబాటులోనుండునట్లు శృంగార నైషధ కావ్యమును సులభమైన వచనములో తెల్పినారు.

### 5. 5. 2. 1 అత్తలూరి సూర్యనారాయణ అంధ్రనైషధసారము:

ఎనిమిదాశ్వాసములుగల వచన కావ్యమిది. దీనిని పాఠశాలలలో పాఠముగ బెట్టి విద్యార్థులలో జ్ఞానమును వెలుగుదీయవలయునను కాంక్షతో కవి ఈ వచనమును వ్రాసెను. బాలుర భావముల కనుగుణముగ సరళశైలిలో వ్రాయబడినదీ వచనము. ఇది శృంగార నైషధమునకు అనువాదమేగాని ప్రతికృతి కాదు. చదువరులకు నలకథపై ఇంపు కలిగించు నుద్దేశ్యముతో కవి అవసరమైనచోట్ల సందర్భమునను సరించి శృంగారనైషధ పద్యములనే యథాతథముగ చేర్చుకొనెను. శృంగార నైషధమునకనువాదమగుట వలన కథకు సంబంధించి యిందు మార్పులేవియు లేవు.

### 5. 5. 2. 2 ఓలేటి వేంకటరామశాస్త్రి - దమయంతి

దమయంతి పేరుతో వెలువడిన ఈ కావ్యము నందు పదునాలుగు ప్రకరణములున్నవి. ఇది శృంగార నైషధమునకాంధ్రీకృతి. అందు

వలన కథకు సంబంధించి మార్పులేవియులేవు. ఇది సామాన్య ప్రజా నీకమున కందుబాటులో నుండు శైలిలో వ్రాయబడినది. శృంగార నైషధమునందలి పలుకుబళ్లు, లోకోక్తులను కవియిందు యథావిధిగ గ్రహించెను. ఇది బాలురకు నీతిని గరపుటకై వారి భావముల కను గుణముగా సుబోధకముగ వ్రాయబడినది.

## 5. 5. 2. 3 దేవరకొండ చిన్నికృష్ణశర్మ - శృంగారనైషధము:

శృంగారనైషధకావ్యమును వచనరచనలో చిన్నికృష్ణశర్మ పండిత పామరులకు విదితమగునట్లు రచించెను. నలచక్రవర్తి వివాహానంతరము తనవంశమునకు మూలపురుషుడయిన కైరవ చక్ర వర్తికి పత్నీసమేతుడై పుష్పాంజలి సమర్పించినట్లు నిందు తెలుప బడినది.

## 5. 5. 2. 4 పోలవరపు శ్రీహరిరావు శృంగారనైషధము:

శ్రీనాథుని శృంగారనైషధమున కనువాదమిది. విశేషించి కథలో మార్పేమియు లేదు. సరళ సుబోధకముగ వ్రాయబడిన వచనకావ్య మిది. చదువరులకు కథపై ఆసక్తి పెంపొందించుటకై కవి నైషధము లోని కథను విభాగములుగ విభజించెను. దీనివలన ఒక్కొక్క విభాగములోని కథావిశేషమంతయు స్పష్టముగ గోచరించుచున్నది.

## 5. 5. 3 కల్పిత నలచరిత్రలు:

తెలుగుకవులు నలకథలోగల నలుని సత్యసంధతను, పవిత్ర తను, నలదమయంతుల పరస్పరానురాగమును దెల్పుటకు కొన్ని కథలను, నలకథలోగల రాజకీయమును దృష్టిలో పెట్టుకొని

సామాజిక స్పృహతో కొన్నికథలను కల్పించినారు. ఈ కల్పితకథలు నలకథావగాహనమునకుపకరించుచున్నవి.

## 5. 5. 3. 1 పోకల శేషాచలపతినాయుని షట్చక్రవర్తుల యింద్రజాలపు కథలు:

ఇంద్రజాలికుడు ఆయా రాజుల సభలలో ప్రవేశించి షట్చక్రవర్తుల ప్రత్యేకతను నిరూపించుటకై కథలను కల్పించిచెప్పెను. ఆడిన మాట తప్పుట ఎరుగని వానికి నిదర్శనముగ హరిశ్చంద్రకథ చెప్పబడినది. పురుకుత్సవ పురూరవ, సగర కార్తవీర్యార్జునులకథలు వారివారి గుణములనుబట్టి తెలుపబడినవి. అట్లే ఆదర్శపరిపాలనకు నిదర్శనముగ నలునికథ చెప్పబడినది.

పద్మనాభుడను ఇంద్రజాలికుడు నలుని సభకరుదెంచి యిట్లు చెప్పదొడంగెను. "తాను విమలాంగియను తన భార్యతో అడవి మార్గములో వచ్చుచు రాత్రి సమయమున మర్రివృక్షముక్రింద నిద్రించితినని, తెల్లవారుసరికి తన కులాంగనను మోసపుచ్చి ఎవరో తోడ్కొని పోయిరని ఆమె జాడ తెలియక యిట్లు వచ్చితి" నని ఆ కపట బ్రాహ్మణుడు మొరపెట్టుకొనెను. నలచక్రవర్తి ఆ బ్రాహ్మణుని భార్య ఎందున్నను వెదకి తెత్తునని మాటయిచ్చి భటులను పంపెను. బ్రాహ్మణుడు భార్యాన్వేషణమునకు వెళ్లెను. ఇంతలో రాజభటులు ఆమె జాడను రాజునకు తెలిపిరి. రాజు ఆమెను సమీపించి తన పురమునకు రమ్మని వేడికొనెను. కులాంగన పరపురుషులతో రాకూడదని తాను నైష్ఠికురాలనని, తన భర్త వచ్చినచో అతని వెంట వచ్చెదనని రాజునకు విమలాంగి ప్రత్యుత్తరమిచ్చినది వీరి సంభాషణ సాగుచుండగనే రక్తపాతవర్షము కురియుట. ఖండింపబడిన శిరసు, కాళ్ళుచేతులు భూమిపై పడుటను జూచి రాజు, భటులు ప్రక్కనున్న పొదలో దాగిరి. ఆమె ఆ భీభత్సవమును కూడ లెక్కసేయక తన భర్త యొక్క కాళ్ళుచేతులను, మొండెమును, శిరసును రాజు

నకు జూపి "నీవు సత్యవ్రతుడవని నమ్మి, నీవు చెప్పిన ప్రకారము నాభర్త తిరిగివచ్చునను ఆశ నాకుండినదని, దురాత్ములెవరో నాప్రాణ నాథుని రెండు తుండెములుగా ఖండించి భూమిమీద పడవైచిరని. భర్తృవియోగము భరింపజాలనని" విలపించి విమలాంగి అగ్నిలో దూకి మరణించినది.

జరిగిన సంఘటనకు రాజు పశ్చాత్తాపముచెంది భటులతో కలిసి పట్టణమునకు పోవుచుండగ ఆ బ్రాహ్మణుడెదురుగ వచ్చెను. రాజునకాశ్చర్యము కలిగి జరిగిన విషయము గుర్తుచేయగ ఆ కపట బ్రాహ్మణుడు "నిన్నుపరస్త్రీ, పరధనాపేక్షణలేని సత్యవంతుడని నమ్మితిని. ఆకటా గౌతమ ముని భార్యను దేవేంద్రుడును, గురుపత్నిని చంద్రుడును వ్రతభంగముగావించిరి. ఆమెను రహస్యప్రదేశమునందు దాచి యగ్నిలో పడినదని అబద్ధమాడుచున్నావుగాని నిజమైన వర్తమానముకాదు. చిత్తవ్యాప్తివలన దోషమేగాని శరీరవ్యాప్తి వలన దోషము కలుగనేరదు. నా దుఃఖము నెవరితో చెప్పుకొందును. బుద్ధిహీనతచేత నిన్ను నమ్మి పోయినందులకు దగిన ప్రాయశ్చిత్తమును గావించితివని" పలికి పొర్లి పొర్లి దుఃఖించెను ఆ దుఃఖ నివారణార్థము రాజు ఆ బ్రాహ్మణునకు మరొక కన్యతో వివాహము చేయుదునని వాగ్దానమిచ్చెను. అందులకా బ్రాహ్మణు డంగీకరింపలేదు. నలచక్రవర్తి పవిత్రుడయినచో అగ్నిదేవా! నాభార్యను రక్షింపు" మని బ్రాహ్మణుడు ప్రార్థించెను, అచటి వారందరు చూచుచుండగ ఆ మాయలాడి విమలాంగి సంపూర్ణచంద్రికవలె ఆ అగ్నిగుండములో నుండి బైటపడినది.

ఇట్లు నలచక్రవర్తి సత్యసంధత, పవిత్రతను లోకమునకు దెల్పుటకై కవి ఈ కథను కల్పించెను.

నలుని సభలో ఈ కథతోపాటు ఇంద్రజాలికుడు మరొక కథను కూడ చెప్పినాడు. ప్రభువునకు, మంత్రులకు ఇంద్రజాలికుడు నిద్రమైకము కల్పించెను. వెంటనే వారు సువర్ణ మండపమును జూచి

ఆశ్చర్యపడి యామంటపములోనికి బోయి యందుండు వింతలను జూచిరి. రాజు ఏనుగునెక్కెను. సభ్యులందరు నశ్వములనెక్కిరి. అక్రీడి వినోదములుజూచి దివ్యమైన ఆమేడలో ప్రవేశించుటకు మార్గముకానరాక బాధపడిరి. ఇంతలో అనామధేయుడైన పురుషు డొకడు ప్రవేశించి, ఆమేడ యింద్రుని కుమార్తెయగు త్రిలోకమోహిని దని సూచించి, ఆమె నలుని తప్ప నన్యులను వివాహమాడదని కూడ చెప్పెను. నలచక్రవర్తి వచ్చిన వార్తను విని త్రిమూర్తులు, అష్ట దిక్పతులువచ్చి నలునిదీవించి వెళ్ళినట్లు, అనంతరము మహేంద్రుడు ఆ మేడకువచ్చి నలచక్రవర్తిని దీవించి తీసికొనివెళ్ళి త్రిలోకమోహినితో వివాహముజరిపించినట్లు, ఇరువది సంవత్సరములనంతరము భార్యా సమేతుడై నలుడు తనపురమునకు వచ్చినట్లు కవియిందు కల్పించెను అంత కన్నులు తెరచిచూడగ వారు సభనందే ఉండుటవలన రాజు సభికులకు ఆశ్చర్యము కలిగినది.

నలదమయంతుల వివాహమునకు పునాదియైనవారి పరస్పరాను రాగమును, వారి వివాహమును దృష్టిలోపెట్టుకొని కవి ఈ కథను కల్పించి యుండును.

## 5. 5. 3. 2 విశ్వనాథ సత్యనారాయణగారి "దమయంతీ స్వయంవరము"

నలకథలోనున్న రాజకీయమును దృష్టిలో పెట్టుకొని విశ్వనాథ సత్యనారాయణగారు అధునిక దృక్పథముతో "దమయంతీ స్వయం వరము"ను నవలను వ్రాసిరి. ఇందులో చెప్పబడిన దమయంతీ స్వయంవర కథకు పురాణ కథకు సంబంధములేదు. నలమహారాజు కథలోని కొన్ని పాత్రలను దృష్టిలో పెట్టుకొని సామాజిక స్పృహతో వ్రాయబడిన నవలయిది.

పురాణకథలో నలదమయంతులకు కీడు కలిగించినవాడు కలి.

ఇందు కలికి మారుగ సి. పురుష్ పాత్ర ప్రవేశపెట్టబడినది. సి పురుష్ కుటిలనీతిపరుడు. ఈ నవల లోని దమయంతి భర్త తెల్లమహారాజు. అతడు సి. పురుష్ చేతిలో కీలుబొమ్మ. పురాణకథలో కలిప్రయత్నము నకు సహకరించినవాడు ద్వాపరుడు. ఇందు ద్వాపరునికి బదులు దమనశ్రీ పాత్ర కల్పింపబడినది. సి. పురుష్, దమనశ్రీలు ధనసంపా దనకై దమయంతీ స్వయంవరమును నిర్ణయించి, దానికి 40 లక్షల మంది నాహ్వానించిరి. దమయంతి వీరిలో నొకరిని గూడ వరింపలేదు. దమనశ్రీ, సి. పురుష్‌లు కూడ వీరలలో ఎవరిని దమయంతి వరించు టకు ఇష్టపడరు. అందుచేత వారు స్వయంవరమును వాయిదాలు వేయుట మొదలు పెట్టినారు. ఈ స్వయంవరమునకు వచ్చిన వారంద రికి ఆహారము అవసరము. వారికి కావలసిన సామగ్రి కుండిన నగర ములో కొనవలయును. ఆ ఊరిలో ధరలు విపరీతముగ పెరిగినవి. అదివరకు బస్తాబియ్యము పదిరూపాయలయినచో అఊరు వారు ఎక్కువ అనుకొనెడి వారు. అ బస్తాబియ్యము ధర ఈ దమయంతీ స్వయంవరముతో ఎనభై రూపాయలకు పెరిగినది. అనగ నిష్పత్తి 1:8 అయినది. దమయంతీ స్వయంవర నిమిత్తమై సి. పురుష్, దమనశ్రీలు ఏర్పాటు చేసిన ఇండ్ల అద్దెలకు, దుకాణములలోని వస్తువులకు గిరాకి పెరిగినది. దీనితో వారికి అధిక లాభములు వచ్చినవి. అందువలన దమయంతి ఒకేపర్యాయము వివాహమాడుటకు వారు అంగీకరింపలేదు నాలుగు పర్యాయములు వాయిదావేసిన మరింతలాభము వచ్చుటకు అవకాశమేర్పడినది. ఈ స్వయంవరము వాయిదా పడినందువలన రైళ్ళకు, పట్టణములలోనున్న హొటళ్ళకు, సినిమాలకు లాభము. దమనశ్రీ సి. పురుష్‌లను కొన్నట్లుగానే వారి ప్రణాళిక నెరవేరినది.

పురాణకథ లోని దమయంతి మహాపతివ్రత ఆమె నలమహా రాజును తప్ప వేరొకరిని వివాహమాడకూడదని పట్టుబట్టినది. నలమహా రాజుకు కూడ దమయంతిమీద అమితమైన ప్రేమ. కాని ఈ నవలాదమ యంతి మాత్రము తెల్లమహారాజును వివాహమాడుటకు సిద్ధపడదు.

తెల్లమహారాజు మాత్రము దమయంతి తననే వరించునని, తన తరువాత దమయంతిని సరిగా ఏలువాడెవడు ఉండడని అనుకొనును. దమయంతికి విషము పెట్టి చంపుటకు కూడ వెనుకాడని వాడు ఈ తెల్లమహారాజు. తనకంటె మహాద్యోగము చేయుటకు తగిన వాడెవడు లేడని ప్రతి నలమహారాజు ధీమా. దమయంతీ స్వయంవరము పురాణ కథలో ఒక్కటేయున్నది. కాని సి. పురుష్ రాజ్యములో ప్రతిచిన్న ఉద్యోగమునకి స్వయంవరములు జరుగుచున్నవి. ఇప్పటికీ ఈతంతు జరుగుచున్నది. ప్రతి నలమహారాజు తాను లేకపోయిన ఆ దమయంతికి తగిన మగడు ఇంకొకడు దొరకడనే అహంకారముతోనే యున్నాడు.

నేడు ఉద్యోగములకు వెళ్ళువారికి ఇంటర్వ్యూలో జరుగు అన్యాయమును దృష్టిలో పెట్టుకొని విశ్వనాథసత్యనారాయణ ఈ నవలను వ్రాసినట్లు గమనింప వచ్చును. అర్హులైనవారెవరికీ ఉద్యోగమివ్వకుండ ఉద్యోగనిమిత్తమై విద్యావంతులను రప్పింపి, తద్వారా డబ్బును సంపాదించువారిని వేలెత్తిచూపడమే ఈ నవల పరమార్థము.

## 5. 6 నల నాటకములు:

"కావ్యేషు నాటకం రమ్యం" "సాహిత్యాం హి నాటకమ్" అని నాటకము ఉత్కృష్ట సృష్టి అని భావింపబడినను తెలుగు సాహిత్యములో 19వ శతాబ్దమునకు పూర్వము నాటకరచనజరుగలేదు. "ప్రపంచమునందలియున్ని సారస్వతములందును బ్రిటిష్ సారస్వత భాగములలో నాటకములనొక శాఖగా భావించుచున్నారు. ఏదేని యొక జాతి యొక్క యౌన్నత్యమునకు హేతుభూతములగు కారణజాలములలో దాని నాటక సారస్వత మొక్కటియనుట యతిశయోక్తికాదు. మతమును బోధించుటకు మిక్కిలినుపయుక్తమైన సాధనము నాటక సారస్వతము. మానవుల మనంబులందు వీరరసమును రగుల్కొనజేయు సాధనము నాటక సారస్వతము. కరుణను, భక్తిని, అనుకంపను మనంబులందుత్పన్నము జేయుటకు నాటకసారస్వతమే ముఖ్య

సాధనము. నీతి గఱపుటకును, విద్యావిహీనులకును దగునాహ్లాదమును గల్పించుచు వారిని దుర్మార్గవర్తనులు గాకుండ చేయుటకును నాటకములే కారణభూతములగుచున్నవి. మతవిభేదములను నిర్మూలించి యన్నిమతములవారియెడ సమానభావములను గల్పింపజాలు నైపుణ్యము గలవి నాటకములు, వేయేల నాటకములు జాతి యొక్కయు తెగల యొక్కయు సంస్కరణసాధనములుగ బరిఢవిల్లుచున్నవి." అని నాటక ప్రయోజనములను గూర్చి దర్భాయజ్ఞేశ్వర సోమయాజులుగారు తెల్పినారు. నాటకము ప్రదర్శనయోగ్యముగా రచింపబడెను. ప్రదర్శన కయోగ్యములగు వానిని పరిహరించి పాత్రోచితమగు కల్పనలు కొన్నిచేర్చి నాటకములు రచింపవలసి యుండును. ఈ విధముగ సామాజిక చైతన్యమును తెచ్చుటలో బహుముఖ పాత్రవహించినది నాటకము. పాతివ్రత్య నిరూపణము, సత్య ధర్మ ప్రతిపాదనము, ఆత్మస్థైర్యనిరూపణము ఇత్యాద్యంశములుగల నలకథ నాటకములుగ రచింపబడి ప్రజాదరణ పొందినది.

తెలుగు సాహిత్యములో నలకథానాటకములు పెక్కు వెలసినవి ప్రసిద్ధములైన నలనాటకములను క్రింద పరిశీలింతము.

## 5. 6. 1 ధర్మవరము రామకృష్ణమాచార్యుని 'చిత్రనళీయము':

తెలుగు సాహిత్యంలో వెలువడిన నలకథాపరములగు నాటకములలో మొట్టమొదటిది విశిష్టమైనది చిత్రనళీయము. ఇందు ఐదంకములున్నవి.

"ఉన్మాదరామప్రేక్షణికము, మదన విలాసము" అను చిన్న నాటకములతో ధర్మవరము రామకృష్ణమాచార్యుల ఆంధ్ర నాటక రచనము ప్రారంభమయినది. ఈ రెండు నాటకములతోనే 1879 సంవత్సరమున చిత్రనళీయము నాటకము వచన భాగము కొంత

రచింపబడినది. కార్యాసక్తిచే కొంత ఆగిపోయినది. కొంత వచన రచనతో ఆగిన చిత్రనళీయము తరువాత సుమారు పదేండ్లకు 1886న పూర్తియై బళ్ళారి పట్టణమున "సరస వినోదిని" యను సభవారిచే ప్రప్రథమముగ ప్రదర్శితమైనది. అందు బాహుకుని పాత్రను ఆచార్యులవారే వేసిరి. ఇది ప్రదర్శనవిషయమున విపుల ప్రజాదరణ పొందిన నాటకము. బళ్ళారిలోగాని ఆ ప్రాంతమునగాని తెలుగు నాటక ప్రయోగము విజయవంతము కాదను అపప్రథ ఆనాటితో పటాపంచలయినది. దీనికంతకును ఆచార్యుల నాటక రచనా ప్రదర్శనశిల్ప నైపుణ్యము, కార్యదీక్షయే ముఖ కారణములు. ఈ విజయోత్సాహమె తరువాతి నాటకరచనమునకు ప్రేరకమైనవి. స్వతంత్ర నాటక రచనము ఇతనితో ప్రారంభమగుట వలన రామకృష్ణమాచార్యులకు "ఆంధ్ర నాటక పితామహుడు" అను బిరుదు లభించినది. ఈ విధముగ స్వతంత్రాంధ్ర నాటక రచనా ప్రయోగమున కంతటికి బీజప్రాయమై, తనను ఉత్తమ నాటక కర్తగా పేరును గణింపజేసిన, నాటకమగుట వలన చిత్రనళీయమునకు "ఆదినాటక" మనుపేరు స్థిరపడినది.

చిత్రనళీయ నాటకకథ జగద్విశ్రుతమైనది. మహాభారతారణ్య పర్వాంతర్గతమైన నలకథయే దీనికి మూలమైనను నాటకకర్త పాత్రలను, సన్నివేశములను దృష్టిలో పెట్టుకొని కొన్ని మార్పులను చేసినాడు. చిత్రనళీయనాటకాంతమున "సారసంవిధానైకత సంపత్తిల్ల రచియించిన చిత్రనళీయనాటకము" అని కవి చెప్పినాడు. చిత్రనళీయమున సారవంతమైన కథాసంవిధానమెట్లు పొందుపర్చబడినదో గమనింతము.

నలుని సభలో పురప్రజలు పుష్కరుని దురాగతములను ప్రస్తావించుటతో నాటకము ప్రారంభమగును. పురప్రజలలో నొకడు నలుని జూచి తనతల్లి పుష్కరుని జూచి లేవలేదన కనికరమించైనను లేక నడివీధిలో జనులందరు చూచుచుండగ తన్నె" ననెను. మరొకడు "ఈ దినము తనభార్య వీధిలో నీరుదెచ్చుచుండ, తనను జూచి పొంచి

పోవుట లేదని కడవ క్రిందపడేదోచి తన్నె" యనెను. మరొకడు "తులవతనమున నీకీమీసములేల" యని మంగలిని బిలిచి ఒక ప్రక్క గొరిగించి అందహీనునిగ జేసినని మొర పెట్టుకొనెను. మరొకడు పౌరుడు "మీ పరిపాలనలో పుష్కరుని దురాగతములకు ప్రజలు, వారి భార్యలు బాధపడుచుండగ నీవు నీ తమ్ముడు సుఖముగ నుందురని" తూలనాడెను. ఇవి విని నలుడు భరింపలేక పుష్కరుని దండింతునని పౌరులను పంపెను. పుష్కరుని దురాగతములు భారతమునందు లేవు. పుష్కరునకు దేవలుడను మిత్రుడుండెడివాడని, వీని సహాయముతో పుష్కరుడవినీతి పనులు చేసెడి వాడని, పుష్కరుడు విదిశాపురములో నివసించెడివాడని నాటక కర్త కల్పించినాడు

చిత్రనళీయ నాటకములో నలదమయంతుల కనురాగమును కూర్చినది భీమరాజు పురోహితుడగు సుదేవుడను విప్రుడు. అతడు వివిధదేశదర్శనాభిలాష మిషతో నలుని కడకు వెళ్ళి దమయంతి చిత్రపటమును జూపెను. దమయంతి చిత్రపట సందర్శనమువలన నలుడు దమయంతిపై మరులుకొనిన విషయమును సుదేవుడు దమయంతి కెరిగించెను. నలదమయంతులకనురాగము కలిగించుటలో హంస ప్రధానపాత్ర వహించినట్లు ఇతర నలోపాఖ్యానములందు తెలుపబడినది. నాటకమున సుదేవుడా కార్యమును నిర్వహించినట్లు కల్పింపబడినది. నాటకము ప్రదర్శన యోగ్యమైనది. రంగస్థలమున హంస మాటలాడుట, దూత్యమొనరించుట సందర్భము, అసహజము. అందువలన నాటకకర్త హంసకు బదులు సుదేవుని ప్రవేశపెట్టెనన వచ్చును.

నారద, పర్వతుల ప్రబోధము వలన ఇంద్రాదులు దమయంతీ స్వయంవరమునకు బోవ నిశ్చయించుకొనినట్లు భారత నలోపాఖ్యానములో చెప్పబడినవి. ఇంద్రాదులు తమంతటతామే దమయంతి స్వయంవరమునకు బోవుటకు సంసిద్ధులయినట్లు ఈ నాటకములో వర్ణింపబడినది. స్వయంవరవర్ణనా సందర్భమున శ్రీనాథుని శృంగార

నైషధములోని రచనా మార్గమొకింత అనుసరింపబడినది.

ఇంద్రుడు ప్రసాదించిన తిరస్కరిణీ విద్యా ప్రభావముచే నలుడు దమయంతి యంతఃపురము ప్రవేశించినట్లు శృంగారనైషధమునందున్నది. ఇంద్రుడు నలునకు ఘుటికను ప్రసాదించినట్లు నాటక కర్త కల్పించినాడు. ఘుటికను శిరసున ధరించినచో మనిషి అదృశ్యాకారుడగును. ఘుటిక తిరస్కరణీ విద్యవంటిది. అదృశ్యాకారముతో అంతఃపురము ప్రవేశించిన నలుడు దమయంతి చెలులు చేయుచున్న స్వయంవరప్రస్తావనను వినినట్లు ఈ నాటకమున తెలుపబడినది.

దమయంతి మన్మథబాధకోర్వజాలక నలుని కలవరించినది. ఇదే సమయమని నలుడు తలపైనున్న ఘుటికను తనచేతియందుంచుకొనెను. అపుడు నలుడదృశ్యాకారుడయ్యెను. నలుడు తనపేరు చెప్పకుండ దౌత్యము నెరపినట్లు. నాటకకర్త చెప్పుట శృంగారనైషధనుకరణమే. నలుడు దేవతల సందేశమును వినిపించి, దమయంతికి మందారమాలనిచ్చినట్లు నిందు తెలుపబడినది. శృంగారనైషధమున స్వయంవరాగతులగు రాజులను దమయంతికి శారదాదేవి జూపినట్లున్నది. ఇందు చెలికత్తెయగు భారతి వరణీయులనుగూర్చి దమయంతికి చెప్పినది. స్వయంవరాగతులవృత్తాంతము భారతమునందు లేదు. స్వయంవరాగతులవృత్తాంతము భారతమునందు లేదు. స్వయంవర సభలో పంచనలురను జూచి దమయంతి నిశ్చేష్టితురాలయినది. అపుడు నలుడు లేచి తాను నలుడనని, మిగిలినవారు దేవతలని తెలిపి వారు తమ స్వస్వరూపములను పొంది దమయంతి తనను పరిగ్రహించునట్లు చేయుమని ప్రార్థించినట్లు నాటకమున కలదు. ఇంద్రాగ్నియమవరుణులు కూడ ఇట్లే ఒక్కొక్కరె లేచి తాము నలులమైనట్లు తక్కినవారు దేవతలని చెప్పినట్లు నిందు కల్పింపబడినది. ఇది నాటకీయతకు ఔచిత్యము నాపాదించు సన్నివేశము. నిజమైన నలుని నిర్ణయింపజాలక దమయంతి సరస్వతిని

ప్రార్థించినది. దమయంతి దుఃఖమును చూడజాలక దేవతలు ప్రసన్నులై ఆమెకు నిజమైన నలుని జూపిరి. దమయంతి నలుని మెడలో పుష్పమాలను వైచినది. ఇది ప్రథమాంక కథ.

కలి ఇంద్రాదులవలన దమయంతీ స్వయంవర వార్తవిని కోపోపవిష్టుడయ్యెను. కలి మిత్రులైన కామదేవ, క్రోధదేవ, లోభదేవులను ముప్వురిప్రవేశము నిందు నూతనముగ కల్పింపబడినది. కలి అకారణ ద్వేషమునకు వీరు కారకులనికూడ ఇందు తెలుపబడినది. కలికి యిట్టి అకారణ కలహము లెన్నియో యున్నట్లు దమయంతి ఇంద్రుని నిరాకరించుటయే తన అకారణద్వేషమునకు కారణమైన ' ని యిందు తెలుపబడినది. నలుని రాజ్యము ను ధ్వంసముచేయుటకు పుష్కరుడను జ్ఞాతిసోదరుడు కలడని, అతని వద్ద దేవలుడను బ్రాహ్మణుడు కలడని, అతడు తనకు స్నేహితుడని, యిక కార్యసాధనకు ఆటంకముండదని కలితలచినట్లు నిందు నూతనముగ తెలుపబడినది. కలి రాజు వికారుడై వచ్చితనను రాజ్యభ్రష్టుని చేసెదనని బెదిరించినట్లు కల వచ్చినదని నలుడు దమయంతికి తెలిపినట్లు ఇందుకలదు. బాన పదులకభిమతముగ నాటకకర్త ఈ మార్పు చేసెననవచ్చును నలుడు దమయంతితో సంతతిలేనివారి బ్రతుకు నిరర్థకమని, పుత్ర దర్శనము వలన మనఃక్లేశములు మటుమాయమై శాశ్వతానందము సమకూడునని చెప్పినట్లు నాటకకర్త వర్ణించినాడు. సంసారసాగర జీవనమునకు కుమారుడు నౌకవంటివాడు. ధర్మరాజును కొంగరూపము నందున్న యమధర్మరాజు "ఆనందములలోకెల్ల ఆనందమేది?" అని ప్రశ్నించినపుడు "చిన్నబాలుడు తండ్రియెదుట నుండుట ఆనందము" మని జవాబు ఇచ్చినట్లు భారతాంధ్యపర్వమునందు కలదు. పుష్కరాగమనమును వార్ష్ణేయుడు సూచించినపుడు దమయంతికి దక్షిణ నేత్రమదిరినట్లు నాటకకర్త తెలిపినాడు. పురుషునకు వామనేత్రము, స్త్రీకి దక్షిణనేత్రము అదురుట అశుభసూచకమని జ్యోతిశ్శాస్త్రము నందు తెలుపబడినది. బానపదులు తను కన్నులదురుటబట్టి శుభా

శుభాశుభములను నిర్ణయింపగలరు. జానపదుల నమ్మకమును దృష్టిలో పెట్టుకొని ఈ అంశమును నాటక కర్తకల్పించియుండును. పుష్కరుడు దేవలుని సహాయముతో నలుని నోడించి రాజ్యబహిష్కృతుని చేసెను. ఇది ద్వితీయాంక కథ.

నాటకకర్త నలదౌత్య, స్వయంవరఘట్టములందు శృంగారనైష ధమును అనుసరించినట్లు తోచును. మిగిలిన కథాభాగమంతయు నన్నయ భారతనలోపాఖ్యానములోని క్రమమే అనుసరింప బడినది. అడవిలో నలదమయంతులిరువురు ఆకలి బాధచే మలమలమాడుచు నొక మామిడిచెట్టు నీడన కూర్చుండిరి. ఇంతలో దైవకల్పితముగ నొక మామిడిపండు చెట్టునుండి జారి వారిముందుపడెను. ఆ ఫలము తినుటకు వారుసంసిద్ధులయిరి. ఆ ఫలమును హరించుటకై కలి మాయాబ్రాహ్మణవేషమున వచ్చి యాచించెను. వారా ఫలమును ఆబ్రాహ్మణుని కిచ్చిరి ఇది కరుణరసోపేతమైన సన్నివేశము. ఎండకన్నెరుగని దమయంతి ఆకలి దప్పులతో అలమటించు సమయమున నోటి కందనున్న ఫలమును కూడ కలి బ్రాహ్మణ వేషమున నపహరించిన విషయమిందు కరుణభూయిష్టముగ కల్పింపబడినది. దీనికి తోడు మరొక సన్నివేశమున మాయదారి పక్షులు నలుని కట్టుబట్టలతో పైకెగిరిపోవుట ప్రేక్షకులలో మరింత భావతీవ్రతను కన్నీటిని జనింప చేయును దప్పికతో అడవియందు తిరుగుచు ఎండమిటారువులను జూచి జలాశయమని భ్రాంతిచెంది, తుదకొక జలాశయమును సమీపించి ఉప్పునీరుత్రాగి నలుడు తనవలన దమయంతికి కలిగిన కష్టములను దలచుకొని దుఃఖించెను అంతఃపురస్త్రీ ఉప్పునీరు త్రాగుట ప్రేక్షకుల హృదయములను జలదరింపజేయును. ఇది కరుణరసోపేతమైన సన్నివేశము. ఇది నాటకకర్త కల్పించినదే. భారత నలకథలో నలదమయంతులు ఒక గృహమునందు శయనించిరని యున్నది. ఇందు ఒక చెట్టుక్రింద నిదురించినట్లు నాటక కర్తమార్చెను. నలుడు నిదురించుచున్న దమయంతి వస్త్రమును సగము చింపి కట్టుకొని వెళ్ళిపోయెను. నలమహా

రాజు కెంతటి దురవస్థ సంభవించినది. ఉన్న వస్త్రమును పక్షులెత్తుకొని పోగా నలుడు వస్త్రహీనుడయ్యెను. అపుడు తప్పని సరిగా దమయంతి వస్త్రమును నలుడు కట్టుకొనవలసి వచ్చినది. ఇది విధిప్రేరితము. "కష్టకాలమందు కట్టిన పుట్టము పక్షులెత్తికొనిపోయినట్టు" అనుసామెత జానపదులందు నలుని కాలమునుండి నేటికి విపులప్రచారముపొంది యున్నది. నలుడు కర్కోటక సర్పముచే దష్టుడయి వికృతాకారు డయ్యెను, కర్కోటకుడు తన వృత్తాంతమును చెప్పుకొనుచు "వెయ్యేం డ్లువనినందున మానవ భాష నయితమునేర్చి మాననీయుడనైతి" ననెను. పాము వెయ్యేండ్లు బ్రతికితే మానవ భాష నేర్చుకొనును. ఇది నాటకమున కల్పింపబడిన నూతనాంశమే. కర్కోటకుడు కలి ప్రేరణచే నలుని కరిచినట్లు, కలియాజ్ఞకు కర్కోటకుడు బద్ధుడని యిందు తెలుపబడినది.

దమయంతిని సర్పము మ్రింగు దృశ్యము ప్రదర్శనాయోగ్య మైనదికాదు. కావున ఆచార్యులవారు దీనిని పరిత్యజించిరి. ప్రయో గానుకూలముగ నాటక కథాసంవిధానమును మలచుకొనుట వీరినేర్పు నకిదియొక దృష్టాంతము. బాహుకుడు ఋతుపర్ణునితో తాను నలుని ఆస్థానములో నుండినపరివారములో నొకడని తెలుపుకొనెను. బాహుకుని కంఠస్వరము విని వార్ష్ణేయునకు నలుడను అనుమానమేర్పడినది ఆతని సందేహనివృత్తికి నలుడు "వార్ష్ణేయా! నన్నెరుగవా! నీతో దమ యంతీ దేవి యింద్రసేనుని విదర్భకు పంపునపుడు నేనందుండలేదా. నీవు నలమహారాజుతో నొకనాడు విదేహదేశపు బ్రాహ్మణుని వృత్తాం తము మిక్కిలి మనోహరముగ చెప్పునపుడు నవ్వుచుండిన వారలలో నేనొకడగదా" అనెను. ఆ నిదర్శనములు వార్ష్ణేయునకు గుర్తునకు రాక పోయినప్పటికి కంఠధ్వనిమాత్రము ఎక్కడనో వినిపించినట్లుండెను. అది నలుని కంఠస్వరమని స్పష్టమగుచున్నది ఋతుపర్ణుడు నల మహారాజు వద్ద నెన్నాళ్ళుంటివనగ పుట్టినది మొదలుకొని ఆరాజన్యు నెడబాయకుంటిననెను. ఇందులోను తానే నలుడనని చెప్పినట్లయినది.

పుట్టినప్పటినుండి నలునిసైన్యములో పెరిగిన వ్యక్తిని వార్ష్ణేయుడు గుర్తించియే యుండును. పైగా పుట్టిన చిన్నబిడ్డ 10 సంవత్సరముల వరకు సేవకావృత్తికి పనికిరాడు. పుట్టినప్పటినుండి అనుటలో అతడు నలుడేయగునని నాటకకర్త స్ఫురింపజేసెను. కాని ఋతుపర్ణుడు. వార్ష్ణేయుడు బాహుకరూపమునందున్న నలుని గుర్తింపలేదు. ఇది నాటక కర్త కల్పనయే.

దమయంతి బోయవానిని శపించి బృహదశ్వుడు తదితర ముని బృందమున్న ఆశ్రమము జొచ్చినట్లు, పాముకరచినపుడు చావనందు లకు విషమూలికలిమ్మని దమయంతి వారిని కోరినట్లు, పాము విషము అమృతముగ మారినదని చెప్పి, "నీవలె నీభర్తను పాము కరచినదని, యిప్పుడునలుడు వికృతాకారుడైయున్నాడని" మునులు దమయంతికి చెప్పినట్లు ఈ నాటకమున కల్పింపబడినది. దీనివలన దమయంతికి తన భర్త మారువేషములో నున్నాడని స్పృహ కలిగింపదలచి నాటక కర్త యిట్టి కల్పనలు చేసియుండును.

దమయంతి చేదిపురమున రాజవీధిలో చనుదెంచు నపుడు మదమెక్కి మృగశాలలో నుండి తప్పించుకొని వచ్చిన గండక మృగ మొకటి ఆమెకెదురయ్యి చంపక పోయిన దృశ్యమును పురకాంత లందరు తిలకించిరని నాటకకర్త చేసిన మరొక కల్పనము. చేది దేశపు రాజు భార్యపేరు సునందాదేవి యని భారతనలకథలో నుండగా ఇందు విపులాదేవిగ మార్చబడినది. చేదిపురమునందున్న దమయం తిని సుదేవుడను విప్రుడు కనుగొనినట్లు భారత నలకథలో నుండగా సుదేవ, పర్ణాదులిద్దరు దమయంతిని కనుకొనినట్లు నిందు కల్పింప బడినది.

సుదేవుడు ఋతుపర్ణుని ఆస్థానమున దమయంతి పంపిన సందే శమును వినిపించినట్లు, అందులకు బాహుకుడు సమాధానమిచ్చి నట్లు. భారతనలకథలోకలదు. ఇందు సుదేవుడు దమయంతీ సందే

శమును వినిపించుటయేగాక మహానసగృహము నందు బాహుకుని పరీక్షించుటకు నిద్రించినట్లు కూడ చెప్పబడినది. సుదేవునకు దమయంతి తన భర్త వికృతాకారుడుగ నున్నాడని చెప్పినందువలన బాహుకుడు నలుడు కాబోలునని అనుమానముతో బాహుకుడు రాత్రి పూట చైతన్యమేదైన కలుగునను భావనతో అతని పరీక్షింపగోరి సుదేవుడు వంటగదియందు నిద్రించెనని యిందు కల్పింపబడినది.

బాహుకుని ప్రవృత్తి తెలిసి కొనుటకు పర్ణాదుడును, బాహుకుని రప్పించుటకు సుదేవుడును నియోగింపబడినట్లు భారతనలోపాఖ్యానము నందున్నది. ఇందు సుదేవుడు రెండు కార్యములను నిర్వహించినాడు. దమయంతీ స్వయంవరమునకు ఋతుపర్ణునితో వచ్చిన బాహుకుని కేశిని పరీక్షించినట్లు భారత నలకథలో నుండగా ఇందు భారతి యను చెలికత్తె యందుకుపయుక్తమైనది. బాహుకుని దధసార ధ్యము ప్రదర్శనయోగ్యము కాదని దలచి ఆచార్యుల వారు త్యజించిరి.

దమయంతి ప్రాతివ్రత్యమును అశరీరవాణి నిరూపించినట్లు ఈ నాటకమున తెలుపబడినది. పౌరులు విదర్భకు వచ్చి బాధలు పడలేక పుష్కరుని చెరసాల యందుంచినట్లు నలునితో చెప్పిరి. ఇది సమంజసము కాదని తోచుచున్నది. నలుడు రెండవసారి జూదమాడి పుష్కరునోడించి తనరాజ్యమును తిరిగి చేకొనెను నన్నయ కథారచనయే సముచితముగ నున్నది. మాయాద్యూతమున నలుని రాజ్యబహిష్కృతుని చేసినపుడు ప్రజలెక్కడపోయిరి? అపుడు ప్రజలెందుకు ఎదిరింపకుండిరో అవగతమగుటలేదు.

విదర్భకు పోవు మార్గమధ్యమున నలునకు కలి ప్రత్యక్షమైనట్లు భారతనలకథలోనున్నది. ఇందు నలదమయంతుల సమాగమ సమయమున కలిప్రత్యక్షమై వరములిచ్చినట్లు కల్పింపబడినది. ఇంద్రసేనుని పట్టాభిషేకముతో చిత్రనళీయ పంచమాంక కథ పూర్తియగును.

ఇట్లు భారత నలకథను గ్రహించి చిత్రవిచిత్రమైన కల్పనలు కల్పించి రామకృష్ణమాచార్యులు చిత్రనళీయ నాటకమును రచించెను.

## 5. 6. 2. రాజామంత్రిపెగ్గడ భుజంగరావుగారి నలనాటకము:

ఇది ఏడంకముల నాటకము. దీనికి మూలము మహాభారతనలోపాఖ్యానమే. ఇందు శృంగార నైషధ కథానుసరణలు కూడ కొన్ని లేకపోలేదు.

This drama is known by the name of Nala Natakam or Nishadham in Sanskrit which was translated by Srinatha into an ordinary Telugu version. Another translation of the original is also found in Mahabharata.

రంగస్థలమున ప్రదర్శనాయోగ్యము కాని హంస దౌత్యమిందు పరిహరింపబడినది. నలదమయంతులు పరస్పరము ప్రేమించుకొనినట్లు హంసవలన తెలియును. ఇదిభారత నలకథా సంవిధానము. కాని ఇందు హంసకు బదులు నలుని వేడుక చెలికాండ్రగు నందుడు పుష్పోద్భవులు నలదమయంతుల బద్ధానురాగమును తెల్పుదురు.దమయంతి రూపసౌందర్యములను మనసున దలచుకొని నలుడు మన్మథుని పూజించి దూషించెను. మన్మథుని బాధ తట్టుకొన జాలక యున్నపుడు నందుడు వచ్చి స్వయంవరమునకు ఇక మూడుదినములున్నదని నలునకు చెప్పినట్లు సింధుమార్చబడినది ఇంద్రాదులు దమయంతిని తమకు కూర్చుమనినపుడు నలుడు మిక్కిలి దుఃఖించి "పలు జ్యోతిష్కులు ఫలంబు సిద్ధంబుగ నున్నదని పలికిన మాటలొట్టిబూటకంబులు కాబోలు. ఈసమస్తము సర్వ లోకాధీశుని అధీనముగాని యొరులది గాదు గదా" అని బాధపడినట్లు.అందులకు నందుడు "గత

జల 'సేతు బంధనము' నిష్ప్రయోజనమని చెప్పినట్లు ఇందుకలదు. పల్లె ప్రజల నమ్మకమును దృష్టిలో పెట్టుకొని నాటకకర్త మూలములో లేని ఈ మార్పును చేసెను.

దమయంతీ స్వయంవరమునకు ఇంద్ర·ధనద, వరుణ యములు వచ్చినట్లు ఈ నాటకమున తెలుపబడినది. కాని భారతాదులందు ఇంద్రాగ్నియమ వరుణులు వచ్చినట్లున్నది. అగ్నిదేవునకు బదులు ఇందు కుబేరునిపేరు పేర్కొనబడినది. స్వయంవరమండపమున నలరూపధారులను పుష్కరుడు తిలకించి, నలునినిందించినట్లు ఇందు మార్చబడినది. పుష్కరుడు నలునకు జ్ఞాతిసోదరుడగుట వలన నలుడు కోరిన దమయంతిని పుష్కరుడు వివాహమాడదలచినట్లు నిందు మార్చబడినది. లోకములో జ్ఞాతిసోదరుల మధ్య ఉన్నవైరమును దృష్టిలో పెట్టుకొని నాటకకర్త ఇట్టి మార్పును కల్పించి యుండును శృంగార నైషధమున దమయంతికి స్వయంవరాగతులగు రాజులను పరిచయము చేయుటకు శారదాదేవి నియమింపబడినది. ఇందు కుముద్వతి వరణీయులను గురించి దమయంతికి వివరించినది.

రాజ్య బహిష్కృతుడైన నలుడు ఒంటరిగా నిద్రించు సన్నివేశమును నాటక కర్త హృదయ విదారకముగ నిట్లు చిత్రించినాడు.

> ఏలురాజోత్తమ సచ్చిరస్థితల సన్మాణిక్య కోటీరముల్
> దలక్రిందై వెలుగొందు గప్పములిడన్ దాంజ వర్గంబునన్
> దిలకించున్ సదయార్ద్రభావమున నాధీశుండు నేడిట్లు భూ
> తలమందున్ నిలువంగ వచ్చె లోకడే దారిద్ర్యమున్ బొందుచున్"

ఈ సన్నివేశము ప్రేక్షకుల హృదయమును జలదరింపచేయును. కటిక నేలపై నిద్రించు దమయంతిని నలుడు వదలివెళ్ళినాడు. దమయంతిని ఒక పాము కరవబోగా కిరాతుడువచ్చి ఆమెను రక్షించి కామించెను. దమయంతి వాని కామభావమును గ్రహించి పతిలేక బ్రతుకుట కంటె చచ్చుటయే మేలని కత్తిని కిరాతునికిచ్చి తనునరుకమనినది. అదే

విధముగ దమయంతితో మదనబాధను భరింపలేక తనను చంపుమని బోయవాడనినట్లు ఇందు మార్చబడినది. ఇద్దరు బాధావహులే. దమయంతికి పతిలేకుండ నివసించుట ఎంతకష్టమో. కిరాతునకు మన్మథ బాధనోర్వకుండుట అంతే కష్టము. ఇది యెట్టిన్యాయమనగ "గొడ్డు పోయినవాడు గొడ్డు కేడ్చినట్లు క్రొవ్వు కోరువాడు క్రొవ్వు కేడ్చినట్లు" సామెతకు సరిపోవు చున్నది.

బోయవానిని శపించి దమయంతి హృద్ధాతుడు. సుపర్వకుడున్న మున్యాశ్రమమునకు వెళ్ళినట్లు ఇందు తెలుపబడినది. భారతములో నున్నట్లే యిందు దమయంతి చేదిపురము చేరుట, సుదేవుడను బ్రాహ్మణుడు దమయంతిని కనుగొనుట అను నంశములున్నవి. పర్ణాదుడు ఋతుపర్ణుని సభలో ప్రవేశించి దమయంతి సందేశమును వినిపించినపుడు బాహుకుడు కనుసైగచేసి ప్రక్కకు పిలిచి భార్య భర్తపై కోపపడకూడదని జవాబిచ్చినట్లు ఇందు తెలుపబడినది. కాని భారతాదులందు బాహాటముగా సభలోనే సమాధానమిచ్చినట్లున్నది రహస్యమైన ఈ విషయమును బాహాటముగా చెప్పుట విరుద్ధమని భావించుట నాటక కర్త ఈ మార్పును కల్పించి యుండవచ్చును.

నలదమయంతుల పునస్సమాగమ సమయమున ఆకాశవాణి ప్రత్యక్షమై తాను. సూర్యచంద్రులు దమయంతిని కాపాడినట్లు. చెప్పినది. ఇవి తప్ప మిగిలిన కథాంశములన్నియు భారత నల కథానుసరణముగనేపాటించ బడినవి.

## 5. 6. 3. ముదిగొండ నాగలింగశాస్త్రి - నలప్రవాసము:

నల ప్రవాసము తొమ్మిది యంకముల నాటకము. ముదిగొండ నాగలింగశాస్త్రి 'నలవిలాసము' ను కూడా వ్రాసినట్లు ఈ నాటకమును బట్టి తెలియుచున్నది. కాని నేడు అది అలభ్యము నలవిలాసములో నలదమయంతుల వివిధ శృంగార కలాపములు వారి వివాహము

వరకు గల కథకలదు. నలుడు జూదమున రాజ్యమోడిపోయి ప్రవాసముచేసి తిరిగి రాజ్యమునొందిన కథపొందుగ నలప్రవాసమునందు కూర్పబడినది.

కథమహాభారతమునుండి గ్రహింపబడినది. కవికి రసనిర్వహణోచితముగ మూలకథను పెంచుటలోను తగ్గించుటలోను మార్పులు చేయుటలోను స్వాతంత్ర్యముండుటచే కొలది మార్పులు మాత్రమే చేసి మూలకథకు వన్నెతెచ్చెను. స్వప్నము, దూతృ్యము, విప్రలంభము కరుణధార, నాయకజ్ఞాతవాసము, నాయికాజ్ఞాతవాసము, మిష, సమావేశము, పట్టాభిషేకము, అనుపేర్లతో ఇందు తొమ్మిది అంకములున్నవి. నాటకకర్త కేవలము మాతృకానుసారముగ సప్తమాష్టమ నవమాంకములను కల్పించినట్లు తోచుచున్నది. ఈ నాటకమున రసము కరుణము, విప్రలంభశృంగారములని కవియే ప్రస్తావనలో చెప్పినాడు.

తెలుగులో వెలసిన నలకథా నాటకములు చాల తక్కువ. సంస్కృతములో ఎక్కువ. సంస్కృతములో వెలసిన నలనాటకమునకు ఈ నాటకమునకు పోలికలులేవు. అదేవిధముగ తెలుగు సాహిత్యములో వెలసిన ప్రథమ నలకథా నాటకమైన చిత్రనళీయమునకు దీనికి పోలికలులేవు. ఇదొక స్వతంత్రాంధ్ర నాటకము. చిత్రనళీయమునకును నీ నాటకమునకును రచనా విషయములోను కథావిషయములోను భేదముగలదు. చిత్రనళీయ నాటకకర్త సంస్కృత సంప్రదాయము ననుసరించి నాటకలక్షణములతో నాటకము వ్రాసినప్పటికి అందు ప్రబంధపోకడలు మిక్కుటముగ నున్నవి. ఇందు ప్రబంధపోకడలు చాలతక్కువ. అంతియేగాక నలప్రవాసమున దీర్ఘస్వగతములు, వర్ణనలు లేవు.

## చిత్రనళీయములోని ప్రభాతవర్ణనము:

"కమలాప్తధాతృవేషమురాగబట్టిన
సురనాటకులతోపు తెరమనంగ
నిసురాక సమ్మదమ్మున బూర్వదిక్కాంత
కైసేయు సింధూర కాంతియనగ"

## నలప్రవాసములోని రాత్రి వర్ణనము:

"ఒక్కడె నల్పుగా నిలిచియున్నది చూడ నరణ్యమెల్ల వే
రొక్కటి గానరాదు తప మొప్పెడినెక్కడ నెందు జూడన
ద్దిక్కుల మిట్టపల్లములులేక సమంబుగ జూపు చున్నదై
యక్కటనాగలోకపుగుహం దలపించెడి నిద్దియెంతయున్"

## చిత్రనళీయములో దమయంతిని గూర్చి నలుని విలాపము:

"పొడగాన కడలూన సడుకాన గడుదీన
గతిమీఱనెంత బన్నెతలబడితొ?
వినుపింపక కనుపంప జనియింప కనలంప
ననునెంత దూటితోవకట దూలి"

## నలప్రవాసమున:

"చానవిలాప భంగి కవసానముగానమి గొంతు బ్రిద్దదై
సోనగ నీరుగారి జల శూన్యతచే గనుగ్రుడ్లు లొత్తలై
యానన మెత్తియింకనెట నంబర కంపితపాణియుగ్మలై
యేనిటు సేసినాడనని యీశునితో మొరపెట్టుచుంటినో"

ఇట్లు రచనా విషయములో చిత్రనళీయమునకు, నలప్రవాసమునకు పోలికలున్నవి.

"మున్నుస్వయంవరంబునకు మోదమునెమ్మది బొంగనేగుచున్
దెన్నున నేచెలంగుటిచి నిర్జర దాసుడనైతి నిప్పుడా
యన్నున కర్ధికే భటుడ నన్యులకుం బ్రియగూర్చుదూతగా
నన్ను సృజించె గావలయు నాల్గుమొగంబులవేల్పుదుష్టతన్"

ఋతుపర్ణమహారాజు దమయంతీ ద్వితీయ స్వయంవరమునకు పోవు నపుడు నలునకు గలిగిన భావపరిణామమిది. సేవకావృత్తియందున్న వారు కష్టసుఖములను తలపగూడదు. అదియునుగాక ప్రభువు పెండ్లికి బోవునపుడు కంటతడిపెట్టుట బొత్తిగా గూడదని" బాహుకుడు తలచెనుతాను రాజాధిరాజయ్యు బానిసవృత్తికి పాల్పడినను సేవకధర్మమునెరపుటలో గూడ ధీరోదాత్తతనే కనబరచినాడు. ఈ వాక్యములు నలుని ఆత్మస్థైర్యమునకు ప్రబల నిదర్శనములు. ఈ మాటలు వినిన ప్రేక్షకులు గుండెలు నిజముగ తరగిపోవునట్లు నాటక కర్త కరుణరసమును వెల్లివిరియించెను.

నలునేగాక దమయంతిని గూడ నాటకకర్త ఉత్తమ సాధ్వీ లలామగా చిత్రించినాడు. తాను రాజాధిరాజుకుమార్తె, అదిగర్భేశ్వరియయ్యు నలుడు తనకు చేసిన అపకారమునకు నోరెత్తి యొక్క పరుషవాక్యమైనను పలుకని పతివ్రతా శిరోమణి దమయంతి. పైగా తనదౌర్భాగ్యమునకు తనను తానే నిందించుకొనినది.

"ఎగసిన ద్రోబిచుట్టకదియించి బిగించినయేకవేణితో
సగమయి శోధనంబెపుడు సల్పమి మాసిన పాతచీరతో
నగపడి గట్టువాలుగతి వార్తత వాడినమోము దమ్మితో
వగ నిగిడించుచున్నయది వారిజలోచన యీమెయెవ్వరో?"

సుదేవుడు సైరంధ్రి వేషముతో చేదిపురమునందున్న దమయంతిని జూచిన నాటి రూపమిది.

"అమవసనాటి చంద్రకళయట్టుల, వేసగినేఱుకై వడిన్
హిమవసయంపు తమ్మివలె హీనత నుద్యుతిమ్రోట జూడ శో
కము గలిగించె నాకెయటుగాంచి సహించు నతండ్రియింకని
నిక్కముగనె తల్లి యీసుతనుగన్గొని యూపిరి దాల్పనేర్చునే"

ఈ దృశ్యము శాకుంతల నాటకమున భర్తృవియోగురాలయిన శకుంతల మరీచ్యాశ్రమము నందున్నప్పటి విషయమును జ్ఞప్తికి తెచ్చును.

"కొమ్మను వీడగానె సమకూరిన పేతన కన్నిసౌఖ్యముల్
పమ్ముల హింస నెట్టగనె మాలవిధాతకు మేలు గూడెనే
యిమ్ముగ నన్ను గన్న ధరణీశునకేమి ఫలమ్ము గల్గెనింకి
పమ్మహి గంటినేను జనియించి విశేషములేమి భోగముల్"

(నలప్రవాసము - 3వ అంకము)

భర్త తనను విడిపోయినపుడు దమయంతి హృదయవేదనయిది ఈమెకు గల్గిన విరక్తి తనపైనను, ప్రపంచముపైననేగాని నలునిపై మాత్రముగాదు. పతివ్రతా శిరోమణులయిన స్త్రీలు సహజముగ తమ భర్త దోషములను గూడ తనపైన వేసికొనుట సహజము. కవికి గల లోకానుభవమునకిది యొక నిదర్శనము. ఈ నాటకమునందలి లోకోక్తులు ఉపమానములు, నీకవికిగల లోకానుభవమును చాటుచున్నవి.

"కాసును చేయనట్టి యొక కాపురుషుడు"
"నీ శరీరమును పూవుబలెన్నలి జేయకుందువే"
"కల గె గనాయటంచు దనకన్ను పడింబెటికింపవచ్చునే"
"ఈ కాఱు చీకటి నా దౌర్భాగ్యముపోలె నెల్లదిక్కుల
గప్పుచు బోగైనది"
"అగ్ని మండించి యెవ్వడే నందు బడునె"

ఇట్టిలోకోక్తులు ఈ నాటకమునందు కోకొల్లలు

భారతనలకథలో కర్కోటకుడు నలునకుపకార జీవి. ఇందు అపకారజీవి అంతేగాక కలిమిత్రుడుగా కూడ చెప్పబడినాడు దమయంతి సుదేవునితో తనను భైమినని చెప్పవలదని ప్రార్థించుట నాటక కర్తకు గల పరమ లోకానుభవమునకు నిదర్శనము. బాహుకుని రథవేగమును, కేశిని చేసిన దీర్ఘోపన్యాసములు నాటక ప్రయోజనములై శిల్పరమ్యతకాస్థానములుగా నున్నవి. బోయవాడు తన్నువలచినపుడు గురుసతిని రాజుభార్యను తల్లితో సమానముగా చూడవలెనని దమయంతి ప్రబోధించినది. అందులకు వాడిచ్చిన సమాధానమును పరికింపుడు -

"ఛాల వరించె గూతతనితాత వరించెను గూతు కూతుస్వ
ర్నేతయాహల్య గూడె రజనీపతియుంగురుపత్ని బొందెనీ
రీతి సనాత నాదృత చరిత్రల సిద్ధములుగాన రూఢిగా
బాతకమేమిగాదనుచు భావనసేయుము పద్మలోచనా"

దమయంతి చెప్పిన లోకనీతికి బోయవానిచే నాటకకర్త పురాణములో జరిగిన సంఘటనలను జూపి ప్రేక్షకుల హృదయమును రంజింప చేసెను.

ఈ నాటకము లోకానుభవముతో వ్రాయబడుటవలన "నలచరిత్రలోని సొగసు నన్నయ గారికే తెలియును. మరల తమకే తెలియును. ప్రతియంకమొక్కొక్కరత్న" మని విశ్వనాథసత్యనారాయణ గారు నల ప్రవాసమునకు వ్రాసిన పీఠికలో వివరించియున్నారు.

## 5. 6. 4 మందిగొండ శంకరశాస్త్రి - నలచక్రవర్తి నాటకము:

పూర్వోత్తర కథాంశములతో వ్రాయబడిన ఏడంకముల నల నాటకమిది. అధునిక నాటకములలో ప్రసిద్ధిపొందిన . భారత

నలకథకు ప్రతికృతికాదిది. శ్రీ దుర్గేశ్వర బాలికా సంస్కృత పాఠశాల విద్యార్థుల కభ్యసింపజేసివారిచే ప్రదర్శింప జేయుటకీ నాటకము వ్రాయబడినది. శివపురాణములో సతీధర్మములు, శాకుంతలములో చతుర్థాంకములోని సతీధర్మములు, స్మృతులనుండి కొన్నివిషయము లిందు పొందుపరచబడినవి. ఇవియేగాక లోకప్రసిద్ధమైన పెక్కు అంశములిందు కూర్పబనవి. భారతములోనే నలకథయొక నాటకముగ రూపుదిద్దుకొన్నది. దానిని మించి మార్పులు చేయవలసిన అవసరములేదు. పైగా నలకథ జనవిశ్రుతమైనది. వివిధపురాణములలోని విషయములను గూర్చినచో బంగారమునకు మెరుగు పెట్టినట్లగును. అందువలన నాటకకర్త వివిధాంశములిందు పొందు పరచియుండును. కథలో కన్పించేకొలది మార్పునాటకానుగుణముగ చేసినట్టిదే.

నలుడు దమయంతి మీదగల విరహముతో గున్నమావి నీడన కూర్చుండినట్లు, నలుడు తన విరహమును విదూషకునితో చెప్పికొన్నట్లు నిందు కల్పింపబడినది ఇంద్రాగ్నియమవరుణులు ఒక్కొక్కరే ప్రత్యేకించి దమయంతీ సౌందర్యమును జూచినట్లు అదు ఇంద్రుడు దమయంతి సుగుణఖనియని, అగ్ని తేజస్విని యని యముడు ధర్మసమాచరణమున గొప్పదని, వరుణుడు ఆమె హృదయార్ద్రార్ద్రమై యమృతప్రవాహమును దలపించునని, దేవతలు కొనియాడినట్లు కల్పింపబడినది. ఇవి ఇంద్రాగ్ని యమవరుణులకున్న ప్రత్యేకలక్షణములు. అవి సంపూర్ణముగ దమయంతియందున్నవని, ఆమె సుగుణరాశియని తెలుపుటకై నాటకకర్త యిట్టి మార్పులు చేసియుండును. శృంగారనైషధమునందువలె నలుడు తిరస్కరణీ విద్యాప్రభావముచే దమయంతి యంతఃపురము ప్రవేశించినట్లు ఇందు తెలుపబడినది. చెలికత్తెలగు మదనిక, తరలికలు దమయంతికి స్వయంవరాగతులను జూపినట్లు కవి యిందు తెలిపినాడు. స్వయంవరసమయమున దమయంతి లోకమాత యగు హైమావతిని ప్రార్థించినట్లు ఆమె, ప్రత్యక్షమై దమయంతికి నలుని జూపినట్లు నిందు కల్పిం

పబడినది. ఈ కల్పనము మహాభారత నలకథలో గాని, ఇతర నలకథా కావ్యములలో గాని లేదు.

వివాహానంతరము నలదమయంతులు పార్వతీపరమేశ్వరులను ధ్యానించినట్లు నిందు తెలుపబడినది. భీమరాజు దమయంతిని యత్తవారింటికి పంపునపుడు నీతులనుపదేశించెను. గురుజనముల నేమరుపాటులేక సేవింపుమని, ప్రియజనులను సఖురాండ్రనుగారవింపుమని, పరిచారికులయెడ నెనరు కుమని అతిథులనాదరింపుమని. సపత్నులతో సఖ్యపడుమని, ఇంటిలోని పశుపక్ష్యాదుల నాకలి దప్పులు గ్రహించి యన్నపానీయములనిమ్మని భీమరాజు కుమార్తె నుద్దేశించి పలికినట్లు ఇందు తెలుపబడినది. ఆడుబిడ్డల నత్తవారింటికి పంపునపుడు తగిన నీతులు చెప్పి పంపుట తెలుగు ప్రజల ఆచారము అదే విధముగ మామ అల్లునకు నీతిగరపుట అచారమే. ఈ సన్నివేశము శాకుంతల నాటకములో కణ్వుడు శకుంతల, దుష్యంతులనుద్దేశించి పలికినమాటలను దలపించుచున్నది.

శకుంతలనుద్దేశించి కణ్వుడు చెప్పిన పలుకులివి:

" గురులకు సేవ జేయుమను గుంగతి జూడు నీ సపత్నులన్
వరు డలుకన్వహించినను భర్త్రవిరుద్ధవు గాకు మీసునన్
పరిజనులందు జూపుము కృపంగడు బొందకు భాగ్యగర్వమున్
తిరిగిన నిట్లు, కాంతురు సతీత్వము కాంతలు వింద్యలొండుచోన్ "

దుష్యంతుని యుద్దేశించి కణ్వుడు చెప్పిన మాటలివి:

" మమ్ముల సత్తపోధనుల మాన్యభావత్కులమున్, స్వబంధులన్
సమ్మతి పేడ కీయెయెటోపల్చిన నీపయికూర్మి. నెంచి మా
కొమ్మను నేలు కొమ్మ, సరికొమ్మలతో సమగౌరవంబునన్
బిమ్మటిదెల్ల భాగ్యమగుపేర్కొనరాదది యింతి బంధువుల్ "

(అభి. శా. చతుర్థాంకము)

శాకుంతలము నాటకమున శకుంతలకు గౌతమి ప్రభృతులు సతీధర్మములు వివరించినట్లే యిందు బ్రాహ్మణస్త్రీయగు అచార్యాణి దమయంతికి సతీధర్మములను ప్రబోధించినది. మగడు శయనించిన పిమ్మట శయనింపుచు. నతనికంటె ముందు నిద్రమేల్కొని తత్పాదములకు మ్రొక్కి నితకృత్యములకు పాల్గొన వలెనని సంతోషముతో ప్రతి కార్యమును నిర్వర్తింపవలయునని. పూజోపకరణముల దానే యోచించి సమకూర్పవలెనని. పతిభుక్తశేషమారగింపవలెనని. అతడు వండించు నెడ ననుగ్రహింపవేడవలెనని. నిష్కారణముగ పతియనుజ్ఞలేక పొరిగిండ్లకు పోకూడదని. ఇంటి రహస్యముల నితరులకు చెప్పరాదని. రజస్వలయైనప్పుడు మగని జూడతగదని. నగ్నయై జలకమాడవగదని, రోలు, రోకలి, తిరుగలి. సాన, కత్తిపీట వీనియందు కూర్చుండరాదని. అంతియేగాక. పతిని గూడిన ఘూతయగునని. మగనికంటె ముందు భుజించిన నజయగునని, భర్తగొట్టిన తిరిగికొట్టునది బిడాలమగునని. అతనితో మాటకుమాట నెదిరించునది సారమేయమగునని, క్రీగంట పరుని జూచిన గిల్లకన్నుగల్లదగునని. భర్తను దూషించిన మూగయగునని ఆచార్యాణి దమయంతికి సతీధర్మములను వివరించినది. అంతేగాక ఆచార్యాణి దమయంతికి పతివ్రతాధర్మములు కూడ చెప్పినట్లు ఈ నాటకమునందు తెలుపబడినది. ఈ సతీధర్మములు భారతమునందుగాని, ఇతర నలకథా కావ్యములందుగాని కానరాదు.

అడవిలో తిరుగుచున్నపుడు దమయంతి నలునితో విదర్భకు పోవుదమని చెప్పగ నలుడందులకు "అలిగియత్తవారింటికి. చెడి చెల్లియింటికి పోజనదని" చెప్పినట్లు ఇందు కల్పింపబడినది. లోకప్రసిద్ధములయిన ఇట్టి సామెతలు ఈ నాటకమున కోకొల్లలు. ఉదాహరణమునకు "చేతులు కాలిన పిదప ఆకుల వెదకినట్లయ్యె" ఇది నలుడు పాకశాలలో విధిని గూర్చి చింతించుచు చేజేతుల దమయంతిని దూరముచేసికొంటినదని బాధపడు సందర్భములోనిది.

"మూలిగే నక్క మీద తాటికాయ పడినట్లయె" "ముల్లుదీసి కొఱ్ఱుదసిన చందమాయె" "తినబోవు రుచి నుడుగుటెందులకు" ఈ మాటలు బాహుక రూపమునందున్న నలుడు ఆత్మగతముగ అనుకొన్నవి. వార్ష్ణేయునిచే దమయంతీ ద్వితీయ స్వయంవరమును విని బాహుకునకు కలిగిన చైతన్యము ఈ మాటలకు దారితీసినట్లు నాటకకర్త కల్పించెను.

అడవిలో కాలసర్పమును జూచి భయపడి దమయంతి తన కుమారుడగు ఇంద్రసేనుని దలచి దుఃఖించినట్లు ఇందు కల్పింపబడినది. రాజ్యబహిష్కరణకు మునుపే దమయంతి బిడ్డల నెడబాసినది. అడవిలో నిద్రించు సమయమున భర్త నెడబాసినది. ఇపుడు ఒంటరినైనది. భారతకథలో భర్తను దలచి దుఃఖించినది. కుమారుడు తల్లిదండ్రుల ప్రతిరూపుడు, జీవన స్వరూపుడు. అట్టి కుమారుని యిక ముందు చూచుభాగ్యము తనకు లేకపోవుటదలచి దమయంతి దుఃఖించినట్లు నాటకకర్త మార్చెను. భారతకథలో చేది రాజపత్ని పేరేమో తెలియకున్నది. ఇందు విమలాదేవియని తెలుపబడినది. విమలాదేవి దమయంతీ వృత్తాంతమును సవిస్తారముగ విని "మంచి వారికే కష్టములు సంభవించుచుండును. అది భగవానుని పరీక్ష. ఆ పరీక్షనుత్తీర్ణులయిన వారలీ యిహమున కీర్తిమంతులై పరమున నుత్తమగతిని పొందుదురు. నీవు విచారముడిగి మాయింటనుండి చేతనగు పనులు చేయుచుండు" మనెను. ఇది నూతనాంశమే.

కష్టములందుండువారే నిజముగ భగవంతుని ధ్యానింతురు. మంచి వారికి కష్టములు ఎక్కువగా నుండును. ఇది లోకానుభవ విషయమె. కలిపురుషుని యాజ్ఞతో కర్కోటకుడను పాము నలుని కరచినట్లు ఇందున్నది. నలునకు మేలు చేయుదలచి రానున్న అజ్ఞాత వాసమును వికృతరూపమునకుపయుక్తముగ నుండునని కర్కోటకుడు కరచినట్లు భారతకథలో నున్నది. క్షకలినలునకపకారి. అపకారితో చెలిమిచేయువాడు కూడ అపకారి. నాటక కర్త నలునకపకారము

చేయుటకై కర్కోటకుడు కరచినట్లు కల్పించి, కథౌచిత్యమునకు దోహదమిచ్చెను.

నలాన్వేషణకై బయలుదేరి చేదిపుర రాజాంతఃపురాంగణమున సుదేవ, పర్ణాదులు పరస్పరము మాట్లాడికొనినట్లు, వారి సంభాషణ ములవలన ఏదేశమున ఈతిబాధలేక ప్రజలు సుఖశాంతులై ఉందురో ఎచట చతుర్వర్ణముల వారు ప్రేమభావమున పరస్పర సహాయమొన రించుకొనుచు, ధర్మమార్గమున తప్పక సంచరింతురో, అచట నల చక్రవర్తి యుండును. అచ్చట యజ్ఞయాగాది పుణ్యకర్మలు ప్రవర్ధిల్లును. అచ్చట ధనధాన్యసంపదలు వర్ధిల్లును. ఆ సలక్షణము లను బట్టి ఆ మహానుభావుని కనుగొనవలయునని చెప్పినట్లు ఇందు కల్పింపబడినది. ధర్మరాజు నలచక్రవర్తివలె పుణ్యశ్లోకుడు. ఇతడు తనతమ్ములతో విరాటు రాజుదగ్గర అజ్ఞాత వాసము గడుపు సమయ మున పాండవులకనిపెట్టుటకు ఎవరికి సాధ్యముకాకపోయెను. భీష్ము నకు మాత్రము తెలియును. ఏదేశమునందు పాండవులుందురో ఆ దేశము సర్వసమృద్ధికలిగియుండునని ఏబదిఆరు దేశములలో విరాటు రాజు దేశము సర్వసమృద్ధిగల దేశమగుటచే అది పాండవులుండు చోటని భీష్ముడు సులభముగ గ్రహించెను. ఈ విషయమును దుర్యో ధనాదులకు చెప్పలేదు. చెప్పినచో పాండవులు యథాప్రకారము అరణ్యాజ్ఞాతవాసములు గడపవలసివచ్చును. భీష్ముడు ధర్మపక్షపాతి పేరునకు కౌరవపక్షమునందుండినను పాండవులకతడు చేసిన సహా యము భారతకథలో మరువరానిది. ఇచట పర్ణాద, సుదేవుల ఊహ భీష్మునియూహవంటిది. ఋతుపర్ణుని రాజ్యము సస్యశ్యామలముగ నుండుటచే నలుడు అక్కడ నుండునని తెలుపుటకై నాటక కర్త ఈ మార్పును కల్పించియుండును. అశ్వశాలలో దమయంతినిగూర్చి బాహుకుని ఆవేదనను కరుణరసోపేతముగ నాటకకర్త చిత్రించెను. అదే విధముగ వార్ష్ణేయుడు దమయంతీ ద్వితీయ స్వయంవర వార్త చెప్పినపుడు నలునకు కలిగిన భావచైతన్యమును కడుంగడు రమ్య

ముగా నాటకమున చిత్రింపబడినది.

ఇట్లు భారతములోని నలోపాఖ్యానమును గ్రహించి శాస్త్రిగారు లోకసహజసిద్ధమైన విషయములను కల్పించి రసౌచిత్యముగ ఈ నల కథా నాటకమును రచించెను.

## 5. 6. 5 సీతారామకవి - మంజుల నైషధము (చిత్రనళీయము):

ఐదంకములుగల నలకథానాటకమిది. ధర్మవరము రామకృష్ణ మాచార్యులు వ్రాసిన "చిత్రనళీయ" మను నాటకము తరువాత వెలువడినదీ "మంజుల నైషధమను చిత్రనళీయము" ఒక నాటకమును అనేకులు అనేక రీతులుగ వ్రాయుటచే కవి ప్రత్యేకముగ ఈ నాటకము వ్రాసి, నారాయణ పరమనామమున అంకితమిచ్చెను. చిత్రనళీయమునకన్న మిన్నగ వ్రాయవలెనని తలంపు కవికి లేదు. కాని కథాగౌరవమే ఈ నాటకరచనకు దారితీసినది. ధర్మవరమువారి చిత్రనళీయము లోని అంక విభజనయే యిందును చేయబడినది. కథా విషయములో చిత్రనళీయ నాటకమునకు ఈ మంజుల నైషధ నాటకమునకు భేదమేమియు గానరాదు. రచనా విషయమునందు మాత్రము కొంత వ్యత్యాసము గోచరించును. సుదేవుడు భీమరాజునకు నలుని చిత్రపటమును జూపి—

"వనదమయంతికి నలుడు
ననఘుండగు నలునకు దమయంతియు భళిరా
ఘనముగ నొప్పుచునుందురు
వనజాక్షుడు లక్ష్మియట్లు పార్థివచంద్రా"

అని వివరించినట్లున్నది.

చిత్రనళీయములో లేని మరొక మార్పు ఇందు గోచరించును.

కలి మిత్రులు కామ, క్రోధ, లోభ దేవుళ్ళు. మానవుని సంతత సౌఖ్యాబ్ధిలో నోలలాడించునది కాంతయని, ' ధనమూల మిదం జగత్ అనుటకంటె "కాంతామూల మిదం జగత్" అనుట యుక్తముగా నుండునని, ఈ కాంతమూలముగానే తాని జగమును పాలించు చున్నాడని, అందులకే కలిరాజు తనకు ప్రథమస్థానమిచ్చెనని కామ దేవుడు వక్కాణించెను. క్రోధుడు ప్రవేశించి "వ్యామోహాతీతాత్ము లయిన స్త్రీ పురుషుల ప్రణయకలహమునందు కూడ తాను స్థానము నాక్రమించెనట్లు" చెప్పెను. లోభుడు ప్రవేశించి "ధనమూలమిదం జగత్" అను మాట సత్యమని, లోభముతో డబ్బు సంపాదించవలెనని తిండి తీర్థములు లేక డబ్బు సంపాదించి భద్రపరచవలెనని బ్రహ్మ రాత్రిని సృష్టించకుండ యుండినచో బాగుండెడిదని బాధపడినట్లు నిందు తెలుపబడినది. ఈ విషయము చిత్రనళీయము నందు గాని, భారత కథయందుగాని కానరాదు. కాని శృంగార నైషధమునందు వీరి ప్రత్యేక లక్షణములు నుగ్గడింపబడినవి.

కలి ప్రవేశవార్తను భటుడు వినిపింపగ దమయంతి కలవరపడి నది. దమయంతిని నలుడిట్లు ఓదార్చినాడు.

"అనతం బాడగ లేక మాటపయి రాజ్యశ్రీల నర్గాధిపు
వ్రానకల్పించి మహోగ్రకాననబమబుత్స్రించున్ సతీరత్నమున్
జనుదేరంజని, వారణావతములోశాతోదరిన్ విక్రమం
బును గావించుచు దాను నీచునిక్రమంబున్ బొందియాపై జగ
ద్వినుతింగొన్న త్రిశంకసూను వినవోబింబాధరీ ధారుణిన్"

హరిశ్చంద్రుని గుర్తుచేసి నలుడు తన భార్య స్వాంతమును కుదుటపరచినట్లు నిందు తెలుపబడినది. జూదమాడుటకు పుష్కరుడు నలుని సమీపించినపుడు దమయంతి పుష్కరుని ప్రణాళిక నర్థము చేసి కొన్నట్లిందున్నది. స్వయంవరానంతరము నలునితో కలహించి ప

పుష్కరుడు మర్యాదతో సన్నిహితుడగుట దమయంతికి అనుమానాస్పదమయినది. ఇది దమయంతికి గల కార్యదీక్షానిపుణతను చాటుచున్నది.

జూదమునకు రమ్మని పుష్కరుడాహ్వానించినపుడు నలుడు జూదమాడుటకు నిరాకరించి ద్యూతము వలన కలుగు కీడుల నిట్లు గడించినాడు.

"పాపమొదవు గీర్తియు నెడబాయు ధనము
నాశనంబగు వైరమున్ గలుగజేయు
నందు చేత త్యజించెదరార్యులెల్ల
జూదమును దమ్ముడా యిట్టి తొప్పవలదు"

కర్కోటకుడు నలుని విషపూరితునిగా జేసి తన విషము దేవేంద్రుని ప్రభావము వలన అమృతముగా మారునని నలునకుచెప్పెను. దేవేంద్రుడు నలునికుపకారి. నలుడు గడపవలసిన అజ్ఞాతవాసమునకు వికృతరూపము సరిపోవునని, ఆ విషము విషముగా ప్రవర్తించినచో అపాయకరమగునని, అట్లు గాక అది ఉపకారికావలెనని నాటక కర్త దేవేంద్రుని ప్రభావమునిందు కూర్చెను.

దమయంతి చేదిపురమున విమలాదేవి దగ్గర గంధముతీయు దాసిగా నుండినట్లు చిత్రసఖీయము నందున్నట్లేయిందును గలదు. కాని ఇందొక మార్పుచేయబడినది. నిరంతరము భర్తను ధ్యానించుట వలన గంధము సరిగా తీయలేకపోయినట్లు, భీమపురి నుండి బ్రాహ్మణుడు వచ్చినట్లు వినబడితనకు ఎడమకన్నదరుట గుర్తించి, ప్రియాగమసూచన తనకు లేదని, మరణమే తనకు తప్పదనినప్పుడు స్థలభ్రంశముకాగలదని బాధపడినట్లు నిందు కల్పింపబడినది. స్త్రీకి ఎడమకన్నదరుట శుభసూచకము.

ఈ విషయములో తప్ప చిత్రసఖీయ నాటక కర్తకు ఈ నాటక

కరకు భేదమేమియులేదు, చిత్రనళీయ నాటక కథాసంవిధానమే యందు కనార్పబడియున్నది.

## 5.6.6 రెంటుచింతల లక్ష్మీ నరసింహశాస్త్రి నలచరిత్ర నాటకము:

నలదమయంతుల వివాహానంతరముగల ఉత్తర కథావిశేష ములున్న నాలుగంకముల నాటకమిది. పూర్వనలకథా భాగము నెందు లకు వ్రాయలేదో కవి చెప్పలేదు. పూర్వకథాభాగము శృంగార రస భూయిష్టమైనది. ఉత్తర కథాభాగము కరుణరసోపేతమైనది. శృంగార ముకంటె కరుణము ప్రేక్షకులను ద్రవీభూతముచేయునని నాటకకర్త భావించియుండును. అదియునుగాక నలదమయంతుల పెండ్లి వరకు జరిగిన కథలో మలుపులులేవు. కథ సాఫీగా సాగినది. తరువాతి కథ ఎన్ని వంకరలు తిరుగవలెనో అన్ని వంకరలు తిరిగినది. నలుడు దమయంతిని వదలివెళ్ళినపుడు పాము కరచుట, అదే విధముగ దమయంతి ఒంటరిగ తిరుగుచున్నపుడు పాముకరచుట, నలుడు ఋతుపర్ణునాశ్రయించగా దమయంతి చేదిరాజుపత్ని నాశ్రయించినది వారి పునస్సమాగమమునకు వివిధ వన్నాగములున్నవి. ఇవన్నియు వంకరటొంకరలు తిరిగిన సన్నివేశములే. ఇవన్నియు కరుణార్ద్రస్ఫోర కములే. ఈ నాటకకథలో నలుని కంటె దమయంతి పాత్రకు ప్రాధా న్యమెక్కువ. కథయంతయు దమయంతి మీదుగనే జరిగినది.

కలిప్రేరణచే పుష్కరుడు నలుని జూదమున కాహ్వానించుటతో ఈ నాటకకథ ప్రారంభమగును. పక్షులు వస్త్రమునపహరించినపుడు నలుడు సిగ్గుపడెను. అందులకు దమయంతి అన్నమాటలు గమనింప దగినవి. " నాథా ! గడచినదానికై వగవకుడు. మనమేకవస్త్రధారు లయియున్నను నీయరణ్యమునసపహసించు వారులేని కారణమున మనమదృష్టవంతుల" మని చెప్పినట్లు ఇందున్నది. రాజదంపతు

లయిన నలదమయంతులు అరణ్య వాసమనుభవించుట దురదృష్టము. ఈ దురదృష్టములో పక్షులు కట్టువస్త్రమునపహరించుట మరీ దురదృష్టమే. ఇట్టి దురదృష్టములో ప్రజలెవ్వరు తమను చూడక పోవుట అదృష్టము. అరణ్యమగుటవలన అదృష్టమైనదని, లేనిచో పరాభవము కలుగుట తథ్యమని దమయంతి యభిమతము. కష్టకాలమునందు భర్తకేవిధముగా చెప్పినచో మతి స్థిమితము కలుగునో ఆ పద్ధతి భార్యకు తెలిసియుండవలెను. అందులకే విజ్ఞులు ఉత్తమస్త్రీ లక్షణములను తెల్పుచు స్త్రీకి కార్యేషు మంత్రిగా నిర్వచించినారు. నలుడు దమయంతిని విదర్భకుపోయి సుఖముగానుండుమని యాదేశించెను. భర్తలేని సుఖజీవితము నిష్ప్రయోజనమని దమయంతి యనిన మాటలు గమనింపదగినవి.

" ఈరు లేదేని సుఖములనిచ్చునట్టి
దైనజనకుని యిల్లు నాకబ్ధరంబె
ఈవెకలినినాకు వేరేల నాధ
కారుటడతియునందన కల్పమరయ "

( నల. ద్వితీయాశ్వాసం. )

అదే విధముగ బోయవానిని శపించి తనవలె పతివ్రత తల్లుల జోలికి పోయినవారికి కూడా ఈ శిక్ష తప్పదని దమయంతి చెప్పినట్లున్నది. దమయంతి తన పాతివ్రత్యమహిమచే అగ్ని పుట్టించుట, అగ్నినిజూచి భయపడి బోయవాడు దమయంతి పాదములపై బడుట దమయంతి తిరస్కరించుట, వాడగ్నికి ఆహుతి యగుట, దమయంతికి అగ్నిజ్వాలలు ఎదురగుట, తన పాతివ్రత్యమహిమచే ఆ యగ్ని చల్లబడుట, అను సంశములిందు నూతనముగ కల్పింపబడినవి. చేదిరాజపత్ని కుశలప్రశ్నలతో ప్రశ్నించినపుడు దమయంతి నలుని గురించి లోన చింతించి " ఉద్యానలతకును, అడవి తీగకు గల తారతమ్యమూహించి, తానొక ఉద్యానలతనని, విధిప్రేరణచే అడవితీగగా

మారితినని " చెప్పినది. అందలి గూఢార్థమును రాజమాత గ్రహించి నట్లు ఇందు తెలుపబడినది.

దమయంతి చెలికత్తెలగు మాలతీ సరోజలు నలుని నిందించుచు "స్త్రీల చిత్తముల సౌకుమార్యమెరుగని పురుషులతిదుర్విదగ్ధులు సుమా !" అనిరి. స్త్రీ పురుషునకాత్మబంధువు. బంధుత్వమనునది కేవలము శరీరమునకు సంబంధించినది కాదు. ఆత్మకు సంబంధించినది. అట్లుగాక శరీరమునకు సంబంధించినదే అయినచో అది చిరకాలము బంధుత్వముగా నిలువదు. స్త్రీల మనసులందున్న సౌకుమార్యమును పురుషుడెరుగవలయును. అదే విధముగా పురుషుని చిత్త సౌకుమార్యమును స్త్రీ తెలిసికొని ప్రవర్తించవలయును. అప్పుడు ఆత్మబంధువనుమాటకు అర్థముండును. సంసారసాగరమను రెండెడ్ల బండికి స్త్రీ పురుషులిరువురు రెండు చక్రముల వంటివారు. ఏ ఒక చక్రము లేకపోయినను బండిముందుకు సాగదు. అదే విధముగా వీరిరువురలో ఏ ఒక్కరు లేకపోయినను సంసారము సాగదు. స్త్రీ సుఖము పురుషుడు, పురుషుని సుఖము స్త్రీ కాంక్షింపవలెనని నాటక కర్త లోకమునకు తెలియజేసెను. కలి పుష్కరదేశపురాజని, కలి పుష్కరులు నలుని ప్రతాపమునకు భయపడి పారిపోవజూచిరని, నలుడు కలిచేయిపట్టుకొని నిలబెట్టెనని, కలి పారిపోవుట చూచి పుష్కరుడు వ్యథచెందెనని, కలిచేయిని వదలినతర్వాత నలుడు పుష్కరుని చేయిపట్టుకొనెనని, కలిపుష్కరుల దీనభావమును గ్రహించి నలుడు వారిని వదలెనని ఇందు కల్పింపబడినది. ఇది నలుని ఉదారగుణమునకు ప్రబల నిదర్శనము.

ఇట్లు నాటకకర్త భారతమందలి నలోపాఖ్యానములోని ఉత్తర కథా భాగమును గ్రహించి, దమయంతి పాత్రకౌచిత్యము కల్పించి ఈ నాటకమును వ్రాసినట్లు గమనింపవచ్చును.

## 5. 7. మొసలికంటి హనుమంతరావు

### 'దమయంతి' ఏకాంకిక:

మొసలికంటి హనుమంతరావు దమయంతి అను పౌరాణిక ఏకాంకికను రచించినాడు. ఇందు దమయంతి స్వయంవర ఘట్టము కుతూహలము గలిగించు విధముగ రచింపబడినది. చిన్న నాటికయై నప్పటికిని ఇది ప్రదర్శనయోగ్యముగా నున్నది.

# 6. జానపద సాహిత్యములో నలకథ

తెలుగులో శిష్టసాహిత్యమునందు వలెనే జానపద సాహిత్యము నందును నలకథ విపుల ప్రచారము పొందినది. విశేషించి నలకథ శిష్టపండితులకంటె జానపదులనే ఎక్కువగా నాకర్షించినది. జానపదులకు పురాణ పఠనముపై ప్రీతి మెండు. మహాభారత పురాణాంతర్గతమైన నలోపాఖ్యానమును జానపదులు తాము భావించిన రీతిలో కొంత మార్పుతో తమ ఆచారముల కనుగుణముగ చెప్పుకొనుచుందురు.

జానపదులు చెప్పుకొను నలకథ శిష్ట సాహిత్యములోని నలకథ కంటె కొంత వ్యత్యాసముగ కనిపించును. నలకథను సంబంధించిన జానపదుల అభిప్రాయములు గ్రంథస్థమైనవి కావు, మౌఖికమైనవి. శిష్ట, జానపద సాహిత్యములలో నలకథకున్న భేదము రచనా సంబంధమైనదే కాని కథాసంబంధమైనది మాత్రము కాదని తెలియుచున్నది

ప్రత్యేకముగ నలకథను చెప్పుకొనుటలో జానపదులకొక అభిప్రాయ మున్నది. నలకథా పఠన, శ్రవణముల వలన పుత్రసంతాన హీను లకు పుత్రప్రాప్తి కలుగుననని, దరిద్రులకు ధనము చేకూరునని, శని చేత పీడింపబడువారు సుఖసంతోషములతో నుందురని, దేశము నందేర్పడిన క్షామాది బాధలు తొలగిపోవునని, ఔషధములకు నివా రణముకాని పెద్దరోగములు కూడ నయమగునని, పాపాత్ములు పుణ్యాత్ములగుదురని జానపదుల ప్రగాఢ నమ్మకము.

జానపద గేయ సాహిత్యములో నలకథకు గల ప్రాచుర్యమును, నలకథలో వ్యక్తమగు జానపదుల మనోగత భావములను తెలిసి కొందము.

నలుని ధర్మపరిపాలనలో పరస్పరము కలహించువారలు వెద కిన లేరని, భిక్షాటనముండెడిదికాదని, నూరు మాడలకు నెలకు పావుల (ఇరవై ఐదు పైసలు) వడ్డీ చెల్లించెడివారని, విస్తారమైన భూ భాగమును రాజు ప్రజలకు గుత్తకిచ్చి పది భాగములలో ఒక భాగ మును తీసికొని తక్కిన తొమ్మిదిభాగములను వారికిచ్చెడివాడని, ఒక రూకకు పుట్టెడు ధాన్యము (66 శేర్లు) లభించుచుండెడిదని జాన పదుల యందు వ్యాప్తియందున్న నలకథను బట్టి తెలియుచున్నది.

శృంగారనైషధమునందు నలుని రూపగుణములను దెల్పుసంద ర్భమున సుమారు 40 పద్యములున్నవి. అందు రెండు లేక మూడు పద్యములందు మాత్రమే నలుని ధర్మ పరిపాలనను గూర్చియున్నది జానపదులు నైషధకథావిషయమును గ్రహించి నలుని సత్య ధర్మ పరిపాలనను మరికొంత విపులముగా వివరించి యున్నారు. చక్రపురి రాఘవాచార్యుని ద్విపద నలచరిత్రలో నలుని సత్య పరిపాలనను వివరించు సందర్భమున గోవ్యాఘ్ర సంవాదమున్నది. పులి నీరు త్రాగుటకై కొలను సమీపించినది. అదే సమయమున ఆవు కూడ నీరు త్రాగుటకై కొలను దగ్గరకు వచ్చినది. ఆవు నీళ్ళు త్రాగి తన తోకతో

కొలను లోని బురదను పులిపైకి విసరినది. బురద తనపై పడగ పులి కోపించి "ఇది నలుని పరిపాలనకదా. నీకు నా వలన భయము లేదు. నల చక్రవర్తి పరిపాలనానంతరము నైన నిన్ను పట్టి చంపుదు" నని బెదిరించగ విష్ణుచక్రము వచ్చి పులి కంఠమును ఛేదించినది. పులికి, మేకకు సంవాదము జరిగినట్లు. విష్ణుచక్రము వచ్చి పులి శిరస్సు ఖండించినట్లు జానపదులలో ప్రచారమందున్న నలకథయం దున్నది. ఈ సంవాదమునుబట్టి నలుని పరిపాలనలో బలవంతులు బలహీనులను హింసించుట లేదనుట తెలియుచున్నది.

నలుడు మంత్రితో వసంత కాలమున ఉద్యానవన విహారము నకు వచ్చి హంసల గుంపును జూచినట్లు, ఆ హంసలలో బంగారు రేకులవంటి ఈకలుగల హంస నలునకు కన్పించినట్లు. దానిని పంజ రము నందుంచవలెనని నలుడు పట్టుకొనినట్లు జానపదులు చెప్పుకొను నలకథ యందున్నది. కాని శిష్టసాహిత్యములో హంస బ్రహ్మకు సార థ్యము వహించునదిగ, నలదమయంతులకు సంగమ కారణ దూత యైనకలహంసగ చిత్రింపబడియున్నది. సంతాన ప్రాప్తికై నాగులమ్మ కామమ్మ, నాంచారమ్మ, రెడ్డెమ్మ వంటి గ్రామదేవతలను భీమరాజు ప్రార్థించినట్లు, వారి వరప్రభావముచే దమయంతి జన్మించినట్లు జానపదులు తమ మనోభావములకనుగుణముగ నలకథలో కల్పించి నారు. జానపదులలో గూడుకట్టుకొనియున్న మూఢవిశ్వాసములకిది ఒక నిదర్శనము.

జానపదుల నలకథలో హంస దౌత్యమునందు హంస నలదమ యంతులతో మాట్లాడినట్లు కనిపించదు. నలుడు దమయంతికి ప్రేమతో వ్రాసిన ఉత్తరమును హంస తన ముక్కున కరచుకొని తెచ్చి దమయంతి చేతికిచ్చినది. అదే విధముగ దమయంతి వ్రాసిన ఉత్తర మును హంస నలునికిచ్చినది. ఉత్తర ప్రత్యుత్తరములవలననే నల దమయంతుల మధ్య ప్రణయభావమేర్పడినట్లు జానపదులుభావించిరి

పక్షియైన హంస మాట్లాడుట అసహజమని కాబోలు ఇట్లు భావించుట జరిగెనది. హంస వాక్చాతుర్యము చేతనే నలదమయంతులు పరస్పరము ప్రేమించుకొనినట్లు శిష్టసాహిత్యములో తెలుపబడినది.

శుక్రవారము దమయంతి తలస్నానముచేసి, ఉతికిన వస్త్రములను ధరించి పుష్పములకొరకై చెలికత్తెలతో కలిసి ఉద్యానవనమునకు వచ్చినట్లు, జానపదులలో వ్యాప్తియందున్న నలకథలో కలదు. ఈనాటికి తెలుగుపల్లెలలో స్త్రీలు శుక్రవారము తలస్నానము చేసికొనుట ఆచారముగ నున్నది. దమయంతి శుక్రవారము తలస్నానము చేసినట్లు జానపదులు భావించుట దీనికనుగుణముగనే యున్నది.

దమయంతి నలుని మీద ప్రేమ పెంచుకొని నిద్రాహారములు మానినది. ఈ విషయమును భీమరాజు చెలికత్తెలద్వారా తెలిసికొని "ఆడుబిడ్డలగన్న తండ్రి పౌరుషము చెడునని పెద్దలు చెప్పినమాట నిజమని" వాపోయినాడు. "నలచక్రవర్తిని పిలిపించి దమయంతి నిచ్చెదమనుకొన్నచో నీకులమేమి, గోత్రమేమి?, అని చులకనగా అడుగును. బలవంతముగ నలుని లోబరచుకొన వలయుననినచో తనకా శక్తి లేదని" భీమరాజు దుఃఖించినట్లు జానపదులు భావించిన నలకథలో వర్ణితమైనది. సాధారణముగ ఆడుబిడ్డలను కనిన తల్లిదండ్రులు తమ కుమార్తె కోరిన వరునితో పెండ్లిచేయలేక ఎదుర్కొను ఈ సమస్యను జానపదుల భావనల కనుగుణముగా చక్కగా చిత్రిత మైనది.

నారదుని ప్రబోధమువలన ఇంద్రాగ్ని యమవరుణులు దమయంతీ స్వయంవరమునకు వచ్చినట్లు శిష్ట సాహిత్యములోని నలకథను బట్టి తెలియును. దమయంతి స్వయంవర సంభ్రమము ముల్లోకములందు వ్యాపించినదని, ఆ సంభ్రమ ధ్వని విని దేవతలు దమయంతికి తామె స్వయంవరమునకు వచ్చినట్లు జానపదులయందు ప్రచారమునందున్న నలకథలో వర్ణితము. ఒకరి ప్రబోధము వలన

దమయంతి మీద దేవతలకు మోహముకలుగుట అభిమతము కాదు. దమయంతీ స్వయంవరవార్త దేవతలకు తెలిసియే యుండునని జానపదుల నమ్మకము.

కొన్ని అమూల్యమైన మూలికలతో తయారు చేయబడిన 'కావు' ను ఇంద్రాదులు నలునికి ప్రసాదించినట్లు ఆ కావును నొసటను పెట్టుకొనగనే నలుడు దమయంతి యంతఃపురము చేరినట్లు జానపదులు కల్పించినారు. శిష్టసాహిత్యములోని నలకథలో దేవతలు ప్రసాదించిన తిరస్కరణీ విద్యా ప్రభావముచే నలుడు దమయంతి యంతఃపురమునకు ప్రవేశించి నట్లున్నది.

దమయంతి స్వయంవరమున నలాకారులైన దేవతలను వారికి గల కొన్ని ప్రత్యేక లక్షణములనుబట్టి గుర్తించినట్లు జానపదుల నల కథలో తెలుపబడినది. కాళ్ళు భూమిపై వ్రాలకుండుట కనురెప్ప పాటు లేకుండుట ధరించిన పూలమాలలు వాడకుండుట అను లక్షణములుగలవారిని దేవతలుగాను, ఈ లక్షణములు లేనివానిని నలుని గాను దమయంతి గుర్తించి అతని మెడలో పుష్పమాల వేసినది.

నలదమయంతుల పెండ్లి సాంప్రదాయకముగ జానపదుల మనో భావముల కనుగుణముగ జరిగినట్లు వర్ణితము. అత్తవారింటికి పంపు నపుడు దమయంతికి తల్లి కొన్ని నీతులుపదేశించుచున్నది తెలుగు దేశమునందు అనాదికాలమునుండి పాటించుచున్న ఆచారము.

కలిపురుషుని జానపదులు శనిగా వ్యవహరించినారు. దమయంతీ స్వయంవరమునకు వివిధ రాజులతోపాటు శని కూడ వచ్చినాడని, అందరిని నిరాకరించి దమయంతి నలుని వివాహమాడుటతో శనికి కోపము వచ్చినదని ఒకరిని బాధించి సంతసించుటయే శనికి ప్రియమని, దమయంతి పుట్టినప్పటి నుండి ఎపుడు ఆమె పెరిగి పెద్ద దగునో యని శని ఎదురుచూచుచుండెనని, ఆ ఆశ నలదమయంతుల వివాహముతో నిరాశగా మారినదని జానపదులు కల్పించినారు. తనను

వరించలేదనెడి కోపముతోనే శని నలదమయంతులకు పరస్పర వియోగము రాజ్యభ్రంశము కలిగించుటకు ప్రయత్నించినాడు. సామాన్యముగ ఈ లోకములో అసూయాపరులు ఇతరుల కలిమిని. కలిమిని జూచి ఓర్చుకొనలేక వారికి కష్టములు కలిగించుచుందురు. అట్టి అసూయాపరులలో శని ఒకడని జానపదుల భావము.

శని నలుని శరీరమునందు ప్రవేశించుటకు చిరకాలము నిరీక్షించెను. ఒకనాడు పాదములో ఒకించుక తడియక నున్నపుడు శని నలుని శరీరమునందు ప్రవేశించెను. పాదములు కడుగకుండా ఆశుచియుగా నున్న వ్యక్తిని శని పట్టునని, కాళ్ళు తడిసీ తడియక కడుగని పాదములను శుభ్రముగ కడుగుకొనవలయునని భావించుట జానపదులలో నేటికిని గలదు.

శని ప్రభావితుడైన నలుడు పుష్కరునకు జూదమున రాజ్యము కోల్పోయెను. రాజ్య బహిష్కృతులయిన నలదమయంతులు అడవిలో పక్షులను పట్టుకొనబోయి శని మాయచే తమ వస్త్రములను పోగొట్టుకొనిరి. "పైమీద బట్ట పక్షులెత్తుకుపోయే కష్టపురోజులు"నే సామెత తెలుగులో ఉన్నది. ఇది నలమహారాజు కథతోనే పుట్టియుండును. వెలది, జూదము, పానము, వేట, పరుష ప్రల్లదము, దండము పరుషదనము, సొమ్ము నిష్ప్రయోజనము వంటి సప్తవ్యసనములందు మనుజుడు తగులుకొనరాదని. జూదము వలననే కదా ధర్మరాజు నల చక్రవర్తి వంటి రాజులు రాజ్యము కోల్పోయిరని జానపదులు నేటికిని చెప్పుకొనుచుందురు. అరణ్యమున దుర్భర కష్టములనుభవించుచున్నపుడు దమయంతి తన తండ్రియైన భీమరాజు దగ్గరకు బోయి కష్టకాలము గడుపుదమని చెప్పినది. అందుకు నలుడు చెడి చుట్టముల చెంత చేరరాదని" ప్రత్యుత్తరమిచ్చినాడు. సామాన్యముగ ఈ లోకములో ఐశ్వర్యవంతుడైనపుడున్న గౌరవము ధనహీనుడుగ నున్నపుడుండదు. కావున ఐశ్వర్యవంతుడు చెడి చుట్టముల చెంత చేరినచో తప్పక పరాభవము పొందునను భావము జానపదులలో ప్రచారము

పొందిన నలకథలో పొందుపరచబడినది.

నలుడు చంద్ర వంశపు రాజని శిష్టసాహిత్యమునందు కలదు. నలుడు సూర్యవంశపు రాజని. అందువలననే రాజ్యబహిష్కృతుడయినపుడు నలునకు సూర్యవంశపు కులుగురువైన వశిష్ఠుడెదురుపడి కర్తవ్యోపదేశము చేసినాడని జానపదులు కల్పించినారు. నలదమయంతులు అరణ్యమున తిరుగుచుండగ శని బ్రాహ్మణ వేషమున కన్పించి. వారి పరస్పర వియోగమునకు నాలుగు త్రోవలు చూపినట్లు వారు ఇంద్రుడు ప్రసాదించిన మామిడి పండును కోసి తినుటకు సంసిద్ధముగ నుండగ వృద్ధ బ్రాహ్మణ వేషమున శని "ఆకలి, ఆకలి బ్రాహ్మణుని ఆకలి మానుపుడని'' ప్రలాపింపగ విప్రునకా దంపతులు మామిడిపండునిచ్చినట్లు జానపదులు నలకథలో కల్పించినారు. కష్టముల మీద కష్టములు వచ్చి సర్వస్వము కోల్పోవుచున్న వ్యక్తిని శని పట్టినాడని. ఏడేండ్లశని నెత్తిమీదకూర్చుని తాండవించుచున్నదని ప్రతి మనిషిని ఏడేండ్లశనిపట్టునని. ఆ శని పట్టిన కాలమున తెలివిగల వ్యక్తి కూడ తెలివి లేని వాడుగ నుండునని జానపదులనుకొను భావములు నలకథయందు ద్యోతకమగుచున్నవి.

శని ప్రభావితులై నలదమయంతులు పరస్పరము వియోగము చెందిరి. దమయంతి చేదిపురమునకు. నలుడయోధ్యాపురమును చేరిరి. చివరకు శని వదలుటతో నలదమయంతులు కలిసికొనిరి. ఈ కథాసందర్భమును పురస్కరించుకొనియే భార్యాభర్తల మధ్య తగవు లేర్పడి. పరస్పరము వియోగముచెంది చిరకాలమునకు సమాగమమయినచో వీరిని శని వదలినాడని చెప్పుటకలదు.

అరణ్యమున దమయంతిని అజగరము మ్రింగబోవ ఎఱుక రక్షించి. కామమోహితుడయ్యెను. దమయంతి తన పాతివ్రత్య మహిమచే వానిని భస్మము చేసినది. ఈ సందర్భమున పరస్త్రీ సంగమము వలన కలుగు అరిష్టములను గూర్చి. పాతివ్రత్య మహిమను గూర్చి జానపదులు విశేషముగ చెప్పుకొను చుందురు.

జానపదులు రుచికరమైన వంట విషయమును గూర్చి చెప్పునప్పుడెల్ల, "నల భీమ పాక" మను చుందురు. సామాన్యముగ ఒక్కొక్క వ్యక్తికి ఒక్కొక్క ప్రత్యేక లక్షణములవడి యుండును. ఈ దృష్టితో చూచినచో రుచికరమైన వంట పాకముల తయారుచేయుటయందు నల, భీములకు నేర్పరితనముగలదు. అజ్ఞాతవాస సమయమున విరటుని యింట భీముడు వంటలవాడై వివిధ వంట పాకములు చేయు చుండెనని. రాజ్య భ్రష్టుడయిన నలుడయోధ్యాపురమందు బాహుక రూపమున ఋతుపర్ణుని యింట వివిధములగు వంటపాకములు చేసెనని, ప్రసిద్ధి కలదు. బాహుక రూపమునందున్న నలుని గుర్తించుటకు దమయంతి కేశిని యను దాసి ద్వారా నలుని వంటకములను తెప్పించి. ఆ వంటకముల రుచి వలన నలునిగ గుర్తించినది. నలుడువంటచేయునపుడు కట్టెలు అక్కర లేదని గరిక పోచల తోనే అగ్గిపుట్టించి, తద్వారానే వంటకమును తయారుచేయువాడని జానపదులు నలపాకమును గూర్చి విశేషముగా పొగడు చుందురు.

గోవ్యాఘ్ర సంవాదము వలన నలుని సత్యపరిపాలనా నిరూపణ. నలుడు బంగారు ఈకలు గల హంసను పట్టుకొనుటకు గల కారణము. ఆడుబిడ్డల కనిన తల్లిదండ్రుల దుఃఖములు, ఆడుబిడ్డలను అత్త వారింటికి పంపునపుడు చెప్పు హితోక్తులు, పరదారాసక్తి వలన కలుగు అరిష్టములు. పాతివ్రత్యమహిమ. అసూయాగ్రస్తుల మనస్తత్త్వము, అశుభ్రముగ నున్న వ్యక్తిని శని పట్టుట, జూదము వలన కలుగు కీడులు. శని ప్రభావితులైన వారి కష్టములు. నలభీమ పాకమును గూర్చి అభిప్రాయము. సాంప్రదాయకముగ వచ్చు కొన్ని ఆచార వ్యవహారములు ఇత్యాదులు జానపదులు చెప్పుకొను నల కథయందు చోటు చేసికొనినవి.

"జానపద సాహిత్యములో గేయ. వచన. రూపకములను మూడు ప్రధాన శాఖలున్నవి. గేయశాఖ కథా సహిత మనియు కథావిరహిత మనియు ద్విధా విభక్తము. కథాసహితమైన గేయములను కథాగేయము

లనియు, గాథా గేయములనియు, కథా విరహితమైన గేయములను జానపదగేయములనియు పల్లెపాటలనియు పేర్కొనవచ్చును" అని ఆచార్య బిరుదురాజు రామరాజుగారు పేర్కొనిరి. తెలుగు జానపద సాహిత్యమున నలకథాపరములైన పదములు, కథలు, గాథలు, జంగముకథలు, హరికథలు, కీర్తనలు, యక్షగానములు ఎన్నో వెలువడినవి.

## 6. 1 తోలేటి సీతారామయ్య నలచరిత్రపదము :

తోలేటి సీతారామయ్య పదముగా రచించిన నలచరిత్ర ముద్రితమైనది. ఇది శార్వరి నామ సంవత్సర బాధ్రపద కృష్ణ, పంచమి సరి తిథి పరిపూర్ణమయ్యెనట. ఇది క్రీ. శ. 1900 సంవత్సరమునకు సరిపోవును. దీనినిబట్టి కవి 20వ శతాబ్ది పూర్వార్ధమునకు చెందిన వాడనుట స్పష్టము. కవి భీమసింగి గ్రామ వాస్తవ్యుడు. పూసపాటి విజయరామగజపతి మహారాజ తనూజుడు. ఆనందగజపతికి సమకాలికుడు. కృతిభర్త భీమసింగిలో వెలసిన గోపాలకృష్ణుడు. వైశాఖపుర వాసియైన కలగర్ల వెంకటరామయ్య కోరికపై తోలేటి సీతారామయ్య నలచరిత్రను పదముగా రచించినాడట.

"భూసురోత్తమ నీవు పూర్వంబు శశిరేఖ
పరిణయ క్రమమెల్ల పదముగావించి
ప్రచురంబుగా జేసి ప్రఖ్యాతి గాంచితివి
వలవొప్పగా నిపుడు నలుని చరితంబు
మృదుతరంబుగ నీవు పదముగా రచియింపు"

పామర జనములకు సన్నిహితముగ ఈ నలచరిత్ర పదము రచింపబడినది. తోలేటి సీతారామయ్య నలచరిత్ర పదమునకు పూర్వమున శశిరేఖ పరిణయక్రమమును పదముగా రచియించినట్లు తెలిసికొని తోలేటి సీతారామయ్య నలకథాప్రారంభమున కవిస్తుతితోపాటు నవ

గ్రహ స్తోత్రమునుకూడ చేసినాడు. కథా ప్రారంభము భారతములో నున్నట్లే, ధర్మజుని ప్రశ్నమునకు సమాధానముగా బృహదశ్వుడీ కథను చెప్పినట్లున్నది. బృహదశ్వుడు నలకథకు గల ప్రాచుర్యము నిట్లు తెలిపినాడు.

" ఆద్యంతము వినంగ నభిలాషగా నుండె
దయచేసి చెప్పవే తాపసోత్తంస
పుణ్యాత్ములైనట్టి పూర్వుల చరిత్రములు
విన్న మాత్రంబుచే వివిధ దుఃఖములు
పరిహారమగు సకల భాగ్యములు చేకూరు
ఖేదంబడగు మదికి మోదంబు గల్గు

కథావిషయమునగాని, పాత్రల విషయమునగాని సాధారణముగా ప్రసిద్ధమైన భారత నలకథ నడచినట్లేగాని ఇందు మార్పేమియులేదు. భారత నలకథలో స్వయంవరాగతులగు రాజుల వృత్తాంతమునిగా వారిని దమయంతి కెరుకపరచుటకు నియమింపబడిన వారిని గూర్చిగాని వివరములేవియు కనరావు. శ్రీనాథుని శృంగారనైషధమున దమయంతికి స్వయంవరాగతులను సరస్వతీదేవి జూపి నట్లున్నది. కాని ఈ పదములో సుదేవుడను విప్రుడు దమయంతికి వరణీయు లగు రాజులనెరుక పరచినట్లు కలదు.

" కాంతరో యీతండు గౌళభూనాథుండు
అంగనామణి యీతడంగ భూవిభుడు
మదిరాక్షియీతండు మత్స్యదేశపురాజు
నెలత యీభూరుండ నేపాళ విభుడు

..................................

..................................

నాతికళింగాధినాధుడీ నృపతి
కీరవాణి యితడు కేరళాధిపుడమ్మ
మందయాన యితండు మాళవాధిపుడు
అవియిట్లు ధరానాథులందరిని జూపి "

నలుని సత్య పరిపాలనలో నిషధదేశపు ప్రజలిట్లుండిరని కవి తెలిపినాడు - చూడుడు,

"ఆ పురమున జూడ సంగహీనులు లేరు
జారులు లేరనాచార్యులును లేరు
పరసతితో కలహించు వారలెక్కడ లేరు
మతి చంచలులు లేరు వెతకి చూచినను
కులహీనులును లేరు పలుగాకులును లేరు
చిత్త చాంచల్యులును బొత్తిగా లేరు
కపట చిత్తులును లేరు గాలించి చూచినను
శోధించితే లేరు వైధవ్యసతులు
అపసవ్య మరణంబు లాదేశమున లేవు
నాలుపాదములచే నడుచు ధర్మంబు"

నలుడు మంత్రితో కలిసి యుద్యానవనమునకు వచ్చి హంసల గుంపును జూచినట్లు వాటిని పట్టుకొనుటకు ప్రయత్నించగ అవి మ్రానెక్కినట్లు మంత్రి వాటిని తరిమినట్లు, అవి నేలపై వ్రాలినట్లు తోలేటి సీతారామయ్య తన నలచరిత్ర పదమున తెల్పినాడు. నలుడు సందర్శించిన ఉద్యానవనమును సీతారామయ్య ప్రౌఢముగ వర్ణించినాడు.

విరహ నివారణమునకై దమయంతికి చెలులు చేసిన శైత్యోపచారములను శ్రీనాధుని శృంగారనైషధము నాధారముగా సీతారామయ్య

ఇట్లు వివరించినాడు.

" మంచి గంధము దెచ్చి మగువకు జూపితే
కంది తత్క్షణమందు కస్తూరి యయ్యె
మల్లెపువ్వుల దండ మదిరాక్షికి నివైవ
వాడివత్తులునయ్యె వసుమతీనాథ
ముత్యాలసరములా ముదితకువైవంగ
మేలైన ముత్యముల్ నీలంబులయ్యె.
పన్నీరు దెప్పించి పడతి వెన్నున బోయ
కుతకుతమనియుడికె కువలయాధీశ
చన్నీళ్ళకాగులో కంజాక్షినుంచితే
వింతగా చన్నీళ్ళు, వేడెక్కెనయ్యా
చిగురుటాకుల మీద చెలియను జేర్చితే
సొగసుగా నెలమెనా? చిగురాకులెల్ల
తరుణీ మణికి మదన తాపంబు రెట్టించె
మగువను పోషింప మాచేతగాదు "

ఇది సామాన్య ప్రజలకు సుబోధకమైన హృద్యమగు ర

దమన మహర్షి వరప్రభావము వలన భీమునకు దమ దమనులను పుత్రులు, దమయంతి పుట్టినట్లు భారత నల విషయము. ఇందు దమయంతితోపాటు, దమనుడు వహా త్రవే చినట్లు తెలుపబడినది. దమయంతి ముందు పార్వతీ భవన వెళ్ళి, ఆమెను ప్రార్థించి, తరువాత స్వయంవర సభకు వ ఇందు తెలుపబడినది. వివాహ నేపథ్యమునకు వెళ్ళుముందు వరులను ప్రత్యేకముగ భగవంతుని సందర్శింపజేయుట అన ధాయమిందు పాటింపబడినది.

భీముడు దమయంతి నత్తవారింటికి పంపునపుడు ఆమెతో పాటు అరణముగా పంపిన సామగ్రి ఇది-

“ ఏడు వారపు నగలు హేమాంబరములు
దంతపు కుర్చీలు దొంతర డబ్బీలు
రమణీయ మయిన నట్టి రత్నపళ్లెములు
బొమ్మలు హంస తూలికా తల్పములు
అత్తరు గిండీలు నరివాణములును
నిలువుటద్దంబులును వెలలేని తప్పెలన్
పన్నీటి కుప్పెలును పసిడి పొందాను
మేలైన కేలు పల్లకీలు తివాసిలు
భోజన పాత్రము పునుగు జవ్వాది
పాడిమొదవలు చిల్క పంజరములు దాస
దాసీ జనంబులును ధనపేటికలు ”

వివాహానంతరము ఆడుబిడ్డలను అత్తవారింటికి పంపునపుడు రిక్తహస్తములతో పంపరాదు. ఆమెకు కావలసిన వస్తు సామగ్రిని పంపవలయును. ఆమె సంతోషముగ వెళ్ళినచో ఆ కుటుంబములోని వారికి అన్ని విధములుగ సంపదలు చేకూరునని జానపదుల నమ్మకము. అందువలన భీముడు దమయంతికి వివిధవస్తువులనిచ్చి పంపెనని యిందు తెలుపబడినది. శృంగార నైషధమునందు కూడ ఈ వస్తు సామగ్రి విషయమున్నది. కాని భారతమునందీ విషయము లేదు.

ఈ నలచరిత్ర పదములో కలిపురుషుని పేరు శనియని యున్నది శని దమయంతిని వివాహమాడుటకు చిరకాలము నిరీక్షించినట్లు, నలదమయంతుల వివాహముతో ఆయాశ నిరాశమైనదని యింద్రాదులతో శని మొరబెట్టుకొనినట్లు ఇందు తెలుపబడినది.

దమయంతి నేలపై పరుండు దృశ్యమును జూచి నలుడిట్లు శోకించినాడు.

" చెలికత్తె లందరును సేవలు చేయంగ
హంస తూలికా తల్పమందు బవళించి
సుఖముగా నిద్రించు సుందరాంగికి నేడు
యీ నేల పాన్పయ్యె నెట్టి కర్మంబొ "

ఇది కరుణ రసోపేతమైన అమూలకమైన సన్నివేశము. మిగిలిన కథాభాగమంతయు భారత నలోపాఖ్యానము ననుసరించి రచింపబడి నట్టిదే.

## 6. 2. జానపద కథలలో నలకథ:

జానపదులు తమ మనోభావముల కనుగుణముగ పౌరాణిక ప్రసిద్ధమైన కథలలో నూతనాంశములను చేర్చి చెప్పుకొను చుండుట కలదు. జానపద నలకథలో చోటుచేసికొనిన కొన్ని విశేషాంశములను క్రింద పరిశీలింతుము.

## 6. 2. 1 సంగవేఃశంగారి 'నాగానందం' లోని నలకథ:

'నాగానందం' అను కథల పుస్తకములో నాగానందం కథతో పాటు నలకథకూడా చెప్పబడినది. 'జూదమున రాజ్యము కోల్పోయి తిరిగి రాజ్యము సంపాదించిన వారెవరైనా ఉన్నారా?' అని చెల్లి యడి గిన ప్రశ్నకు అన్న ఆమె సందేహ నివృత్తికై నలకథ చెప్పినట్లున్నది. భారతారణ్యపర్వములోని నలోపాఖ్యానమే ఈ కథకు మూలము. భారత కథనే గ్రహించినను జానపదుల అభిరుచికనుగుణముగ నిందు కొన్ని మార్పులు, కూర్పులు చేయబడినవి. కవి నవీనుడగుట వలన నేడు నలకథను గూర్చి జానపదులు చెప్పుకొను అభిప్రాయములిందు చేర్పబడినవి.

నలుని చేత పట్టుబడిన హంస తన భార్యను. ముసలి తల్లి దండ్రులను, మొన్ననే పుట్టి ఇంకను కాళ్లులేవలేని పిల్లలను గూర్చి దుఃఖించి చెప్పిన సంగతులు కరుణరసోపేతముగ మానవ ప్రవృత్తి ద్యోతకమగునట్లు నిందు చిత్రింపబడినది. నలుని చేజిక్కిన హంస మగది.కుటుంబ పోషణ విషయములో ఆడవారికంటే మగవారికధిక బాధ్యత ఉండును. హంసకు వచ్చిన ఈ కష్టములు మానవునకు వచ్చుట పరిపాటి. వాటిని నేర్పుతో తప్పించుకొనవలెననుట ఇందు ద్యోతకమగుచున్నది. హంస దుఃఖించుటను జూచి నలుని మనసు వెన్నవలె కరిగి పోయినదట. రాజు కరుణార్ద్ర హృదయుడని తెల్పుటకై కవి యిట్లు చెప్పెను. సజ్జనులకు కరుణ యుండును. మనసు వెన్న వలె కరిగి పోవుట సహజముగ జానపదులుపయోగించు జాతీయము. నలుడు హంసను వదలిపెట్టెను. అది ప్రత్యుపకారముగ తాను బ్రహ్మదేవునికి వాహనమైయుందునని. దమయంతిని అతనికి భార్యగా నొనరించెదనని వాగ్దానమిచ్చెను. సృష్ట్యాది రహస్యములు బ్రహ్మకు తెలియును. బ్రహ్మవాహనమైన హంసకు నలదమయంతు ల వివాహ విషయముకూడ తెలిసియుండునని తెలుపుటకే కవి యిట్లు వర్ణించి యుండును. ఒకనాడు సరస్వతితో చతుర్ముఖుడు వాహ్యాళి కెళ్ళినపుడు నలుడు సౌందర్యవంతుడని, దమయంతి సౌందర్యవతి యని, వీరి వివాహము తథ్యమని చెప్పినట్లు. ఆవిషయమును హంస వినినట్లు నిందు తెలుపబడినది. అందువలననే అంతధీమాతో హంస నలునకు దమయంతివివాహమునుగూర్చి చెప్పెను.హంస దమయంతి ఉద్యానవనమునందుండగ చేరుకొనినట్లుండగా ఇందు అంతఃపుర వాటికలో దమయంతి విహరించుచుండగ హంస ఆమెనుచేరుకొన్నట్లు దమయంతి దానికి పాలుయిచ్చి అతిథి మర్యాదతో సత్కరించి నట్లు కల్పింపబడినది హంసకు తామరతూండ్లు. పాలు, ఆహారము. నీళ్ళలో కలిసిన పాలును మాత్రము గ్రహించి నీళ్లను వదలు స్వభా భావము హంసకున్నది. తన యింటికి వచ్చిన వారిని మర్యాదతో సత్క రించుట జానపదులకేగాక శిష్టులకు కూడా ఆచారమే, కాని శిష్టజాన

పదుల ఆచారములందు భేదమున్నది. దూరప్రదేశములనుండి తమ బంధువులు వచ్చినపుడు జానపదులు చూపు అప్యాయత, అనురాగము లెన్నదగినవి. దమయంతి హంసను అతిథిమర్యాదతో సత్కరించినదని కవి కల్పించెను. హంస దమయంతితో తాను బ్రహ్మకు వాహనమని తన వీపు మీద బ్రహ్మ కూర్చుని కైలాసమునకు వెళ్ళినపుడు తనతో నలదమయంతుల వివాహమును గూర్చి చెప్పినాడని, అంతియే గాక నలుడు అందమునకు మన్మథుడని, ప్రతాపమునకు సూర్యుడని ఐశ్వర్యమునకు కుబేరుడని, అన్ని విద్యలెరిగిన అపరసరస్వతి యని బ్రహ్మ తనతో చెప్పినట్లుగ చెప్పినది. "నూరు తప్పులు చెప్పి ఒక పెండ్లి కార్యము చేయాలి'' అను సామెత జానపదులలో నున్నది. దీని ప్రకారము నలునకన్ని ప్రత్యేక గుణములు లేక పోవచ్చును. కాని నలచక్రవర్తిని దమయంతి వివాహమాడవలసిన విషయము ప్రస్తుతాంశము. అందువలన హంస నలుని గుణములను కీర్తించినది. ఇది లోకములో ఎక్కువగ పెండ్లి విషయములందు కన్పించును. పెండ్లి చూపులైన తర్వాత వధూవరులకు మధ్యవర్తులు ఒకరిగుణములు మరొకరికి చెప్పుదురు. ఆ చెప్పు విషయములు కూడా సాధారణముగ చెప్పరు, గోరంతలు కొండంతలు చేసి చెప్పుదురు. వీరి గుణప్రశంసలు వలన ఆ వధూవరుల వివాహము స్థిరమగుచుండును. ఇక్కడ హంస కూడ అదే పని చేసినది. నలదమయంతులను కలుపుటయే హంస ముఖ్యోద్దేశము.

దేవతల పనుపున తిరస్కరిణీ విద్యాప్రభావముచే దమయంతి యంతఃపురము ప్రవేశించినట్లు, స్వయంవరాగతులగు రాజులను దమయంతికి సరస్వతీదేవి జూపినట్లు నిందున్నది. ఇది జానపద నల కథలో నున్నప్పటికి కవి శృంగార నైషధమునను సరించి కల్పించి యుండును. స్వయంవరమునకు కలిరాజు కూడ వచ్చినాడని అతనిని వివాహమాడుటతో కలికి కోపావేశమధికమై నలచక్రవర్తిని పట్టినాడని జానపదులనుకొను విషయమిందు చెప్పబడినది. కలి, కామ క్రోధ, లోభ

మోహాదులకు రాజని అనాచారత్యాచారాలు రోగ దుర్భిక్షములు, దారిద్ర్యదుఃఖములు అతని పరివారమని, ఒకరిని బాధించి సంతసించడమే ఆయనకు ప్రియమని జానపదులనుకొను విషయమిందు తెలుపబడినది. నలుడు కాళ్లు "కడుగుకొనునపుడు కొంత తడువలేదని, అతడి యనిష్ఠానమున కలి నలుని శరీరమునందు ప్రవేశించినాడని, కాళ్లు సేతులు శుభ్రముగా కడుగుకొనవలయునని, తడిసి తడియక కడుగుకొనిన వ్యక్తిని శనిపట్టునని జానపదుల అభిప్రాయమిందు చేర్చబడినది. పుష్కరుడు నలునకు జ్ఞాతి సోదరుడు "అన్నదమ్ములు ఐక్యతగనుండుట, భార్యాభర్తలు విడిపోవుట ఎప్పటికి జరగదు" అనుమాట జానపదులలో నున్నది. అన్నదమ్ములలో ఎంత ఐక్యమున్నప్పటికి వారి వివాహమైన తర్వాతనైన వారిభార్యలలో స్పర్ధలేర్పడి విడిపోవుట సహజము. అట్లే ఎన్ని స్పర్ధలేర్పడుచుండిన సహజముగ భార్యాభర్తలు విడిపోవుట జరగదు. అయితే ఈ విషయము ప్రతి వ్యక్తికి వర్తింపక పోవచ్చును. నలపుష్కరులు చిన్నాయన, పెదనాయన బిడ్డలు. పుష్కరుడు నలుని ఆస్తిని కాజేయవలెనని తలంపుతో నుండెను. అట్టి సమయములో కలి పుష్కరుని సమీపించి తన ప్రణాళికను చెప్పికొనినట్లు నిందు తెలుపబడినవి. ఇది లోక సహజము కూడా. ఇద్దరి మధ్య వ్యవహారమున్నపుడు ఒకరిని సాధింప దలచి మరొక వ్యక్తి వాని ప్రక్కచేరి పగ సాధించుచు. అందువలన కలి నలునిపై పగ సాధించుటకై పుష్కరుని చేరెనని యిందు తెలుపబడినది. పుష్కరుడు కపట ద్యూతమున నలుని రాజ్య మపహరించెను. రాజ్యభ్రష్టులైన నలదమయంతులకు ఆహారము లభింపక పోవుటచే పక్షులను పట్టి భక్షింతమని నలుడు ప్రయత్నించి విఫలుడయ్యెను. తన వస్త్రమును పక్షులపహరించినవి.

విన్నావా చెల్లీ "పైమీద బట్ట పక్షులుఎత్తుక పోయే కష్టపురోజులనే సామెత ఎరుగవూ? అవి యీ నలమహారాజు కథతో పుట్టినదని" చెప్పెను. నలదమయంతుల ఆకలి బాధ నివారణార్థము దేవతలు

చూతఫలమిచ్చినట్లు, దానిని కపట బ్రాహ్మణ వేషధారియైన కలి హరించినట్లు ఇందు కల్పింపబడినది. నలుడర్ధరాత్రి సమయమున దమయంతి చీరమర్ధముచించుకొని వెళ్లెను. నలమహారాజునంతటి వానికి మలిన వస్త్రము పైగా ఆడువారి చీరకట్టుకొను కాలము వచ్చినది. కష్టమనునది ఎవరికిని తప్పునదికాదు. విధి వక్రించి నపుడు భగవంతుడైనను తలవంచ వలసిందే అని జానపదు లనుకొను మాటలిందున్నవి. "విధివ్రాత తలవ్రాత" అన్నట్లు నలు డయోధ్యాపురమునకు, దమయంతి చేదిపురమునకు వెళ్ళిరని యిందు చెప్పబడినది. ఇది జానపదుల అభిప్రాయమే. చేదిపురి రాజమాత దమయంతిని ఎవరని ప్రశ్నించినపుడు "చెప్పినచో నలునిగూర్చి చెప్ప వలసివచ్చునని, అరణ్యములో అమాయకురాలిని ఒక్కర్తెను విడిచి వెళ్లినాడను నేరమునకు నలుని అందరు నిందింతురని, తన భర్తను వేరొకరు నిందించుట తనకిష్టములేక తన వృత్తాంతమును మార్చి చెప్పినది. ఇది దమయంతి పతివ్రతా గుణమునకు ప్రబల నిదర్శ నముగ నిందు తెలుపబడినది. దమయంతి బాహుకుని పరీక్షించు టకు తన చెలికత్తెయగు భారతిని నియోగించినట్లు ఇందు తెలుప బడినది.

అన్నాచెల్లెండ్ర సంభాషణముఖముగ జరిగిన ఈ నలకథకు గల ప్రాశస్త్యమును గూర్చి కూడ కవి ఇట్లు చెప్పినాడు. "నలదమ యంతులను, నాగరాజైన కర్కోటకుడు, రాజర్షి అయిన ఋతు పర్ణుని తలచుకొనినచో సమస్తమైన కలి కల్మషములు అంతరించి పోవును. సకల సంపదలు కలుగును. ఇది జ్ఞాపకముంచుకొని రోజూ స్మరించు'' మని అన్న చెల్లెలకు హితోపదేశము చేసి నలకథను ముగించెను.

## 6. 2. 2. సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'సదాచారము తప్పకుము':

వివిధపురాణములలోని నీతి ప్రబోధకమైన అంశములను క్రోడీకరించి "పురాణగాథలు" అను పేరుతో సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ప్రచురించినారు. ఇందు జానపదులుచెప్పుకొను అంశములు పెక్కున్నవి. శాస్త్రిగారు నలకథనుండి "సదాచారము తప్పకుము" అను శీర్షికను గ్రహించి జానపదుల కభిమతముగ కొన్ని కల్పనలు చేసినారు. త్రిలోక సుందరియగు దమయంతి ఇంద్రాదులనుగూడ తృణీకరించి నలుని పెండ్లియాడినది. ఆమెను పెండ్లియాడుటకు కలి చాల కుతూహలము పడెను. కాని అప్పటికప్పుడే కార్యము మించిపోయెను అది దేవతల వలన విని యాతడు "నేను పెండ్లియాడదలచిన కన్యను వివాహమాడుటకు వీడెవడు ?" అని కోపించి కలి నలుని ఎట్లయినను ముప్పు తిప్పలు పెట్టవలయునని సంకల్పించెను. కాని నలుడు సదాచార సంపన్నుడగుట వలన అతని యందు ప్రవేశించుటకు కలికి అవకాశము చిక్కకుండెను. అందుకు నిరుత్సాహపడక కలి నలుని ప్రవర్తనమును కనిపెట్టుకొనియుండెను. ఇట్లుండగ ఒకనాడు నలుడు మూత్ర విసర్జనముచేసి విధి వశమున పాదములు కడుగుకొనుట మరచి సంధ్యాపాసనము గావించెను. అది సమయమని కలి నలుని శరీరమునందు ప్రవేశించెను.

పరిశుద్ధుడుగా నున్నపుడు కలి నలుని యేమియు చేయలేకపోయెను. అపరిశుద్ధుడైనపుడు అతనిలో సులభముగ ప్రవేశింప గలిగెను. కావున శాస్త్రిగారు పరిశుభ్రముగ నుండువలయునని, అట్లుండనిచో శని పట్టునని ఈ శీర్షిక ద్వారా లోకమునకు ప్రబోధించెను.

## 6. 3. పెదన దాసాచార్యుని నలచక్రవర్తి నాటకము (జంగం కథ):

తెలుగు సాహిత్యములో నలకథాపరమగు కథయొక్కటి యున్నది. జంగమ కథలు పల్లెసీమలందు విపుల ప్రచారము పొందినవి. తెలుగు దేశములోని జంగములు పౌరాణికమైన ఏదేని నొక కథను పల్లెసీమలలో రాత్రివేళ నాట్యముచేయుచు ప్రదర్శింతురు. వీరు ముగ్గురు లేక ఐదుగురు కలిసి బృందముగా నేర్పడి వివిధ వేష భూషణములతో నాట్యమభినయింతురు. వీరిలో స్త్రీ పాత్రకు అత్యాధిక ప్రాధాన్యముండును. ఒకే పురుషుడు ఆ పౌరాణిక కథలో వచ్చు వివిధ పురుష పాత్రలనభినయించును. అదేవిధముగ స్త్రీ పాత్ర కూడ వివిధ స్త్రీల పాత్రలనభినయించును. వీరి వేషధారణ సంభాషణ పౌరాణిక కథా. పాత్రలకు సన్నిహితముగ నుండును. జన వ్యవహారమున జంగమ కథలు, బుఱ్ఱ కథలు ఇంచుమించు సమానార్థద్యోతకములే. ప్రధానముగ రెండింటి మధ్య కొంత వ్యత్యాసమున్నది. జంగమ కథలో కేవలము పౌరాణిక కథతో పాటు సమకాలిక సాంఘికేతి వృత్తములు కూడ చోటు చేసికొని యుండును. జనపదమున నాటకములకుగాని, యక్షగానములకుగాని, చివరకు హరికథలకుగాని లేని విశేషవ్యాప్తి ఈ జంగమ కథలకు లభించినది. చిత్ర విచిత్ర కల్పనలతో పౌరాణిక కథలను అల్లుట జంగమకథలలో చెప్పుకోదగిన విశేషము.

పెద్దన దాసాచార్యుడు ఐదాశ్వాసములుగల నలకథా పరమగు జంగమకథను నలచక్రవర్తి నాటకమను పేర రచించెను. ఇది ముద్రితము. ఇందలి కథకు నన్నయ భారత నలోపాఖ్యానము, చక్రపురి రాఘవాచార్యుని ద్విపద నలచరిత్రము మూలములు. ఇందులో జన సామాన్యమునకనువుగ దాసాచార్యుడు వివిధములగు మార్పులు కూర్పులు కూడ చేసినాడు. కథ మధ్యలో ప్రదర్శనానుకూలముగ వివిధంబులగు దరువులు, తాళములున్నవి

నలుని సత్య పాలన కేవలము మానవ మాత్రులకేగాక పశు పక్ష్యాదులకు కూడ వర్తించుచుండెడిదని తెలుపుటకై పెద్దన దాసాచార్యుడు తన నలచక్రవర్తి నాటకము నందు చక్రపురి రాఘవాచార్యుని ద్విపద నలచరిత్ర ననుసరించి గోవ్యాఘ్రసంవాదమును చేర్చియుండును. ఇది జానపదుల అభిరుచి కనువుగ తీర్చిదిద బడినది.

నలమహారాజు వసంత కాల సమయమున వినోదార్థమై ఉద్యానవనమునకు వివిధ వాద్యబృందములతో వచ్చి, సురపొన్న వృక్షము క్రింద పాన్పుపై కూర్చుండి మంత్రితో వసంత కాలమగుటచే వసంతునికి పూజచేయుమని చెప్పినట్లు, పూజానంతము హంసలు ఉద్యానవనమున మరింత ఆహ్లాదకరమగుటచే వానిని పట్టుకొనుట కభిలషించినట్లు ఈ జంగమ కథ యందు తెలుపబడినది. ఇది రాఘవాచార్యుని నలకథలో కూడ నున్నది. భారత కథలో దమయంతి మీద గల విరహ వేదనను సహింపక నలుడు ఉద్యానవనమునకు వచ్చినట్లున్నది. ఈ కథలో నలుడుత్తమ ప్రజాపాలకుడు. అట్టి వానిని కేవలము స్త్రీ లోలుడుగ చెప్పుట సమంజసము కాదని, వసంత కాలాగమనముతో ఉద్యానవనమునకు వచ్చినాడని కవి మార్చి వ్రాసినారు.

దమయంతితో దమనాఖ్యుడు మాత్రమే పుట్టినట్లు నిందు తెలుపబడినది. దమయంతిని సమీపించి హంస నలుని గుణగణములనిట్లు కీర్తించినది.

"మానవేశ్వరుడు నిషధ నగరు సమ్మదమున పాలించు
నాలోకములనొందెను కీర్తిన్ నలచక్రవర్తి
లోకముల్లెల్లను విష్ణుచక్రమే రూఢిగ పాలించు
యేడు దీవులు యేలెడు రాజయిన సమానతేజు
వోతివి శ్రీనలకూబరుకైన పూవిల్తునికైన

వారి జాసనునికైనను దివ్యవారి జాప్తుకైన
గౌరమనోహరునికైనా కమల విభునికైనా
ధరణిలోన పెన్నొందిన రాజు తగిన వాడు నీకు
పరగ సేను వీక్షించిన నృపులీ వసుధలోన లేరు
పెలది లలామరో యిట్టిరాజు భువివెదకిన లేడమ్మా
తలిరుబోణినిను వంటి దానికి తగిన వాడానృపుడు
ప్రపదములో పదునాల్గు లోకములు పాలించెడి నృపుడు
కమల మిత్రుని కులజుడు మాల్యగ్రామ శౌరినాత్మ
నమ్మిన భక్తుడు శాస్త్రకోవిదుడు నార్యపూజితుండు
సమ్మదమున వరియించితే నీకు సకల పదవి గలుగు"

పెద్దన దాసాచార్యుడు దమయంతి విరహమునిట్లు శబ్దాలంకార పూరితముగ వర్ణించెను.

"బట్టదు రవికెయు దోడిగి చక్కగా బంగారు చీరె
గట్టదు బూయదు పరిమళంబు శ్రీగంధంబును మేన
బూయదు అన్నము పొందు మీరగ భుజింపక నుండు
శేయదు విడియము సొమ్ము బెట్టదు చింత తోడ తాను
ఆడదు సరసము చెలియల తోడ అనుదినమును చాల
వీడదు మాల్యాద్రీశుని భక్తివిభుని మీదిచిత"

ఈ విరహిణుల ప్రవృత్తి మానవ సహజమైనది. దమయంతి విరహమును గ్రహించి భీమరాజు ఆడుబిడ్డల కనిన వారి కష్టముల గురించి చింతించెను. ఆనాటికి ఈనాటికి ఇది తీరని సమస్యగానే మిగిలియున్నది. ఆనాడు వరకట్నములిచ్చు ఆచారము లేక పోవచ్చును. కాని తమ కుమార్తెను బలవంతముగ ఇచ్చెదమనినచో అది ఆరాజమర్యాదకు తీరని లోటు. అందువలన భీమరాజు తన కుమా

ర్తైను గురించి క్రుంగి పోయినాడు. "ఇస్తానన్న వస్తానన్నచులకన" అను సామెతలోని పరమార్థముకూడ ఇదియే. కాని ఈనాడు వరకట్న దురాచారము వలన ఆడపిల్లల వివాహము బహుదుర్భరమైనది. ఆడ పిల్లల తండ్రుల కష్టములు ఆనాటికి ఈనాటికి తప్పినవి కావు.

నలుడిక్ష్వాక కుల సంజాతుడని కవి యిందు మార్పు చేసెను. కాని నలుడు చంద్ర వంశపు రాజు. హరిశ్చంద్ర, శ్రీరామాది నృపులు సూర్యవంశపు రాజులు. వీరు సత్యవాక్య పరిపాలకులు. వీరివలె నలుడు సత్యపరిపాలకుడని నమ్మకము కలిగించుటకై కవి యిట్టి మార్పుచేసి యుండును. నారదుడింద్రాదులతో దమయంతీ స్వయం వరమును గూర్చి చెప్పి, ఆమె నలుని తప్ప నన్యులను వివాహమా డదని కూడ చెప్పినట్లు ఇందు తెలుపబడినది. నారదుడు త్రిలోక సంచారి. అట్టి వానికి నలదమయంతుల ప్రేమ తెలిసియుండునని కవి అతనితో చెప్పించెను. వసుదేవుడను విప్రుడు దమయంతికి స్వ యంవర లగ్నమేర్పరచినట్లు, దమయంతి శ్రీశైలమల్లికార్జునస్వామిని దర్శించి, తరువాత స్వయంవర మండపమునకు వచ్చినట్లు ఇందు తెలుపబడినది. వివాహ వేదిక నలంకరించక పూర్వము వధూవరులు ఇష్టదేవతా పూజనము చేయుట సదాచారమై యున్నది. అందువలన దమయంతి మల్లికార్జునస్వామిని ప్రార్థించినట్లు కవి యిందు కల్పించెను.

రాఘవాచార్యుని నలకథలో నున్నట్లే యిందును స్వయంవరా గతులగు రాజులను దమయంతికి వసుదేవుడను విప్రుడు జూపి నట్లున్నది.

క్రొల్గంటి కాశ్మీర కాశ్యపిధవుడితడు
యితడు మగధాపురంబేలురాజు
అంగన మహారాట అధిపతిగాయితడు
యితడు మ శన పురాధీశ్వరుడు

భామామణి యవనపట్టణన్నృపుడితడు
యితడు శ్రీబంగాళ పతిగనొప్పు
యితడు సౌరాష్ట్ర పురిపతి యతులితముగ
చోటి యితడును మరికరహాటధవుడు
తరుణి యీతడు కుకర వల్లభుడు"

నలదమయంతుల వివాహ సందర్భమున స్త్రీలు శోభన పాటలను పానుపు పాటలను పాడినట్లు కవి యిందు కల్పించెను.

## పానుపుపాటలు - ఆట తాళము॥

"నలరాజుపెండ్లికొడుకాయనూ! మన జలజాక్షిపెండ్లికూతు
రాయనూ। భవనములు సంతోషమంద నాయనూ। యల్ల
పౌలతులందరు ముత్యముల హారతులొసగ ॥నల॥
పరగ విప్రాంగనాలు వేట్కాగా । పెండ్లి పాటలును బాడుచునుండగా
అపుడు రథాంగకాహళ భేరి ధ్వని దివినిండగాను ॥నల॥
వందిమాగధులు కీర్తింపగా। మంత్రివరులు నిరుగడల నిలిచి
యుండగా వారసుందరాంగులనెల్ల సొగసు నాట్యమాడ ॥నల॥
వేత్తాలు హోమముల్వేల్పించగా। భూసురోత్తములక్షతలు విప్వగ॥
చలగి నత్తుగ పుణ్యస్త్రీలూ వేషాలు చల్లగాను ॥నల॥
వాసిగ మాల్యాగ్రావవైనను। జగతీశుడై వెలసి లక్ష్మితోడను।
వాలా దాసుల బ్రోచి చిట్టిదామోదరుని కృపతో ॥నల॥

## శోభనపు పాటలు : ఆదితాళము

"శోభనమే వీరసేనాత్మజునకు। ప్రాకట విదర్భేశుపట్టికిని ॥శోభనే॥
సుందరమూర్తి। వసుంధర విభునకు
యిందువదన దమయంతికిని ॥శోభనే॥

అమరుల దీవెన లందిన నలునకు
కమలాక్షికి ద్విరదగామినికి ॥శోభనే॥
సకల దేశాధీశ ధీశునకును
ప్రకటిత పల్లవ పాణికిని ॥శోభనే॥
వరసత్యనలునకు ధరసార్వభౌమునకు
పరమ పతివ్రతల తరుణికిని ॥శోభనే॥
పరగ శ్రీమాల్యశైల। నరహరి హృత్సేవ్యునకు
వురగ వేణికి పల్లె విరుల బంతికి ॥శోభనే॥

ఇది తెలుగు ప్రజల ఆచారము. వివాహ సమయములో వివిధ పాటలతో వివాహ వేదిక మారుమ్రోగుచుండుట నేటికిని మనము గమనింపవచ్చును.

నలుని పీడించలేక శని యిట్లు వ్యథచెందినట్లు పెద్దన దాసాచార్యుడు వర్ణించినాడు.

"యేమి సేయుదు। ధూమకేతువు ఐనానా నవలేను ॥యేమి॥
యితని సత్యశీలమూను। అతులితము చూచితిని ॥యేమి॥
వీరసేన నాకొమరుడును। కూరిమితో నుండగాను ॥యేమి।
అతిగా నింద్ర సభలోను। ప్రతిజ్ఞను జేసితిని ॥యేమి॥
ఘనశ్రీమాల్యాద్రిశౌరి కృప. యేలాగునుందో కాని ॥యేమి॥

ఇవి అమూలకమే.

భీమరాజు దమనుని దమయంతికి తోడుగ నిషధకు పంపినట్లు ఇందు తెలుపబడినది. ఇది తెలుగు ప్రజల ఆచారమే. ఆడుబిడ్డవారు వివాహానంతరము బిడ్డను అత్తవారింటికి పంపునపుడు ఆమెకు ఇష్టులగువారిని వెంట పంపునాచారము ఇప్పటికిని కలదు.

ఈ నలకథలో కలికి మారుపేరు శనియని తెలుప బడినది. అత్తవారింటి కేగునపుడు దమయంతికి తల్లి హితోక్తులిట్లు చెప్పినది.

"అంబుజనేత్రి నీ అత్తమామలమాట
నొప్పుగా జవదాటకుండవమ్మ
పతిని శ్రీపతిని గావించి మదిలోన
హరిగుమభక్తియు మరువకమ్మ
బంధుకోటికి ప్రియంబైన సాటివారిలో
బాగుగా కీర్తులు తేగదమ్మ
సఖియ నీనాథుండు చనవిచ్చినపుడు
పలుమారు నెదిరించి పలుకకమ్మ
చెలులతోడ తనతిచెల్మి సేయవమ్మ
పొసగ దాసీ జనంబుల బ్రోవ వమ్మ"

ఇది తెలుగు దేశమునందు పాటించబడు ఆచారమే.

అడవిలో తిరుగుచున్న నలదమయంతులకు శని బ్రాహ్మణ వేషమున కన్పించి నాలుగు త్రోవలు జూపినట్లు ఇందు తెలుపబడినది. దమయంతికి పాము కరచినపుడు ఆమె పాతివ్రత్యమును భంగము చేయుదలచి శని బోయవానిని పంపినట్లు నిందు కల్పింప బడినది. శని వలన ఈ కథ జరిగినది. కావున శని ప్రభావమువలన వివిధ కథా సన్నివేశములు జరిగినవని కవి యిందు కల్పించెను.

కామోద్రేకుడైన బోయవానికి దమయంతి యిట్లు హితబోధ గావించినది.

రగడ:

" తలప లోకముల తల్లు లేవ్వరని తలపునుంచరన్నా
అని నీమాటలకు అది యెట్లెంటె ఆలకించరన్నా

తన గురుసతి యొక తల్లిగ నుండు తగ వినరోరన్నా
వనరుగ రాజ్యము నేలు రాజుసతి వక్క తల్లిరన్న
తగదు భ్రాతృసతి త ల్లిగ నుండు తమక కవినరన్న
తన భార్యామణి తల్లియునొక్క, తల్లియురోరన్న
తనదు తల్లికి మించిన యట్టి తల్లులు వీరంత
వీరిలోన యెవ్వరినైనాను వీక్షించియు నెంతో
కూరిమితో మోహించి నడలితె ఘోరపాతకంబు
పాపమొచ్చును లోకములోన మానభంగమగును
ఆపదలొచ్చును దారిద్ర్యము చే నమిత దుఃఖపడును
రూపము చెడి పోరూఢిగ సర్వరోగములరుదెంచు"

(చతుర్థాశ్వాసము)

దమయంతి శాపముచే బోయవాడు భస్మీభూతుడయ్యెను. పతివ్రతామతల్లుల జోలికి పోయినవారికి తప్పక పరాభవము జరుగునను సూచన యిందు తెలుప బడినది.

దమయంతిని వదలి నప్పటి నుండి నలుడు కట్టిన పుట్టము తప్ప వేరు వస్త్రము ధరించెడి వాడుకాడని, అదే విధముగ దమయంతి కట్టు వస్త్రములతో నుండెడిదని, ఈ వస్త్రపరిశీలన మూలకముగనే వారు పరస్పరము తెలిసికొనుట కవకాశమేర్పడినదని కవి యిందు తెలిపెను. కష్టములు వచ్చినపుడు పరస్పర ప్రేమావగాహనతో నుండవలయునేగాని వివిధభూషణాలంకారములతో నుండరాదని కవి లోకమునకు ఇందుమూలకముగ చాటిచెప్పినాడు.

దమయంతి యగ్నిగుండము ప్రవేశించినపుడు త్రిమూర్తులు ప్రత్యక్షమై దమయంతి పాతివ్రత్యమును నిరూపించిరని యిందు తెలుపబడినది. నలదమయంతుల సమాగమ సందర్భమున కులగురువగు వశిష్టుడు వచ్చి నలునకు హితోపదేశమిచ్చినట్లు ఈ జంగమ

కథలో తెలుపబడినది.

ఇట్లు పెద్దన దాసాచార్యుడు భారత నలకథను, చక్రపురి రాఘవాచార్యుని నలకథను గ్రహించి జానపదులకనువుగ వివిధ మార్పులు కల్పించి ఈ నలకథను వ్రాసినాడు. ఇందు జానపదుల అభిప్రాయములెక్కువయుండుట వలన ఈ నలకథ విపుల ప్రచారము పొందినది.

## 6. 4. నలకథాపరములగు హరికథలు:

తెలుగు సాహిత్యములో నలకథాపరములగు నాటకములు, జంగమ కథలతోపాటు హరికథలు కూడ ఆవిర్భవించినవి.

### 6. 4. 1. బాలాజీదాసు - నలచరిత్ర:

బాలాజీదాసు సకల దోష నివారణార్థము కొరకు నలచరిత్రను హరికథగా వ్రాసినట్లు అవతారికలో చెప్పుకొన్నాడు. ఛాయాపుత్రునకు ఈ కృతి అర్పింపబడినది. భారతారణ్య పర్వ నలోపాఖ్యానము ఈ నలచరిత్రకు మూలము. హరికథానుగుణముగ వివిధ కల్పనలు సంగీత దరువులు ఇందు కల్పింపబడినవి. వర్ణన సుదీర్ఘముగా సీస మాలిక నందిట్లు వివరింపబడినది.

"ధర్మమార్గంబు వదలి నీచవృత్తుల నాచరించెడి విప్రులచట లేరు
గౌరవింబడక నగౌరవప్రాప్తులౌ యవనీధ వాఘను లచట లేరు
చేరసారము దీయు వేశన బద్ధంబు లాడెడు కోమటులచట లేరు
మద్యపానమున ప్రమత్తులై దుర్వృత్తి నాచరించెడి శూద్రులచటలేరు
హరికథల్వినుచు హైమైనదాయన గడియారములాచుచు పారిచటలేరు
తప్పు సాక్ష్యములు చెప్పిపత్రంబులు రచియించు కరణంబులచటలేరు
హస్తంబుపై వేసి యప్రమాణముచేసి వ్యవహరించెడి వేశ్యలచటలేరు
జేస్తుపై నిగుదేశ్చుబెట్టి మొట్టులనిడి యాడెడు జూదగాండ్రచటలేరు"

"దుర్జనుల మానసములకు దోమరమ్మ
అఖిల సుఖదమ్ము సిరులకు నాలయమ్ము
ధీజనులసొమ్ము విద్యా విరాజితమ్ము
చూసరుల కిమ్ము ఘన నిషధాపురమ్ము"

" తిండి మగనికి ముందుగ దినెడివారు
అత్తమామల నెత్తిపై మొత్తువారు
ముంగురుల గత్తిరించక మురియువారు
లేరు నిషధాపురంబున ధారుణీశ "

నలుని సత్య సంధతను నిరూపించు ఈ నిషధాపురవర్ణన ఇంత విస్తృతముగా మూలమున గానరాదు.

సుదేవుడను విప్రుడు దమయంతికి స్వయంవరాగతులను గూర్చి ఇట్లు తెలిపినాడు.

" బంగాళ భూపాలుడంగనాగను మీత
డంగదేశ నృపాలు పుంగవుండు
మత్స్యరాజాతండు మాళవ భూపాలు
డీతండు కాశ్మీర నేత జుమ్ము
కొంకణ ఘూర్జర కొంకణ కర్ణాట,
బాహ్లిక ప్రభువు లీవరుసవారు
చోళసౌరాష్ట్ర నేపాళ బర్బరమద్ర
మగధ కోసల పతుల్మగువవీరు.
లాటకురుధరాకాంతులిచ్చోటి వారు
కుకుర భోగవతీ నివాసకులు వీరు
గాన మీమదికెంపైన వాని నరసి
పూలమాలిక నడవమ్మ ముద్దుగుమ్మ "

ఇది బాలాజీ దాసు కవితా పాటవమును తెల్పుచున్నది.

వివాహానంతరము భీమరాజు నలదమయంతులను దీవించి, దమయంతికి పతిగృహ వర్తన విషయములు చెప్పి నలునుద్దేశించి "మా వంశగౌరవము కాపాడు" మని ప్రార్థేయపడినట్లు ఇందు తెలుపబడినది.

నలదమయంతుల వస్త్రమును పక్షులపహరించిన సమయము శీతాకాలమని, బట్టలులేకపోవుటచేత వారు చలికోర్వలేక బాధపడిరని యిందు తెలుపబడినది.

"మహిని గల మానవులు బుద్ధివంతులగుట
గొన్ని సదుపాయములు జేసికొనిరి గాని
జంతు సంతాన మీబాధ లెంతపడునొ
కటకటా చలికాలంబు గడుప వశమె"

చలిచే వస్త్రహీనులైన వారు బాధపడుటయే గాక జంతుసంతాన బాధను దలచి దుఃఖించిరి. రాజ దంపతులయిన నలదమయంతులకు చలిబాధ తెలియక పోవచ్చును. కాని ఇప్పటి స్థితి భిన్నముగ నున్నది. వస్త్రములు లేకపోవుటచే వీరు జంతువులతో సమానముగ తిరుగుచున్నారు. తాము చలిబాధననుభవించు చున్నప్పటికి జంతువుల బాధను దలచి దుఃఖించుటలో నలదమయంతులకు గల కరుణార్ద్రత వ్యక్తమగుచున్నది.

కర్కోటకవిషదగ్ధుడై నలుడు వికృతరూపము పొందెను. నల మహారాజు హస్తస్పర్శవలన తనకు విముక్తి కలుగునని బ్రహ్మర్షి వర మిచ్చినట్లు కర్కోటకుడు నలునకు తన శాపవృత్తాంతమును చెప్పుట అమూలకాంశమే.

దమయంతి ద్వితీయ స్వయంవరమును వినిన బాహుకరూప

మునందున్న నలునకు గలిగిన భావపరిణామమిట్లు చిత్రితమైనది.

## భైరవి - త్రిశ్రగతి

"ఎట్టిదుష్టవార్తవింటి, నేమిసేతు దైవరాయ
నట్టడవిని దాని విడచి నందున గోపము వహించి
యిట్టిపని దలంచి యశము, నీటముంపనెంచెనా ॥ ఎట్టి ॥
పతివ్రత యటంచు దాని భావమున నెంచితినిగాని
సతియిట్టి విపరీతపు పని సల్పునని దలంచనైతి ॥ ఎట్టి ॥
మగువల నమ్మరాదనెడి, మాట నిజంబయ్యె
చిగురు బోణి నమ్మంగనుగొనుటకున్నైన యీ విధ
ముగ జేసెగాబోలు, నిజముగ నెంచెనాచాలు
నగవులకతివీలు గూఢముగ నుండుచే మేలు
జగతిని బాలాజినేలు, తొగపగతుని సుతుకృప యీ
పగదినున్నదిక నేమి చేయగలవాడ, నగడు చూడ॥"

నల, ఋతుపర్ణులు విదర్భకుపోవుటకు, మార్గమధ్యమున ఒక తాండ్రచెట్టుకు పెద్దకొమ్మలు రెండుండుటను. కొమ్మకొమ్మకు నూరు శాఖలుండుటను. ప్రతిశాఖకు రెండేసి పూగుత్తులు, పదివేల పండు టాకులుండుటను లెక్కించి సరిగా నున్నవని నలుడు ఋతుపర్ణునితో చెప్పుట ఇత్యాద్యంశములు ఇందు నూతనముగా కల్పింపబడినవి.

నలుని పాక విశేషములను కవి యిట్లు చిత్రించినాడు.

"అతని పాకసౌష్టవ మయరె నుతింపగ నేరిశక్యమౌ
నూత జలంబు లూరు గతిన్యూనము లేకయె రిక్తభాండమం
దాతటి నీరు పుట్టెదృణమాపోయినుంచ గృశానుడింధన
వ్రాతములేక నుండు నగరంబున భక్ష్యపదార్థ వాసన
ల్ఖ్యాతములై పెనంగె నవలగ్న వినిందిత మత్తపేసరీ."

పంచభూతములు దమయంతి పాతివ్రత్యమును నిరూపించి నట్లు నిందు తెలుపబడినది. మిగిలిన కథాభాగమంతయు భారత నలకథానుసరణముగనే పాటింపబడినది.

## 6. 4. 2 కోసూరి భోగలింగదాసుగారి నలోపాఖ్యానము (హరికథ):

ఇది 1907లో నర్సాపురము డైమండు జూబ్లీ ముద్రాక్షరశాల ముద్రింపించి ప్రకటింపబడినది. కథలో మార్పేమియులేదు. భారతారణ్యనలోపాఖ్యానమే దీనికి మూలము. హరికథానుగుణముగ నిందు వివిధ రాగ, తాళములు కూర్చబడినవి

స్వయంవరమునకు ముందు భీముడు దమయంతి చిత్రపటమును సుదేవుని ద్వారా నలునకు జూపినట్లు ఇందు తెలుపబడినది. ఇంద్రుడు ప్రసాదించిన మంత్రపూరితమైన ఘుటికనుధరించి నలుడు దమయంతి యంతఃపురమునకు ప్రవేశించినట్లు స్వయంవరమండపములో నల, పుష్కరులకు సంవాదము జరిగినట్లు ఇందు కల్పింపబడినది.

అడవిలో తనతో తిరిగి వేసరి నిద్రించిన దమయంతిని జూచిన నలుడిట్లు దుఃఖించినాడు.

" ఘనతర సౌధాంతమున సౌఖ్యమొందెడు
పనితకు గుహాన నివాసమయ్యె,
వరశశికాంత సోపానంబు లెక్కెడు
యింతి చిట్టాళ్లపైనెక్కె నయ్యె
మగువల మధ్య నూడిగము గన్మృగమధ్య
మృగ మధ్య మెలగుచు బొగలనయ్యె,
మృదుశయ్యనతివలు పదములొత్తగ నిద్ర

గొను కొంత పాంసుల గుంద నయ్యో,
నక్కటా కోరివచ్చిన యమర వరుల
మానినను పెండ్లియాడనిమ్మగు వకిట్టి
యాపదలు గల్గెనే విధియాజ్ఞగడువ
నెవరికి దరంబుగాదు మహీతలమున "

అంతఃపురమునందు హాయిగ కాలము గడుపు దమయంతి కానల సీమలందు వసింపవలసివచ్చినది. దేవేంద్రాది దిక్పాలకులు కోరి వరింపవచ్చినను నిరాకరించిన దమయంతికి విధి కారణము వలన నిట్టి కష్టములు సంభవించినవి. విధియాజ్ఞదాటుటకు నెవరికి తరము గాదని నలుడు సమాధానపరచుకొనెను. విధి వక్రించినపుడు ఎంత గొప్పవారికి కూడ కష్టములు తప్పవను సూచన ఇందు చేయబడినది.

నలుని గానలేక దమయంతి దుఃఖించినది ఆ దుఃఖములోని ఆవేదనను కవి యిట్లు కరుణరసోపేతముగ చిత్రించినాడు.

కన్నడ - చతురశ్రి

"దైవ మాయదాటనెవరి తరముగాదుగా జగాన ॥దైవ॥
భావమున నేనొకటి దలచ భగవంతుండొకటి దలచె హా ॥దైవ॥
మరణమొందదలచినట్టి మగువను నన్విడిచిపెట్టి, ధరన
భాగ్యరాలినైన నాతోడను వచ్చిన కతన సార్థవాహుల
బరిహరించె గరినికాయమెంతటి దురితమునకు నిరవునైతినకటా ॥దైవ॥
ఆనాడు నను నలుడతి మోదముతో నాడు పరిణయమును
విని తైశ్యా, వరుడు పరుణుండు సుసర్వాణ వరులరుదెంచిన
నలుమాన విమ్మగాన ననుచు బల్కితి నా నేరమును
బట్టి దివిజులీకాననంబు పాలు చేసిరోచతురాననుండు
నుమట వ్రాసెనో యదిగాన భోగలింగవరదుడగునా ॥దైవ॥

దమయంతి ప్రాతివ్రత్యమును వాయుదేవుడు నిరూపించి నట్లు భారతమునందుండగా. ఇందు ఆకాశవాణి నిరూపించినట్లున్నది. ఇవి తప్ప మిగిలినదంతయు భారత నలకథవలె సాగినది.

## 6. 5. మణవాళదాసు - నలచరిత్ర:

తెలుగు సాహిత్యములో నలకథ కీర్తనలందు గూడ వెలసినది. భారతారణ్య పర్వములోని కలకథనే మణవాళదాసు తన నలచరిత్ర కీర్తనలందు పాటించినాడు. ప్రధానముగ కథలో మార్పేమియు లేదు. నన్నయ నలోపాఖ్యానములోని పద్యములనే మణవాళదాసు కీర్తనల రూపమున కూర్చుకొనినాడు. ఆ పద్యగద్యములను "సంధివచనము" "సంధిపద్యము" అను పేర్లతో కవి కలుపుకొనినాడు.

కవికి నలకథమీద అమిత గౌరవమున్నది. అందువలన ఈ రచనకు పూనుకొన్నట్లు అవతారికలో చెప్పికొనినాడు.

నలోపాఖ్యానము వినువారికి - నలఘుపుణ్యమబ్బును గొబ్బగ ॥న॥
పలాయనంబై - పాపము వోవును - హలాయుధుండును హరియును
సాక్షిగ ॥న॥
ఆయురారోగ్యంబైశ్వర్యంబును - జేయు సుపుత్రులు జగతిన్ గలుగును
శ్రీయుతుడను బహుసిరులజెలంగును - శ్రీపతి గర్భిత్యుమాపతి
సాక్షిగ ॥న॥
జగన్నాథార్యుల సచ్ఛిష్యులగు జగపతిని శేషయగారి
సుతుండిల భగవంతుని కృపబడసి భారత - పద్యగద్యములు
పదములజేసిన ॥న॥
యతిగణప్రాసంబేమియునెరుగకు - నుతకావ్యంబులగతినేతెలియన్
పతిపావనుని భక్తియు దెలియక క్షితిమణవాళదాసుకు కృతిగజేసిన ॥న॥

నలదమయంతుల వివాహానంతరము దేవేంద్రాదులకు శని

ఎదురుపడి తన పరాక్రమమును వివరించెను. దేవతలుశనితో నలుని పట్టవలదని యిట్లు కోరిరి.

" వలదు శనైశ్చరా వనితపై వైరము
ఇలనలరాజు దేవ హితుడు సుమతిమోము ॥ వల ॥
సతిపతి హితులు ఋ సత్యులయి యున్నారు
మతి దలచగనిల మానినికిసములు లేరు ॥వల॥
భూసురులకు సదా - పూజలొనర్తురు వాసుదేవుని
పదవ్రతము లేమారరు ॥వల॥
నలువ గూర్చెనీ - నాతిని నలునకు తలుపుము
మణవాళదాసు డెరుగ భువిని" ॥వల॥

నలదమయంతుల నిత్యకృత్యములిందు ద్యోతకమగుచున్నవి.

నలుడు దమయంతిని వదలు సన్నివేశమును కవి హృదయ విదారకముగ కీర్తన రూపమున నిట్లు చిత్రించినాడు.

## కీర్తన - నీలాంబరిరాగము - త్రిపుట తాళము

"నెలతానిన్నెటు పాయుదు నిక్కాన నమున ॥నెల॥
నెలతానిన్నెడబాసి నేనెట్లు తర్లుదు నిలమీద బరుండుండగ
ఓ నెలతా ॥నెల॥
కలహంస నిను దెల్పుకొలమ్మనది మొదలు కలనైననిను బాయనే
కాంతాశ్రీకాంతా ॥నెల॥
అలనాడు నింద్రాది యమవరులు నినుగోర నలువీడనని యాడితే
నందరు వినగ ॥నెల॥
నిను విడనాడనని - నిజమెపల్కితి దుఃఖ మనసు నేనెటు నిల్పుదు॥
మణవాళుడెరుగ నెలతా"

కలిపురుషుని పేరిందు శనియని తెలుపబడినది. నలుని కరచిన సర్పము పేరిందు కానరాదు. కాని తెలుగు నలకథాకావ్యము లన్నింటియందు కర్కోటకుడని తెలుపబడినది. అట్లే దమయంతి స్వయంవరవర్ణన కూడ యిందు కానరాదు.

ఇట్లు కొలది మార్పులతో భారత నలకథనే గ్రహించి కీర్తనల రూపమున మణవాళదాసు ఈ నలచరిత్రను రచించెను.

## 6. 6. నలకథాపరములగు యక్షగానములు :

తెలుగు సాహిత్యములో నలకథాపరమగు యక్షగానములుకొన్ని ఆవిర్భవించినవి. తెలుగులో వెలసిన నలకథాపరమగు యక్షగానములకు మూలము నన్నయ భారతనలోపాఖ్యానము. భారత నలకథనే గ్రహించినను ప్రదర్శనాను కూలముగ వివిధ ''దరువులు", తాళములతో కూడిన పాటలను కవులిందు చేర్చినారు.

## 6. 6. 1. కెల్లకప్పకయ్యకవి - నలచక్రవర్తి నాటకము

తెలుగులో పూర్వోత్తర కథాంశములుగల ప్రథమ నలకథా యక్షగాన నాటకమిది. ఇందు కథానుగుణముగ నన్నయ నలోపాఖ్యానములోని పద్యములు చేర్చబడియున్నవి. భారతములోని నలోపాఖ్యానమే దీనికి మూలము. నలదమయంతుల కనురాగము కలిగించుటలో తోడ్పడిన హంస దౌత్యమిందు కానరాదు. పక్షిదౌత్యము చేయుట అసందర్భము, అసహజము. అందువలన కవి ప్రదర్శనకయోగ్యమైన ఈ అంశమును పరిహరించినాడు.

భీముడు తన మంత్రిపుంగవులతో దమయంతీ వివాహ విషయమును ప్రస్తావించినట్లు, దమయంతికి స్వయంవరము చాటింపుమని వారు సూచించినట్లు ఇందు తెలుపబడినది. కొన్ని సందర్భములందు

తప్ప మిగిలిన కథాభాగమంతయు నన్నయ భారత నలోపాఖ్యానము ననుసరించినట్టిదే.

దమయంతికి పురోహితుడగు వసుదేవుడు స్వయంవరాగతు లగు రాజులను జూపినట్లు ఇందు తెలుపబడినది.

"కంజాక్షి యీతండు గౌళభూనాథుండు
రమణి యీతడు మహారాష్ట్రవిభుడు
మగువ యీశూరుండు మాళవ భూపతి
పడతి యీఘనుడు నేపాళ నృపతి
బోటి యీధీరుండు కరహాట మహీభర్త
లలన యీతడు ద్రావిడ ప్రభుండు
అంగన యీధీరుడంగదేశ స్వామి
వనిత యీతడు మత్స్యవల్లభుండు
వంగరాజేంద్రుడితడు కాళింగుడితడు
వీరశేఖరు నిషధాధికారియైన
నలధరాధీశుకై వడి నలరుచున్న
వారుకడు చిత్రమిక దెల్ప నేరనమ్మ"

స్వయంవరాగతుల వృత్తాంతము భారతమునందు కానరాదు. శృంగార నైషధమున శారదాదేవి, చక్రపురి రాఘవాచార్యుని ద్విపద నలకథలో వసుదేవుడను విప్రుడు దమయంతికి వరిణీయులను గురించి తెలిపిరి. రాఘవాచార్యుని రచన ననుసరించి కవి ఈ కల్పన చేసియుండును. దమయంతీ స్వయంవరమునకు దేవతలతోపాటు కుబేరుడు కూడ వచ్చి, వివాహానంతరము వారికి వరములిచ్చినట్లు నిందు కల్పింపబడినది. వివాహానంతరము దమయంతికి జననీజన కులు అనేక వస్తువాహనదాసదాసీ జనములను కానుకలను ఇచ్చినట్లు ఇందు తెలుపబడినది. ఇది తెలుగుప్రజల సంప్రదాయము. తెలుగు

ప్రజల ఆచారవ్యవహారములను దృష్టిలో పెట్టుకొని కవి వీటిని కల్పించెననవచ్చును. తల్లిదండ్రులు దమయంతిని అప్పగించిన తీరును కవి యిట్లు చిత్రించినాడు.

పాట:

"సుదతిరో పలుమారు జూడ వచ్చెరామా। మదిలోవిచారంబు
మానుమాయమ్మ
తలప పుట్టింటనెంతటి సౌఖ్యమయినా। పొంతియత్తింటి
సుఖమునలోరాదమ్మా,
లలనాయత్తమామలచేత - నెపుడు వెలమసద్భక్తిమెలగుమాతల్లి
సతి సత్పతివ్రతాచారసంపత్తి। పతిని లక్ష్మీకాంతాపతిగాజూడవే
పుట్టింటివారి కత్తింటివారిటె నీ నెట్టనంబున కీర్తిబుట్టించవమ్మా
ఆర్యబంధుజనంబుతాననమెచ్చా। మర్యాదవిడువాకామనలామాతల్లి
రామచంద్ర నృపాలు రహిమీరనేలు కామజనకునిగొల్వ గాంచినే
మేను"

ఈ నలకథాకావ్యమునందు కలిపురుషునకు కలి, శని యని రెండు పేర్లున్నట్లు తెలుపబడినది. నలుడు యజ్ఞయాగాది క్రతువులాచరించునపుడు నలుని శరీరమునందు ప్రవేశించుటకు సాధ్యము కాక కలి నిరీక్షించి నొకనాడు పాదశౌచము కడుగుట మరచి సంధ్యోపాసన చేయు సమయమున కలి నలుని యందు ప్రవేశించెను. అశుభ్రముగా నున్న వ్యక్తిని శని పట్టునని జానపదులకు గల నమ్మకము నలకథతోనే ప్రారంభమై యుండును. జూదమునందు సర్వస్వము కోల్పోవుచున్న నలుని జూచి దమయంతి తమ బిడ్డలను వార్ష్ణేయుని విదర్భకు పంపినట్లు భారతములో నుండగా ఇందు పాదిషేయుడను రథసారథిద్వారా పంపినట్లు మార్చబడినది.

నలదమయంతులు అరణ్యమునందు, వివిధకష్టములు పడు

చున్నపుడు ఇక్ష్వాక వంశ కులగురువగు వశిష్టుడు వారికి దర్శనమిచ్చి దివ్యదృష్టితో నలదమయంతులకుకలిగిన కష్టములకు కారణము కలి అకారణ ద్వేషమని చెప్పి, వారికనతి కాలములో యథాపూర్వ సంపదలు చేకూరగలవని కర్తవ్యోపదేశము చేసి మాయమైనట్లు ఇందు తెలుప బడినది. కులగురువు ఉపదేశము కష్టకాలములందు ఊరట కలిగించు నని కవి యిట్టి మార్పును కల్పించి యుండును.

కట్టినపుట్టమును పక్షులపహరించి కొనిపోగా నలుడు దమయంతి వస్త్రములో సగము చించి కట్టుకొనెను. నలదమయంతులట్లు ఏకవస్త్ర ధారులయిరి. అట్టిసమయములో కలి విప్రవేషమున వారికి కన్పించి కష్టములు వచ్చినపుడు పురుషుడే అనుభవింపవలయునని, స్త్రీకందు బాధ్యత లేదని, రాజ్యము పోగొట్టుకొనుటకు నలుడే కారకుడని దమ యంతికేవిధమైన సంబంధమందులేదని, కలి నలునకు చెప్పెను. కలి దమయంతిని విదర్భ పట్టణమునకు పొమ్మని ఆదేశించినట్లు, అందులకామె నిరాకరించినట్లు, తన ప్రయత్నము విఫలముకాగా కలి వారికి నాలుగు త్రోవలు జూపి అదృశ్యుడయినట్లు కవి యిందు కల్పించెను

దమయంతిని సర్పము కరచినపుడు కలి బోయవాని రూపమున వచ్చి సర్పమును చంపి ఒంటరిగా నున్న ఆమె శీలమును చెరచుటకు ప్రయత్నించినట్లు నిందు కల్పింపబడెను. దమయంతిని భార్యగ పొందవలయునని కలి ఆశ. నలదమయంతుల వివాహముతో అతని యాశ నిరాశయైనది. అందువలన బోయవాని రూపమున వచ్చి దమ యంతికి మేలుచేసి, తద్వారా ఆమెను పొందదలచినట్లు కవి యిందు కల్పించెను.

పతివ్రతల జోలికి పోయినవారికి కలుగు కీడులను దమయంతి కిరాతునకిట్లు వివరించినది.

"పంచ మాతృకల నెవ్వతెనైన కామించి

కొంచక వీక్షించు పంచజనుని
కాయువు బోవుమపశయము వాటిల్లు
పాపము సంభవించు సంపద లణంగు
రూపంబు దొలగు నారోగ్యంబు జెచూపుబు
నాశనం బందు మానంబు
దూలపుణ్యంబు మాయునుదైన్యమేనులకొను
గలుగు తాపము ముఖకాంతిదప్పు
గాక తుది సమవర్తి కింకల సమూహా
మదలుచును బట్టిపైతరన్యాదియైన
రౌరవాదిమహాఘోరనరకములను
ద్రోచి బాధింతు రీబుద్ధిదొలగుమన్న"

దమయంతి బోయవానిని శపించి వశిష్ఠ వామదేవ భృగు నారదులున్న మునిపల్లెను చేరినట్లు ఇందు తెలుపబడినది.

చేదిపురమునందు దమయంతి కాటుక దిద్దుట, కుంకుమ బెట్టుట, కోకలు కట్టుట, గంధము బూయుట, పూలుజుట్టుట ఇత్యాది పనులందు నియమింపబడినదని. యిందు తెలుపబడినది ఈ విష యములు భారతనలకథలో లేవు.

నలుని కరచిన కర్కోటకుని శాపవృత్తాంతము భారతాదు లందు కానరాదు. పూర్వజన్మమున కర్కోటకుడు ఒక బ్రహ్మర్షి నుల్లంఘించినట్లు, తత్ఫలితముగ అతనికి సర్పరూపము కలిగినట్లు నలునిచేతి స్పర్శవలన శాప విమోచనము కలుగునని బ్రహ్మర్షి చెప్పినట్లు ఇందు మార్చబడినది.

సందర్భానుగుణముగ నన్నయ భారతారణ్యపర్వనలోపాఖ్యాన మందలి పద్యములిందు చేర్చబడినవి. ఉదాహరణమునకు దమ

యంతి పంపిన ప్రశ్నకు బాహుకుడిచ్చిన సమాధానము పరికింపుడు.

"పురుషునందు దోషపుంజంబు గలిగిన
నోటిగి యది సహించెనేని భార్య
పురుషునందభీష్టభోగం బు దేహాంత
రంబునందు ధర్మరతియుబడయు"

బాహుక రూపమునందున్న నలుని పరీక్షించుటకు కేశినియను దాసిని నియోగించబడినట్లు భారతములో నుండగా ఇందు దమయంతి చెలులు బాహుకుని పరీక్షించినట్లు తెలుపబడినది.

ఇట్లు కెల్లకప్పకయ్య భారతములోని నలోపాఖ్యానమును గ్రహించి వివిధమార్పులు చేసి నలకథను యక్షగానముగా రచించి యున్నాడు.

## 6. 2. 2 నలనాటకము :

కవిపేరు తెలియని నలనాటకము వ్రాతప్రతి D. No. 1890 (S.V.O.M.L.)నందు కలదు. వ్రాత సరిగాలేదు. ఇందు మూడాశ్వాసములున్నవి. భారతారణ్యపర్వనలోపాఖ్యానమే దీనికి మూలము. కథారంభము భారత నలకథలో నున్నట్లే ధర్మజుని ప్రశ్నకు బృహదశ్వుడీ నలకథను చెప్పినట్లున్నది. బిల్వపతి కంకితమీయబడిన యక్షగానమిది.కథారంభమున కవిబిల్వపురీశుని యిట్లు కీర్తించినాడు.

"శ్రీమించు బిల్వపురమున
ప్రేమతోభక్తులనునేవి ప్రియములరంగా
యేమరక వరములొసగెడి
కామీశుని దలచి నేను కథరచియింతున్"

వెంకటేశ్వరుని స్తుతి, త్రిమూర్తుల భార్యల స్తోత్రము, వ్యాసవాల్మీ

కాది ఋషుల సేవనము ఇత్యాద్యంశములు కథారంభమునందున్నవి ఈ నాటకకర్త హాస్యనటునిచేత ప్రేక్షకులకు 'అపదలెల్లబాపుకథ'గ నలకథను సూచించినాడు. ఎన్నో పురాణకథలున్నవని, అవన్నియు నలకథతో సాటిరావని. నలకథ పరమోత్కృష్టమైనదని కవి అభి ప్రాయము.

నలమహారాజు మంత్రితో కలిసి వసంతకాలసమయమున ఉద్యానవనమునకు వచ్చి హంసల గుంపును జూచినట్లు, వాటిని పట్టుటకు ప్రయత్నించి విఫలుడయినట్లు, అవి ప్రహారెక్కినట్లు, వాటిని మంత్రి తరిమిపట్టుకొనినట్లు నిందు మార్చబడినది. దమ యంతికి స్వయంవరాగతులైన రాజులను కేతినాయుడను విప్రుడు జూపినట్లు నిందు తెలుపబడినది.

దమయంతి నేలపై పరుండు దృశ్యమును జూచి నలుడిట్లు దుఃఖించినాడు.

"కనికరంబుగ భువిగలరాజసుతులు
కనుసన్నసూడిగములు శాయంగ
హంసతూలికశయ్యనుపవ్వళించి
అంచయానకు అవని పాన్పుగను
దినకరకాంతి నెందినతీగకీతి
ననుబోణినిద్రిప్ప నా భార్యవైతి"

ఇట్లు వివిధ సన్నివేశములను దృష్టిలో పెట్టుకొని కవి ఈ నలనాటక మును రచించెను.

## 6. 6. 3. సిరిపెగ్గడ సుబ్బారాయుని - నలనాటకము:

1890లో ప్రచురితమయినదీ నలనాటకము. సిరిప్రెగడ సుబ్బ

రాయుడు సారంగధర నాటకమును కూడ వ్రాసెను. సుబ్బారాయుని నలనాటకమునకు మూలము భారతనలోపాఖ్యానము. ఇది బిల్వపురీశున కంకితమీయబడినది. ఇందు ఆశ్వాసవిభాగముండుట విశేషము.

## 6. 6. 4. కేశవ పట్టణము జియ్యరయ్య - నలనాటకము:

జియ్యరయ్య కేశవపట్టణము రామానుజాంబా భాష్యకారులకు పౌత్రుడు. యతిరాజమన్మనాథమునీంద్రులకు పుత్రుడు. కృతిపతి చోడవరము జమిందారగు చెవ్వాకుల సుబ్బయ. ఇది కవి రంజనీ ప్రెస్, మదరాసు, 1881లో ప్రచురింపబడినది. భారతములోని నలోపాఖ్యానమున కథాసంవిధానమే యిందును పాటింపబడినది. ఘటికుని రాకతో కథప్రారంభమగును. వాని ప్రసంగము హిందీలో గలదు. ఇందు పాత్రల 'తెరద్విపదలు' పాత్ర ప్రవేశపు దరువును గలవు. ఇందలి దరువులు ప్రసిద్ధ రాగతాళములందున్నవి. ద్విపదలు పద్యములు, సంధి,సంభాషణ వచనములు, సీసార్థాదులును గలవు. విశేషించి కథలో మార్పేమియు లేదు.

## 6. 6. 5. గొ.కవాడ పెద్దనకవి - నలచక్రవర్తి నాటకాలంకారము:

ఇది 1898లో చెన్నపట్టణము వేంకటేశ్వర ముద్రాక్షరశాలయందు ముద్రితమైనది. పూర్వోత్తర కథాంశములుగల యక్షగానమిది. ఇందు ఆశ్వాస విభాగముండుట విశేషము. శ్రీ మాల్యాద్రి లక్ష్మీనృసింహ స్వామిపై పాడిన యక్షగానమిది. ఇందు వివిధ రకములైన రాగ, తాళ ములతో గూడిన పాటలున్నవి. కవి మహాభారత నలకథనే గ్రహించి పెంచి వ్రాసినాడు. ఇందు నలుని సత్య పరిపాలనా నిరూపణకు గోవ్యాఘ్రసంవాదమును కల్పింపబడినది. నలుని పరిపాలనలో మానవులకేగాక నోరులేని జంతువులకు కూడ కలహములుండెడివి

కావని గోవ్యాఘ్రసంవాదమువలన నిరూపితమైనది. దుష్టశిక్షణ శిష్టరక్షణార్థమై విష్ణు చక్రము నలచక్రవర్తి రాజ్యము నందుండినదని యిందుతెలుపబడినది. నలుని రూపగుణములు హంస దమయంతితో చెప్పినపుడు విష్ణుచక్రముయొక్క ప్రభావమును గూడ వర్ణించినట్లు నిందు తెలుపబడినది.

నారదుడు నానాలోకసందర్శనార్థమై ఇంద్రలోకమునకు పోయినట్లు భారతనలకథలో నుండగా ఇందు దమయంతి స్వయంవరము జరుగనున్నట్లు ఆమె నలుని తప్ప వేరొకరిని వివాహమాడదని ఇంద్రునకు తెలుపగోరి స్వర్గమున కేగినట్లు నిందు తెలుపబడినది.

స్వయంవరమండపమునకు పోవుటకు ముందు దమయంతి రమేశుని ధ్యానించినట్లు నిందు కల్పింపబడినది. వివాహమునకు ముందు వధూవరులు ఇష్టదేవతా పూజనము చేయుట సంప్రదాయము. దాని దృష్టియందుంచుకొనియే కవి ఈ మార్పును చేసెను.

ఇందు కలిపేరు శనియని తెలుపబడినది. స్వయంవరానంతరము ఇంద్రాదులకు కలి మార్గమధ్యమున కన్పించినట్లు భారతకథలోనుండగా ఇందు శని యింద్రసభకేగి దమయంతీ స్వయంవర వార్తను ప్రస్తావించి, తాను వివాహ మాడదంచిన స్త్రీని పరపురుషుడు స్వీకరించుట వలన తన దుఃఖమున కంతులేదని బాధపడినట్లు కవి యిందు కల్పించెను. ఇది రాఘవాచార్యుని నలకథలో నున్న అంశమె.

దమయంతితో తన ప్రియసోదరుడగు దమనుడు నిషధకు వచ్చినట్లు ఇందు తెలుపబడినవి. చెల్లెలకు వివాహమైనప్పుడు సోదరుడు ఆమె నత్తవారింటికి పంపునప్పుడు వెంట వెళ్లును. ఇది తెలుగు దేశమందలి ఆచారము.

శని నలుని యందు ప్రవేశించి వివిధ కష్టములు పెట్టుట. నలుడు దమయంతిని వదలి అయోధ్యాపురముచేరుట. దమయంతి చేదిపురము చేరుట ఇత్యాద్యంశములు భారతనలకథలో నున్నట్లే యున్నవి. కథలో చెప్పుకోదగిన విశేషములుగాని, మార్పులుగానిలేవు.

## 6.6.6. గవురహరాజు లక్ష్మీపతిరాయుడు— నలచక్రవర్తి చరిత్రము :

ఇతడు ఋగ్వేది. అంజమాంబాహరిరాయుల పుత్రుడు. అతని నలచక్రవర్తిచరిత్రము గ్రంథముఖపత్రముపై "అంబటి అనుమంతు ప్రేరణపై గ్రంథకర్తచే సర్వస్వాతంత్ర్యము పొంది, సికింద్రాబాదు నివాసుండగు శివసూరు వీరమల్లయ్యగారిచే హిందూరత్నాకర ముద్ర శాలయందు ముద్రింపించి ప్రచురింపబడియె- చెన్నపట్టణము. 1897 సంవత్సరము అని యున్నది. ఈ నాటకమునకు భారతారణ్య పర్వనలోపాఖ్యానము మూలము. కథలో విశేషించి మార్పులేవియు లేవు.

## 6.6.7. తేరంలపురి నారాయణకవి—నలచరిత్ర నాటకము:

కవి కాలము తెలియదు. శ్రీవత్ససగోత్రుడు. కిచ్చయ్యప్రపౌ త్రుడు. చలమయపౌత్రుడు. మూర్త్యం బాశేషయార్యుల పుత్రుడు. ఈ నాటకము చామరాజప్రెస్ 1903లో ప్రచురితమైనది. తేరులపురి శేరి కంకితము. ఇందాశ్వాస విభాగముండుట విశేషము. ప్రసిద్ధ మైన భారత నలకథయే దీనికి మూలము. ఇందు ప్రత్యేకించి కథా విశేషములు ఏమియు కానరావు.

## 6.6.8. రేవూడి పిచ్చయ్య కవి - నలచరిత్ర :

వివిధ తాళ, రాగములతో వెల్లివిరిసినదీ యక్షగానము. ప్రధాన ముగా కథాసంవిధానము భారత నలకథయందున్నట్లే యున్నది.

మార్పేమియు లేదు. కాని ఒకచోట మాత్రము మార్పున్నది, దమయంతీ స్వయంవరమునకు ఇంద్రాగ్ని యమ వరుణులు నల్గురు మాత్రమే వెళ్ళినట్లు భారత నలోపాఖ్యానములో నుండగా ఇందు వీరితోపాటు ధనదుడు (కుబేరుడు) కూడ వచ్చినట్లు తెలుపబడినది. కలిపేరు శనియని యిందు తెలుపబడినది. ఇంతకు మించి కథలో మార్పేమియు లేదు.

పైన పేర్కొనిన నలచరిత్ర యక్షగానములేగాక కవిపేరు తెలియని "నలమహారాజు చరిత్రము" అను యక్షగానము. అలభ్యమైన రఘునాయకం రామానుజసూరి రచితమైన "నలనాటకము" అను యక్షగానమును కలవు.

జానపదులలో మౌఖిక ప్రచారమునందున్న నలకథావిశేషములను, వివిధ జానపద సాహిత్య ప్రక్రియలను జంగము కథ. హరికథ యక్షగానము. మొదలైన వానియందు వెలసిన నలకథాంశములను కూలంకషముగ పైని పేర్కొని పరిశీలించడమైనది.

సమాప్తం

# ఆంధ్ర నలకథా సర్వస్వము - సూచికలు


I Chapter

1. UNNI, NP Nala Episode in Sanskrit Literature, P 2
2. Weber, Albrecht: The History of Indian Literature P. 132
3. The Sivapurana, part III, Motilal Benarsidass, Delhi P. 1186-1190
4. UNNI, NP "Nala Episode in Sanskrit Literature" P6
5. Vettam Mani 'Puranic Encyclopedia' P. 519 Motilal Benarsidass Delhi, 1975
6. UNNI NP. Nala Episode in Sanskrit Literature P.20
7. నాగయ్య జి, దాక్షిణాత్య సాహిత్యసమీక్ష - మొదటి సంపుటి పుట 103
8. డా॥ సుందరం, ఆర్వీయస్-కన్నడ సాహిత్య చరిత్ర పుట. 17

II Chapter

1. చేమకూర వెంకటకవి - విజయవిలాసము, 1-27 పద్యం
3. వ్యాస భారతనలోపాఖ్యానము - అరణ్య 53 (15-20)
4. నన్నయ భారతనలోపాఖ్యానము - అరణ్య (2-51)
5. సత్యనారాయణ, విశ్వనాథ - నన్నయగారి ప్రసన్న కథాకలితార్థయుక్తి పుట 36

III Chapter

1. వేంకటరాయశాస్త్రి, వేదం - శ్రీనాథుని శృంగారనైషధము - సర్వంకషవ్యాఖ్య పీఠిక భాగం
2. రామరాజభూషణుడు - కావ్యాలంకార సంగ్రహము - వివరణ. సన్నిధానం సూర్య నారాయణశాస్త్రి. పుట - 233
3. నందితిమ్మన - పారిజాతాపహరణము - 1వ ఆశ్వాసము, 97వ పద్యం
4, 5. శేషేంద్రశర్మ, గుంటూరు - స్వర్ణహంస (హర్షనైషధకావ్యపరిశీలన) 97, 98
6. డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తి శ్రీనాథుడు (నైషధాంధ్రీకరణము) పుట 462
7. వేంకటరామశాస్త్రి వేదం - శ్రీనాథుని శృంగారనైషధము (సర్వంకషవ్యాఖ్య) పుట 330
8. వేంకటకవి, చేమకూర - విజయవిలాసము 1వ ఆశ్వాసము, పుట 169
9. శేషేంద్రశర్మ గుంటూరు - స్వర్ణహంస పుట 104

10. సత్యనారాయణ, విశ్వనాథ-శ్రీనాథుని శృంగారనైషధము-పీఠికభాగము (వావిళ్ళవారి ప్రచురణ)

11 డా॥ రామకోటిశాస్త్రి కేతవరపు - ఒకరత్నము ఒక మంత్రము - వివేచన డిసెంబర్ 1976

12. రంగప్పరాజు, రామరాజు సాంబోపాఖ్యానము 3వ ఆశ్వాసము 143-158


## IV Chapter

1. జోగారావు, యస్వీ-ఆంధ్రయక్షగానవాఙ్మయ చరిత్ర ద్వితీయ భాగము పుట 3

2. రామకోటిశాస్త్రి, కేతవరపు-ఘటికాచల మహాత్మ్యము పీఠికభాగము సాహిత్య అకాడమీ ప్రచురణ 1968

3. బాలక్రిష్టారెడ్డి, ఎడ్ల-తెలుగులో విప్రనారాయణకథ, ఎం ఫిల్ సిద్ధాంతవ్యాసము 1978

4. D. No. 1071 Madras Oriental Manucsript Library.

5. దక్షిణాంధ్ర వాఙ్మయచరిత్ర పుటలు 64-65

6. ద్విపద వాఙ్మయము పుట 197

7. రఘునాధనాయకుని కృతులు-విమర్శనాత్మక పరిశీలనము-అముద్రితము పుట 133

8. భారతీనిలయ ముద్రాక్షరశాల చెన్నపట్టణము 1872

9. నాగేశ్వరరావు కాశీనాధుని-ఆంధ్రపత్రికా కార్యాలయము చెన్నపురి

10. శారదానిలయ ముద్రాక్షరశాల చెన్నపట్టణము 1882


## V Chapter

1. శ్రీవిద్యాముద్రాక్షరశాల-విజయనగరము 1933

2. R. No 336, Paper S. V. Oriental Manuscript Library

3. తజ్జాయాజాయానవతి యదస్యాం జాయతే పునః
అభూతిరేషా భూతిర్బీజమేతన్నిధీయతే॥

ఐతరేయ బ్రాహ్మణము 33వ అధ్యాయము, సప్తమీగాధ

4. షట్చక్రవర్తి చరిత్ర-ముద్రితము, వోలావీరన్న అండ్ సన్సు సికింద్రాబాద్ 1926

5. యజ్ఞేశ్వర సోమయాజులు, దర్భా, "ఆంధ్రనాటకముల విజృంభణము" భారతి జూలై 1926

6. దామరాజు శివరామయ్య, నలనాటకము పీఠిక


## VI Chapter

1. బి. రామరాజు-తెలుగు జానపదగేయ సాహిత్యము పుట 15

# అనుబంధం - I

## ఉపయుక్త గ్రంథములు - వ్యాసములు


అనంతరామశాస్త్రి, నేతి : శ్రీనాధుని సామెతలు ఆంధ్రప్రభ, ఫిబ్రవరి 25, 1973.

ఆరుద్ర : సమగ్ర ఆంధ్ర సాహిత్యము ( 10వ సంపుటము ) శేషాచలం అండ్ కంపెనీ మద్రాసు.

———— : సమగ్ర ఆంధ్ర సాహిత్యము (12వ సంపుటము) ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సికిందరాబాదు, 1967.

ఉషశ్రీ : జూదం తగదు (భారతంలోని చిన్నకథలు) ఆంధ్రప్రభ, ఏప్రిల్, 3, 1979.

కోటేశ్వరరావు, తుమ్మపూడి : ఆముక్తమాల్యదాసౌందర్యము, మలయకూట ప్రచురణలు, 1971. నవభారతి, జూన్, 1980.

,, ,, నలదమయంతులకథ

గంగప్ప, యస్ : శ్రీకోలాచలం శ్రీనివాసరావుగారి నాటకములు-ఇతర రచనలువాని వైశిష్ట్యము శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం వారిచే పి.హెచ్.డి. పట్టముబడసిన సిద్ధాంత వ్యాసం 1971.

గణేశ్వరరావు, మద్దూరి : నలోపాఖ్యానము-మహాభారతము, భారతి, ఫిబ్రవరి, 1943.

చినసీతారామస్వామిశాస్త్రులు, వజులు : హరిశ్చంద్రనలోపాఖ్యాన విమర్శనము, వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ చెన్నపురి, 1953.

జగన్నాథశర్మ, వేమూరి : అష్టాదశపురాణ సారము. రామా అండ్ కో., హెచ్.ఓ. ఏలూరు, 1954.

జయకృష్ణ బాపూజీ, జంధ్యాల : శ్రీనాథుని సాహిత్య ప్రస్థానము, పరిశోధన గ్రంథము, ఆంధ్ర విశ్వవిద్యాలయం, 1977.

జి. యస్. రెడ్డి : చిత్రకవిత్వం-సాహిత్యసమితి వ్యాసావళి 1 సాహిత్య సమితి, తిరుపతి. 1967.

జోగారావు, ఎస్. వీ. : హరిశ్చంద్ర నలోపాఖ్యానములు-శ్లేషశైలూషీవేసిన వాలకములు, సారస్వత నీరాజనం, 1965.

తమ్మయ, బండారు : శ్రీనాథుని జాతీయములు, భారతి, ఏప్రిల్, 1949.

దొరస్వామిశర్మ, రావూరి : తెలుగు సాహిత్యము-రామకథ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ,

సమాదరమున ప్రకటితము, 1972.

దొరస్వామినాయుడు, వి : చక్రపురి రాఘవాచార్యుని ద్విపదనలకథ- ఒక పరిశీలన, నవభారతి, డిసెంబర్ 197

——— : భారతములో నలకథాప్రాశస్త్యము; నవభారతి, ఫిబ్రవరి, 1980.

——— : జానపద సాహిత్యములో నలకథ, స్రవంతి, ఆగష్టు, 1980.

నరసింహారావు, వి. వి. యల్ : నన్నయ కవిత్వము-అక్షర రమ్యత, విశ్వేశ్వర పబ్లికేషన్స్, విజయవాడ-2, 1977.

నాగయ్య, జి : ద్విపద వాఙ్మయము, యూనివర్సిటీ బుక్ సెంటర్, తిరుపతి, 1967.

——— : తెలుగు కావ్యావతారికలు, యూనివర్సిటీ బుక్ సెంటర్, తిరుపతి, 1968.

——— : దాక్షిణాత్య సాహిత్య సమీక్ష (మొదటి సంపుటము) నవ్యపరిశోధక ప్రచురణలు, 18-1-699, భవానీనగర్, తిరుపతి, 1976.

నాగవీరేశ్వర కవి, ముదిగొండ : శివపురాణము, సికిందరాబాద్, 1958.

నారాయణరెడ్డి, సి : ద్విపదలలో దివ్యకవిత, వ్యాసవాహిని (సాహిత్యవ్యాసాలు) ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సికిందరాబాద్.

నారాయణశాస్త్రి, పెద్దాడ : వ్యాసుడు-గన్దచౌర్యమా, భారతి, అక్టోబరు, 1979.

పద్మాకరరెడ్డి, ఎ. వి : తెలుగులో హరిశ్చంద్రకథ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం వారిచే పి. హెచ్‌డి., పట్టముపొందిన సిద్ధాంత వ్యాసం (అముద్రితము) 1977

పాపయ్యశాస్త్రి, చిలుకూరి : శ్రీనాధ కవితా సమీక్ష, రిపబ్లిక్ ప్రెస్, కాకినాడ, 1961.

ప్రసాదభూపాలుడు, : ఆంధ్రవిజ్ఞానము. (మూడవ సంపుటము) 1939,

బ్రహ్మచారి, ప్రభుదత్త : భాగవత దర్శనము (అష్టమ ఖండము) శ్రీరామ శరణమందిరము, బుద్ధాం, 1964.

మాధవశర్మ, పాటిబండ : ఆంధ్రమహాభారతము - అరణ్యపర్వము ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 1971.

మృత్యుంజయరావు, జొన్నలగడ్డ : వ్యాసభారతము - నన్నయపరిష్కారము ఆంధ్రవిశ్వవిద్యాలయము వారిచే డాక్టరేట్ పొందిన సిద్ధాంత వ్యాసం 1979

రంగప్పరాజు, రామరాజు : సాంబోపాఖ్యానము-శ్రీమదాంధ్ర సాహిత్య పరిషత్తువారిచే ప్రకటింపబడినది. పీఠిక, కర్రిసాంబమూర్తి శాస్త్రి, 1932.

రామరాజు, బి : జానపదగేయ సాహిత్యము, ఆంధ్ర రచయితల సంఘము, హైదరాబాదు, 1958.

రామరాజభూషణుడు : కావ్యాలంకార సంగ్రహము- వివరణ-సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి, ఎం. శేషాచలం అండ్ కో;

సికిందరాబాద్, 1949.

రామకృష్ణకవి, తెనాలి : ఘటికాచలమాహాత్మ్యము,
పీఠిక- కేతవరపు రామకోటిశాస్త్రి,
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, 1968.

రామబ్రహ్మం, గూడవల్లి : నలవేషం.
పరిశోధన (సారస్వత ద్విమాసపత్రిక)
అక్టోబర్, నవంబర్, 1954.

లక్ష్మీపతిశాస్త్రి, చిలుకూరి : నైషధకావ్య శిల్పము,
(శ్రీహర్ష శ్రీనాథుల తులనాత్మకపరిశీలనము)
నవోదయఏజన్సీస్, దేవిచౌక్,
రాజమండ్రి, 1970.

వెంకటకవి, చేమకూర : విజయవిలాసము,
శివాజీప్రెస్, సికిందరాబాద్-3, 1968.

వెంకటరామనరసింహము, కాకర్ల ; దక్షిణాంధ్రయుగ వాఙ్మయచరిత్ర,
ప్రథమభాగము, 1955.

——— : కవిసార్వభౌముని కథాకథనకౌశలము.
ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక సంచిక-5.

వెంకటసుబ్రహ్మణ్యదీక్షితులు, కల్లూరి: ఆంధ్రస్కాంధము (ప్రథమభాగము)
ఆర్షభారతి, 1959.

——— : శ్రీహర్షనైషధము,
ఆంధ్రప్రభ, ఆదివారం 15, 1973,

వేంకటకుటుంబరావు, బొడ్డపాటి : ఆంధ్ర నవలాపరిణామము,
గాయత్రీ ప్రచురణము,
హైదరాబాద్-1, 1971.

వేంకటనరసింహాచార్య, ఉత్పల : శ్రీనాథుని శృంగారనైషధము (పరిష్కృతము) వావిళ్ళరామస్వామిశాస్త్రులు అండ్

సన్స్ 1960.

| | | |
|---|---|---|
| వేంకటానంద రాఘవరావు, గొబ్బూరి | : | నన్నయభట్టు - విజ్ఞాన నిరతి, సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరము, 1959. |
| వేంకట రంగయ్య, మామిడిపూడి | : | సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము (5వ సంపుటము) సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశ సమితి, హైదరాబాదు, 1966. |
| వేంకటరామకోటిశాస్త్రి, కేతవరపు | : | తిక్కన కావ్య శిల్పము, వైఖరీ ప్రకాశము, 1973. |
| వేంకటావధాని, దివాకర్ల | : | నన్నయ కవితా వైభవం, యువభారతి, సికింద్రాబాద్-3, 1976. |
| వేంకటరాయశాస్త్రి, వేదము | : | శ్రీనాథునిశృంగార నైషధము (సర్వంకషా వ్యాఖ్యానము) వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్ మద్రాసు-1, 1961. |
| శమంతకమణి, పండా | : | తెలుగు సాహిత్యములో రామకథ, ఆంధ్ర సారస్వత పరిషత్తు. హైదరాబాదు, 1972. |
| శాస్త్రి | : | జానపద వాఙ్మయము, భారతి, అక్టోబర్, నవంబర్, 1940. |
| శ్రీనివాసరావు, వేమూరి | : | పూర్వగాథాలహరి, వేంకటరామా అండ్ కో., విజయవాడ, 1965. |

శ్రీరామమూర్తి, కొర్లపాటి : శ్రీనాథుడు,
ఆంధ్ర విశ్వ కళాపరిషత్తు, 1971

శేషాద్రి రమణ కవులు : దమయంతీ సంవరణము.
భారతి, ఫిబ్రవరి, 1929

శేషేంద్ర శర్మ, గుంటూరు : స్వర్ణహంస (శ్రీహర్షనైషధకావ్య పరిశీలన) ఆంధ్ర సారస్వతపరిషత్తు, 1968.

సత్యనారాయణ విశ్వనాథ : నన్నయగారి ప్రసన్నకలితార్థయుక్తి
విజయవాడ-2 1970

సత్యనారాయణ, విశ్వనాథ : నన్నయగారి భారతాంధ్రీకరణము.

——— : శ్రీనాథుని శృంగారనైషధము (పరిష్కృతము) ఎం. శేషాచలం అండ్ కో., సికింద్రాబాదు, 1970.

సత్యనారాయణరావు, యండమూరి: శారదా ధ్వజము.
1965లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమానం పొందిన గ్రంథం.
అనంత పబ్లికేషన్స్, విజయవాడ.

సీతాదేవి, కె : దమయంతి-పరమభక్తురాలు.
ఆంధ్ర మహిళాసభ, మైలాపూర్,
మద్రాసు, ఆంధ్రమహిళ, జనవరి, 1955.

సీతారామాంజనేయులు, మండపాక : నలదమయంతులకథ
(బొమ్మల మహాభారతకథ)
ఆంధ్ర సచిత్ర వారపత్రిక,
8-12-1978 నుండి సీరియల్ ప్రారంభం.

సుశీల, టి : ఆంధ్ర ద్విపద సాహిత్య చరిత్ర.

ఢిల్లీ విశ్వవిద్యాలయము వారిచే
పి. హెచ్ డి., డిగ్రీ పొందిన సిద్ధాంత
వ్యాసం, 1979.

సుదర్శనం, ఆర్. ఎస్, : తెలుగు సాహిత్యములో సామాజిక
చైతన్యము,
ఆంధ్రపత్రిక, సంవత్సరాది సంచిక,
1969-70.

సుబ్బరామశాస్త్రి, ఉడాలి : శ్రీహర్ష నైషధము (టీకాతాత్పర్యసహి
తం) ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ
హైదరాబాదు, 1971.

సుబ్బారాప్ప, తండిరాలవెంకట : తెలుగు వీరగాథాకవిత్వము,
సిద్ధాంతవ్యాసము, శ్రీవేంకటేశ్వర
విశ్వవిద్యాలయం వారిచే పి. హెచ్ డి.,
డిగ్రీ పొందిన సిద్ధాంత వ్యాసం,
(అముద్రితము)

సుందరాచార్యులు, కె. వి. : యయాతి చరిత్రమే మొట్టమొదటి
అచ్చ తెలుగు కావ్యము.
భారతి, సెప్టెంబరు, 1979,

సుందరయ్య, ఇవటూరి : నైషధరచనాతత్త్వము.
ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక,
ఆశ్వయుజకార్తిక మాసములు,
1929.

సుందరం, ఆర్వీయస్ : కన్నడ సాహిత్య చరిత్ర,
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ,
హైదరాబాదు-4, 1977.

హనుమచ్ఛాస్త్రి, ఇంద్రగంటి : సారమతి నన్నయ:
నవోదయ పబ్లిషర్సు,
విజయవాడ-2, 1976.

## ఆంగ్లము :

Arunoday Natvaralal Jani: A Critical Study of Sriharsa's Naishadhiya Caritam. Oriental Institute, Baroda, 1957.

Annie Besant, F. T. S. : The Story of the Great war Theosophical Society, London, 1899.

Ajwani, L.H. : History of Sindi Literature Sahitya Akademi, New Delhi, 1977.

Donald A. Mackenzie : Indian Myth and Legend. The Gresham Publishers Co., Ltd.,
34, Southampton Street, Stand, London,

Epiphanius Wilson : Hindex Literature. Published by J. Tetley for Asian Educational Services, New Delhi, 1900

Edwin Arnold, C S·I. : Indian Idylls. Trubner & Co., Ludgate Hill, London, 1883.

George Chambers : Encyclopaedia. (New Edition) Volume IX. George Newnes Ltd. New York, 1955.

Krishna Kanta, Handiqui: Naishadhacarita of Sriharsa, Deccan Research Institute, Poona-3, 1965.

Krishna Machariar, M : History of Classical Sanskrit Literature. Motilal Banarsidass, Varanasi, 1974.

Monier, Williams : Nalopakhyanam (Story of Nala) University of Oxford 1879

Mayadhar Mansinba : History of Oriya Literature Sahitya Akademi. New Delhi 1962.

Pratap Chandra Ray, C. I. E. : The Mahabharata of Krishna Dwaipaya Vyasa (Translated into English prose). Calcutta, 1889.

Parameswaram Nair. P.K.: History of Malayalam Literature, Sahitya Akademi, New Delhi, 1977

Ralph, T.H. Griffith : Specimens of Old Indian Poetry. (Translated from the Original Sanskrit into English verse).

Sadhu Ram : Essays on Sanskrit Literature. Munshi Ram Manohar Lal, Naisarak, Delhi-6. 1965.

Sukumar Sen, Dr. : History of Bengali Literature. Sahitya Akademi, New Delhi, 1971

Towney's : The Ocean of Story. (Translation of Somadeva's Katha Saritsagara, Vol. IV). J. Sawyer, Ltd. Grafton House.

UNNI, N.P. . Nala Episode in Sanskrit Literature Published by M. Easwaran College Book House, Trivandrum 1977.

Venkatacharya, T. : The Nalakirti Kaumudi of Agastya Pandita, D.K. Publishing House, Delhi, 1975.

Vettam Mani : Puranic Encyclopaedia, Motilal Banarsidass, Delhi, 197. .

M. Winternity : A History of Indian Literature. Translated from the German by Subhadrajha, Motilal

Banarsidass, Bungalow Road, Jawahar Nagar, Delhi-7, 1977.

Washburn Hopkins, E. : Epic Mythology, Motilal Banarsidass, Delhi, 1915

## తమిళము:

పుగళేంది : నలవెణ్బా, వ్యాఖ్యాత-వి. పడనియప్పన్ అణ్ణామలై విశ్వవిద్యాలయము, 1975.

## కన్నడము:

కనకదాసుడు : నలచరిత్రె- గద్యానువాదము-దాకూరు శంకరనారాయణబట్టె కన్నడపరిషత్తు, బెంగుళూరు, 1976.

చౌండరస కవి : నళచంపు, కన్నడ అధ్యయన సంస్థ, మైసూరు విశ్వవిద్యాలయం, 1971.

బసవప్పశాస్త్రి గళ్ : దమయంతీ స్వయంవరమ్, గద్యానువాదము-కె.ఆర్.లక్ష్మీకాంత్, కన్నడ సాహిత్య పరిషత్తు, బెంగళూరు- 1976

ముగళి : కన్నడ సాహిత్య చరిత్ర, తెలుగునేత-ఎం.ఎస్. మహాంతయ్య సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ, 1978.

## మళయాళము:

ఉణ్ణాయి వారియర్ : నలచరితమ్(కథావళి) వ్యాఖ్యాత-ఎ.డి.హరిశర్మ, ప్రచురణ-ఎ.హెచ్.గోపీనాథశర్మ, ఎర్నాకుళం, 1956.

# అనుబంధము – 2

# తెలుగు నలోపాఖ్యానములు

ఈ సిద్ధాంత వ్యాసమునందు నేను పరిశీలించిన నలోపాఖ్యానములివి:

## చంపూ కావ్యములు:

| | | | |
|---|---|---|---|
| 1. | నలచరిత్రము | ముద్రితము | కాకరపర్తి వీరరాఘవాచార్యులు. |
| 2. | నలచరిత్రము | ముద్రితము | బెహరా రామకృష్ణకవి. |
| 3. | నలచరిత్రము | ముద్రితము | సిరిప్రెగడ ధర్మనామాత్యుడు |
| 4. | నలచరిత్రము | అముద్రితము | రుద్రరాజు తిరుమలరాజకవి |
| 5. | నైషధీయచరితమ్ | ముద్రితము | శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి |
| 6. | నైషధపారిజాతీయము | అముద్రితము | కృష్ణాధ్వరి |

## చిత్రకావ్యములు:

| | | | |
|---|---|---|---|
| 7. | శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము. | ముద్రితము | కందుకూరి వీరేశలింగంపంతులు |
| 8. | షట్చక్రవర్తుల కథ | ముద్రితము | రాజపల్లా రెడ్డి |
| 9. | షట్చక్రవర్తుల కథ | అముద్రితము | రామచంద్రకవి |
| 10. | హరిశ్చంద్రనలోపాఖ్యానము | ముద్రితము | రామరాజభూషణుడు |

## ద్విపద నలచరిత్రలు:

| | | |
|---|---|---|
| 11. నలచరిత్ర | ముద్రితము | చక్రపురి రాఘవాచార్యుడు |
| 12. నలచరిత్ర | అముద్రితము | తిమ్మయకవి |
| 13. నలచరిత్ర | అముద్రితము | రఘునాధనాయకుడు |
| 14. నలచరిత్ర | ముద్రితము | పిళ్ళారిశెట్టిరాఘవయ్య |
| 15. నలచరిత్ర | ముద్రితము | కాకర్లపూడి రాఘవయ్య |
| 16. నలచరిత్ర | ముద్రితము | వరకవి రాఘవకవి |
| 17. నలచరిత్ర | ముద్రితము | ఆల్వకొండ కృష్ణమూర్తికవి |

## వచన నలచరిత్రలు:

పూర్వోత్తర కథాంశములు గలవి.

| | | |
|---|---|---|
| 18. నలచరిత్ర | ముద్రితము | పురాణం పిచ్చయ్యశాస్త్రి |
| 19. నలచరిత్ర | ముద్రితము | దొరసామయ్య |
| 20. నలచరిత్ర | ముద్రితము | యస్. రామానుజరావు. |
| 21. నలమహారాజుకథ | ముద్రితము | జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి |
| 22. నైషధసారము | ముద్రితము | ఇ. సూర్యనారాయణ |
| 23. వచననైషధము | ముద్రితము | మంత్రిప్రెగడ భుజంగరావు |

## పూర్వవచన నలచరిత్రలు:

| | | |
|---|---|---|
| 24. ఆంధ్ర నైషధసారము | ముద్రితము | అత్తలూరి సూర్యనారాయణ |
| 25. దమయంతి | ముద్రితము | ఓలేటి వేంకటరామశాస్త్రి |
| 26. శృంగారనైషధము | ముద్రితము | దేవరకొండ చిన్నికృష్ణశర్మ |
| 27. శృంగారనైషధము | ముద్రితము | పోలవరపు శ్రీహరిరావు |

## కల్పిత వచన నలచరిత్రలు:

| | | |
|---|---|---|
| 28. దమయంతీ స్వయంవరము | ముద్రితము | విశ్వనాథ సత్యనారాయణ |
| 29. షట్చక్రవర్తుల యింద్రజాలపు కథలు | ముద్రితము | పోకల శేషాచలంనాయుడు |

## నాటకములు:

| | | | |
|---|---|---|---|
| 30. | చిత్రనళీయము | ముద్రితము | ధర్మవరము రామకృష్ణమాచార్యులు |
| 31. | నలచక్రవర్తి నాటకము | ముద్రితము | ముదిగొండ శంకరశాస్త్రి |
| 32. | నలచక్రవర్తి నాటకము | ముద్రితము | రెంటుచింతల లక్ష్మీనరసింహశాస్త్రి |
| 33. | నలనాటకము | ముద్రితము | రాజామంత్రిప్రెగడ భుజంగరావు |
| 34. | నలప్రవాసము | ముద్రితము | ముదిగొండ నాగలింగశాస్త్రి |
| 35. | మంజుల నైషధము | ముద్రితము | సీతారామకవి |

## యక్షగానములు:

| | | | |
|---|---|---|---|
| 36. | నలచక్రవర్తి నాటకము | ముద్రితము | కెల్లకప్పకయ్య కవి |
| 37. | నలనాటకము | ముద్రితము | సిరిప్రెగడ సుబ్బారాయుడు |
| 38. | నలనాటకము | ముద్రితము | కేశవపట్టణము జియ్యరయ్య |
| 39. | నలచక్రవర్తి నాటకాలంకారము | ముద్రితము | గాయకవాడ పెద్దనకవి |
| 40. | నలచక్రవర్తి నాటకము | ముద్రితము | తేరులపుడి నారాయణకవి |
| 41. | నలచరిత్ర | ముద్రితము | రేపూడి పిచ్చయ్యకవి |
| 42. | నలచక్రవర్తి చరిత్రము | ముద్రితము | గపురహరాజు లక్ష్మీపతి రాయుడు |

## జంగము కథలు:

| | | | |
|---|---|---|---|
| 43. | నలచక్రవర్తి నాటకము | ముద్రితము | పెద్దన దాసాచార్యుడు |

## హరికథలు:

| | | | |
|---|---|---|---|
| 44. | నలచరిత్ర | ముద్రితము | బాలాజీదాసు |
| 45. | నలోపాఖ్యానము | ముద్రితము | కోసూరి భోగలింగదాసు |

## గేయ కావ్యములు:

| | | | |
|---|---|---|---|
| 46. | నలచరిత్ర | ముద్రితము | తోలేటి సీతారామయ్య |

| | | | |
|---|---|---|---|
| 47. | నలచరిత్ర | ముద్రితము | మాతలయ్య |
| 48. | నలచరిత్ర | ముద్రితము | మణవాళదాసు |
| 49. | నాగానందములో నలకథ | ముద్రితము | సంగమేశం |
| 50. | పురాణగాథలలో నలకథ | ముద్రితము | సుబ్రహ్మణ్యశాస్త్రి |

## ఉత్తర నలోపాఖ్యానములు:

| | | | |
|---|---|---|---|
| 51. | ఉత్తరనైషధము | ముద్రితము | వీరేశ్వరశర్మ |
| 52. | ఉత్తర నైషధము | అముద్రితము | కవిపేరు తెలియదు |

కాశీనాథుని నాగేశ్వరరావు ఆంధ్రపత్రికా కార్యాలయము వారి కేటలాగునుబట్టి ఈ క్రింది నలచరిత్రలున్నట్లు తెలియుచున్నది ఇవి నాకు లభింపలేదు.

| | | | |
|---|---|---|---|
| 53. | నలచరిత్ర | ముద్రితము | జి. పెద్దన్నకవి |
| 54. | నలచరిత్ర | ముద్రితము | కోదండరామయ్య |
| 55. | నలచరిత్ర | ముద్రితము | భాస్కర కవి |
| 56. | నలచరిత్ర | ముద్రితము | యస్. ధర్మయామాత్యకవి |
| 57. | నైషధనక్షత్రమాలిక | ముద్రితము | యం. వేంకటసుబ్బారావు |
| 58. | దమయంతీ కళ్యాణము | ముద్రితము | వేంకటరామకృష్ణకవులు |
| 59. | దమయంతీ చరితము | ముద్రితము | కల్లూరి విశాలాక్షమ్మ |
| 60. | దమయంతీ పరిణయము | ముద్రితము | ద్వివేది బ్రహ్మానందము |
| 61. | దమయంతీ స్వయంవరము | ముద్రితము | ఏలేశ్వరపు సుబ్రహ్మణ్యశాస్త్రి |
| 62. | దండాన్వయ నలోపాఖ్యానము | ముద్రితము | టి. సింగరాచార్యులు |
| 63. | నలచరిత్ర (వచనము) | ముద్రితము | వావిలకొలను సుబ్బారావు |
| 64. | దమయంతీచరితము(వచనము) | ముద్రితము | రాయసము వేంకటశివుడు |
| 65. | దమయంతీచరితము(వచనము) | ముద్రితము | పంచవటి వేంకట్రామయ్య |
| 66. | నలచరిత్ర (యక్షగానము) | ముద్రితము | వీరమల్లయ్య |
| 67. | నలచరిత్ర (యక్షగానము) | ముద్రితము | వి. కన్నయ్యదాసు |
| 68. | నలచరిత్ర (యక్షగానము) | ముద్రితము | శేషాచలదాసు |

# తప్పొప్పుల పట్టిక

| పేజీ | పేర నెంబరు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 16 | 1 | పచ్చి | పచ్చి |
| 30 | 2 | చొందిరసు | చొందిపిసు |
| 42 | 2 | రామధానచరిత్ర | రామధానచరిత్ర |
| 17 | 1 | పేర్కొనదగివి | పేర్కొనదగినవి |
| 62 | 2 | కముల | కష్టముల |
| 65 | 2 | గుయు | యుగు |
| 66 | 2 | గకుల | కుల |
| 66 | 2 | కలకథ | నలకథ |
| 67 | 1 | విజము | విజయము |
| 67 | 3 | కల్పింము | కన్పించు |
| 68 | 1 | మూడేళ్ళని | మూడేండ్లని |
| 95 | 2 | వైదలష్యము | వైదుష్యము |
| 161 | 2 | కవ్పించినట్లు | కన్పించినట్లు |
| 171 | 1 | శృంగార | శృంగార |
| | 2 | నట్లు న్నది | నట్లున్నది |
| 179 | 1 | పేములపగా | పేలవముగా |
| 182 | 1 | గజ గజ | గుజగుజ |
| 184 | | శంఖావముమూఖము | శంఖావము-మూలమునందు |
| 220 | — | ప్రార్థింపుము | ప్రార్థింపుండు |
| 234 | 1 | తద్వారా | తద్ద్వారా |
| 237 | — | ఇలు | ఇల్లు |
| 240 | 2 | కవితాగోష్ఠి | కవితాగోష్ఠిలో |
| | | తెలుపబడినతి | తెలుపబడినది |
| 24 | 1 | ఏకపత్నీవ్రతుడు | ఏకపత్నీవ్రతుడు |
| 263 | — | పరస్పరానురమును | పరస్పరానురాగము |
| 265 | 2 | అన్నిగుండము | అగ్నిగుండము |
| 266 | 1 | పురుషుడాడు | పురుషుడొక్కడు |
| | | జరిపినట్లు | జరిపించినట్లు |
| 271 | 1 | క్రిందపడేద్రోచి | క్రిందపడద్రోచి |
| | | జరుగదవి | కవినిరూపించెను |
| 274 | 1 | అశుభలను | అశుభములను |
| 286 | 1 | 1 చతుర్థాంము | చతుర్థాంకము |
| 293 | 2 | మూత్యము | మూత్యతము |
| 307 | 2 | కులగురుపు | కులగురువు |
| 310 | 3 | వృంత్తాంతమునిగా | వృత్తాంతముగా |
| 315 | — | స్వభాభావము | స్వభావము |
| 316 | 2 | శృంకారనైషధము | శృంగారనైషధము |